
ఆంధ్ర ప్రదేశమంతటా
అందరిని, అన్ని అభిరుచులవారిని
ఆనంద పరవశుల చేయుచున్న
అపూర్వ జానపద
చిత్రము....
వాహినీ వారి
రాజమకుటం
నిర్మాత. దర్శకుడు
బి. యన్. రెడ్డి
BAKTHA

# పి. సి. ఏ. అండ్ కంపెనీ,

## ఆయుర్వేద సమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా

జగత్ప్రసిద్ధములగు మా ఆయుర్వేదీయ ఔషధములు వేలకొలదిమందిచే వాడబడు చున్నవి. అనేకులు మా ఔషధములను పరీక్షించి అద్భుతమైన గుణములు కలవని నిర్ణయించిరి.

### నారసింహ లేహ్యము




దీని యందు బంగారు రేకులు, వెండి రేకులు, పచ్చకర్పూరం కుంకుమ పువ్వు, పాలా మిశ్రి, మొదలగు విలువ గల వస్తువులు చేర్చి తయారు చేయ బడినది. ఇదిమిక్కిలి బలమును కలిగించుటలో అత్యుత్తమమైనది. మేహములు, నిశ్శక్తి, నిస్సత్తువ, శుక్లనష్టము, మూత్రము వెంట శుక్లము పడుట, కాళ్లు పీకుట, నడుము నొప్పులు, అతిమూత్రము, హరించి మిక్కిలి వీర్యవృద్ధిని, సంభోగశక్తిని కలిగించుటలో అమోఘమైనది. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు. 3-8-0

### చ్యవనప్రాస లేహ్యము

అజీర్ణము, శ్లేష్మము, కఫము, క్షయ, బలహీనత, పురాణజ్వరము, ఉబ్బసము, దగ్గు, మొదలగు శ్వాసకోశ సంబంధమగు వ్యాధులనుహరించి బలమును కలిగించును.

20 తులముల డబ్బి రు. 2-0-0

### మహాఖండార్ద్రిక లేహ్యం

పైత్యములు వాంతులు, చర్ది, ఎక్కిళ్లు, అమ్లపైత్యము, మలబద్ధము, అరోచకము. దాంతి, ఓకారము మొదలగువాటిని ఖండించును 15 తులముల డబ్బి రు. 1-8 0

### రోజాపుష్ప లేహ్యం

మలబద్ధకము, అజీర్ణము, గర్భవాయువు మొదలగువాటిని హరించి కొలవిరేచనము చక్కగా కలిగించును.

15 తులముల డబ్బి రు. 1-4 0

### మదనకామేశ్వర లేహ్యము

ఇది మిక్కిలి వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో శ్రేష్ఠమైనది. మేహము, నిశ్శక్తి, నిస్సత్తువ, శుక్లము పడుట మొదలగువాటిని ఖండించి రక్తమును వృద్ధి నొందించును.

20 తులముల డబ్బి రు. 2-4-0

### పాలసుగంధి లేహ్యం

సవామేహములు, మేహపాకలు, కొరుకు పుండ్లు, ఇతరచర్మరోగములు, కీళ్లనొప్పులు, శిథిలించిన పాతి సుఖవ్యాధులు మొ॥గా, మొదలగు వ్యాధులను హరించును

20 తులముల డబ్బి రు 2-4-0

### ఘనసార చందిని

శిరోవ్యాధులు, అంటుమూత్రపు మంట చురుకు, స్త్రీలకు సమస్తవ్యాధులు, మొదలగువాటిని హరించును.

సీసా 1 కి రు. 2 4-0 అనుపానమునకు చందిని అత్తరు ¼ ఔన్సు రు. 1-4-0

### గంధకరసాయనము

సర్వ చర్మరోగములను నిర్మూలముచేయును శిథిలించినవవాయిలు, చర్మరోగములు పురుపులు, కొరకుపుండ్లు, తీట, జిల, మేహపొడలు, మచ్చలు, శిథిలించిన పాతసుఖవ్యాధులు మొదలగువాటినిఖండించుటలో శ్రేష్ఠమైనది. 10 తులముల డబ్బి రు 2-8-0

### హేమసుందరము

బంగారు ఛాయగలది. మేహములు, అత్యుష్ణము, శుక్లనష్టము, రక్తరోగము, కాళ్లు చేతులు మంటలు, స్త్రీల కుసుమ వ్యాధులు మొదలగువాటిని హరించును.

తులం 1 కి రు 4-0 0

### సంజీవనకల్పము

ఉష్ణాధిక్యము, ఉష్ణపైత్యము, ఉష్ణవాతం మొదలగువాట్లచే గలుగు సమస్తవ్యాధులను, జ్వర మాంద్యమును, దాహము, తాపము కొన్ని దినములకు దగ్గులు, అలకీళ్ల నొప్పులు నడుము నొప్పులు, శిర్ర వాపు, మూత్రం బిగించుట, శరీరవేడిమి మొదలగు వాటికి రామబాణం.

5 తులముల డబ్బి రు. 1-12-0

### ప్రతాప కస్తూరి మాత్రలు

మిక్కిలి ఘాటుగలిగి సువాసనగా నుండును. 1-2 మాత్రలు పుచ్చుకొనిన శైత్యము వాయువు, జలుబు. జ్వరము, సన్నిపాతములు, మాంద్యము, చిన్నబిడ్డలకుగము, దగ్గు, ఉబ్బసము, సీతబేదులు, అజీర్ణ దోషములు. మొదలగువాటిని ఖండించును.

200 మాత్రలు సీసా రు. 0-8 0

### సుఖవిరోచన మాత్రలు

ఇది 2-8 విరేచనములై అజీర్ణం,వాయువు జలుబు జ్వరము మొదలగువాటినిహరించును

40 మాత్రలు సీసా రు 0-8 0

### అజీర్ణవాయువ మాత్రలు

బిడ్డలకు శ్రేష్ఠమైనది. అప్పుడప్పుడు1-2 మాత్రలను వేయుచుండిన చక్కగా విరేచనమగుటయేగాక అజీర్ణము, వాయువ మొదలగువాటినిహరించి వ్యాధులను రానీయవు

50 మాత్రలు సీసా రు. 0-8-0

### రాజమోహన హేరాయిల్

శ్రేష్ఠమైన సువాసనగలది. తలవెంట్రుకలను నృగువు, నలుపు కలిగించి వృద్ధి చేయును. మెదడుకు చల్లదనము నిచ్చును.

సీసా రు. 1-0-0

### భృంగామలకతైలం

తలంటుకు శ్రేష్ఠమయినది. మెదడుకు చలవచేసి తలనొప్పులు, మాడుపోటు మొదలగు వాటిని హరించును.

4 ఔన్సులు సీసా 0-14-0

### తామరతైలము

అన్నివిధములగు చర్మరోగములను పోగొట్టును. తామర, తీట, గజ్జికి రామబాణము.

డబ్బి రు. 1-0-0

ఇంకా మావద్ద సిద్ధమకరధ్వజ, మకరధ్వజ, పూ॥ చంద్రోదయం మొదలగు ఔషధములు గలవు. కోరినవారికి మాక్యాటలాగు ఉచితముగా పంపెదము. వ్యాధిగ్రస్తులు తమ వ్యాధినిగురించి వ్రాసినచో సలహా నొసంగెదము.

ఆయుర్వేదవిద్వాన్ ఆయుర్వేదోపాధ్యాయ పి. సి. అయ్యవారప్పయ్యపంతులుగారు ప్రొప్రయిటరు.

# ఆంధ్రపత్రిక

## శార్వరి సంవత్సరాది సంచిక

[ఏబది ఒకటవ సంచిక]

[1960-61]

★

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

★

వెల: రూ. 2

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

సంచిక 51

# శార్వరి సంవత్సరాది సంచిక

సంవత్సరము 1960-61

## విషయానుక్రమణిక


| | | | |
|---|---|---|---|
| ప్రస్తావన | ... | ... | [illegible] |
| వచ్చె శార్వరి సంపద తెచ్చె మనకు! — శ్రీ దామోదరం సంజీవయ్య | ... | ... | 11 |
| వికారి సంవత్సరంలో సాహిత్య వికాసం — శ్రీ పాళ్వ కృష్ణమూర్తి | ... | ... | 13 |
| మంగళమాఘమ్ — శ్రీ రాయప్రోలు సుబ్బారావు | ... | ... | 22 |
| ఆత్మగీతము — శ్రీ హారీత శివశర్మ | ... | ... | 24 |
| అంతరాని కోణం — శ్రీమతి తురగా జానకీరాణి | ... | ... | 26 |
| శిశిర వేదన — శ్రీ సి. నారాయణరెడ్డి | ... | ... | 32 |
| పదేండ్లలో దొరికిన అపూర్వ శాసనాలు — శ్రీ కొల్లూరు పార్థవర్ధనశర్మ | ... | .. | 33 |
| త్రిశంకుడు — శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి | ... | ... | 40 |
| శివము - సంఘటన: ఏది ముందు? — శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు | ... | ... | 46 |
| గంగ: కాశ్యపి — శ్రీ శ్రీరంగం నారాయణబాబు | ... | ... | 52 |
| రెండవ ప్రణాళిక నేర్పిన పాఠాలు — శ్రీ బులుసు వేంకటసుబ్బారావు | ... | ... | 59 |
| గోలకొండ దుర్గము — శ్రీ ముకురాల రామారెడ్డి | ... | ... | 63 |
| ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతర సాహితి — శ్రీ దేవులపల్లి రామానుజరావు | ... | ... | 67 |
| సింధుచరితలో సింధూరరేఖ — శ్రీ "రంగారావ్" | ... | ... | 70 |
| నవ్వులు కురిపించే నేటి రచనలు — శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి | ... | ... | 74 |
| మదనోత్సవమ్ — శ్రీ ఆవంత్స సోమసుందర్ | ... | ... | 89 |
| నవభారత రాజ్యాంగం: స్థూలపరిశీలన — శ్రీ చిత్తజల్లు వరహాలరావు | ... | ... | 94 |
| చిరునవ్వుల మెరుగు...! — శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం | ... | ... | 106 |
| తమిళసాహిత్యంపై తెలుగు వెలుగు — శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ | ... | ... | 113 |
| [illegible] — శ్రీ త్రిపురాన వేంకటకృష్ణరావు | ... | ... | 118 |
| అమెరికను నవల జాతీయత — శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ | ... | ... | 124 |
| నాలుగు స్తంభాలాట — శ్రీ బూదరాజు శ్యామసుందరరావు | ... | ... | 128 |
| కేరళమునకు విహారి చేసిన మేలు — శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు | ... | ... | 135 |
| శివయాత్ర — శ్రీ కోట సుందరరామశర్మ | ... | ... | 139 |
| మా తేండ్ల తెలుగు వ్యాసము — శ్రీ నిడుదవోలు వేంకటరావు | ... | ... | 141 |
| ఊరిచివర యిల్లు — శ్రీ బాలగంగాధర తిలక్ | ... | ... | 152 |
| అరకులోయభాష: ఆంధ్రంతో సంబంధం — శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి | ... | ... | 165 |
| చిన్నయసూరి — శ్రీ అగ్దేపల్లి నాగగోపాలరావు | ... | ... | 172 |
| ప్రాచీ ప్రతీచీ కవుల ఆదర్శంలో భేదం — శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మ | ... | ... | 175 |
| అడ్డదారి — శ్రీ "శండిల" | ... | ... | 179 |
| విమర్శన చర్చ: రసగంగాధర మతము — శ్రీ కేశవపు రామకోటిశాస్త్రి | ... | ... | 187 |


త్రివర్ణ చిత్రాలు: వసంత శోభ — శ్రీ కేశవ భావ, నగారు (ముఖచిత్రం);

పారాణి: శ్రీ కల్యాణప్రసాదశర్మ, పల్లెపడుచులు: శ్రీ వర్మ

# ADVERTISERS' INDEX


| | Page No. |
|---|---|
| Alvitone Laboratories | 180 |
| Ambatı Subbanna & Co | 188 |
| Amrutanjan Ltd. | 4th Wrapper |
| Andhra Bank Ltd. | 36 |
| Balakrishna Industrial Works | 16 |
| Government of India | 12 |
| Indian Medicine House | 189 |
| Indian Mutual General Insurance | 48 |
| Kesari Kuteeram | 170 |
| Kesavardhini | 2nd Wrapper |
| K. T. Krishnamoorthy Achary & Co | 96 & 177 |
| K. ORR. & Co | 18 |
| M. Narayanaswami Mudaliar & Sons | 154 |
| National Engineering Co. | 66 |
| Navratnakalpa | 68 |
| New Star & Co. | 191 |
| Nutrine Confectionery | 163 |
| Padmasri Films | 3rd Wrapper |
| P. C A & Co | 2 & 158 |
| Radha Bros | 160 |
| Ranee & Co | 23 |
| Sait Nagji Purushotham & Co | 14 |
| Shaik Ismail & Co | 19 |
| Southern Railway | 47 |
| Sreevatcha Chemicals | 53 |
| Sri Nagarjuna Productions | 4 |
| Sukheebhava Productions | 186 |
| The Bharatha Lakshmi Bank | 114 |
| The Coir Board | 147 |
| The Hindusthan Ideal Insurance Co, Ltd. | 125 |
| United India Fire and General Insurance | 59 |
| Vanguard Insurance Co | 190 |
| Vauhini Pictures | 1 |




ఓమ్

# ప్రస్తావన

వికారి సంవత్సరం ప్రపంచంలో పెక్కు రంగాలలో పలువికారాలు పుట్టించి విస్తరింపజేసినా, తుదకు నిర్వికారతకు నాగాలు పోసి నిర్గమించిందనవచ్చు; కదన భీతి కాదంబినిని కదల్చి 'యుద్ధం మనకు వద్దు", "పోరు నష్టం, పొందు లాభం" అన్న శాశ్వత హితసూక్తిని తమచుట్టూ ఇనుప తెరలు దించుకున్న అగ్రరాజ్యాధినేతల అంతరంగాలలో మరొకమారు మిణుకు మిణుకుమనజేసి మరలిపోయిందనవచ్చు. ఈ మాత్రం మిణుకుమిణుకుకు కారణం మారణాయుధాలను సిద్ధపరచి స్వాయత్తం చేసుకొనే పోటీలో ఎవరిదీ పైచేయి కాబోదన్న పరిజ్ఞానం ప్రతిభాసించడమే ఈ ప్రతిభానానికి మూలం మానవుని విశ్వరహస్య విజ్ఞానవల్ల కలిగిన పరిణామమే; అభివృద్ధి విరోధక శక్తులను అణచి, అభ్యుదయం సాధించాలనే తీవ్రతర వేదనే.

ఈ జిజ్ఞాస, వేదన వికారిలో కలిగినంతగా మరెప్పుడూ కలుగలేదేమో! భూభౌతిక విజ్ఞాన పరిశోధన వికారిలో అపూర్వ విజయాలను అందుకొన్నది. దీనితో మానవుని భావనాధారే మరొక మార్గానికి మళ్ళింది. ఉపగ్రహాల సర్జన ప్రయత్నం మరొక అంగ ముందుకు సాగింది. సోవియట్ యూనియన్ వైజ్ఞానికులు విళంబి సంవత్సరంలో వదలిన మొదటి గ్రహవేధి "ల్యూనిక్" (రాకెట్) రోదసీ కుహరాన్ని భేదించుకొని సూర్యకక్ష్యఁ జొచ్చి సూర్యమండలం చుట్టూ ప్రదక్షిణంచేసే గ్రహమైంది. వికారిలో వదలిన మరొక గ్రహవేధి చంద్రమండలం ఆవలివైపు అంచులు చూచి, దాని స్వరూప స్వభావాలను మనకు అందజేసింది. అమెరికా కూడా ఈ కృషిలో వెనుకబడలేదు.

ఈ గ్రహవేధులు వికారిలో అగ్రరాజ్యాధినేతల అహంతను హతమార్చి కనువిప్పు కలిగించాయి. ఒగ్గశంకన్నా క్షమే తగవని వారు తలపోశారు. సోవియట్ యూనియన్‌కు బ్రిటిష్ ప్రధాని శ్రీ మాక్మిలన్, అమెరికా ఉపాధ్యక్షుడు శ్రీ నిక్సన్ వెళ్ళి రావడం, అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ సౌహార్దం కనబరుస్తూ వెళ్ళవలచడం—తదుపాంగంగా, తొలిసారిగా భారతం మొదలయిన ప్రాచ్యదేశాలలో పర్యటించడం, సోవియట్ అగ్రనాయకులు మికోయన్, కృశ్చేవ్ అమెరికాకు వెళ్లడం, అధినాయక సమావేశ పరంపర జరుపాలని నిశ్చయం కావడం—ఇవన్నీ గ్రహవేధి సృష్టించిన ఘటనలే అనవచ్చు

అగ్రరాజ్యాలే పెక్కు విషయాలలో వెనుకడుగు వేసినా, చైనా - మనతో సహస్రాబ్దుల సంస్కృతి సంబంధానుబంధాలున్న చైనా-మన సరిహద్దులపై తన కబంధ హస్తాలు సాచడం, మనతోనే కాదు; అటు ఇండోనీషియాతో, ఇటు బర్మాతో, మరొకవైపు పాకిస్తాన్‌తో, ఇంకొకవైపు నేపాల్‌తో వివాదాలుపడి సీమోల్లంఘనంచేసి మైత్రి వాతావరణం కలుషితమొనర్చి తన వైదేశిక నీతికూరత్వాన్ని చాటుకోవడం శోచనీయమే అయినా, ఇట్టివేళ తన అంతరువు అరసి, మనతో చెలిమితో మెలగడానికి ఒడంబడడం హర్షించదగిందే. దలైలామాకు ఆశ్రయమిచ్చామన్న అక్కసుతో ఈవిధంగా ప్రవర్తించిందనే అపయశస్సు మాత్రమే చైనాకు దక్కింది. జార్ చక్రవర్తుల సామ్రాజ్యంలోని భౌగోళిక పరిస్థితికి భంగం రాకూడదని స్టాలిన్, కృశ్చేవ్‌లు భావించినట్లే, అలనాటి చైనా సామ్రాజ్యం భౌగోళిక పరిస్థితికి ఎంతమాత్రమూ చేటు వాటిల్లకూడదనేదే చౌ ఎన్ లై మనస్తత్వమని ప్రపంచం గ్రహించక పోలేదు. ఈ క్లిష్టపరిస్థితిలో భారత సంస్కృతికి మూలకందమైన నిగ్రహంతో, క్షమతో మన ప్రధానా

మాత్యుత శ్రీ నెహ్రూ శక్తి చడం మరొకమారు మన దేశం ఎత్తుకొనేట్టు చేసింది.

ఇట్లే మరికొన్ని ప్రాంతాలలోనూ "చంక దుడ్డు-శరణార్థి" తత్త్వం తలయెత్తకపోలేదు జెనీవాలో జరిగిన అగ్రరాజ్య విదేశమంత్రి సమావేశంలో నిరాయుధీకరణకు నూతనసంస్థ స్థాపించబడినా, నిరాయుధీకరణ కార్యక్రమం అనుసరించే పక్షంలో తమ అణ్వస్త్రాలన్నిటిని ధ్వంసం చేయడానికి పదేపదే క్రుశ్చేవ్ సంసిద్ధతను ప్రకటించినా, ఫ్రాన్స్ అణ్వస్త్ర పాటవ పరీక్షను మానుకోలేదు; అమెరికా యూరపియన్ దేశాలతో అణ్వస్త్ర విజ్ఞాన వినిమయానికి ఒడంబడిక చేసుకోకపోలేదు.

ఇటు పాకిస్తాన్‌తో మనకుగల లుకలుకలు తొలగి, ఎట్టకేలకు అనుకూల వాతావరణం ఏర్పడడం మెచ్చదగింది సరిహద్దు దుర్ఘటనలను సమయింపజేయడానికి ఉభయ దేశాలమధ్య సిలకత్తాలో సంతృప్తికరమైన సంధి కుదిరింది. పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ అయూబ్ ఖాన్ ఢిల్లీకి వచ్చి శ్రీ నెహ్రూను కలుసుకొని ఉభయ దేశాల సమస్యలను న్యాయ్యమయిన విధంగా పరిష్కరించుకోవాలనే నిర్ణయం చేసుకొన్నాడు సింధు జలాల పంపిణీ కూడా అనుకూలంగా జరిగే సూచనలు గోచరమాతున్నాయి.

తక్కిన మన ఇరుగు పొరుగు దేశాలలో పెక్కు దుర్ఘటనలు, ఘటనలు జరిగాయి. లంక ప్రధాని భండారనాయకే హత్యకు గురిఅయ్యాడు అప్పటి విద్యాశాఖామంత్రి దహనాయకే ప్రధానిగా నూతన మంత్రివర్గం ఏర్పడి, అదిన్నీ ఓడిపోవడంవల్ల జరిగిన కొత్తఎన్నికలలో ఎక్కువస్థానాలు సంపాదించిన యునైటెడ్ నేషనల్ పార్టీ నవ మంత్రివర్గాన్ని డడ్లీ సేనానాయకే ప్రధానిగా స్థాపించింది. నేపాల్‌లో శ్రీ బిశ్వేశ్వర్ ప్రసాద్ కొయిరాలా నాయకుడుగా తొలిసారిగా ఎన్నుకోబడిన మంత్రివర్గం అధికారానికి వచ్చింది. ఇండోనేషియాలో ప్రెసిడెంట్ సోకర్నో మంత్రివర్గం ఉపదిష్ట ప్రజాస్వామ్య విధానంతో పరిపాలనకు పూనుకుంది. బర్మాలో ఎన్నికలు జరిగి ఊను నాయకత్వాన నూతన ప్రభుత్వం నెలకొన్నది ఘనా రిపబ్లిక్‌గా రూపొందింది. సింగపూర్ స్వయం ప్రభుత్వం సంపాదించింది.

భారతదేశమూ ఇతర దేశాలతో పాటిగా పెక్కురంగాలలో ముందుకు ఉరకుతున్నది. ద్వితీయ ప్రణాళిక తన లక్ష్యాలు ఏమాత్రమూ చెక్కుచెదరక కొనసాగుతున్నది. పారిశ్రామికాభివృద్ధి మూడు పూలు లారు కాయలుగా సాగిపోతున్నది. భిలాయ్, దుర్గాపూర్, రూర్‌కేలా, ఉక్కు కార్ఖానాలు మొదటి కొలుములను ప్రారంభించాయి. మన పరిశ్రమల ప్రవృద్ధికి, ప్రాజెక్టుల నిర్మాణానికి విదేశాలు అహమహమికతో సహాయపడదలుస్తున్నాయి. భారీ పరిశ్రమల నిర్మాణానికి సోవియట్ యూనియన్ రుమేనియా, జెకోస్లోవేకియా వాగ్దానం చేశాయి. కోయనా ప్రాజెక్టు నిర్మాణానికి ప్రపంచం బ్యాంకి రెండున్నర కోట్ల డాలర్లు అప్పు పెట్టింది. జెకోస్లోవేకియా 23 కోట్ల ఋణం ఇవ్వడానికి సమ్మతించింది. మనతోను, ఇతర ప్రాచ్యదేశాలతోను సన్నిహితత్వానికి సోవియట్ యూనియన్ మున్నగుదేశాలు చేయి చాపుతున్నాయి. దీనికి తార్కాణలే క్రుశ్చేవ్, వరోషిలొవ్, ఫిన్‌లెండ్ ప్రధాని మున్నగువారు మన దేశానికి రావడమ్మూ, ఇతర ప్రాచ్య దేశాలలో సంచరించడమూను.

రాజకీయంగా వికారి దేశంలోని పెక్కువికారాలు పోనాడింది. భాషాప్రయుక్తంగా బొంబాయి, గుజరాత్ రాష్ట్రాలు అవతరించడానికి నిర్ణయం జరిగింది. కేరళంలో శాంతిభద్రతలు రక్షించజాలని కమ్యూనిస్ట్ ప్రభుత్వాన్ని ఇండియా రాష్ట్రపతి రద్దుచేసి మరల అసెంబ్లీకి ఎన్నికలుజరిపించగా, కమ్యూనిస్టులు పూర్తిగా ఓడిపోయారు. కాంగ్రెస్ తను అత్యధికబలం సంపాదించినా, ప్రజాస్వామ్య శక్తులను ఏకంచేసేదృష్టితో ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుడు శ్రీ పట్టం థానుపిళ్ళై ముఖ్యమంత్రిగా నూతన మంత్రివర్గం ఏర్పడడంలో సహాకరిం

చింది. ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు 65వ అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. బెంగుళూరులో జరిగిన ఈ కాంగ్రెస్ మహాసభ అగ్రరాజ్యాలమధ్య ప్రచ్ఛన్నయుద్ధం కొంత తగ్గుముఖం పట్టినందుకు హర్షం ప్రకటిస్తూ తీర్మానించింది; దేశాభివృద్ధి ప్రణాళికల ఆచరణలో కాంగ్రెస్‌వాదులు ప్రధానపాత్ర నిర్వహించాలని హెచ్చరించింది.

ఉద్యోగుల జీతభత్యాల విషయంలో కేంద్ర ప్రభుత్వం కమ శ్రద్ధ వహించింది; వేతన నిర్ణాయకసంఘం చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవాటిని ఆమోదించింది. దీనివల్ల కేంద్రప్రభుత్వానికి ఏటా అదనంగా 16 కోట్ల రూపాయలు వ్యయమవుతుంది.

భారతప్రభుత్వం రక్షణ విషయంలో స్వయంసమృద్ధం కావడానికి నిశ్చయించింది గనుక, తదనుగుణంగా, ఈసారిబడ్జెటులో రక్షణశాఖకు 272 కోట్ల, 56 లక్షల మొత్తం కేటాయించింది. ఇది నిరుటి వ్యయం కంటే 28 కోట్ల 56 లక్షలు హెచ్చన్నమాట. ఈ దృష్టితోనే రక్షణశాఖామంత్రి శ్రీ కృష్ణమీనన్ ఇచ్‌పూర్ ఆర్డ్‌నెన్స్ డిపోలో ఒక ఉక్కుపోత యంత్రానికి ప్రారంభోత్సవం జరిపారు.

బలమైన ప్రతిపక్షం ఉన్నప్పుడే ఏ ప్రజాస్వామ్యమైనా మనగలిగేదీ, మాట నెగ్గించుకో గలిగేదీని. విమర్శ, ప్రతివిమర్శ, సింహావలోకనం లేకపోతే పరిపాలనలో స్తబ్ధత ముంచుకురావడమూ, ప్రజలలో నైరాశ్యం నెలవుచేసుకోడమూ సహజం. రథం-మహాగంభీరంగా, వేగంగా వెళ్లుతున్నప్పుడు పక్కకు తొలగి ప్రమాదాలు కలుగకుండ "సన్నలు" వేస్తున్నట్టు ప్రతిపక్షాల విమర్శలు ప్రజాప్రభుత్వం అప్రమత్తతకు అవసరం. అలాంటి ప్రతిపక్షం మేధావుల నాయకత్వాన ఉన్నప్పుడే సాధ్యం. గనుక ఈదృష్టితో శ్రీ రాజగోపాలాచారిగారు 'స్వతంత్రపార్టీ' అనేపేర ప్రతిపక్షం స్థాపించారు. శ్రీ రాజగోపాలాచారి వంటివారే దీనిని స్థాపించడం విశేషం. దేశాభ్యుదయ దృష్టితోనే ఈ పక్షం వ్యవహరిస్తుందని ఆశిస్తున్నాము.

సాంప్రదాయికంగా వికారి పెక్కు వికారాలను పటాపంచలు చేసిందనే చెప్పాలి. ఎన్నో ప్రాంతాలలోని రాజవంశాలవారి అపోహాలను ఈ సంవత్సరం దూరం చేసింది. జపాన్ యువరాజు రాజవంశ సంప్రదాయాలను తోసిరాజని, మరొక వంశంలోని కన్యను పెండ్లాడడు. అలాగే జపాను రాజకుమారి ఒకబ్యాంకు గుమాస్తా పాణిగ్రహించడం, కుమారునికని, అంతఃపుర కాంతల సంప్రదాయానికి ప్రతికూలంగా పాలివ్వడం, బ్రిటిష్ రాజకుమారి మార్గరెట్ ఒక సామాన్యుణ్ణి పరిణయం చేసుకోవడం, దీనికి నిదర్శనలు.

ఇండియా, ఆస్ట్రేలియా క్రికెట్ జట్లకు కాన్పూరులో జరిగిన రెండవ టెస్ట్ పోటీలో ఇండియా జట్టు ఘన విజయం పొందింది టెస్ట్ పోటీలలో ఆస్ట్రేలియాను ఇండియా ఓడించడం ఇదే మొదటిసారి

జెనీవాలో జరిగిన ప్రపంచ చలనచిత్ర ప్రదర్శనలో సత్యజిత్ రాయ్ తీసిన 'పథేర్ పాంచాలి,' 'అపరాజితా' అనే రెండు చిత్రాలు బహూకరించబడ్డాయి.

ఢిల్లీలో జరిగిన ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనం పెక్కుదేశాల కార్మిక కర్షకులను, వ్యవసాయ నిపుణులను సన్నిహితం చేసింది. ఈ ప్రదర్శనానికి మన ప్రెసిడెంట్ డాక్టర్ రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం జరిపారు.

తొలిసారిగా భారత దేశంలో ఒలిగ్జిజన్ యూనిట్ నెలకొల్పడం, ట్రాంబేలోని పరమాణుశక్తి పరిశోధన కేంద్రం 'అప్సరా' పూర్తికానుండడం కూడ వైజ్ఞానికంగా పెద్ద విషయాలే.

ఆంధ్రప్రదేశ్ వికారిలో వివిధ రంగాలలో తారస్థాయిని అందుకున్నది. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడు కావడం, ఆయనపిదప ముఖ్యమంత్రి పదవిని శ్రీ సంజీవయ్యగారు అలంకరించడం, ప్రజాస్వామ్య బద్ధంగా అధికార వికేంద్రీకరణ (పంచాయతి సమితుల, జిల్లాపరిషత్తుల

స్థాపన) ఆంధ్రప్రదేశ్ కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింప జేశాయి.

కాని, రాష్ట్రానికి పేరుప్రతిష్ఠలు తెచ్చి, తమ కృషిఫలితాన్ని చూచి ఆనందిస్తున్న పలువురు కురువృద్ధులు పరమపదించడం విషాదకరం. రాజనీతి ధురంధరులైన డాక్టర్ పట్టాభి సీతారామయ్య, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్ల అస్తమయం రాజకీయ రంగంలోను, శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ పరవస్తు రామానుజస్వామిగార్ల నిర్యాణం సాహిత్యలోకంలోను, శ్రీ దైతాగోపాలం, శ్రీ డి. వి. సుబ్బారావు, డాక్టర్ గోవిందరాజుల వేంకట సుబ్బారావుగార్ల కాలధర్మం నటబృందానికి, శ్రీ హరినాగభూషణం, ద్వారం నరసింగరావుగార్ల కన్నుమూత సంగీత ప్రపంచానికీ తీరని లోటు కలిగించింది.

రాష్ట్రం ఎంత పురోగమిస్తున్నా, పెక్కు సమస్యలింకా అపరిష్కృతంగానే ఉండిపోయాయి. మనకు విడిగా రైల్వేమండలం ఏర్పడవలసి ఉంది; ఆహార మండలం నెలకొనవలసి ఉంది; భారీ పరిశ్రమలు స్థాపించబడినదే రాష్ట్రశ్రేయస్సు కుంటువడుతుంది గనుక భారీ పరిశ్రమలు నెలకొనవలసి ఉంది; గోదావరి నీరును ఇంకా అరికట్టి ఉపయోగించవలసి ఉంది.

భాషారాష్ట్రాలు ఏర్పడినా, ఇతర పొరుగు రాష్ట్రాలతో సరిహద్దు వివాదాలింకా తెగనే లేదు. విశాలమైన ఆంధ్రప్రదేశ్ ను అంచులు కొరికి తిందామనే ధోరణే పరిసర రాష్ట్రాలవారిలో ఉన్నట్టు తోస్తున్నది. ఇది శార్వరిలో పరిష్కారమై సరిహద్దు ప్రజలకు, రాష్ట్రప్రజలకూ కూడా మనశ్శాంతి చేకూరగలదని ఆశించవచ్చు.

ఈ విధంగానే అంతర్జాతీయ సమస్యలూ ఎన్నో మిగిలిపోయాయి. జాతి విద్వేషం అణుమాత్రమూ అణగారలేదు. బ్రిటిష్ ప్రధాని దక్షిణాఫ్రికా పార్లమెంటులో జాతివిద్వేష విధానాన్ని తీవ్రంగా ఖండించినా, అమెరికన్ న్యాయస్థానాలు ఎన్ని తీర్పులు చేసినా, శ్వేతజాతులలో ఇది నెలవుచేసుకుంటున్నదే కాని, తొలగిపోవడంలేదు ఇటీవలనే జోహాన్స్‌బర్గ్‌లో శ్వేతజాతుల అహంకారానికి పలువురు ఆఫ్రికనులు గురిఅయి దుర్మరణం చెందారు. ఒకవైపు ఇజ్రాయల్, మరొకవైపు అడినోవర్ ప్రపంచాన్నే లెక్కచేయడంలేదు.

ఈ సమస్యలు శార్వరిలో సర్వాంకషంగా పరిష్కృతమై పోగలవని, శార్వరి శర్వానివలె, శారద శర్వరివలె అనుచితాన్ని, అనాగతాన్ని అడుగంట జేసి, ధర్మజ్యోతులు వెలుగొందజేయగలదని ఆశిస్తున్నాము.

# వచ్చె శార్వరి సంపద తెచ్చె మనకు!

శ్రీ దామోదరం సంజీవయ్య

(ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి)

శార్వరీదేవి మనమీద చల్లనైన
దృష్టి ప్రసరించి ఎల్లర కష్టములను
బాపి బ్రోవుత! మంచు నే ప్రణతు లిడుదు;
తల్లిపిల్లల బ్రోవంగ తరలి వచ్చె.

నీలకంఠుకు నీ చెంత నిలచియుండ
నిఖిల లోకాల బ్రోచెడు నిదు శక్తి
యినుమడించె గదమ్మ ఓ! ఈశు రాణి
తరలి రావమ్మ హృదయమ్ము తనివి తీర.

వచ్చె శార్వరి సంపద తెచ్చె మనకు
తెలుగుప్రజలకు క్రొంగ్రొత్త వెలుగు నిచ్చె
కలసి కృషిసల్ప సఖ్యమార్గమ్ము చూపె
తెలుగు వెలుగులు లోకాన వెలయునటుల.

అరుణపల్లవముల మెక్కి హాయి మీర
శుకపికాదులు మంజుల శ్రుతుల తోడ
'కుహూ కుహూ' యంచు తెలుగుల కోరికలను
గాన మొనరించె మోహనగళము లెత్తి.

కవులు పండితుల్ గాయకుల్ కలసి పాడి
తెలుగుదేశపు కీర్తిని తెలియజేయ
కష్టజీవులు కర్షకుల్ కలసి మెలసి
పాడిపంటల నభివృద్ధిపరుప మనకు
కొరత లేకుండ గడచును క్రొత్తయేడు.

# ద్వితీయ దశ



అన్ని రాష్ట్రాలలో, కేంద్ర పాలిత ప్రాంతాలలో ఉన్న కొన్ని ప్రత్యేక ప్రాంతాలలోను, రెగ్యులేటెడ్ మార్కెట్లలోను మెట్రిక్ తూకాలు 1958 అక్టోబరు 1వ తేదీ నుండి ప్రవేశపెట్టబడ్డాయి. పూర్తిగా అమలుపరచడానికిగాను అప్పట్లో రెండేళ్ల వ్యవధి నిర్ణయింపబడింది.

*ఈ రెండేళ్ల వ్యవధి 1960 సెప్టెంబరు 30వ తేదీతో ముగుస్తుంది. ఆ తర్వాత పై చెప్పిన ప్రాంతాలలో మెట్రిక్ తూకాల వినియోగం నిర్బంధమవుతుంది.*

ద్వితీయ దశ ప్రారంభించడానికి అప్పుడే ఏర్పాట్లు జరుగుతున్నాయి. దేశంలోని మిగతా ప్రాంతాలకు కూడా ఈ పద్ధతి విస్తరించబడుతుంది. కేరళ రాష్ట్రమంతటా మెట్రిక్ పద్ధతి తూకాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఇతర రాష్ట్రాలుకూడా త్వరలోనే ఈ పద్ధతిని అవలంబిస్తాయి.

మార్పు మన మంచికే

## మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి - ఎంతో సులభమైనది

భారత ప్రభుత్వం వారిచే జారీ చేయబడినది

DA 59/541

# వికారి సంవత్సరంలో సాహిత్య వికాసం

**శ్రీ సాళ్వ కృష్ణమూర్తి**

ఏమేటికాయేటు—వచ్చిన సాహిత్యాన్ని వచ్చినట్లే కోసి గుండు చేసుకోవడం ఒక విధంగా కలభింగ క్రియ వంటిదనే చెప్పాలి. అయినా అదొక ఆత్రం మరి!

జరిగిన సంవత్సరం ఈ జరిగినట్లుగా కాక ఎంతోకొంత చాల్లో సాగి ఉన్నట్లయితే కవి వ్యాసంలో 'జాజ్రెటి' (Jazzetry) ని గురించి, 'కోపనోద్యమాన్ని' గురించి విపులంగా ప్రసంగిస్తూ ఉండేవాణ్ణి. 'కోపనోద్యమం' మాత్రం కొంచెం పాతది. జాజ్రెటి ఎరి కొత్త సాహిత్యమార్గం! మరింత తేలిగ్గా Jazz + Poetry = Jazzetry అట! అంటే పాశ్చాత్యదేశాల్లో ఒకటి రెండు దశాబ్దాలుగా సైద్య ముద్ర వేసుకొని గౌరవాన్ని అనిపించుకొన్న 'జాజ్' సాంగ్కి అనుగుణమైన కవితారచన జాజ్రెటీ అన్నిటిని గురించి పాశ్చాత్యులింకా గేయాలు పాడుతూనే ఉన్నారు. 'కోపనోద్యమం' ఆరంభించిన యువకమేధావి వర్గం ఆ మార్గంలో వ్రాస్తూనే ఉన్నది. ఇంతకూ ఏమిటీ కోపనోద్యమం? సంఘంలో జీవితంలో ఉన్న సాంప్రదాయికమైన 'విలువలు' జారిపోయి క్రొత్తవాటిని నిర్మించుకోలేని లోకం, సంఘం, నాగరకత, నీతి నియమం—అన్నిటిని ఎదిరించుకుంటూ ఈ అన్నింటిమీద తిరుగుబాటు చెయ్యడం. కాని ఈ తిరుగుబాటు చేసేవారు ఏమీ తెలియని వారనుకోవడానికీ వీలేదు. వీరంతా మేధావులు—విరంగా కూడా మేధావులే Angry Young Men, Beats మొదలైన పేర్లతో వ్యవహరించే వీరు తిక్కన రచయితలకంటే స్పష్టంగా ప్రతిభావంతులు. అది వీరితో వచ్చిన చిక్కు. అదే ఆ ఉద్యమానికి మూలహేతువు. దానికి అనువైన పరిస్థితులు కల్పించింది ఆధునిక విజ్ఞానశాస్త్రపు శాకినే. పోయిన సంవత్సరం సి. పి. స్నో వ్రాసిన 'విడిపోతున్న రెండు సంస్కృతులు' అనే వ్యాసం మేధావుల్లో సంచలనాన్ని కలిగించింది. జీవితానికి కళలకూ సమ్యక్ దృష్టి కావాలి. విజ్ఞానశాస్త్రానిది విశ్లేషణమార్గం. ఈ నాటికి విజ్ఞానశాస్త్రమంతా ఏకుమేకై కూర్చుంది. కళలనూ జీవితాన్ని గ్రస్యాలుగా చేస్తున్నాయి; ... స్తున్నాయి. ఫలితంగా రెండు కాల ప్రవృత్తులు నాటేమధ్య ఆపులించే అఖాతం ఏర్పడింది.

ఈ పరిస్థితి పాశ్చాత్యదేశాలలో ఉన్నంతగా లేకపోయినా అంత ప్రాయంగా మన ఈ దేశంలోనూ అంతో ఇంతో లేకపోలేదు. దాన్ని గురించి ముందు ముందు కొంత సూచిస్తాను. ప్రపంచంలోని కల్లోల పరిస్థితి అన్ని దేశాల్లోనూ ఒకేవిధంగా ఉండడంవల్లనే ఈ సామ్యాన్ని పోల్చుకోడానికి వీలవుతున్నది. తెలుగు సాహిత్యంలో పోయిన సంవత్సరం వచ్చినపంట ఎటువంటిదో, దాని తియ తేనెలు రుచి రుచులు ఎటువంటివో పరిశీలిద్దాం.

ఈ సంవత్సర కాలంలో వచ్చిన తెలుగు సాహిత్యాన్ని చూచినంతవరకు, తోచినంతవరకు మనసుకు పట్టించుకొని చూస్తే నాకు కన్పించిన ముఖ్యలక్షణాలివి. సాహిత్యరంగం కొన్ని దశాబ్దులుగా ఉద్యమాలతో ఉరకలాడింది. ఆ ఉరకలాటలలో చెదిన ఆలోచనలూ ఉరకలాటగానే ఉండిపోవి. అటు తర్వాత కొన్నాళ్ళు ఒక విధమైన స్తబ్ధత ఏర్పడింది. తర్వాత క్రమంగా ఆ స్తబ్ధత, జడత్వం విచ్చిపోతున్నది. అన్నిశాఖల్లోనూ మనస్సు ఆలోచనాభిముఖమౌతున్నవి. ఉద్యమాలతో ఒడ్డెక్కినవైన సాహిత్యపుటుద్యానం స్థిమితత్వాన్ని తెచ్చుకుంటున్నది. పండిన గింజల పంట పెంటబెట్టి కొలుచుకుంటున్నట్లుగా ఉన్నది సంవత్సరం. కవిత్వం, నవలలు, కథలు, నాటికలు—అన్ని సాహిత్యశాఖలలోను వచ్చిన జాతిరచనలు తక్కువే. క్రమంగా ఆయా శాఖలను గురించి చూచుకుంటూ పోదాం.

ముందుగా కావ్యాలసంగతి: ప్రాచీనమైన, సాంప్రదాయికమైన భావంతో కవితానూతనంగా స్వచ్ఛతరంగ భంగికగా, జీవనదిగా అవ్యాహతంగా సాగుతూనే ఉన్నాయి. ప్రాచీనులు మనకు గడించిపెట్టిన శాశ్వతసంపద అది. కొద్దికాలంక్రిందట వాల్మీకిరామాయణం, పోయిన సంవత్సరం భారతం భాగవతం, నాగినంతో మూల గ్రంథాలతో సమానంగా క్రొత్తదనంగా సంతరించుకొంటూ సర్వోత్కృష్టంగా ... సాగించినవి; ఇంకా సాగిస్తాయి. క్రొత్తమీద కోరికతో కోతి అనే మనస్సుకు తిరుగుబాటు కావలసిరావడం అరుగులేని ప్రాతకావ్యాల అంశ అక్కర కావడంలో విశేష మేముంది గనుక! ఇక సాంప్రదాయికమైన మార్గంలోనే క్రొత్తగా వచ్చిన స్వతంత్ర కావ్యాలలో మొట్టమొదట చెప్పుకోవలసింది కీ. శే. కొడవలూరు రామచంద్రరాజకవి వ్రాసిన 'మహాసేనోదయం'. నాయక ప్రతినాయకులను తీర్చడంలో కావ్యం శివాసురయుద్ధం వంటిదన్నారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఒకసారి. ఈ దృష్టితో 'మహాసేనోదయం' విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి సమకాలీనంగా వచ్చిన మహాకావ్యం. స్కాందపురాణంలోని శివరహస్యఖండం ఆధారంగా వ్రాసిన కావ్యమిది. తెలుగులో ముదిగొండ బ్రహ్మయలింగకవి వ్రాసిన 'శివరహస్య ఖండతత్త్వ ప్రకాశిని' అనే వచనగ్రంథాన్ని ముఖ్యంగా అనుసరించి వ్రాశాడు కవి. తాత్త్విక విషయాలను కథారూపంగా ప్రపంచించడం పురాణమైనపంథా. కార్తికేయుని పుట్టి నివాసక్తి) కూడపన్న తారకాసురుణ్ణి వధించడం, శ్రీవల్లి కల్యాణంకొరకు ఇందులో కథ. ఆయా చోట్ల అన్నిరసాలు పోషిస్తూ వస్తుసహజమైన గాంభీర్యాన్ని అంగిటిబంటిగా తాగించేది కావ్యం. అయినా అతిమాత్రమైన సంయమం, భాషాచ్ఛందః పాండిత్యం, చిత్రమైన కవిత్వ మర్మజ్ఞత—అన్నిటికంటె ఎక్కువగా ప్రసన్నత ఈ కావ్యానికి

శోభిస్తూన్న విషయాలు. తరువాత చెప్పవలసింది కవిసమ్రాట్టుల శ్రీగిరిశతకం— ఈ సంవత్సరం 'భారతి'లో ప్రచురితమైంది. అలంకార భాషాప్రాగల్భ్యాలు ఇందులో మట్టం. ఆయన చిత్తశుద్ధి ఈ శతకానికి అలంకారం. భక్తిధారాంగంతో తనలోని పంచకోశాలు చించి తెలుగుమాటల్లో శివుని ముందుపోశాడు. ఆయన నిరహంకారిత ఈ కావ్యం చదివినవారి నందరినీ నిరహంకారులుగా చేస్తుందంటే ఇది సర్వజనీనమైన రచన అన్నమాట. ఏ పద్యం చూచినా చాలును గనుక ప్రత్యేకంగా ఒకపద్యాన్ని ఉదాహరించి అపచారం చెయ్యను. తరువాతిది మోటూరి వేంకటరావుగారి 'చకోరసందేశం'. మేఘసందేశ కావ్యాన్ని 'తూటాత్రిప్పికొట్టుట' గా వ్రాసిన చక్కని కావ్య మిది. ప్రతిపత్రలీన పరివ్యాప్తంగా అలముకొన్న స్త్రీప్రకృతిలోని ప్రతీక్షా సౌకుమార్యం నిజంగా చదివి అనుభవింపదగింది. మేఘసందేశమన్నాను గనుక రాయప్రోలువారి అనువాదం 'దూతమత్తేభం' సున్నం వీరరాజకవి వ్రాసిన 'యక్షప్రవాసం' అనే కావ్యాలనుగూడ పేర్కొనాలి. 'యక్షప్రవాసం'లో యక్షుడు సందేశమంపడు. తన ప్రియావిరహాన్ని గురించి ఖేదంతో వెళ్ళబోసుకుంటాడు. మరి బూర్గులవారి పండిత భాషాపాండిత్యం చాటే 'పండితరాజ పంచామృతం' (అనువాదం), ధుండిరాజకవి వ్రాసిన అభినవ కాదంబరికి వేదం వెంకటకృష్ణశర్మగారు చేసిన తొలి తెలుగనువాదం 'అభినవాంధ్ర కాదంబరి' కి॥ శే॥ కోమాండూరు కృష్ణమాచార్యులవారి 'కృష్ణలీలా విలాసము' ప్రాచీన మార్గానికి చెందిన మరికొన్ని కావ్యాలు. గటి లక్ష్మీనరసింహంగారి 'గాథా సప్తశతి' అనువాదాన్నికూడా ఈ పట్టున స్మరించాలి.

'ప్రాతకొత్తల మేలుకలయిక'గా వ్రాసేవారిలో పి. నారాయణరెడ్డి ఒకరు. ఆయన వ్రాసిన 'విశ్వనాథ నాయకుడు' చిన్నకావ్యమైనా గుణమైన కావ్యం. రవీంద్రుని 'గీతాంజలి'కి చలంగారు చేసిన భావవ్యక్తి పాటవంగల అనువాదం, కూర్తుకుడిలో ఉంటూ తెలుగులో ముప్పైతొమ్మిది కీర్తనలు వ్రాసిన కోశనపల్లి సీతురామయ్యగారి 'కామధేను గానామృతం' విలక్షణమైన చేర్పులు.

నవ్యకవితామార్గానికి వస్తే మనకు రెండురకాల కవులు కనిపిస్తారు—కాల్పనిక కవితామార్గ చ్ఛాయలోబడి ఖండికలు వ్రాసేవారు, అభ్యుదయ కవులు. నవీనుల్లో ఈసంవత్సరం పేరుబడ్డ పెద్దవాళ్ళెవరూ గొంతు విప్పినట్టు కానరాదు. అభ్యుదయ కవుల రచనలు కూడా తిరుగుబాటు తత్వాన్ని విడిచిపెట్టి సాత్త్వికదృష్టికి, భావప్రమితంగా వ్రాయాలనడానికి మళ్ళినాయంటే ఖండికా రచయితల అంతికంటే ఎక్కువగానే సంయమానికి తత్వాభిముఖతకు తిరగడంలో విశేషంలేదు. ఈయేడువచ్చిన కవితాసంపుటాల్లో నిక్రిందాభాగునండి నవ్యసాహితీసమితివారు ప్రచురించిన "నవ్యసాహితి" ఒకటి. కాని అదేమంత చెప్పుకోదగినస్థాయిలో లేదు. విడిగా ప్రచురింపబడిన నవ్యకావ్యాల్లో నారాయణరెడ్డిగారి "నెన్నెలవాడ", కె.వి రమణారెడ్డిగారి 'అంగారకవల్లరి". మాగిరాజు రంగారావుగారి "కిర్మిరం", 'మేల్కొన్న ఆకాశం", కుందుర్తి వ్రాసిన "యుగే యుగే" అనేవి పరిశీలింపదగినవి.



నాట్య సంగీతాలకు కవిత్వాన్ని మళ్లా జోడించే ప్రయత్నం పాశ్చాత్యదేశాల్లో జరుగుతున్నదని "జాజ్ పోయెట్రీ'ని గురించిన వార్త వల్ల తెలుస్తున్నది. అలనాటి 'లిరిక్కు'లు 'లైర్'ను విడిచిపెట్టి దూరమైపోయినాయి గదా! సంగీతానికి కవిత్వాన్ని జోడించిన రోజులవి. నాట్యానికి కవిత్వాన్ని జోడించబూనుకున్న రోజులివి. "సంవాదిన్యో మేధావినాం బుద్ధయః" అంటారుగదా. తెలుగు కవిత్వంలోనూ ఈ ఛాయ కనబడుతుంది—నారాయణరెడ్డిగారి "వెన్నెలవాడ' లోని రచనలు నృత్యనాటికలుగా ప్రదర్శింపదగినవి. దేశంలో వచ్చిన మార్పువల్ల నాట్యసంగీతాలపట్ల ఆదరాభిమానాలు పెరుగుతున్నవి. దానికనుగుణమైన రచనలివి. కాని ఈ దేశంలో నాట్యం సమాహారకళగా, అన్నికళలకూ అంతగా నిలిచిందే—పాడడానికి కృతులు, అభినయానికి పదాలు, జావళీలు వ్రాశారు. ఇదేమీ క్రొత్త కానవచ్చు. నిజమే. తాత్కాలికంగా ఒక భావానికి వచ్చిన ప్రాధాన్యమే ఇది. ఈసృష్టి అధునికుల కవితావ్యాసంగంలోనూ కనబడుతుంది.

ఈ యేడు వచ్చిన కొన్ని ఖండకావ్యాలు, ఆ కవిత్వంలోని పోకడలు ఎట్లావున్నాయో చూద్దాం. పైన చెప్పిన నవ్యకవుల గ్రంథాల్లోనూ ఈ చెప్పబోయే ఖండికల్లోనూ ప్రధానంగా కన్పించేది 'భావచిత్రణ' (Imagery) మీది మోజు. మునుపటికంటె ఎక్కువగా, సమర్థంగా అలంకారాల బదులు కవులీ 'భావచిత్రణ' చేస్తున్నారు. సౌందర్యసృష్టి దీనికి చోదకశక్తి. కాని ఈభావచిత్రణ అనన్వితంగా ఉండిపోవడం జరుగుతున్నది. కవిత్వంమీద ఆధునిక చిత్రలేఖన ప్రభావం కూడా కనబడుతున్నది. కోపనోద్యమాంకురచ్ఛాయలు కూడా ఉన్నవి. ఈ నాలుగు విషయాల జ్ఞాపకంతో ఖండికా రచనలను చూస్తే నా మట్టుకు నాకు పోయిన సంవత్సరం వచ్చిన—అంటే పత్రికల్లో ప్రచురితమైన—వాటిలో మొదట జ్ఞాపకం వచ్చేది 'సుప్రసన్న' వ్రాసిన 'పాపాప్రమాన్మథము'. పాఠకులు, వన్నెవిలోకకులు వ్రాసిన చంఛానదృశాలైన రచనలెన్నైనా వచ్చి ఉండవచ్చు. వానిని పరామర్శింప నక్కరలేదు—'పాపాప్రమాన్మథము' మాత్రము మేలుజాతి రచన. కావ్య వస్తువు ప్రాతదే—వసంతరుతువులో మన్మథభావ విజృంభణము. సమర్థుడైన కవి ప్రాణిమనఃకోశమును ప్రచ్చి క్రమించి మన్మనభావం ఎట్లు ఉల్బణమగునో చక్కగా చిత్రించినాడు. ప్రాణుల ప్రవృత్తి వీథుల నభివర్ణించడమే కవిత్వం గదా. మన్మథావిష్టమైన మనసుకు వసంతర్తు దర్శనానికి తెగని లంకె. అది సంగీతము పాడిస్తుంది, ఇంచుక ఉన్మాదసదృశమైన ఉల్బణాతిగాయిత చూపిస్తుంది. ఈ క్రింది పద్యంలో కవి జేబుకొన్న ఆ భావాన్ని ఎలా పట్టినాడో చూడండి:

"వేలై మన్మథు లాక్రమించిన దిశల్ వీణాక్వణత్క్రమరో
ద్రోలావణ్యము హూర్చ్వగో దిశల దంతుల్ గున్నమామిళ్లగా
నాలో మన్మథ మన్మథమ్ములు చలన్నవ్యాంబుదార్ద్రింబులై
మాలారమ్యములైన ఊహలు మృదూన్మాదక్రియా హేతువుల్.

"నగ్నము లౌ ఒడల్లు, కనిపంత వి పొంగులుపోవు యౌవనో
ద్విగ్నరసైక వాహములు, వ్రీడ ఎఱుంగని సోగకన్నులున్
అగ్నులవోని కోరికల అంతరమంగు జ్వలించు కామ సం
లగ్నులు మద్విరోగధిర లక్ష్యము లచ్చర లెన్ని వందలో."

ఈ రెండవ పద్యంలోని, నగ్నత. పొంగులు పోవుట, వ్రీడ ఎఱుంగమి, సిమసిమలాడు కోరికలు, విరహానుభవ తీవ్రత — మన్మథసంబంధులుగా చూచుకుంటే కవి నేర్పు ఎంతటిదో తెలుస్తుంది. ఈ మృదూన్మాదానికి కారణం వసంతదర్శనం. ఆ దానికి సాధనమైనవి కండ్లు—ఆధునిక చిత్రకారులు చెరదేసి కండ్లు ఒకటిగాని రెండుగాని చిత్రించి భావానికి స్ఫూర్తిమత్త్వ మాపాదించినట్లే ఈయన ఒట్టి కండ్లనుగూర్చి ఉల్లేఖించాడు చూడండి:

"ఎదలో కామము కొల్పునో దగినదా ? ఈ కత్తులౌ కన్నులన్
తుదలన్ చక్రములట్లు వెల్గులను చిందుల్ త్రొక్కు నేత్రంబులున్
మదసంప్రసన్న యనంబులున్, భువన సామ్రాజ్యైత్వ దర్పాత్తముల్
ఉదిత స్వప్నము లంబకమ్ములు నవర్తూన్మాదముల్ పెంచగా."

నా మట్టుకు నేనీ ఖండిక చదివి ఆనందించాను. అట్లే బాలగంగాధర తిలక్ వ్రాసిన 'కవితోపనిషత్' భావచిత్రణలో సొగసైన రచన.

'తూలిన తాగుబోతు, కూలిన యింటినడికప్పు, బ్రతుకు పైలు దారిలో వ్రాలిన మృత్యువురెక్క ఒక కాన్వాసు మీద ఆర్టిస్టులు చిత్రిస్తున్న నిమూషాన'—అంటూ పదాలతో బొమ్మకట్టడం ఉంది. లోకాన్ని అడివిగా, మనుష్యులని మృగాలుగా స్ఫురింపజేసే ఈ వాక్యాలు చూడండి:

'నీపల కొండచిలువలు వెలుతురు కుందేళ్లను మ్రింగి సంఘపు మర్రిచెట్టును చుట్టుకొని మత్తుగా నిద్రబోయే సమయాన,

'మానవారణ్యంలోని పెద్దపులులు జరీఖండువాలు, ఓరుదాంకితమైన సువర్ణపతకాలు ధరించి సిటీలో సభావేదికమీద కథాకళీ నృత్యం చేస్తున్న కాలాన,

'సాయం విహారార్థ మరిగే చక్కని చుక్కల మినుకు మినుకు మనే వెలుగుల్లో చలికాచుకునే పసుచువాళ్ళ చప్పట్ల తప్పెట్లు మ్రోగే సుముహూర్తాన,

'అతగాడు ఒక్కడూ ఊపిరాడనిగదిలో జిడ్డుతేరిన తన ముఖాన్ని కన్నీళ్లతో టాయిలెట్ చేసుకుంటున్నాడు.'

ఇట్లాంటి రచన—అంటే భావచిత్రణ—పిలకా గణపతి శాస్త్రిగారుకూడా ఊహాపోహాపటువుగా చేశారు 'కలలో పిలుపు' అనే ఖండికలో.

'జాజువా తెరచాప కెరటాల జీరాడ
సాగినది సంధ్యాప్రవాళనౌక.
జలధిలో జలతారు వలలోన మీనమై
మిలమిలల మెరసినది నెలవంక.
తెలిమంచు తెరల కావల తరళహాసితమై
వెలిగె ధ్రువతారకా దీపకళిక.
ఎలుగెత్తి ఎవరో అవలితీరమున నిలిచి
పిలిచిరో కలగించె నొక్క కేక.'

ఏదో కొంచెం 'మిస్టికల్'గా ఉందిగదూ! అవును. ఆలోచనాభిముఖమైన మనసులు తత్త్వాభిముఖం గాకుండా ఎట్లా ఉంటాయి? 'నాదపరిమళం'లో నారాయణరెడ్డి స్పష్టంగా వేదాంతంలో పడి

'ఇంకా కమియింగదేమి
ఈ పంచేంద్రియ బంభర
ముహుర్ముఖర ఝంకార
ముల విమల వికారములు
కన్నులేసుట కిమ్మీరిత
కాంతా కింజల్కములు
చల్లాపగ మనసులోని
చిరవాసనలారు టెట్లు!!

అంటున్నాడు. మరి మామూలుగా ప్రాచీనపన్థను గమ్మత్తుగా ప్రాబంధికమైన భావాలను భావచిత్రణలో జొనిపి వైలక్షణ్యం సాధిస్తున్నాడీయన.

'మాట్లాడే స్మృతులు' అనే ఖండికలో—
'నా స్మృతులు నాల్కల్ని తోడుక్కొని
నడిరేయి యేవిటో పలుకుతున్నాయి.
గతమనే ముసలిగోవును కట్టేసి
నిర్దయగా అనుభవాల్ని పిదుకుతున్నాయి.
వెన్నెల దమురు ఒంట బట్టించుకొని
పన్నీటి కుల్యల్లో జలకాలాడుకొని
కమ్మకస్తురి గిర్నామం దిద్దుకొని
కలువ పుష్పాల్లో మెయిగండా అద్దుకొని
తెమ్మెర పల్లకీపై షికార్లు తిరిగిన దినాలు
గమ్మత్తుగా, మత్తుగా కరగినక్షణాలు
కనిపిస్తున్నాయి పాతచుట్టాల్లాగా
తునిగిపోయిన కలలోని చిత్రాల్లాగా.'

ఇవి ఆహ్లాదంతోపాటు జాలికూడా కలిగించే స్మృతులు. రెండో రకం స్మృతు లెట్లున్నాయో చూడండి:

'భయాల దుప్పట్లు కప్పుకొని ఇరుగ్గదిలో
చావుకు జీవంపోసే మొనగాళ్ళు
ఆకల కుంపట్లు పెట్టుకొని ఆకాశం వేపు
చూపుల్ని ముడుపుగట్టిన మునిగాళ్ళు
పచ్చిగడి అనుకొని గోతిలోపడ్డ పసిలేళ్ళు
చిచ్చు కౌగిట్లో వెచ్చగా పడుకొన్న ఊళ్ళు
అబ్బా, ఎంతటి చేదు జ్ఞాపకా లివ్వి
అరుస్తున్నాయి పొగగొట్టాల్లా వికవికనవ్వి.'

ఈయన ఇన్నిరకాల కవిత్వాలు కలపడంకంటే ఏదో ఒక మార్గానికి కట్టుబడి నిలిస్తే నావంటివారు సంతోషించగలరు, ఆయనా మరి కొంత సాధించనూ గలడు.

'పావ్రసమాన్మథం' కంటే మరింత సాంప్రదాయిక మార్గంలో రచించిన 'వాంఛానుమితి'లో 'సంపత్కుమార' దక్కని వాక్చిత్రం కట్టాడు, అంటే అలంకారం వేశాడన్నమాట. వస్తువు వర్ణిస్తున్నాడు కవి. మన్మథప్రశక్తి వచ్చింది

'ధనువై సొమిమనోజ్ఞ చక్రము వియద్భాగమ్ము చిన్నారి చ
క్కని రెక్కల్ విచలించుచున్ జను బలాకాశ్రేణితా వారిదై

ఘన జల్లుల్ విశిఖమ్ములైన మదనస్వామీ! ఇదో గుండె వి
చ్చిన ఈ బాడబరీతి వాంఛలను వెచ్చింతున్ త్వదర్థమ్ముగన్.'

ఈ పద్యం చదువుతోంటే నాకు భాస్కర రామాయణంలో అనన్యసాధ్యంగా వ్రాసి పెట్టిన వర్ష ఋతువర్ణన — ఆ ఋతుతత్త్వాన్ని శోభను ఒక్క నాలుగుచరణాల్లో అదిమిపెట్టిన రచన జ్ఞాపకం వస్తున్నది:

'ధృతశక్రాయుధ, మింద్రగోపము, సమార్ద్రీభూత భూభాగ, మూర్జిత వాఃపూర్ణ సరస్తటాక తటినీ శ్రేణీక, మానంద న
ర్తిత కేకి ప్రకరం, బలక్షిత దిశాదిత్యంబు...'

ఇత్యాదిగా సాగుతుం దాపద్యం. ఇంతకంటే ఇంప్రెషనిస్ట్ కవిత్వం ఉంటుందా? ఏమో మరి! అల్లే 'యమునదంకము, కృష్ణభూమదిల, వక్షాత్మన్మనుష్యంబు' అనేది ప్రావృట్కాల సర్వసృష్టిని శ్యామాయితంగా వర్ణించే గొప్ప పద్యం—ప్రకృతానికి వస్తాను.

ఇంక అలంకారాల గొడవకు కూడా అక్కరపోకుండా భావాన్ని 'స్ప్రింగ్'గా తయారుచేసి దాన్ని అదిమిపట్టి చిక్కగా సరళంగా పద్యం చదివినపిదప పాఠకుడు పైకెగిరి పోయేటట్లుగా వ్రాసేవారిలో మల్లంపల్లి శరభయ్యగారు ఒకరు కాదు, నాకు తెలిసినంతవరకు, ఒక్కరే. ఆయన పండితుడు. మనస్వి. మనస్సెప్పుడూ మననశీలమూ, భావావిష్టమూ. ఎప్పుడో గాని చేసిన రచన బైటపెట్టడు, మునుపెన్నడో 'సాహితీసుప్తదీపిక'అనే ఖండిక వ్రాశారు. అది ఇతరభాషల్లోకి అనువదింపదగిన రచన. ఈ సంవత్సరం ఆయన వ్రాసిన 'పితృతిథి'అనే చిన్న ఖండిక 'జయంతి'లో ప్రచురితమైంది. కేవలం ఆయనకే సంబంధించిన విషయమైనా సర్వజనీనత, భావచిక్కణత అందులో ఉన్నాయి. పితృతిథినాడు అమావాస్య 'పితృభుక్త' భాజనాలు సముద్రంలో కలపబోయి చీకటిలో సముద్రాన్ని చూచినప్పటి అనుభవం చెప్తాడిందులో. చిన్నతనంలో అతురాలు దిద్దుకునే వయసులో అది మానివేసి తల్లిని సముద్రమెంత పెద్ద దేలువో చెప్పమనేవాడట. ఆ జ్ఞాపక స్మరణంగా ఖండిక ఈ రెండు పద్యాల్తో ముగుస్తుంది:

'ఖచిత సాధనపథమై ప్రగాఢమోహ
వివశమై తండ్రి! మీ సర్వవీక్షణమ్ము
తప్పి దేవయాలనజీవితమ్మునందు
చెలగి యొకనాడు మిము పలించినది లేదు.

నేడమావాస్య మున్నీటి నీట గలుప
వచ్చినానేను పితృభుక్త భాజనముల
కబళిత నభః కటాహాంధకార విలయ
జలధి మీకోప మరసి విహ్వలుడనైతి.'

ఇంతగా అంతర్ముఖులైన కవు లీదేశంలో. ఈ దేశంలోకి ఏ ఉద్యమమూ అంత త్వరగా రాలేదు, వచ్చినా పాదుకోలేదు, పాదుకున్నా వేరూనలేదు. ఏది వచ్చినా సంచలించడం మన సాధుస్వభావంలోనే ఉంది ఏదివచ్చినా 'సర్వారణ్యం వ్రజతిచ గజః స్యందనాలోకభీతః' అన్నప్పట్టి సంగలిత స్థితి ఏర్పడుతుంది. కాల్పనికోద్యమం వచ్చినప్పటి స్థితి ఎట్లా ఉండినదంటే మహర్షి వర్ణించిన ఈ ఋషభ చేష్టితంగా ఉండినది.

'జలధర రవం శ్రుత్వా శ్రుత్వా మదోద్భ్రమితదర్పితో
విలిఖతి మహీం శృంగాక్షేపై ర్వృషః ప్రతిసర్ద్ధయా,
స్వ సముపతి వృత్తో గోష్ఠా ద్గోష్ఠం ప్రయాతి చ నిర్భయో
వృషభ లలితం చిత్రం వృత్తం కరోతి చ శాద్వలే.'

మరి శ్రీశ్రీ మొదలైన వారితో మరొక కవితోద్యమం వచ్చి దానికి 'చాలెంజ్'గా నిలిచింది. అదికూడా ఎట్లున్నదంటే — మహర్షి మాటల్లోనే చెప్తాను:

'ఏష గజేంద్ర మత్తకలేభః కలభైః పరివృతః
క్రీడతి వృక్షగుల్మ గహనే కుసుమభరనతే,
మేఘరవం నిశమ్య ముదితః పవనజవసమః
సుందరి వంశపత్రపతితం పునరపి కురుతే'—

అన్నట్లుగా ఉంది. ఇట్లుండిచెట్లకుచెల్లే టీకి సాకవై చేసేతికి వచ్చింది.

'ఏషోఽచ్యుత నిర్వనతుల్య రవః తీవ్రః స్ఖలమాన విలంబగతిః,
శ్రుత్వా ఘనగర్జిత మద్రితటే, వ్యాఘ్రః ప్రతిమాటయతి ద్విరదః.'

మరి ఈనాడు మనకూ కోపనోద్యమంలాంటిది వచ్చే అవకాశమున్నదా అంటే ఉందీ అనవచ్చు. మరి రాకనూ పోవచ్చు. కాని ఒకటి మాత్రం నిజం. మేధావి వర్గంలో చాలా అసంతృప్తి ఉంది. దాన్నే పోరీత శివశర్మగారు 'అపరోక్షధర్మ'మనే ఖండికలో ఇట్లా వెలిబుచ్చినారు.

'ఇవి చేతులా? కావు, ఎవరికే నొకరికి
బానిసత్వము చేయు బ్రతుకుదారులు
ఇదియుగ సిమ్మమా? ఇదియును బుద్ధియా?
అరుగాళ్ళకు అమ్ముడైన ముద్ద
ఇది శరీరమ్ము కానే కాదు, గొప్ప సం
సారమ్ము నీగు పంజరపు తేవ
ఇదియును జీవితం బెంతయు గాగు నిం
తయుకు మాటికొరకై త్రచ్చు సుదధి.

ఇందులో సేనటన్న సుగ్గంగు గలదు? —
లేదు ఒక్కటి పరను దుఃఖమ్ము మాత్ర
మదియు సుఖమానో గుఃఖమేయానో నాకు
తేల్చి చెప్పగలాని ప్రార్థింతు సతము'

సహాసిాణ నిత్తం తప్పిపోవడం, విరక్తి, వైకల్యం, ఇగినుఖనూ గుఃఖనూ ఎవరైనా తెలియజెప్పమనడం — ఇంతకంటే కోపనోద్యమానికేం కావాలని.

'కఠనోపనిషత్'లో బాలగంగాధర తిలక్ వ్రాసినదాంట్లో కూడా 'అతగాడు పరీక్షనాళికలో ఎండిన శాంరీకత గండె పరీక్షించి కొంచెం కొంచె తన కన్నీళ్ళతో తడుపుతున్నాడు.'

'కష్టాల బాధల భయాల పర్వతశిఖరాలపైన నిలచిన కొంక్షా నీహారాల ఆశానూర్యకు ప్రతిఫలింప ఏడురంగుల ఇంద్రధనుస్సు లెక్క లెక్కపెట్టి కోటకోలవి జనులు ఎండమావుల పండుగలు చేసుకొనే సమయాన —'

'నాలుగురోడ్ల కూడలిలో నిలబడి సౌఖ్య నగరానికి దారి తెలియక సైన్‌పోస్టుమీద మిథ్యాలిపి డిసైఫర్ చెయ్యలేక జిగీషువుల

జిజ్ఞాసువుల ముఖాలు వెలవెలబోతున్న సమయాన—అతగాడు ఒక్కడూ ఊపిరాడని గదిలో ఉరిపోసుకు చనిపోయాడు.'

ఈ మొదటైన వాక్యాలు ఆ అంకురాలనే సూచిస్తాయి—ఇది మునుపటి కవిత్వంలోని ఆవేశం కాదు. ఆవేశం లేకపోవడమే ఆలోచించ తగిన విషయం. కాని మన సాధుస్వభావంలోని మరో లక్షణం బహుశః దీన్ని అణిచిపెట్టవచ్చు. ఏదైనా ఒక విషయాన్ని గురించి పొంగుగా ఒక భావం వచ్చినప్పుడు, దాన్ని ఒక సిద్ధాంతంగా చేసి వేసుకొని ఊరుకోవడం—అంటే దాని 'సొల్యూషన్'ను సిద్ధాంతంగా చెప్పివేయడం—తర్వాత అగ్నిపుస్తకాల్లో ఉండిపోతుంది; కల్లోలం తప్పుతుంది. క్రమంగా దానికి సర్దుకుంటుంది లోకం. ఈ లక్షణంగూడా దాశరథి శివశర్మగారి 'అపరోక్షపర్వం'లో కనబడుతుంది.

> 'కర్మమ్ము కర్త కీర్తనరి కర్మదగు ఫలంబు సెప్ప
> కార్మికోరూఢతజెంది ఘనఫలదాయకమగును
> కర్మమ్ము ధర్మమ్ము వనియు ధరలోన శాంతియు నోయు
> దుర్మార్గులకు కలిచెందు దుర్మరణముగూడనదియు'

ఆ ఖండికలో వ్రాసినదానికంతటికీ ఉన్న ధార (edge) తీసివేసి సాధువుగా చేసిందీ పద్యం—తాత్కాలికంగా.

మాదిరాజు రంగారావుది ఇంకొక మార్గం. రమణారెడ్డి రచనల్లోగూడా ఈ లక్షణం తొంగిచూస్తుంది. రంగారావు కవిత్వాన్ని ఒకవిధంగా వైజ్ఞానిక కవిత్వమనవచ్చు. సోషియాలజీ, ఆంత్రపాలజీ, సైన్సు మొదలైన వాటిని కలిపి వ్రాస్తాడీయన. 'ఇరవై అయిదో శతాబ్దంలో చంద్రుడు' అనే రచనలో సైన్సువల్ల రాబోయే స్థితిని అభ్యూహించి చంద్రునితో ఈ మాటలు చెప్పిస్తున్నాడు.

> 'ప్రతిమనిషి కాంతి గోళంలా మారి
> మనిషి మస్తిష్కం టెలివిజన్ యంత్రమై
> గాలికి కెరటంలా తేలే మనస్సుతో
> బంతిలా ఎగిరే శరీరంతో
> మీరంతా నాస్థానం ఆక్రమించి—కళ్ళు
> కదలిక ఎరుగనివాళ్ళై, సాగించి
> పరిశోధనలు ఆయుర్దాయం తేల్చి
> కొంపజాతి మంచుమనిషివని నిశ్చయించి
> నా చుట్టూరతుణకోసం యంత్రాలు......
> నమ్మనంతగా మారుతుంది నా పూర్వరూపం.
> కాంతి గోళాల్లా తిరుగుతుంటారు మీరు
> ఎవరికి వారే స్వయం వ్యక్తి, సంపూర్ణంగా
> టెలివిజన్ మస్తిష్కంతో మనుషులు.
> కాంతి ముద్రలు - చెల్లిపోయిన
> చెల్లని పాస్కుల పత్రం 'రిన్యూ' చేతుందా?
> కాంతి చక్రం పరిధిలో వెలుగుతప్ప
> సాగివచ్చినంత మేర తిరిగి చీకటేగా ?'

ఇదంతా క్రాంతిదర్శిత అనకోడంకంటే 'సైన్సుఫిక్షన్' అనుకోడం బాగుంటుంది. సైన్సు ఇదంతా సాధించవచ్చు. కాదనను కాని చివరి 'చీకటి' మాటకేం చెపుతారు? చంద్రమండలాన్నే కాదు సూర్యమండలాన్ని గూడా ఆక్రమిస్తామని వ్రాస్తే కవిత్వంలో గూడా దాన్ని ఒప్పుకోవడం కష్టం - ఈ రకపు రచనలకు ప్రయోజనం - ఎవరంగానూ—చాల స్వల్పమనుకుంటాను. కావలిస్తే ఆ శాస్త్రీయ విషయాలు చక్కగా వ్యాసాలు వ్రాసి విజ్ఞాన ప్రచారం చెయ్యవచ్చు

కాగా, కవిత్వాన్ని గురించి తేలిందేమంటే ఆలోచనాభిముఖంగా ఉండి తత్త్వోన్ముఖమైన రచనలు చేసే చిత్తవృత్తి కవిత్వానికి తత్త్వానికిగల సంబంధాన్ని గుర్తించబోవడం బాగుగా కనబడుతుంది. రచనలో భావచిత్రణ ఎక్కువ - చాలాచోట్ల అది అనన్వితం. కోపనోద్యమం రాగల బీజాలున్నప్పటికీ ఇప్పటి 'మూడ్'లో వచ్చే సూచనలేదు. మన స్వభావంకూడా అందుకొక కారణం. వచ్చిన కవిత్వం రాశిలోకూడా కొంచెం, నవ్య కవిత్వానికి సంబంధించినంతవరకు. స్ఫూర్తి శ్రీ భాస్కరరావు 'మహాశ్వేత' కథను సంవిధానయుతమైన చిన్న కావ్యంగా నిర్మించడం చూస్తే సరైన పరిస్థితిలో శాశ్వతమైన రచనలు రాగల సూచనలున్నాయి.

కవిత్వం తర్వాత నవలలు : ఈ సంవత్సరం విశ్వనాథవారు వ్రాసిన ఒకటి రెండు నవలలే ప్రధానంగా చెప్పదగినవి. సృష్ట్యాది నుండి జరిగిన చరిత్రను పది పుస్తకాలుగు నవలలుగా వ్రాయడానికాయన సంకల్పించినారని తెలుస్తున్నది. ఈ వచ్చిన భగవంతుని పై

పక, శాస్త్రీ ధూమము అనే రెండు పుస్తకాలను ఈ కారణంచేత మన నిర్ణయాలకు పాత్రం చెయ్యకూడదు. తర్వాత ఆంధ్రపత్రికలో ప్రచురితమౌతున్న 'అన్వేషణ' హైదరాబాదు జీవితాన్ని మాత్రమే అన్వేషించేదిగా ఉంది. సంవిధానం ఎంత బాగున్నా చెప్పే విషయాలు అనుదాత్తంగా సామాన్యంగా ఉండడంచేత పై తరగతి పాఠకులను ఆకర్షించ లేకపోతున్నది. ఆ నవలకు బహుమానం వచ్చింది. నిజమే చాలా మంది ఇతరుల కంటే రచయిత జీలుగా సంఘటనలు కూర్చగలవాడే. కాని మొత్తం కథలోని 'లెవెల్' కొంత ఉదాత్తంగా ఉంటే బాగుండేదేమో!

ఇంక కథలమాట: కథలకేం కథాప్రసంగ వతుగా చాలానే వచ్చినాయి. 'ప్రపంచ కథలు' వంటి అనువాద సంపుటాలు, విడిగా బుచ్చిబాబు 'మూడు కోతులు' వంటి కథల పుస్తకాలు వచ్చాయి. కొన్ని పత్రికల్లో కొన్నాళ్లు ఇంగ్లీషు మొదలగు భాషల్లో నుండి అనువదించి కథలు వేశారు. కేథరీన్ మేన్సు ఫీల్డ్ వ్రాసిన 'ఒక కప్పు టీ' అనే కథ యొహాన్ పీటర్ హెబిల్ అనే జర్మన్ రచయిత వ్రాసిన 'కానిట్ ఫర్ స్టన్' అనే కథా పేర్కొనదగ్గవి. ఈ కథల్లో శిల్పం కన్నా కొనరాదు. అదేవాటి గొప్పతనం కథగా ఉత్కంఠరా ర్వహణ చాలా ప్రాధమిక విషయం శిల్పం గొప్ప కథలో మాటున ఉంటుంది. ప్రతికథకూ వస్తు సహజమైన ఉన్నీ లక్షణ మొకటి ఉంటుంది. సంవిధానం రచయిత చేసేది. రచయిత సమర్థుడైతే ఆ ఉన్నీలనమూర్గ మెరిగి సంవిధానంగా రూపొందిస్తాడు. కాని నాకు కథకుడు 'టెక్నిక్' కోసం తాపత్రయపడటం జరుగుతుంది. కథకంతకూ చేరి ఒక 'పాయింట్' కూడా ఉంది ఈ రెండూ తెలుసుకొని వ్రాస్తే కథకు రచనా సంబంధమైన ఉదాత్తత వస్తుంది. పైన పేర్కొన్న కథల్లో అటి ఉదాత్తత ఉంది — ఈ సంవత్సరం విడిగా వచ్చిన కథల్లో పేర్కొనదగ్గ మంచికథలు నేను చదివినంతవరకూ — వచ్చే కథలన్నీ చదవడం కొంచె మించు మించుగా అసాధ్యమే అనాలి — ఏవున్నాయి. ఆర్. ఎస్. సుదర్శనం వ్రాసిన 'కాలం తెచ్చినమార్పు' గొప్పకథ. పండిత విమర్శకులుగూడా ఈ కథ ఇతరభాషల్లోకి అనువదింపదగిందన్నారు. 'ఆదర్శాల మేరకు వ్యక్తిత్వాన్ని సాగదీయటంకన్న వ్యక్తిత్వం మేరకు ఆదర్శాలను కుదింపుచెయ్యటమే మంచిదేమోనని నా ఊహ' అంటారు 'విశ్వనాథం' ఇందులో. రాజకీయాలు విరమించిన ఒక కాంగ్రెసువాది చుట్టూ ఈ కథ అల్లబడింది. ఇందులో సంవిధానానికి ప్రాధాన్యంగాని, వైచిత్రిగాని ఏమీ లేదు. కలో చనా పటువైన కథ. కథలో 'స్వరాజ్యం' అని ఒక అమ్మాయి పేరుండడం, ఇంట్లో దొంగతనం చేస్తున్న నల్లపిల్లి ఒకటుండడం ఇందలి 'సింబాలిజం'. రెండో కథ కూడా సుదర్శనం వ్రాసిందే 'అమృతుడు'. ఇది మూడు జన్మలకథ. ఈ జన్మకథలో పూర్వజన్మకథ పొదిగి ఉత్తరజన్మకథ సూచించి వదిలాడు రచయిత. కాను క్రితం జన్మలో ఎప్పుడో విజయనగరంలో యోధుడు. పువ్వులాదిక నొకతెను ప్రేమించినాడు ఆమెకోసం తుంగభద్రా తీరానికిపోగా ఇంట్లో తల్లి చనిపోతుంది. తల్లియెడ అపచారం చేశాననుకుంటాడు. సైన్యంలోనుండి యుద్ధాల్లో ఒకసారి తిరిగి వచ్చేసరికి పువ్వులాదికను మరొక వైదేశికుడు పెళ్లాడినాడు—

జరిగిందనీ, ధూలవిపర్యాలను కూర్చి సమాహిత చిత్తంతో ఆలోచించడం జరుగుతున్నదనీ చెప్పవచ్చు.

కవిత్వం తత్త్వాభిముఖంగా ఉంటుందనేది మతం మళ్ళీ యిప్పుడిప్పుడే గమనిస్తున్నా మనడానికి కవిసమ్రాట్టులు వ్రాసిన కొమంతల పాట ఎమిది వ్యాసాలు ప్రతీకలవచ్చు. ఈ వ్యాసాలెంత గంభీరములో మనుచరిత్రమీద వ్యాసాలూ అట్టివే. కూచిపూడివారి కలాపాల్లో భామాకలాపం శృంగారమని, గొల్లకలాపం భాణిక అని, తోడిగాని కలాపం 'డోంబీ' అని వ్యాసాలు, ఇలాంటివి పెక్కు వచ్చాయి.

పత్రికల్లో సమీక్షలుకూడా కొంతవరకూ పగ్గాలు బిగబట్టి నప్పటి ఉదాత్తంగా ఉండడానికే ప్రయత్నిస్తున్నాయి. పాఠకులు కూడా అది వ్రాసినా చదివే స్థితిలో లేరు. 'దూతవృత్తి' కావ్య సమీక్షమీద ఆంధ్రపత్రికలో వచ్చిన 'ప్రతి సమీక్ష' ఇందుకు నిదర్శనం. ఇదికూడా సంతోషించదగిన చైతన్యమే.

ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'తెలుగు వెలుగులు' అనే శీర్షిక క్రింద గొప్పవారనిపించుకొన్నవారిని పరిచయం చెయ్యడం వారి లోటుపాట్లుకూడా చూపించడం - అన్నిటికంటె ముఖ్యంగా ఆ శీర్షికను ధర్జవశీలంగా నిర్వహించడం ఒక విశేషం.

ఏమైనా కేంద్ర సాహిత్య అకాడెమీనుండి తెలుగువారి పుస్తకానికి బహుమతి లేకపోవడం విచారించవలసిన సంగతి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారూ, సంగీత నాటక అకాడెమీవారూ చేస్తున్న కృషి ప్రశంసనీయం. సాహిత్య అకాడెమీ వెంకటరామశాస్త్రిగారి 'స్వారోచిషుని కవిత'కు రెండువేల రూపాయలు బహుమతి యిచ్చి ప్రోత్సహించింది. సంగీత నాటక అకాడెమీ శ్రీరామ అప్పారావుగారి నాట్యశాస్త్రానువాదానికి వెయ్యి రూపాయలు మంజూరు చేసినట్లు విన్నాము

స్థూలంగా మాసక్షిప్తంగా వ్రాస్తు పోతే ఇది వికారి సంవత్సరంలో తెలుగు సాహిత్యవికాసం. నవలలు నాటకాలు దక్కినవి తృప్తిగా రాలేదు. ఆలా నవ కలవాటుపడడంలో ఈయేడు వచ్చిన ప్రోత్తరచనలు తక్కువైనా ఫర్వాలేదని నాకు తోస్తున్నది. ఏమంటే మనలో కిమంతులకుగాని, వైవిధ్యానికిగాని కొదువలేదు. అన్ని కాలల్లోనూ చెయితిరిగిన రచయితలెందరో ఉన్నారు. కథకళి సాహిత్యం చంద్రోత్సవకావ్యం మొదలైన మళయాళ భాషా సాహిత్యాన్ని గురించి వ్రాసిన పుట్టపర్తి నారాయణాచార్యుల వంటి బహుభాషా వేత్తలు, సాంప్రదాయికంతర తమిళ సాహిత్యాన్ని గురించి వ్రాసిన చల్లా రాధాకృష్ణశర్మగారంటి తమిళభాషా వేత్తలు ఉన్నారు. ఇరుగుపొరుగు సాహిత్యాలనింకా కొంత పరిచయం చేసుకుంటే తెలుగు సాహిత్యానికదికూడా ఒక శోభ తేగలదు.

ఈ యేడు వచ్చిన రచనలు కొన్నటిని కించపరచనక్కరలేదు. స్థాయి పెరిగే సమయంలో రాశి కొరవడడం సహజం గనుక తెలుగుసాహిత్యవనంలో అన్నిరకాల పుష్పజాతులూ, పరిమళాలూ ఉన్నాయనే సంతోషించవచ్చు, నిజమైన అభ్యుదయాన్ని ఆశించవచ్చు.

"చూతాశోకారవిందైః కురవకతిలకైః కర్ణికారైః శిరీషైః
పున్నాగైః పారిజాతైర్వకులకులయోః కింశుకైః సాతిముక్తైః,
ఏతైర్నానాప్రకారైః కుసుమసురభిభిర్విప్రకీర్ణైశ్చ తైస్తైః
ర్వాసంతైః పుష్పబృందైర్నృపవర! వసుధా స్రగ్ధరేవాద్యభాతి."

భోరన నంకుర పల్లవ కోరక పుష్పఫల వితతిఁ గొమరమరి మనో
హారములై సారములై యారామము లొప్పె మధుసమాగమవేళన్
వలి మొగ్గలు విరిపువ్వులు నలకొత్తమై చూడనొప్పెఁ జంపక మత్యు
జ్జ్వలరుచి రేవగ లూరక వలిగెను నుద్దీప దీపవ్యూకము వోలెన్.

(స్వారోచిషుని వసంత వర్ణనము)

# మంగళ మాఘము

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

### నాంది

మధువునకు లేమావి — మల్లియ
వేసవికి — వృష్టికి కదంబము
తమ్మి శరదికి — సీతు శిశిరున
కిచ్చితివె హేమంతమా!

### పూర్వరంగం

కోయిలలు రాగాలు తీయగ
తమ్ములను ముద్దాడ తుమ్మెద
కన్నెలతలు నమర్తలాడ — వ
సంతు డరిగెను సుఖముగా.

రావి బంగారాకు లొత్తగ,
పగలుబడి నవ్వంగ మాగధి,
చందనార్చన సలుప వింహిణి
దీర్ఘ వాసరములు చనెన్.

జడకుచాలని కురుల పోలిక —
చెదరి చెదరిన కరుపుట్టల —
కొదమ మబ్బులు కులుకగా — పుల
కించె లోకము తొలకరిన్.

ముసురుధారల — వానముంపుల
నిగుడిండగ నిర్ఝరములై
ఈనమోసిన ధేనువుల వలె
కనులు తనిపె తటాకముల్.

జున్నుగడ్డల భంగి చుక్కల —
వెన్నలను పెరుగన్నముట్టల —
మ్రింగె దయ్యములాగు చీకటి
జడలు విడ మిట్టాడుచున్.

వారిజములు తేటతేరెను —
బాట లెండెను - పచ్చ గేదగి
చెండ్లు మోసెను - పసులు మేసెను
లేతపచ్చిక బీళ్లలోన్.

స్నానమాడిన చాన లూరికిన
నీళ్లు పిండి బయళ్ల పఱచిన
చీరలన తెలుపారి మబ్బులు
తేలియాడె నభంబునన్.

మంచిగుమ్మడిపూలు బంగరు
కంచములవలె మించె గట్లలో;
రేయి చుక్కలరీతి కన్నది
దోస నూగరి పిందెలన్.

పాలుపోసిన పయిరు పొట్టల
చేలు శ్యామల మాంసలములై
ఈనవచ్చిన పడుచులాయెను
శిశిరు సావాసంబునన్.

భోగినోములు నోచి నెలతలు
పసుపుచీరల పమిటలాడగ,
పాలపొంగలి పంచిపోయిరి
చలికి శయ్యల దూరగన్.

మిరపతోటల మెఱిసినవి పగ
డాల బోలిన పండ్లగుత్తులు —
బంతి మొక్కల చాళ్లు పూచెను
పసుపుముద్దల నిత్తెనాన్.

వచ్చినావే మాఘమా! శ్లా
ఘాతరంగ రసవదుపోఘము!
ప్రత్యూషః స్నానవ్రతిచ్ఛాశ
భక్తజన తాపాఘమా!

శిశిరశుక్లనిశీథమందున
శౌరి నిద్దుర లేవగా — వై
కుంఠమున వాకిండ్లు తీయగ
వచ్చినావే మాఘమా!

పెండ్లిసంనాహములు - పిలుపులు
ఇండ్లకును సంభ్రమప్రతిష్ఠలు —
పంటకోతలు - కుప్పనూరిపి
ఎన్ని శుభములె మాఘమా!

# ఆత్మదీపము

శ్రీ హారీత శివశర్మ

ఏనన్ నేను త్రిగుణాత్మ ఘటిత బంధాయత్త క్షుధార్తుల్ల ఘో
రైనట్టి హృదంతర స్ఫురిత దివ్యధ్వాంతభావుండనై
ఏనన్ నేను నిరంత సంవరిత సంహీన స్పృహారిక్తుడై
ఈ నా జీవితమెల్ల నేమగునో యం చేస్తున్ సహస్రాకృతిన్.

లుళితహృత్కుహరవల్గు ప్రగల్భంబు గోష్పదసంయుక్తప్రతిసారకలన
చలితవాంఛామందసాన్నటస్ఫటి కామ్యాకర్షా విప్రకర్ష వలన
లలిత నానాభవవళితమ్ము ఊహామ్ము తతమహావరణ వర్ధనము కలిమి
గలిత సమాయోగ గలితమానసహంసి ఆజవంజవనిషద్వ్యాప్తిచేత

పేశల తనూవికాస ప్రతిష్ఠమైన
ప్రాకు కులోపల భావ మత్తాటలాడు
నిజయు నధ్యాసొ, భ్రాంతియో, యెరుగరాక
నాకు నాలోన గుడుసుళ్లు కాక లేదు.

మాయామోహనవాహినీనిహృత రసాస్తుంగహిల్లోలలో
లాయానంబగు జీవితంబున సుశీలాన్వంబు లాశివిమ
శ్రీ యోగంబులు దృష్టనీప్రసర చీర్ణిహ్లాగ్హృష్టీకంబులన్
ఆయం బొప్రబతు కంతయున్ అభృతహాల్యాతుల్యాకల్పాంకమై.

కన్నుల్ జూతును కర్ణరంధ్రములు ప్రుక్కన్ విందు ప్రేంకిన్ సమా
పన్నంబైన సుహృద్వర స్థవిర శశ్వద్విప్రవాక్యంబులన్
ఎన్నంజూడను; ఉత్కలాషుకజరాన్స్పృక్ దగ్ధజీవుండనై
ఉన్నిద్రా హతిబాధ చెందుదు కువణ్యవ్యాళి సందష్టతన్.

తొలిచదువుల్ ప్రబుద్ధములు ధూర్వహముల్ పరిణద్ధ ధర్మముల్
మలిచదువుల్ విచిత్రములు మానసముల్ ఉతధర్మగర్భముల్
తొలిమలివిద్యలన్ మనసు తోచదు, తోచినదో అసహ్య వి
హ్వాలమయి ఎంతపట్టు తుది పట్టదు బిట్టు మనూపతాళమై.

నాలో నేనయి చూచుకొందివురుగన్ నాన్యత్ పథప్రాదినీ
శ్రీలాలిత్యములోని వెల్గొకటి తోచితోచనట్లై, యెదో
బాలాహస్కర రేఖపాళి, గహనాభ్రమ్మందు మినైక్కు, ద్రాశా
లోలత్తీవ్ర ప్రహేళికాప్రాదమునై, లోనూగి పై నూగుచున్.

# ఆత్మదీపము

ఘనఘనాఘనపటాత్ ఘనవల్లికాజాలత్
గగనవీధీ ప్రాంగణము కదలి
నిత్యనితాంతఘూర్ణితసరంధ్యాంబోధి
కిర్మీరితము దశకీల రేగి
గహనాంధకార నికారదీవ్యద్దీప్త
దీపవృత్తశిఖాప్రదీప్తి వెలిగి
అతినిరంతరజాడ్య ద్ధిత సత్యకామనా
కృతి నాత్మ మనుభూతి గిలకరించి

ఇది యెదో క్రొత్తమధుగోష్ఠ కదిలివచ్చి
ప్రమిదలోపలి దీపమ్మువలెను వెల్గు
మనసులో భావ మేర్పరింపంగరాని
స్థితిని పొందినదాచు వేధించు నన్ను.

ఈ వెలుగేమొ చిత్రమయి ఇంతకు ఇంతకు నాగిపోవునా
ఈ వెలుగింతలో చిత్రమయి ఇంతస్థిరన్ గని నిల్వనేర్చునా
ఈ వెలుగేమొ నిల్వగ, మరేమియు నిల్వ దనంగరాదు, తా
నై చిలసచ్ఛిఖావిహ్వృతి నందినయట్లుగ నాత్మదీపమై.

ద్వైతధీభావము ప్రబ్బకో దమువు సర్వాంగాన్ వ్యథాఖిన్నమై
అతిన్ పొందినయట్లుగన్, మరల నత్యంతంబు నానందనాత్
పథీయః పరిమృష్టమై పొలుచు నద్వైత ప్రమాశక్తిచే
పాథఃప్లావిత ముత్ప్రకృష్టము సుహోర్వావ్యగూఫలారంభమై.

అభిహవమైన జీవితమునందన సత్యగిరంసనాన్ గనత్
విభవసుహాగ్నికుండమును తెరిచి హావ్యముగాగ దుష్టధీ
ప్రభవము నా జవంజవదర ప్రకృతిన్ హావనింతు, వీకమున్
అభయశమప్రశస్తపథమందున నిల్పుదు, తెల్వి గొల్పుదున్.

ప్రవణమునజేసి దీక్ష నమువర్ధనమున్ పొసరించి దక్షిణా
వితతమహానుభావపదవి స్థిరచిత్తమునైన తాల్మితో
నతితము శ్రద్ధతో విమల సత్యమునన్ తెలుకొంత్తు క్రొత్త స
ద్ధతికిని తార్తు జీవితము లౌంతము నాత్మత ప్రశాంతమున్.

# అవతలి కోణం

## శ్రీమతి తురగా జానకీరాణి

సికింద్రాబాదు స్టేషనులో రైలు ఆగి పదినిముషాలైంది. తలుపు దగ్గర నిలబడి ప్లాట్ ఫాం అంతా కలయ చూసి చూసి, సీత లోపలికి తిరిగివచ్చింది. సుందర్రావు బద్ధకంగా ఆవులించి లేచి కూర్చున్నాడు. "ఏం? రాలేదా మీ వేలువిడిచిన చెల్లాయి?" అన్నాడు.

"ఇక్కడికిరాను, 'హైదరాబాదు స్టేషనుకి వస్తాను. ఇక్కడ దిగొద్దు' అని రాసింది—లేవండీ యింకా ఏం బద్ధకం చెప్పండి. బానీకి ఏమైనా కొని పెడుదురుగాని అలావెళ్లి."

సుందర్రావు లేచి వళ్ళువిరుచుకుని, పేపరు మడతపెట్టి, "ఏంకావాలిరా బానీబాబూ!" అని కొడుకుని పలకరించాడు. వాణ్ణి ఎత్తుకుని రైలుదిగి క్రిందికి వెళ్ళాడు.

స్టేషనులో కోలాహలం చూస్తుంటే సీతకి తన చిన్నతనంలో బెజవాడ ప్రయాణం జ్ఞాపకంవచ్చింది—అప్పట్లో సుమిత్రకూడా వుంది. ఎవరిదో పెళ్ళయితే వెళ్ళారు. బెజవాడస్టేషను చూస్తే తనకు మహా ఆశ్చర్య మనిపించింది. అది లోకంలో ఒక భాగంగా కాక, ఒక ప్రత్యేక ప్రపంచంలా కనుపించింది. తను, సుమిత్ర ఒకళ్ల చేతులు ఒకళ్లు గట్టిగా పట్టుకుని, ఎక్కడ తప్పిపోతామో అన్నట్టుగా నడిచారు. ఆ తర్వాత నాలుగేళ్లుకూడా కలిసిలేరు యిద్దరూ.

సుమిత్ర స్కూల్ ఫైనల్ తనతో ఆవూళ్ళో చదివింది. అవడానికి అప్పాచెల్లెళ్ళ పిల్లలే ఐనా సుమిత్ర, తను చిన్నతనం నుంచీ ఒకచోట అరమరికలు లేకుండా పెరిగారు. ఆ తర్వాత కాలేజీ చదువుకి వేరేవూరు వెళ్ళిపోయింది సుమిత్ర. తన పెళ్లికికూడా వచ్చింది కాదు. ఎమ్. ఏ. ప్యాసు అయిందనీ, హైదరాబాదులో పెద్ద ఆఫీసరుగా వున్నదనీ తెలిసింది.

చిట్టి ఏడుపుతో ఆలోచనలు చెదిరిపోయాయి సీతకి. దాన్ని ఎత్తుకుని సముదాయించి మళ్ళీపడుకోబెట్టింది. ఫ్లాస్కులో వేడి నీళ్ళలో తువ్వాలుముంచి, చిట్టివళ్ళంతా తుడిచింది.

రైలుకి గంటకొట్టారు. సుందర్రావు వచ్చి రైలెక్కాడు. బానీ చేతుల్లో బిస్కట్లు. చాక్లెట్లు వున్నాయి.

"ఇంక యిరవై నిముషాలు పడుతుంది అక్కడికి చేరడానికి." అన్నాడు సుందర్రావు వాచీ చూసుకుని.

పొడుగు వేసుంటే, చక్కిలిగింతలు పెట్టినట్టుంది కాబోలు చిట్టి పకపక లాడుతోంది. 'వ్వూ' కబుర్లు చెబుతోంది.

"నువ్వు దిగడం సంగతి సరేగానీ, నేనుకూడా వస్తే ఏం బాగుంటుంది చెప్పు-ఆవిడ ఒక్కత్తే వుంటున్న చోటుకి" అన్నాడు సుందర్రావు.

"ఏమీ ఫరవాలేదు. పైగా అది అంతగా రాసినప్పుడు వెళ్ళక పోతే బాగుండదు. మీ కెందుకు నాకులేని యిది?" చిట్టిని ఎత్తుకుని ఎదుటి బెర్తుమీద పడుకోబెట్టి, చిన్న చిన్న వస్తువులన్నీ పేము బుట్టలో పడేసింది సీత.

"నువ్వు ఆవిణ్ణి చూసి ఎన్నేళ్లయింది? గుర్తుపడతావా?" అన్నాడతను మళ్ళీ.

సీత నవ్వింది "మంచివారండి! మర్చిపోతా నేమిటి?—ఎంత యిదిగా వుండేవాళ్ళ మనుకున్నారు? స్కూలు ఫైనల్ వరకు ఒక్కచోట పెరిగాము. ఆ సమానం ఇద్దరం కలిసే వుండేవాళ్ళం. మా అమ్మ నవ్వుతూ వుండేది—వీళ్లకి పెళ్ళిళ్ళైతే కాపురాలకి వెళ్లమని పేచీపెడతారేమోనని. అది డాన్సు నేర్చుకుంది. మా నాన్న నాకు నేర్పించలేదు. మళ్ళీ ఏడాదికే నా పెళ్ళి ఐపోయింది." రైల్లోంచి తొంగిచూసింది సీత. దూరంగా మేడలు, పొగగొట్టాలు కనుపిస్తున్నాయి. ప్రక్కనున్న హుస్సేన్ సాగర్ మీదనుంచి చల్లగాలి వీస్తోంది.

"అది బాగా చదువుకుని పైకి వెళ్ళింది—ఉద్యోగస్తురాలైంది. నేనిలా సంసారంలో పడ్డాను." వెనక్కి తిరిగి సుందర్రావువంక చూస్తూ నవ్వింది సీత.

"ఆ హోల్డాలు కట్టేయండి. నేను కుస్తీపట్టలేను దాంతో." అన్నది సుందర్రావు లేచాడు.

సామానంతా సర్దుకుని, చిట్టిని ఎత్తుకుని బానీని పిలిచి కూర్చోబెట్టేసరికి. పలుకుగా రెన్న మధ్యలోంచి పోతోంది రైలు. "పూలు, పూలు" అంటూ ఎగిరాడు బానీ. "అవి పేపర్ ఫ్లవర్సా నాన్నా?" అని అంటున్నాడు వాడు.

రైలు ఆగకుండానే కంపార్టుమెంటులోకి ఇద్దరు కూలీలు ఎక్కారు. కిటికీలోంచి తల బైటికిపెట్టి చూసింది సీత. రైలు ఆగింది. సుమిత్ర ఎక్కడా కనబడలేదు. సామాను అంతా దింపేస్తున్నారు కూలీలు.

సుందర్రావు కోటు తీసి భుజాన తగిలించుకుని "కనుపించిందా?" అన్నాడు. సీత లేదన్నట్టు తలూపింది

"దిగండి చూద్దాం." అన్నది అతను క్రిందకి దిగి సామాను లెక్క చూస్తున్నాడు. అతనికి చిట్టిని అందించి తనూ దిగింది సీత.

"సీతా!" ప్రక్కనుంచి తెల్లనిచేయి పడింది సీతభుజాన. సుమిత్ర! సుమిత్రేనా? ఎంత మారిపోయింది?

"మీ రైలు పదకొండున్నరవరకు రాదని ఎంక్వైరీవాడు చెప్పాడు. ఆఫీసుకి వెళ్లి, కొంత పని చూసుకుని యిల్లా వచ్చాను-ఎన్నాళ్ళకి చూశాను నిన్ను! పదేళ్ళయిందేమో కదూ!" అన్నది సుమిత్ర. ఆమె నవ్వితే బుగ్గలు చక్కని సొట్టలు పడుతున్నాయి.

"చాలా మారావు సుమిత్రా నువ్వు-ఇదుగో. ఈయన్ని చూడ లేదుగా నువ్వు? వీళ్ళందరినీ-"

సుమిత్ర సుందర్రావు వేపు తిరిగి "నమస్కారమండి" అన్నది.

సుందర్రావు ఒకచేతిలో సిగరెట్టు. భుజానకోటు, రెండో చేతిలో చిట్టి వుండగా, ఏం చేయాలో తోచక, కంగారుగా నవ్వి, "నమస్కారం" అన్నాడు.

సీత కిలకిల నవ్వింది "బాగుందండీ! బావా మరదళ్లు వస్తూ రాలేక పోవటం—దాన్నిల్లా ఇవ్వండి అని చిట్టిని తీసుకుంది. వాని, సుమిత్రవంక బెరుగ్గా కొత్తగా చూస్తూ, వాళ్ళమ్మ చేయి పట్టుకున్నాడు.

బయలుదేరారు. టాక్సీ ఎక్కే వరకు పదకొండున్నర కొట్టింది "మీరు ఆఫీసుకు వెళ్లలేదేమో" అన్నాడు సుందర్రావు.

"అక్కర లేదండీ. రెండు గంటలకి వెడతాను" అన్నది సుమిత్ర.

"ఏం సీతా ఏమీ మాట్లాడకుండా యిలాగైపోతూ వేమిటి?— ఏమండీ, మా సీత యింత నిశ్శబ్దంగా వుంటుందా ఎప్పుడూ — మీరు ఎప్పుడూ దాని వాగ్ధోరణిలో మునిగిపోతుండేవాళ్లమోనని నేను భయపడుతుండేదాన్ని."

సుందర్రావు నవ్వాడు. "లేదండీ వాక్కూడా వరదాయే నండీ సీతమాటలంటేను—మీ దగ్గర క్రొత్తలా వుంది." అన్నాడు.

సీత మళ్ళీ కిలకిల నవ్వింది. "మరి! ఏనాటైనా దిగుతూనే మొదలెట్టాలా గోల? మా సుమిత్రతో చెప్పుకోవలసినవి లక్ష వుంటాయి-అవన్నీ మీరుండగా ఎల్లా?" అని సుమిత్రవంక చూసింది.

సుమిత్ర చాలా అందంగా వుంది. చిన్నప్పుడే అంతా అనుకునేవారు. అప్పుడు బాగా సన్నగా వుండేది, అతి నాజూకు అనిపించేలా. ఇప్పుడు కొంచెం లావుకావడంవలన, చక్కదనం తగ్గింది. చేతులు మొగలిరేకుల్లా వున్నాయి—మెడ, చెవులు నగలు. వింతగా కోపంతో నిండివున్నాయి: కొటుకకి ప్రతిగా కళ్ళు అతిస్నిగ్ధంగా తెల్లగావున్నాయి—టాక్సీ యింటికి చేరే లోగా సీత గమనిస్తోంది సుమిత్రని.

"అంతగా మారిపోయానా సీతా? అంతిదిగా చూస్తున్నావు. నువ్వుమాత్రం మారలేదేమిటి—పూర్తిగా గృహిణివై పోయావు?" అన్నది ఆమె—"ఇంతకీ పిల్ల పేరేమిటి?" అన్నది

"వీడు వాని, అది చిట్టి—అసలుపేర్లు చెప్పము మేము—నవ్వుతారు మీరు." అన్నాడు సుందర్రావు.

చిన్న యింటిముందు ఆగింది టాక్సీ. గేటుదగర ఒక పని మనిషి కూర్చునివుంది. సుమిత్ర దానికి యింటి తాళంచెవి యిచ్చి, ముందుకువెళ్లి టాక్సీవాడికి డబ్బిచ్చేసింది 'అదేమిటండీ?' అని సుందర్రావు అంటున్నా వినిపించుకోకుండా.

పనిమనిషి తాళంతీసి వచ్చి. సీతచేతుల్లోంచి చిట్టిని తీసుకుంది. ముందుగదిలో బుల్లి సోఫా సెట్టు, రేడియో, ఓమూల బల్లమీద పత్రికలు అద్దాల బీరువాలో పుస్తకాలు— గదినిండా అక్కడక్కడ పెయింటింగ్సు, పనితనం చూపించే అందమైన చిన్న చిన్న వస్తువు లున్నాయి సీత యివన్నీ ఒకసారి కలయచూసి, రెండో గదిలోకి వెళ్ళింది. అక్కడ ఒక మంచం, డ్రెస్సింగు టేబిలు అద్దం బీరువా వున్నాయి. ఆ తర్వాత రెండుగదులు - ఒక గది చాలావరకు ఖాళీ గనే వుంది. ఒక అలమారలో కంచం, చెంచాలు, టీ సెట్టు మాత్రం వున్నాయి చివరగది వంటిల్లు.

సామాను లోపల పెట్టించి. సుందర్రావుని కూర్చోమని చెప్పి, సుమిత్ర లోపలికి వెళ్ళింది. "ఏం? వచ్చిందా నా సంసారం?" అన్నది.

సీత అంతా కలయచూసి "చాలా చేర్చావే, సామాను, ఒక్కర్తె కేనా?" అన్నది.

"ఒకర్తె యినా వస్తువులైనా అవసరాలు ఒకటేగా. ఏది లేంది గడుస్తుంది—కాఫీ తాగుతారా?—బ్రెడ్ వుంది. అది తినలేమంటే యిడ్లీ తెప్పిస్తాను." అంది సుమిత్ర.

"ఇప్పుడేమీ వద్దు - స్నానంచేసి భోజనంచేస్తాము. వారు అక్కడ యిదే వేళకి భోజనం అలవాటు. ఆయన పదింటికి టిఫిను తినివెళ్ళి, ఒంటిగంటన్నరకి భోజనానికి వస్తారు. ఆ దాకా వంట మనిషి అలా అన్నీ వేడిగా వుంచాల్సిందే. పిల్లలకేమో వేరే వంట తొమ్మిదిన్నరకల్లా ఐపోతుంది. అదిగో పిల్ల లేమిటిలే వాడికి చక్కడికి కారం తినకుండా వాడు! ఉప్పేసి కూరలు వుడికించి, కొంచెం వెజిటబుల్ సూప్ చేసి పెట్టేస్తాను వాడికి. వాడి వంట మాత్రం నేనే చేస్తాను."

చెప్పుకుంటూ సీత యివతలికి వచ్చింది. డ్రాయింగురూమని అనుకుని వున్న ఒక గదిలో పెట్టించింది వాళ్ల సామానుని సుమిత్ర.

"ఇక్కడ యింకో గది వున్నదేమిటి?—ఖాళీగా వుందేం యీగది?" అన్నది సీత.

"నేను చదువుకోవడం, వ్రాసుకోవడం యీ గదిలో-లైటిల్లు వుంది కదూ? మా ఆఫీసు వాళ్లెవరైనా వస్తే మాట్లాడానికి వుంటుంది దీనో ని కుర్చీలు బైట వరండాలో వేయించాను."

అందరి స్నానాలు అయ్యేసరికి 12-30 అయింది. సుమిత్ర వడ్డించింది.

"మీరు వంటచేసుకుంటారా?" అన్నాడు సుందర్రావు భోజనానికి కూర్చుంటూ.

"సాధారణంగా చేసుకుంటాను. బద్ధకమనిపిస్తే హోటలునుంచి తెప్పిస్తాను. నా నమ్మిన బంటుని చూశారుగా. ఇక్కడే దానిల్లు. ఎప్పుడు కేకేసినా పలుకుతుంది ఇవ్వాళ్లనుంచి రోజల్లా యిక్కడే వుండమని చెప్పాను-చాలా మంచిది."

వానీ అన్నం తినడానికి పేచీ పెడుతున్నాడు. అది కాదు యిదని, యిది కాదు అదని వాళ్ళమ్మని వేధిస్తున్నాడు.

"ఏం? మీవాడికి సరిపడదా నావంట!" అన్నది సుమిత్ర.

సీత వాడితో విసిగిపోయింది "వాడి చిత్రమైతే తిండానికి టాడు అన్నీ—ఆపెరుగు యిల్లా పెట్టు." అన్నది. చివరికి పెరుగు అన్నం మాత్రమే తిన్నాడు వాడు.

'సాయంత్రం నేను వండేస్తాను వీడికి' అన్నది సీత.

సుందర్రావు వంట బాగుందన్నాడు. "హోటల్లో వుంటారా అండీ వంటరిగా ఎం వుంటారు యిల్లా?" అన్నాడతను.

"ఏను, చింతా లేకుండా హాయిగా వుంది యిక్కడ. ఇక్కడుండే స్వతంత్రం అక్కడుంటుందా ఏమిటి?" అన్నది సీత.

భోజనాల తర్వాత సుందర్రావు పడుకున్నాడు. వానీకూడా పడుకున్నాడు.

సీతకి నిద్రరాలేదు. హాల్లో, వగాపులు అవీ పైన దాకా మీద ఎండేసి రమ్మని పంపించింది పనిమనిషిని సుమిత్ర.

"నువ్వు ఆఫీసుకి వెళతానన్నావుగా—తర్వాత వెడుదుంటా మలే, చెప్పు ఖబురేమిటి?" అంది సీత -- రేడియో త్రిప్పుతూ.

"ఏమున్నాయి? యీ మధ్య నవపూజా వెళివచ్చాను. కొన్ని నాళ్ళని గాసిప్పాను. నువ్వు సంక్రాంతికి గాలేదని గాలా యిదౌతున్నారు-ఐనా అక్కడి ఖబుర్లు నేను చెప్పేదమిటి?

సుమిత్ర నవ్వింది. "ఏంతమాట! అంత పెద్ద పొగడ్తలు భరించలేను నేను—ఏదో నా శక్తికి తగిన కృషి. అంతే." అన్నది ఆమె.

ఆమె నోటివెంబడివచ్చిన మాటలు వాళ్ళు ముగ్గురూ అతి శ్రద్ధగా విన్నారు. "వస్తామండీ—మీ పరిచయభాగ్యం కలిగినందుకు చాల సంతోషం." అన్నారు. వెళ్ళిపోయారు.

సుమిత్ర చిరునవ్వుతో సీతవంక చూచి అడిగింది "నేను డాన్సు చేస్తాను తెలుసా?" అని.

"తెలియకేం! పేపరులో చూస్తూనే వున్నాం కదా!—నేను నేర్చుకుంటానంటే నాన్న ఒప్పుకున్నారు కారు, అన్నిటిలో పాటే అది అల్లాగైపోయింది."

సుమిత్ర మౌనంగా నవ్వుకుంది. చటుక్కున సుందరరావు వంక చూసింది. అతను సీత వంక ఒకసారి చూసి తలతిప్పేసుకున్నాడు—సుమిత్ర చూపుని ఎదుర్కోలేక అతను.

"ఎక్కడికి వెడదాం యింటికి!" అన్నది సీత.

"సినిమాకి వెడదామా? పబ్లిక్ గార్డెన్సుకి వెడదామా? అల్లా టాంక్ బండిమీద నడుద్దామా?" అన్నది సుమిత్ర.

"వాకింగ్!" అన్నాడు నానీ. సుమిత్రకి నవ్వొచ్చింది. "కాన్వెంటులోకదూ వీడు చదువుతున్నాడు—అందుకే యీ యింగ్లీషుమాటలు. ఏరా! తెలుగు మాట్లాడవా నువ్వు?" అన్నది వాడి బుగ్గ గిల్లి.

"నో అయిల్ స్పీక్ ఇన్ ఇంగ్లిష్." అన్నాడు వాడు. సుమిత్ర పకపక నవ్వి, వాణ్ణి దగ్గరకు తీసుకుంది.—

—ఆ తర్వాత నాలుగురోజులు గడిచాయి.

సుందరరావుకి ఫ్లూ వచ్చింది. సుమిత్ర ఒకరోజు సెలవు పెట్టి తెలిసినవాళ్ళ కారు ఒకటి తీసుకొచ్చి, చూడవలసిన వన్నీ చూపించింది వీళ్లకి. ఎక్కడికెళ్ళినా ఎవరో ఒకరు సుమిత్రని ఎరిగున్నవాళ్ళు కనుపిస్తూనే వున్నారు. ఏదో వినయంగా ఆమె విద్యని, నాట్యాన్ని పొగుడుతున్నారు. సుందరరావు చెప్పాడు వాళ్ళ ఆఫీసు బ్రాంచి మేనేజరు కూడా సుమిత్ర చాలా సమర్థురాలైన ఆఫీసరని చెప్పాడని.

ఓ నాడు సినిమాకి వెళ్లారు అంతా కలిసి. చిట్టి సినిమా ఆరంభంకాగానే నిద్రపోయింది పేచీలేకుండా. సినిమా చూస్తున్నంతసేపూ సీత మనస్సు ఏమీ బాగుండలేదు. ఏమిటో నిరుత్సాహంగా వుంది. చీకట్లో సుమిత్ర వంక చూసింది. ఆమె ఆమె కళ్ళల్లో మెరుపు కనిపిస్తోంది. ఆమె కూర్చున్న తీరులో నే ఓ సౌభాగ్యంవుంది. ఆమె చూపులో ఒక చకచక, ప్రతి కదలికలో ఒక చైతన్యం వున్నాయి. ఆమె జీవితంలో ఆ చైతన్యం తొణికిసలాడుతోంది అనుకుంది సీత. తన సంగతేమిటి? దైనందిన కార్యక్రమాలలో ఒక తరహాలో నడుస్తుంది తన జీవితం. చెరువులో నీళ్ళలాగా తన జీవితానికి కదలిక లేదు. సుమిత్ర ఒక సెలయేరు—గలగలలాడుతూ, కొత్తదనాలతో పరుగులెత్తుతూ వురుకులతో పరుగులతో ప్రవహించే సెలయేరు.

సీత కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి ముత్యాల్లాంటి రెండు కన్నీటిబొట్లు బుగ్గలమీదనుంచి క్రిందికి జారాయి. ప్రక్కకి తిరిగి ఆయన్ని చూసింది. చెదిరిపోతూకనబడింది ఆయన ఆకారం. తనకి యీర్ష్య సుమిత్రని చూస్తే ఎందుకు? తనకీ డబ్బువుంది. తనభర్తకి హోదా వుంది.

కానీ—కాని—తన జీవితంలో లోటులేదు. తనకు అర్థం కాని విషయాలు, అర్థంచేసుకునే అవకాశంలేని విషయాలు ఎన్నో వున్నాయి. సుమిత్రవున్న ఆ మెట్టుమీదికి, ఆ సంస్కార స్థాయికి ఎక్కడానికి తనకి అర్హత, అవకాశం లేవు—సీతకి యీ ఆలోచనలు వూపిరి సలపనివ్వలేదు.

తనని బంధించి, పైకి వెళ్ళనివ్వక, చిన్నతనాన్ని అందుకునే అవకాశం లేకుండా చేశాయి యీ పెళ్లి. యీ పిల్లలు, సంసారం. తనలోని విద్యాతృష్ణకి ఉత్సాహానికి వేరేమార్గం లేదు. "ఇదే నీ జీవితానికి పరిధి ఈ గిరిలోపలనే ఆనందం పండించుకో" అని విధించినట్టయింది.

సీతకి వెలుబికివచ్చింది దుఃఖం. చటుక్కున లేచి బైటికి వెళ్ళిందామె—అక్కడ నిలబడలేకపోయింది. సుందరరావు లేచి వచ్చాడని తెలుసు. గట్టిగ కళ్లుతుడుచుకుని వెనక్కి తిరిగేసరికి, అతను ఎదురయ్యాడు.

"ఏమండి—చికాకుగావుంది యిల్లా వచ్చాను. తగ్గుతుంది యిప్పుడు." అన్నది ఆమె మెల్లిగా.

ఆ రాత్రి సుమిత్ర త్వరగా నిద్రపోయింది. సీత పాపాయికి కావలసినవన్నీ సర్దుకుని, పడుకునేసరికి పన్నెండయింది.

సుందరరావు చదువుతున్న పేపరు మడిచి పడేశాడు. "చూడు సీతా!" అన్నాడు.

"చెప్పండి"

"మీ సుమిత్ర పెళ్లి చేసుకోదా అసలు?" అన్నాడు.

"ఇప్పుడెందుకొచ్చింది ఆ ప్రశ్న మీకు?"

"వేణుకి ఉద్దేశం వుంటే ఓ సంబంధం చెబుదామని."

"ఎవరేమిటది?" అన్నది సీత కొంచెం సేపాగి.

"మా వేణు"—సీత మాట్లాడలేదు. ఒక పది నిమిషాలైనాక "దాని తరహా వేరు. పెళ్లి, సంసారం, జంజాటం అంతా అక్కర్లేదు దానికి—హాయిగావుంది. చీకు, చింతా లేకుండా పైకి వెళుతోంది—కీర్తి తెచ్చుకుంటోంది—దాని కెందుకు పెళ్ళి—బంధనం కాకపోతే." అన్నది.

అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది.

—"రేపు వెడతారండీ మీరు." అన్నాడు సుందరరావు మర్నాడు ప్రొద్దున్న కాఫీలప్పుడు.

"అప్పుడేనా?" అన్నది సుమిత్ర సీతవంక చూసి.

"మరి వెళ్ళొద్దూ? ఇప్పటికే వారమైంది వచ్చి—శలవు కూడా యీ రోజుతో అయిపోతుంది. ఇంకా వుండమంటే ఎల్లా?" అన్నది సీత.

"ఆ సీత యిలు వాకిలి చూసుకోకపోతే పెంకులెగిరిపోతుందండీ—పాలవాడు, పనివాళ్ళు అంతా గొడవలుపడి పోతుంటారని తన వూహ." అన్నాడు సుందరరావు నవ్వుతూ.

సీత ఆశనిరాశ చూసి నవ్వింది. "మరి! మీరు లేకపోయినా నాకు బెంగలేదు కాని—పాలవాళ్ళ కోసం మాత్రం బెంగే. ఏం?" అంది.

"ఎల్లుండి రాత్రి నా ప్రోగ్రాం వుంది యిక్కడ. వుంటారా? అవతెల్లుండి వెళ్ళిపోదురు గాని" అన్నది సుమిత్ర సందేహిస్తూ.

"మరి చెప్పరేం? తప్పకుండా వుంటామండీ. ఏం సీతా?" అన్నాడు సుందర్రావు హుషారుగా

"నా సీత ఎల్లాగూ వుంటుంది. అడిగే దేమిటి?"—అన్నది సుమిత్ర.

* * * *

కారు మంచి స్పీడుమీద మెత్తగా జారిపోతోంది రోడ్డు మీద. సుమిత్ర తల్లో మల్లెపూలవాసన గుప్పున వేస్తోంది. చీకట్లో సుమిత్ర వంటిమీదున్న ఆభరణాలన్నీ దగద్ధగాయమానంగా మెరుస్తున్నాయి. రేగిన జుట్టుని సవరించుకుంది సుమిత్ర—చేతినున్న గాజులు గలగలమన్నాయి. ఉంగరాలు, గాజులలోని రాళ్ళు తళుక్కున మెరిశాయి.

"సీతా, ఎన్నాళ్ళగానో అంటున్నావు నా సుమిత్ర డాన్సు చూడాలి, చూడాలని—మాశావుగా? ఎల్లా వుందో చెప్పవేం?" అన్నాడు సుందర్రావు.

"నే చెప్పేదేమిటి? అక్కడి జనమంతా చెప్పారు. బిరుదు యిచ్చి అంతా గౌరవించారు. నా అభిప్రాయ మెందుకు?" అన్నది సీత.

సుమిత్ర తనచేయి సీత భుజంమీద వేసింది "అలా కాదు. నీ అభిప్రాయమే కావాలి నాకు—అందరూ అనే మాటకేం లే." అన్నది.

సీత మాటాడలేదు. కారు యింటికి చేరింది. డ్రైవరు మల్లెపూల దండలు, ఇతర సామానులు తెచ్చి లోపలపెట్టి సలాం చేసి వెళ్ళాడు.

లోపలికి వెళుతూనే, తన గదిలోకి వెళ్ళి డాన్సు డ్రెస్సు విప్పేసి, చీర కట్టుకుని వచ్చింది సుమిత్ర. రేగిన ముంగురులు, ముఖాన రంగు, నల్లగా దిద్దబడిన కళ్ళు, కనుబొమలు, కెంపులా మెరుస్తున్న పెదిమలు—సీత కళ్ళు మరల్చుకోలేనంత అందంగా వుంది సుమిత్ర.

"భోజనం చేదాం పదండి" అన్నది సుమిత్ర. భోజనం చేస్తున్నంతసేపు సుమిత్ర నవ్వనా, చూపనా, యేం చేసినా లావణ్యం తొణికిసలాడుతోంది. ఆమె కంఠం గలగలలాడుతూ, చిరుగజ్జెలు మ్రోగించినట్లుగా శ్రావ్యంగా వుంది. అలనాడు లాస్యం చేసిన పార్వతి యిల్లాగే వుండేదికాబోలు అనుకుంది సీత.

"రంగు కడిగేసుకో పోతే, ఏమీ కాదా ముఖం!" అన్నది సీత.

"ఏమౌతుంది? ఏం కాదు—అలవాటులేనివాళ్ళకి తెల్లారేసరికి పీక్కుపోయినట్లు వుంటుంది ముఖం." అన్నది సుమిత్ర.

భోజనాలయ్యాక హాల్లో చాలాసేపు కూర్చున్నారు కబుర్లలో. సుమిత్ర తనకివ్వబడిన బంగారు నటరాజవిగ్రహాన్ని చూస్తో నిలబడింది చాలసేపు.

పన్నెండైనాక సుందర్రావు లేచి, "నిద్రొస్తుంది. నీకు నిద్ర రావటంలేదా?" అన్నాడు సీతవంక చూసి.

"మీరు పడుకోండి" అన్నది సీత. అతను వెళ్ళిపోయాడు.

కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి. సుమిత్ర నిట్టూర్చింది. "ఇన్నేళ్ళకి ఇప్పుడు కనిపించావు—ఇంకెప్పటికి కనిపిస్తావో మళ్ళా?"

"మేమే రావాలని ఏమిటి? నువ్వు రాకూడదూ? హాయిగా వంటరిదానివి కదా?—సుమిత్రా, ఎన్నైనా చెప్పు, చదువుకున్నవాళ్ళ దారి వేరు, చదువుకోనివాళ్ళ దారి వేరు—డబ్బు హోదా ఎన్నైనా వుండొచ్చుగాక. ఆ తరహా రాదు." హఠాత్తుగా ఆవేశపూరితమైంది సీత కంఠం.

"అల్లా అంటావేం సీతా? చదువుకుని నేను బావుకున్న దేమిటి—నీకు తక్కువైం దేమిటి?" అన్నది సుమిత్ర చేతులకి, చెవులకి వున్న వస్తువులు తీస్తూ.

"నీ కర్థంకాదు సుమిత్రా, ఎల్లాగూ తప్పదు ఆ ఖేదం. అప్పుడు చదువుకోలేదా—అంతే. ఇక ఎప్పుడూ ఆరాట అంతే—నా అంతట నేనిప్పుడు ఏదైనా నేర్చుకుందామన్నా తగిన ఆసరా లేదు. ఆయనా అంతంతమాత్రం చదివే చదివారు. ఇక యీ జన్మకి కుదరదు పైకి వెళ్ళే దారి మాకు—ఈ పెళ్ళి సంసారం పిల్లలు వీటిల్లోపడి ఏమీ తెలియక, ఏమీ పట్టక అన్యాయమైపోయాను" సీత కంఠం గద్గదికమైంది.

సుమిత్ర దగ్గరగా జరిగింది సీతకి. "చూడు, నేనేదో సాధిస్తున్నానని, ఆ తస్థులో వున్నాననీ అనుకుంటున్నావు నువ్వు—నీ సంగతి నీకు తెలియటంలేదు సీతా!"

సీత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "నన్ను ఓదార్చాలని అంటావు—నాకు కూడా మా నాన్న చదువు చెప్పించి, ఏ సంగీతమో, ఏదో చెప్పిస్తే నేనుకూడా పైకి వచ్చేదాన్ని కాదూ?"—సుమిత్ర మాట్లాడలేదు.

సీత అన్నది "చిట్టి దీపం వుంటే లేస్తుంది. ఆర్పేయి అది." అని.

సుమిత్ర లేచి ఆర్పేసి వచ్చింది. సీత చేతులు తన చేతుల్లోకి తీసుకుంది. "పైకి రావటమంటే ఏమిటి సీతా? కొంత పేరు, డబ్బు, హోదా కదూ? ఏమిటో పైకి రావటం నేనిప్పుడు ఔన్నత్యం పొందానంటావు నువ్వు—నేను సుఖపడుతున్నాననా? నావాళ్ళయితే మీరున్నారా, యీ దండలు, విగ్రహం చూడడానికి, నాకు బిరుదు యిచ్చానని సంతోషించడానికి—నా వాళ్ళెవరుంటారు? చీకట్లో, అర్థరాత్రివేళ తలుపు తెరుచుకుని, ఆ దండలు అలా పడేసి, చెవుల్లో ఆ చప్పట్లు మార్మోగుతోంటే వంటరిగా వుండడానికి భయం వేసి, యింట్లోని దీపాలన్నీ వేసుకు కూర్చుంటాను."...

కొంచెం ఆగి, "నాలుగువందల మైళ్ళ దూరంలో వున్న అమ్మ, నాన్న నా దగ్గిర వున్నా నాకు శాంతి నివ్వలేరు సీతా—"

ఆమె చేతులు చల్లగా వణికాయి. వేళ్ళు ఏమీ తోచనట్లు సీత చేతుల్లో కదులుతున్నాయి.

"తోటిదానివి కాబట్టి నీతో చెప్పుకో గలుగుతున్నాను. నన్ను అపార్థం చేసుకోకు. నువ్వు ఆయనవంక చూసి నవ్వితే, ఆయన నీవేపు యిష్టంగా నవ్వుతుంటే—అప్రయత్నంగా యిది కనిపిస్తుంటే అర్థమైంది ఆలోటు ఏమిటో. నీకు తెలుసు నీ జీవితంలో ఎంత సంపూర్ణత్వం వుందో, ఆ పిల్లలకోసం కష్టపడడంలో, ఆయనకోసం శ్రమించడంలో నువ్వు చూపే శ్రద్ధ చూస్తుంటే— నీ జీవితమే అందుకు అర్పించేస్తున్నావని తోస్తుంటే — నీలో ఔన్నత్యం కనిపిస్తుంది. నీలోంచి ఒక ప్రేమపూరిత వాహిని, ఒక తియ్యని వెల్లువలో కొన్నంతని ముంచెత్తివేస్తుం దనిపిస్తుంది... సీతా, నీ కళ్ళల్లో లోతు నీ కర్థం కాదు. అద్దంలో చూసుకుంటే కనబడదు. నీ చిట్టివేపు నువ్వు చూస్తుంటే కనబడుతుంది..."

సీత మెల్లిగా తలెత్తి, సుమిత్ర కళ్ళలోకి చూడ్డానికి ప్రయత్నిస్తోంది. ఏముందో వెతకాలనుకుంది. సుమిత్ర తన అరచేతులు చెంపల కదుముకున్నది.

"నే నేమిటో పైకి వచ్చానంటావు—కానీ నీలాగా పైకి రాలేను సీతా నేను. నీకు భవిష్యత్తు వుంది. అనంతమైన భవిష్యత్తు వుందనిపిస్తుంది. మూడు జీవితాలు నిన్ను ఆధారం చేసుకుని, నిన్నల్లుకుని వున్నాయి. రెండు జీవితాలు మలచి, వ్యక్తిత్వాలు రూపొందించి—యింక ఎన్నో చేయాల్సిన భవిష్యత్తుంది. నీ జీవితానికి ఒక అర్థం, ఒక పరిపూర్ణత్వం వున్నాయి. నాకు ప్రాణం విసిగిపోతోంది—ఈ హోదా, జీతాలు, గొడవలు- కాని నేను జీవితంలో ఒకభాగాన్ని చూస్తున్నాను. ఆ భాగం యింక యిక్కడికి అంతం చేసి యింకా ఎన్నో చూడాలి అనిపిస్తుంటుంది నాకు. లేకపోతే ఎన్నో అనుభూతులు, మమతలు, నాకు అర్థం కాకుండా వుండిపోతాయి."..... సీత కిదంతా అర్థమౌతోంది. కానీ—ఆమె యిదంతా నిర్ధారణ చేసుకోవాలన్నట్లు సుమిత్ర ముఖంలోకి చూస్తోంది.

"సీతా, నేను స్వేచ్ఛగా వున్నానన్నావు—ప్రశాంతమైన ఎడారిలో విడిచేస్తే మనిషికి కావలసినంత స్వేచ్ఛ వుంటుంది—అల్లాంటిదే నాదీ. ఆ స్వేచ్ఛ భరించడం కష్టం సీతా!......" సుమిత్ర కంఠం వణుకుతోంది. సీత ముఖంలోకి వెదుకుతూ, తలచి, తలచి చూస్తున్న కళ్ళు, చీకట్లో కూడా మిలమిలలాడుతూ కనిపిస్తున్నాయి.

లోపల నానీ కదిలినట్లు అలికిడైంది. సీత చిట్టిని భుజాన వేసుకుని లేచింది "వేసంకాలం ఓమూలైనా రాత్రి నిద్రలేపి తాగించాలి వాడిచేత. దాహం వేస్తోంది పాపం!" అంటూ లోపలికి వెళ్ళింది. పదినిముషాల తర్వాత తిరిగివచ్చింది.

ఒక్క క్షణం ఆగి సుమిత్ర నవ్వింది "మాటలా మరి—అదీ నీతరహా-చూడు, అన్నీ మర్చిపో. పడుకుని నిద్రపో నిశ్చింతంగా. చిట్టి లేస్తుంటుంది నువ్వు పక్కన లేకపోతే...పద. నాకోరనే యింత" అన్నది.

—మర్నాడు రాత్రి రైలు హైదరాబాదు విడిచిపెట్టి మెల్లిగా నడుస్తోంది. కను మరుగయ్యేదాకా సుమిత్రని చూశారు సీత, సుందరరావు. లోపలికొచ్చి తలుపు వేశాడతను.

సీత అతనివంక చూసి నవ్వింది. అతనుకూడా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావు?" అన్నాడు.

"మీరెందుకు నవ్వారు?" అంది సీత యింకా చిలిపిగా నవ్వుతూ.

"నువ్వు నవ్విన తర్వాత, నేను నవ్వకపోతే, నువ్వు ఏడుస్తావేమోనని—" ప్రక్కనవచ్చి కూర్చున్నాడు,

"ఏడవలేకపోయాను లెద్దురూ!" కిలకిల నవ్వింది సీత.

"చూడండి—మన శీనుకి మీరు చెప్పిన సంబంధం చేద్దాం, ఏం?" అన్నది.

సుందరరావు ముఖంలో ఆశ్చర్యం తొంగిచూచింది. ఎల్లాయీ మనిషిని అర్థంచేసుకోవడం అన్నట్లుగా ప్రశ్నార్థకంగా కూడా వచ్చింది. మరుక్షణం నవ్వి "అల్లాగే" అన్నాడతను.

# శిశిరవేదన

శ్రీ సి. నారాయణరెడ్డి

నవ మాఘమాస సుందరి తొంగిచూచినది
బరిగత్తులను పదునుపరచు చూపులతోడ.

నా యెదుట శిశిరకాంత నటించిపోయినది
జలతారు మంచు కుచ్చెలలు దుసికిళ్ళాడ.

చిటిలినది నా అధరపుట మొక్కటే కాదు
మొయిమడతలన్ దాగిన యెడంద సైతమ్ము.

ఘ్రంకు వడినది పేద గుండె యొకటే కాదు
పాలరెక్కల భావనా లలిత మూర్తులును.

అనలే వియోగ దగ్ధాకృతిని; అందులో
శిశిరనర్తకి చేల చెరగు గాడ్పులదాడి.

ఇక నేమి మండిపోయెను గుండెపై క్రొత్త
కుంపటుల్ భుగభుగ రగుల్కొల్పి నటులాయె.

విన ఈ బాధ నాకినాటిదా కాదు;
ప్రతి ఋతువులో ప్రజ్వలితమైనదే కదా!

ఇదిగో వసంతమని యెదపొంగి లేచితిని
అది పికీ కంఠమం దొదిగి కేరింతలిడె.

గ్రీష్ముని యింటిముంగిట నిల్చి చూచితిని.
కనులు రెండింట దుమ్మురు గొట్టిపోయె నది.

జలద ఋతువంచు మిన్నం క్రేన కేల్సాచ
గ్రుడ్లెఱ్ఱజేసి పిడుగులు రాల్చిపోయె నది.

ఓహో శరత్తని మధూహాలను పెంచుకొన
అది చకోరికలకే అంకితమ్మైపోయె.

చివరి కొక చలికారు చిక్కెనని ఉప్పొంగ
అది జంట కౌగిళ్ళయందే నలిగిపోయె

మిగిలినది యీ శిశిరమే కదా మరి! ఇదియు
నను దిగంబరునిగా నొనరించ కెటులుండు?

ఇంత కొండంత బధేతిహోనమ్ము నా
మది దాచి పెనవ్రేన్ మల్లికలు పూయింతు.

కొండకోనల నంటుకొనెడు దావాగ్ని కా
దిది; అంతరాల మండెడు బాడబజ్వాల.

ఓ శిశిర విషధర శ్రీకుంతలా! చల
న్నిహికాటాంచలా! మేను పరచితి రమ్ము.

నడిచిపో నా మొండి యొడలిపై; కాదేని
విడిచిపో ఈ పూలపెండ్లి పందిరిని.

నది కాని ప్రస్తుతము లభ్యమైన సాక్ష్యములచే వారు అశ్వమేధ, యజ్ఞయాగాది కర్మలనుష్ఠించిన వైదిక మతావలంబకులని నిర్ధారణగా చెప్పగలము. బౌద్ధమతమునకు సంబంధించిన వారి శాసనము లన్నియు ప్రాకృతమునను, వైదిక మతమునకు సంబంధించినవి సంస్కృతమునను గలవు. ఇటీవల దొరికిన మూడు ముఖ్యమైన శాసనములగూర్చి వివరించగలను. నిర్దుష్టమైన చక్కని సంస్కృత శ్లోకములలో ఏహువల చాంతమూలుని ఏకాదశ రాజ్యవత్సరమున నొక శాసనము గలదు. కార్తికేయ భక్తుడు, తలవరశ్రేష్ఠుడు, సేనాపతి అశిక్కా పౌత్రుడును, గణి పుత్రుడును నగు ఎలి శ్రీ అనువానిచే చక్కని విశాలమైన శివాలయ మొకటి నిర్మించబడినదని కలదు.

"దేవే యుప్యాతిభక్తి హాటకవహాతనయే దణ్డశక్తే కుమారే
పౌత్ర స్సేనాపతేయ్యశ స్సమరవిజయినః ఖ్యాతకీర్తే రణిక్కః,
ప్రాసాదం గణిపుత్రి స్స తలవరవరః కార్తికేయప్రసాదాత్
ఎలిశ్రీ శ్రీవిశాలం శుభమతి రకరోత్ సర్వ దేవాధివాసం."

దీనిని రచించిన కవిపేరు తెలియదు. కాని అత డిక్ష్వాకురాజుల ప్రాపున నుండెననుటకు సందియములేదు. మధ్యాంధ్ర దేశమున మూడవ శతాబ్దమున నిటువంటి చక్కని కవిత్వము చెప్పగల కవులుండుట మన మెంతయు గర్వించదగినది.

ఏహువలచాంతమూలుని 16 వ రాజ్యకాలమున మఱియొక శాసనము గలదు. మహారాజ కుమారుడు మహాసేనాపతి యగు హారితి పుత్ర వీరపురుషదత్తుడు శ్రీ పుష్పభద్రస్వామి ఆలయము గట్టించి, ధ్వజ స్తంభము నెత్తించి, ఆలయస్థితికై గ్రామము నొకదానిని దాన మిచ్చెనని యున్నది. వీరపురుషదత్తుని మాతృ పితృ వంశముల మూడు తరములవారిందు పేర్కొనబడిరి. అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధ, బహుసువర్ణకాది యాగములు చేసినట్టియు, స్వభుజబల పరాక్రమ లబ్ధరాజ్యశ్రీకుడైన ఇక్ష్వాక వాసిష్ఠీపుత్రచాంతమూలుని ప్రపౌత్రుడు, సగర దిలీపాంబరీష యుధిష్ఠిర రాముదులతో పరియైన వాసిష్ఠీపుత్ర ఏహువలచాంతమూలుని పుత్రుడుగ చెప్పబడెను. ఏహువల చాంతమూలుని రాణియు వీరపురుషదత్తుని మాత మహాదేవి కుపణశ్రీ పుష్యక-దీయ శాఖకు చెందిన మహాతలవర స్కందగోపుని పౌత్రి, మహాతలవర ఖందవశాలుని పుత్రికయని గలదు. మరియు నీమె మాతులుడు నితర మహాతలవరుడట. ఇటీ శాసనముబట్టి ఇక్ష్వాక పుష్యకందీయులకుగల పరస్పర వివాహ సంబంధము తెలియుచున్నది. వీరపురుషదత్తుడు హారీతీపుత్రు డనుటచే ఈ పుష్యకందీయులు హారీతి గోత్రజులని స్పష్టము. ఈ రెండు శాసనములలో శివాలయములను నిర్మించుట, వానికగ్రహారాదికములు దానమిచ్చుటనుబట్టి ఇక్ష్వాకురాజులు శైవమతస్థులని చెప్పుట కవకాశము గలదు.

వీరరుద్ర పురుషదత్తుని ఏకాదశ రాజ్యకాలమునాటి శాసన మొకటి చక్కని శిల్పము చెక్కబడిన కంబమునకు గలదు. శిల్పము కొంచెము చెరగిపోయినది. ఉన్నతపీఠముపై స్త్రీ యొకతె ఆసీనురాలైయుండి తన పాదములను దిగువనొక చిన్నపీటపై నుంచియున్నది. ఆమె దక్షిణహస్తమున దర్పణము, పార్శ్వమున పరిచారిక లిద్దరు గలరు. శాసనములో రాణి వర్మభట్టారిక (వమ్మభటా) ఛాయాస్తంభ మెత్తబడినదని గలదు. సామాన్యముగ నీ ఛాయా స్తంభములు మృతినొందినవారికై వేయించెదరు. కావున పై శిల్పములోని స్త్రీ శాసనములో చెప్పబడిన మృతినొందిన రాణి వర్మభట్టారికయే. ఈమె మహారాజ ఏహువల చాంతమూలుని రాణి, వీరరుద్ర పురుషదత్తుని మాతయని చెప్పబడెను. మరియు నీమె బృహత్ఫలాయన గోత్రజుడగు మహాక్షత్రపుని ఆడుబిడ్డ. పశ్చిమదేశపు మహాక్షత్రప శకరాజులకు ఇక్ష్వాకులకు గల సంబంధ మిదివఱకే మనకు తెలియును. మాఠరీ పుత్ర వీరపురుషదత్తుని రాణి మహాదేవి రుద్రభటారిక ఉజ్జయిని మహారాజ కుమార్తెయని చెప్పబడినది. గుంటూరిజిల్లా పెట్లూరిపాలెములో శకరాజుల నాణెములుగూడ దొరికినవి. నాగార్జున కొండలోని ఇతర సాక్ష్యములనుబట్టి శకమనుష్యు లిక్ష్వాక రాజధానిలో నుండినట్లు తెలియుచున్నది. కావున రాణివర్మ భట్టారిక శకరాజపుత్రిక యనుటలో సందియములేదు. ఈమె తండ్రిపేరు తెలియదు. దీనినిబట్టి పశ్చిమదేశపు శకమహారాజులు బృహత్ఫలాయన గోత్రజులని నూతనముగా తెలియవచ్చినది. రుద్రపురుషదత్తుడు వాసిష్ఠీపుత్రుడునని తెల్పుకొనుటచే నీమె అతని సవతితల్లి కావచ్చును. పై రెండుశాసనములనుబట్టి ఏహువల చాంతమూలునికి ముగ్గురు రాణులు యిద్దరు కుమారులు గలరని స్పష్టమగుచున్నది.

కొద్దికాలముక్రిందట దొరకిన నాగార్జున కొండలోని అభీర వసుసేనుని శాసనము ముఖ్యముగా గమనించదగినది. బ్రాహ్మీలిపిలో సంస్కృతభాషలో చక్కని శిలాఫలకముపై చెక్కబడియున్నది. దీనిలిపి సరిగా ఇక్ష్వాకరాజుల లిపినే పోలియున్నది. మరియు వారి శిథిలములపై గన్పించుటచే నా కాలమునకే చెందిన దగుటకు నిదర్శనము. వాసిష్ఠీపుత్రుడగు అభీరవసుసేనుని 9 వ రాజ్యకాలమున అష్టభుజస్వామి విగ్రహ మొకటి స్థాపించబడినది. ఆ సందర్భమున మహాగ్రామిక, మహాతలవర, మహాదండనాయక పరిబిదేహాకులజుడు కౌశికగోత్రుడగు శివసేనుడు, సంజయపురమోనరాజులు, అవరన్తేశ్వరుడగు శకరుద్రదాముడు, వనవాసక విష్ణురుద్రశివలనంద శాతకర్ణి మున్నగు రాజులు పేర్కొనబడిరి.

1. నమో భగవతో దేవ పరమదేవస్య పురాణపురుషస్య నారాయణస్య రాజ్ఞో వాసిష్ఠీపుత్రస్య అభీరస్య వసుసేనస్య సంవత్సరే 9...

2. మహాగ్రామికేన మహాతలవరేణ మహాదండనాయకేన కౌశిక గోత్రేణ పరిబిదేహానాం శివసేనేన సంజయపురితో యోనరాజభిః.

3. అవన్తికేన శకేన రుద్రదామ్నా వనవాసకస్య విష్ణురుద్రశివల నంద శాతకర్ణినా... అష్టభుజస్వామి.

4. అభృత్య స్థాపితా—

ఇందు పేర్కొనబడిన అభీరవసుసేనుడు స్వతంత్రరాజుగా చెప్పబడుటచేతను దీని లిపి పల్లవుల శాసనలిపికంటె ప్రాచీనమైనదియు సరిగా ఇక్ష్వాకుల శాసనలిపినే పోలియుండుటచేతను, మరియు ఈ శిలాఫలకము అష్టభుజస్వామి విగ్రహము మున్నగు శిథిలములు ఇక్ష్వాకశిథిలములతో కన్పట్టుటనుబట్టియు ఇక్ష్వాకు లాతనిచే జయింపబడిరనుట నిస్సందేహము. వారెటనుండి ఇక్ష్వాకు లాభీరునకు సామంతులైరో లేక మరల అతని దండయాత్రానంతరము స్వతంత్రించిరో తెలియదు. ఈ అభీరవసుసేను డెక్కడనుండి దండెత్తివచ్చెననునది ప్రశ్న. బొంబాయిరాష్ట్రములోని నాసిక కొండలలో అభీర ఈశ్వర

శైలాని శాసన మొకటి గలదు. దానినిబట్టి వా రా ప్రాంతమును పాలించుచుండినట్లు తెలియుచున్నది. ఈ ఆభీరవసుసేనుడు బహుశః ఆనాసిక ప్రాంతమునకు చెందిన ఈశ్వరసేనునిసంతతివాడు కావచ్చును. ఈ శాసనములో వానిని సమకాలికులు బహుశః అతనిచే జయింపబడిన రాజులు కొందరు పేర్కొనబడిరి. మొదట మహాగ్రామిక, మహాతలవర మహాదండనాయక శివవిష్ణు గలడు. ఈతడు కౌశిగోత్రజుడు, శాలి దేవాకులజాడుగ వర్ణింపబడెను. బహుశః ఈతడు ఇక్ష్వాకుల సామంతుడని ఆంధ్రరాజేతిహా సూచింపుచున్నది. రెండు సంజయాపుర యవనరాజులు. వీరుకూడ ఇడమిత్రుని చెప్పుటకు వీలుగా నున్నది. మూడవవాడు అగ్నిశర్మ మానవ్యకుడైన శక రుద్రదాముడు. ఈతడు పశ్చిమదేశపు మహాక్షత్రపస్వామి రుద్రసేనుని తండ్రియగు రెండవ రుద్రదాముడు. ఇంతవఱకీతని కుమారుని శాసనమును బట్టియే తెలియును గాని నిజముగ నీతడు పాలించినట్లు తెలియదు. ప్రస్తుత శాసనమునుబట్టి ఇతడు స్త్రీ నగరము రాజధానిగా పాలించినట్లు ఆభీరవసుసేనుని సమకాలికుడైనట్లు నిర్ధారణ చేయవచ్చును. పశ్చిమదేశపు మహాక్షత్రపులకు ఇక్ష్వాక రాజులకు వివాహ సంబంధములు గలవని పైన వివరింపబడినది. నాల్గవవాడు వనవాసక విష్ణురుద్ర శివలానంద శాతకర్ణి. ప్రస్తుతము మైసూరురాష్ట్రములోని బనవాసియే అది. కదంబులకు పూర్వ మిచ్చట శాతకర్ణులు పాలించుచుండిరి. ఈ వనవాసరాజులకు ఇక్ష్వాకులకు కూడ సంబంధము గలదు. ఇక్ష్వాకుల శాంతమూలుని పౌత్రి కొడబలిసిరి వనవాసక మహారాజు భార్య. బహుశః ఆభీర వసుసేనుడు ఇక్ష్వాకులపై దండెత్తివచ్చినపుడు తమతమ సంబంధములను పురస్కరించుకొని శకరుద్రదాముడు, వనవాస శాతకర్ణి మున్నగువారతని కెదిర్చి యుండవలెను. కాని అతనిధాటి కాగలేక యుందఱు నోడిపోయి యుందురు. ఈ ఆభీరుని దిగ్విజయము సముద్రగుప్తుని దక్షిణదేశ దిగ్విజయమును బోలియున్నది.

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని మంచికల్లువద్ద పల్లవ సింహవర్మ శాసన మొకటి దొరికినది. దీని లిపి పైన చెప్పిన ఇక్ష్వాక ఆభీరశాసన లిపుల తర్వాతిది. మైదవోలు, హిరహడగల్లి శాసన లిపులకంటె ప్రాచీనమైనది. ఇంతవఱకు లభ్యమైన పల్లవ శాసనములన్నింటిలోను ఇదియే మొదటిదని చెప్పవచ్చును. భారద్వాజగోత్రజుడైన పల్లవ సింహవర్మ ధర్మమహారాజు స్వహస్తముతో చేయబడిన శాసనము స్వస్త్యయనోత్సవసమయమున భగవంతుడైన శివస్వామి దేవాలయమునకు దీపాలాదిదానములు చేసెను. ఈ భాగము ప్రాకృతము.

1. "సిద్ధం. భారదాయస గోత్తేన...ధరేణ పల్లవాణం సీహ
2. వంమ్మణా అప్పణో వెజయికె ధంమ్మబల వర్ధనికె సాన్తిసతి
3. యా ఖుణం కాతూణ భగవతో సిరి జీవశివసామి పతేథి కా
4. న కుత్తిగోపహార కాది కాతం"—

మైదవోలి, హిరహడగల్లి తామ్రశాసనములలోని శివస్కందవర్మకంటె నీతడు పూర్వుడు. ఈ రెండు శాసనములలోను శివస్కందవర్మ తన తండ్రిపేరు చెప్పుకొనలేదు కాని ధాన్యకటకము రాజధానిగాగల ఆంధ్రపథమంతయు పల్లవరాజ్యములోనిదని చెప్పబడెను. సరిగా అదేస్థలమున ఈ సింహవర్మ శాసనము దొరకుట, లిపి, భాషకూడ పై రెండు శాసనములకు దగ్గరలో నుండుటనుబట్టి ఈతడే శివస్కందవర్మ తండ్రి కావచ్చునని ఊహించుటకు వకాశ మున్నది. పల్లవులు తమ శాసనములలో "కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్యసన్నద్ధ"—అని చెప్పుకొనుటనుబట్టి ఇక్ష్వాక రాజులు బౌద్ధమతము నాదరించుట చూచి పల్లవసింహవర్మ వైదికమత పునరుద్ధరణ మను నెపమున ఇక్ష్వాకరాజధానిపై దండెత్తి యుండును. ఆభీర వసుసేనుని దండయాత్రతో ఇక్ష్వాకరాజ్యము కూడ బలహీనమైనది. ఆ సమయమును పల్లవసింహవర్మ సద్వినియోగము చేసికొని ఇక్ష్వాకులను పూర్తిగ రూపుమాపి వారి ఏలుబడిక్రిందగల ఆంధ్రపథమంతయు కాంచీపురపల్లవరాజ్యమున చేర్చి యుండును.

శ్రీకాకుళముజిల్లా పెద్దదూగాములో నొక తామ్రశాసనము లభ్యమైనది. ఇందలి లిపి సుమారు 5 వ శతాబ్దమునాటిది. సింహపురము (సింగుపురము) నుండి మహారాజ శత్రుదమనునిచే గిరికళింగ వంమాత్యాగ్రహారమున మూడు గ్రామములు పటువ గ్రామవాస్తవ్యులు, తైత్తిరీయ శాఖకు చెందినట్టి కౌండిన్య గోత్రజులైన సర్వశర్మ, కప్పశర్మలకు దానమీయబడినవి. ఈ శాసనమునుండి మొట్టమొదటిసారిగ సింహపురమునుండి శత్రుదమన మహారాజు పాలించుచుండినట్లు తెలియవచ్చినది. ఈ సింహపుర మొకప్పుడు మధ్యకళింగమునకంతకు ముఖ్యపట్టణము. ప్రాయికముగ నాకాలమున నీ ప్రాంతమును పాలించిన రాజులందఱు తాము స్వతంత్రులమని చెప్పుకొనుచుండిరి. కాని ఈ శాసనములో శత్రుదమనుడు "భట్టారక పాద పరిగృహీతః"—అని వర్ణింపబడెను. దీనిబట్టి అతని సామంతత్వము వెల్లడి యగుచున్నది. ఆ సార్వభౌముని పేరందు పేర్కొనబడలేదు. ఆ కాలమున ఆ ప్రాంతపురాజులకు గుప్తరాజులు సార్వభౌములు. తన సార్వభౌముని పేర్కొనకుండుట, గుప్తరాజ్య కాలములో గాక స్వరాజ్యకాలమున దానము చెల్లుటబట్టి శత్రుదమనుడు క్రమముగ స్వతంత్రించుటకు ప్రయత్నించుచుండినట్లు గనబడుచున్నది. సముద్రగుప్తుని అల్హాబాదు విజయస్తంభములో ఏరండపల్లి దమను డొక్కడు ఆ ప్రాంతమునుండి పేర్కొనబడెను. ఏరండపల్లి దమనుడు, సింహపురశత్రుదమనుడు నొక్కరే యనుట కాధారములులేవు. మరియు సింహపురము నాల్గవ శతాబ్దానంతరము ప్రసిద్ధిచెందినది. కావున ఈ శత్రుదమనుడు సుమారు 5 వ శతాబ్ద ప్రాంతమున సింహపురమునుండి పాలించిన వేరొక రాజై యుండును.

గుంటూరుజిల్లానుండి విష్ణుకుండినవంశజుని తామ్రశాసన మొకటి లభ్యమైనది. ఏకాదశాశ్వమేధములు చేసిన మహారాజ మాధవవర్మ సంతతివాడగు విష్ణుకుండిన విక్రమేంద్రభట్టారకుడు తన 14 వ రాజ్యకాలమున అకివాస్తవ్యుడు, ఆపస్తంబసూత్రుడు కౌండిన్యగోత్రజుడైన స్వామి శర్మకు తూణ్డిగ్రామమును దానమిచ్చెను. ఈ వంశజుల తామ్రశాసనము లింతవఱకు రెండు మాత్రమే దొరికినవి.

నెల్లూరుజిల్లా పొదిలి తాలుకాలోని కురవాయపాలెములో పల్లవ తామ్రశాసన మొకటి గలదు. పల్లవ ప్రథమ పరమేశ్వరవర్మ పూమిరాష్ట్రములో ముసునూనది దక్షిణ తీరమున గల కుబుమూరు గ్రామమును ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలమున ఉర్వ

టూరు గ్రామ వాస్తవ్యుడు, మౌద్గల్యగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు, వేదవేదాంగవిదుడు, కోవిదుడువగు స్వామిశర్మపౌత్రుడును, ద్రోణశర్మ పుత్రుడగు దేవశర్మకు అగ్రహారముగ నిచ్చెను. దీని కాలము అతని 19 వ రాజ్యవర్షమున పౌష శుద్ధ త్రయోదశి భానువారము. ఇంతవరకు లభ్యమైన పరమేశ్వరవర్మ శాసనములలో కాలమును చెప్పునది యొక్కటియే. ఇందు గల తిథివారములు సరిగా క్రీ. శ. 687 డిసెంబరు 22 వ సరిపోవును. ఇది అతని 19 వ రాజ్యవర్షముగాన అతడు క్రీ. శ. 669-70 లో సింహాసన మధిష్ఠించి యుండవలెను.

మైసూరురాష్ట్రములోని చిత్రదుర్గజిల్లా గంజగట్టి గ్రామ వాస్తవ్యునివద్ద చాళుక్య అభినవాదిత్యుని తామ్రశాసన మొకటి గలదు. రెండవపులకేశి పౌత్రుడు, ఆదిత్యవర్మ పుత్రుడగు అభినవాదిత్యుడు భాద్రపద పౌర్ణమినాడు ఉచ్ఛశృంగ విషయము (బళ్లారి జిల్లా ఉచ్ఛంగిదుర్గ)లోని పెల్కుండ గ్రామమును దేవరాతి కౌశిక గోత్రజుడగు శుప్పశర్మకు దానమిచ్చెను. క్రీ. శ. 642 లో రెండవ పులకేశి మరణానంతరము చాళుక్యసామ్రాజ్య మరాజకమైనది. అతని పుత్రులెవ్వరికి తమ శత్రువగు పల్లవు నెదిరించ శక్తిసామర్థ్యములు లేక వేర్వేరు రాష్ట్రములనుండి పాలించుచుండిరి. వారిలో జ్యేష్ఠుడగు ఆదిత్యవర్మ కర్నూలు ప్రాంతమును పాలించుచుండెను. ప్రస్తుత శాసనములోని అభినవాదిత్యుడాతని పుత్రుడే. దీనినిబట్టి బళ్లారి, చిత్రదుర్గ జిల్లాలు కూడ అతని ఏలుబడిక్రింద గలవని తెలియుచున్నది. అభినవాదిత్యుని శాసన మింతవరకు లభ్యమైన దిది యొక్కటియే. దీని కాలము క్రీ. శ. 650 ప్రాంతము. క్రీ. శ. 655 లో విక్రమాదిత్యుడు మరల చాళుక్య సామ్రాజ్యమును స్థాపించుటతో వీరందరు అనామకులైరి.

ఈ విక్రమాదిత్యుని తామ్రశాసన మొకటి మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూరు సమీపములోని అముదాలపాడులో దొరకినది. మహారాజాధిరాజ పరమేశ్వర విక్రమాదిత్య సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజు తన 5 వ రాజ్యకాలమున (క్రీ. శ. 660) వైశాఖ పౌర్ణమినాడు శివమండలదీక్షాసమయమున వంగూరవాడి విషయములోని ఈ పట్టణంలు అను గ్రామము సుదర్శనాచార్యులకు గురుదక్షిణగా నొసంగెను. ఆ గ్రామమును 27 గురు బ్రాహ్మణులకు పంచియిచ్చెను. విక్రమాదిత్యుని పితృపితామహులందరు పరమభాగవతులని, విష్ణ్వాలయములకు దానము లొసంగిరని శాసనములబట్టి తెలియుచుండ ఈతడు శైవాచార్యులవద్ద శివమండలదీక్షను పొంది పరమమాహేశ్వరుడని వర్ణించబడుట మిక్కిలి ఆశ్చర్యము. విక్రమాదిత్యుని సామంతుడగు శ్రీయాశ్రయ శీలాదిత్యుని నౌసారీ తామ్రశాసనములో నితడు పరమమాహేశ్వరుడనియు శ్రీనాగవర్ధనుని పాదయుగ మర్చించువాడనియు గలదు. ఈతని చేతనే తలమంచి శాసనములో వాసిష్ఠగోత్రుడగు మేఘాచార్యులను స్వకీయ గురువుగా పేర్కొనెను. ఈ రెండు శాసనములు ప్రస్తుత శాసనమునకు తర్వాతివి, మరియు ఈ శాసన ప్రతిగ్రహీతలలో నాగవర్ధన మేఘాచార్యులు కానరారు. కావున సుదర్శనాచార్యుల తర్వాత విక్రమాదిత్యునకు వారు గురువులనిగాని లేదా ఈతని దీక్షాగురువు,

నాగ శిల్పాలంకృతులని యైన చెప్పవచ్చును. ఈ శివమండల దీక్ష యీ ప్రాంతమున వీరశైవ దీక్షవలె కాన్పించుచున్నది. అట్లైన వీరశైవము బసవునకు పూర్వము చాలకాలమునుండియే కర్ణాటకమున నుండి ఆతని కాలమున విజృంభించి యుండవలెను.

ఆదే తాలూకా పల్లెపాడులో వినయాదిత్యుని తామ్రశాసనము కూడ లభ్యమైనది. దీని కాలము శకవర్షములు 604 వైశాఖ పౌర్ణమి, ఆతని రెండవ రాజ్యకాలమని చెప్పబడినది. ఇది క్రీ. శ. 682 ఏప్రిల్ 27 వకు సరిపోవును. ఇది ఆతని రెండవ రాజ్యవర్షము గాన ఆతడు క్రీ. శ. 680 లో రాజ్యమున వచ్చెనని నిర్ధారణ చేయ్యగలము. స్వామికరాజు కోరికచే మాధవస్వామి యను బ్రాహ్మణునకు కృష్ణానది దక్షిణపు టొడ్డువగల పణిమలు గ్రామము దానమీయబడినది. అనంతపురం, కర్నూలుజిల్లాలలో ఈ చాళుక్యుల శిలాశాసనములు తెలుగుభాషలో గలవి చాల దొరికినవి. వీటి నన్నింటిని చక్కగా పరిష్కరించి ప్రకటించిన ఆంధ్రవాఙ్మయ చరిత్రకు మిక్కిలి యుపకరించును.

కర్నూలుజిల్లా నర్నూరు నాగేశ్వరస్వామి ఆలయములో ఎనిమిదవ శతాబ్దమునకు చెందిన ప్రాచీన శిలాశాసన మొకటిగలదు. అందు నరియనూరు ఉత్తమేశ్వరునకు ముమ్మాద్ర మహాజనులచే ఇరువది మత్తుల భూమి దానమీయబడినదని గలదు. సాంకేతికుడైన నాగచండస్వామి తిప్పన పేరిటచే ఆలయము కట్టబడినది. దానికి సమీపమునను కూడ పెద. మాచెర్ల, గురజాలలోని నాగుల శాసనములకంటె నిది ప్రాచీనమగుటచే ఆంధ్రదేశమున ఎనిమిదవ శతాబ్దమునుండి నాగులపూజ గలదనుట కిది యొక తార్కాణము.

కర్నూలుజిల్లా నాయకల్లులో శకవర్షములు 889 ప్రభవ సూర్యగ్రహణము (క్రీ. శ. 967) నాటి అకాలవర్ష పృథివీవల్లభుని శాసనమొకటి దొరకినది. ఈతడు మాళ్ఖెడ్ శాఖకు చెందిన రాష్ట్రకూట తృతీయ కృష్ణరాజు. దీనికాలమునుబట్టి ఈతని రాజ్యకాలము మరి కొద్దిమాసములు పొడిగించవచ్చును. దీనిలో మహాసామన్త వన్నియ చాళుక్క్య రాచమల్లుడొకడు పేర్కొనబడెను ఈతడు చాళుక్య ప్రభువు కావచ్చును.

రాయచూరుజిల్లా లింగసుగూరు తాలూకాలోని బన్ని గోళులో శకవర్షములు 947 (క్రీ. శ 1025) నాటి శాసనమొకటి దానిలో త్రైలోక్యమల్ల విజయాదిత్యుడు మోరగనూరు ప్రాంతమును పాలించుచున్నట్లు గలదు. ఆకాలమున పశ్చిమ చాళుక్య రాజులలో విజయాదిత్య నామధారు లెవ్వరును లేరు. మరియు జగదేకమల్ల బిరుదాంచితుడగు రెండవ జయసింహుడా ప్రాంతమునకు సార్వభౌముడు. ఈ సందర్భమున నొక విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది. పూర్వ చాళుక్యరాజగు విమలాదిత్యుని పుత్రులు రాజరాజ, విజయాదిత్యులు వేంగి సింహాసనమునకై యొండొరులతో పోరాడుచుండిన చోళులవి రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోళుని, విజయాదిత్యుడు పశ్చిమ చాళుక్య ప్రభువగు జయసింహుని ఆశ్రయించిరి ముసంగి (మాస్కి)వద్ద చోళ చాళుక్యులకు ఘోరయుద్ధము జరిగినది. జయసింహుడు పూర్తిగ యోడిపోయెను ఇక విజయాదిత్యునకు వేంగికోశమున నిలువ తావు లేక పశ్చిమ చాళుక్య ప్రభువగు జయసింహుని ప్రాపునే మహా మండలేశ్వరుడుగా లింగసుగూర్ ప్రాంతమును పాలించుచునుండవచ్చును. అందుకే త్రైలోక్యమల్ల బిరుదునుగూడ ధరించె నేమో!

విశాఖపట్నము జిల్లా సర్వసిద్ధి తాలూకాలోని మడుతుర్తి భీమేశ్వరాలయమున నొక శిలాశాసనము గలదు. సెట్టి కొంతమంది చోళేశ్వరాలయమును నిర్మించి అందు చోళేశ్వరుని ప్రతిష్ఠించి ఆదేవుని అంగరంగభోగములకు కొంతభూమిని దానమిచ్చిరని గలదు. దీనికాలము అనంతవర్మ రాజరాజదేవుని మొదటి రాజ్యపాలన వర్షమగు శక సంవత్సరములు 1119 కన్యా శుద్ధ ఏకాదశి మంగళవారము. అనగా క్రీ. శ. 1197 సెప్టెంబరు 28. ఈతడు తూర్పుగాంగ వంశజులలో అనంతవర్మాభిధేయులలో మూడవవాడు. శ్రీకూర్మములో ఈతని 11 వ రాజ్యకాలమున శకవర్షములు 1129 కుంభ బ. 2 శుక్రవారమునకు సరియగు క్రీ శ 1207 ఫిబ్రవరి 6 న మరియొక శాసనముగలదు ఈ రెండు శాసనములనుబట్టి ఈతడు క్రీ. శ. 1196 సెప్టెంబరు 28, క్రీ. శ. 1197 ఫిబ్రవరి 6 తేదీలమధ్య సింహాసన మధిష్ఠించి యుండవలెనని నిశ్చయించగలము. ఈ తూర్పుగాంగవంశజుల శిలాశాసనములు, అనేక తామ్రశాసనములు గూడ శ్రీకాకుళము జిల్లానుండి బయల్పడినవి కాని వాటి నన్నింటిని తడవుట కిచ్చట తావు గాలదు.

పశ్చిమగోదావరిజిల్లా సర్వాపూరులోని మదనగోపాలస్వామి ఆలయావరణములో నాల్గు చాళుక్యశాసనములు బయల్పడినవి. అందొకటి సర్వలోకాశ్రయ విష్ణువర్ధనవీరభద్రేశ్వర చక్రవర్తి 15 వ రాజ్యకాలమున గలదు. పాలకొల్లు, జాత్రిక శాసనములబట్టి చాళుక్య వీరభద్రుడొకడు ఇందుశేఖర ఉదయాంబా పుత్రుడుగను, కాకతి రుద్రాంబ భర్తయని తెలియుచున్నది. పాలకొల్లు శాసనములో ఆతనికి అన్యయాంబ యను వేరొక భార్య యుండినట్లు గలదు. ప్రస్తుత శాసనములోని విష్ణువర్ధన వీరభద్రేశ్వర చక్రవర్తి ఈతడే యగుచో, ఈతడనను పదిహేను సంవత్సరములు రాజ్యము పాలించినట్లును చెప్పవచ్చును.

నాగార్జునకొండ కెదురుగా కృష్ణానది కావలియొడ్డునగల ఏలేశ్వరమువద్ద శిథిలములను ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ఆధ్వర్యమున త్రవ్వుచుండగా కొన్ని ఆయక స్తంభములు, వానిపై శాసనములు బయల్పడినవి. ఇవి ఇక్ష్వాకరాజుల శాసనముల తర్వాతవి. చాళుక్య లిపిలో రణవిక్రమ, రణమర్దన, రణమల్లన, గుణభిరాము మున్నగు బిరుదములు కొన్ని, రేవణమంచి, నందిమంచి, సింగమంచి యను కొందరి పేర్లు గలవు. పదియవ శతాబ్దమునకు చెందిన గౌడీయ లిపిలో నొక చిన్న శాసనము గలదు. వరేంద్రివిషయాధీశ్వరుడగు ఉగ్గవల సూసురాజ పుత్రుని పేర్కొనుచున్నది. వరేంద్రవిషయ మనగా ఇప్పటియుత్తర బెంగాల ప్రాంతము. గనుకబట్టి పదియవ శతాబ్దములో ఆంధ్రదేశములోని ఏలేశ్వరమున కంతదూరమునుండి తీర్థయాత్ర కరుదెంచుచుండి రనుకొనదగినది. అచ్చటనే శివాలయమునకు దగ్గరలో చక్కని రెండు శిలాఫలకములపై సుమారిరువది శాసనములు వేర్వేరు కాలములవి. వేర్వేరు రాజులకు చెందినవి కొంతపర్యక్రమములేక వరుసగా చెక్కబడియున్నవి. అందు కందుకూరి గోకర్ణదేవ చోడమహారాజ, భీమదేవ చోడమహారాజులవి. కాకతి గణపతిదేవ, రుద్రదేవులవి, యాదవ సింగనవి, పల్నాటి హైహయవంశజులైన

అనుగు గామరాజాది, కెలూరి మనుమసిద్ధిరాజాది, ఇంకను మరి కొంతమంది శాసనములు గలవు. ప్రస్తుత మివి యన్నియు సరుసగా ఈ శిలాఫలకములపై వ్రాసియుండుటబట్టి పూర్వమవి వేర్వేరు శిలలపై చెక్కియుండి ఏ ప్రమాదమునకో గురియగు సమయమున బుద్ధిమంతులగు మన పూర్వులు వానిని నకలుపరచి ఈ రెండు శిలాఫలకములపై చెక్కించి భద్రపఱచినట్లున్నది. శాసనముల ప్రాముఖ్యమును మన పూర్వులెట్లు గ్రహించి శ్రద్ధవహించుచుండిరో తెలిసికొనుటకిది చక్కని తార్కాణము. ప్రస్తుత కాలమున అట్టి అందమైన శాసన శిలయే కాన్పించిన పరులెఱుగకుండ గృహ నిర్మాణమునకై దానిని వినియోగించి సంతసించెదరు.

పూర్వపు హైదరాబాదు రాజ్యమున రాష్ట్రకూటుల మాన్యఖేటము, చాళుక్యకలచుర్యుల కల్యాణి నగరము, యాదవుల దేవగిరి, కాకతీయుల యోరుగల్లు మున్నగు రాజధానులం దణగియున్నవి. మన తెలంగాణా ప్రాంతము శాసనములకు గనియేయని చెప్పవచ్చును. గత సంవత్సరము నూతన శాసనములకై వరంగల్లుప్రాంతమున పర్యటించుచుండ, చక్కని సంస్కృతకావ్య మొక కొండకు చెక్కబడినది కాన్పించినది. కావ్యమంతయు 62 శార్దూల విక్రీడితములలో సిద్ధదంపతులచరితము వర్ణింపబడియుండెను. చక్కని సాయంసమయమున సరసీప్రాంతమునకు చెలికత్తెలతో వచ్చిన యువతి నొకతెను సిద్ధయువకుడు జూచెను. ఇరువురును పరస్పరానురాగముగలవారగుదురు. ఇంతలో బాలకుడొకడామెను పిలుచుకొని అంతఃపురమున కేగును. తరువాత విప్రలంభము, సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు. చెలికత్తె యొకతె అతనికడకు వచ్చి ఆమె విరహమును దెల్పి అతని వెంటనుండి రహస్యముగ నంతఃపురము చేరుమని ప్రార్థించును. గాఢాంధకారములో నాతడు కోటగోడ నొక త్రాటిచే దాటుచుండగా రాజభటులచే దొంగయని పట్టుకొనబడి కారాగారమునం దుంచబడెను. చెలికత్తె లీ విషయమంతయు నామె తండ్రియగు నవకొంగదున కెఱింగింప అతని కులగోత్రములు తెలిసి మిక్కిలి సంతసించి వారి వివాహమున కాత డంగీకరించును. తరువాత వివాహము, సంభోగశృంగార వర్ణనములతో కావ్యము ముగియును. శాసనాంతమున "నరసింహ ఋషేః కృతీ"—యనుటను బట్టి దీనికర్త నరసింహుడని తెలియుచున్నది. అదే కొండకు మరియొక ప్రక్క నాగరిలిపిలో వేరొక శాసనముగలదు. అందు "ఇతి రాజగురు విశ్వేశ్వర దుహితృ సూనో నరసింహమహర్షేః కృతౌ"— అని యుండుటచే ఈ రెండు శాసన గ్రంథములకర్త యొక్కడేయనియు నాతడు రాజగురువైన విశ్వేశ్వరపండితుని దౌహిత్రుడనియు స్పష్టమగుచున్నది. రాజగురు విశ్వేశ్వరపండితులు కాకతి గణపతిదేవుని దీక్షాగురువగు సుప్రసిద్ధ విశ్వేశ్వర శంభువే. వరంగల్లుకోటలోని చిన్నవి రెండు శాసనములలో నొక నృసింహ లేక నరసింహ కవి పేర్కొనబడెను. వానినిబట్టి అతడు కాకతి రుద్రప్రతాపరుద్రుని కాలము (క్రీ. శ. 1293-1323) వాడనియు, ఋగ్వేద వ్యాఖ్య, కాకతీయ చరిత్ర, మలయవతియను గద్యకావ్యము, అనేక రూపకములు రచించినట్లు తెలియుచున్నది. కాదంబరీ నాటక కర్తయగు నృసింహుడొకడు ప్రతాపరుద్రుని కాలమున గలడు. పైన చెప్పిన నృసింహులందఱు నొక్కడే యనియు నాతడు రెండవ ప్రతాపరుద్రుని ఆస్థానమున సుప్రసిద్ధ విద్యానాథుని సమకాలికుడనియు నా యభిప్రాయము. ఈతని శైలి చూపుటకు రెండు శ్లోకములు మాత్ర మిచ్చట ఉదాహరించెదను.

> సార్ధం చేటవయా సమస్తజగతా మస్తం గతో భానుమాన్
> వ్యామోహేన సమం తమాంసి పరితః కాష్ఠాః సనం చక్రిరే,
> వామైః కాముకలోచనైః స్సహ తత స్తారాగణాః ప్రస్ఫురుః
> కందర్పోజ్జ్వలకేన నాక ముదయం యాతః కలానాం నిధిః.

> 2. తిష్ఠ త్యుచ్ఛ్వలతి ప్రయాతి పునర ప్యాయాతి సంభాషతే
> తూష్ణీంభావ ముపైతి పశ్యతి దిశః సమ్మీలయ త్యక్షిణీ,
> ఉద్భ్రాన్త్యా త్యధికం దదాతి చ స్మృతిం విశ్వసితే చేష్టతే
> హా కష్టం మదనేన దారుణ తరం కింకిం నవా కార్యతే.

కథ ఎంత చమత్కారముగ నున్నదో ఈతని వర్ణనలు నట్లే గలవు. ఇట్టి కావ్యమును చక్కగా పరిష్కరించి లోకమున కర్పించు భారము ఆంధ్రులమగు మనపై నున్నది.

గుంటూరుజిల్లా కనపర్తి సీతారామస్వామి ఆలయ స్తంభమున నొక శాసనముగలదు. పూర్వము రాయవారిచే కమ్మరులలో చేయబడిన దానము మహామండలేశ్వర సంబెట అలసండల మాంకయదేవచోడమహారాజపుత్రుడు వీర బొబ్బళిదేవచోడ మహారాజుచే విరదేవరాయమహారాజు ఆతని భార్య దేమా అమ్మంగారు, యువరాజు విజయబుక్కరాయలకు పుణ్యముగా పునరుద్ధరింపబడినది. దీనికాలము శకవర్షములు 1348 పరాభవ మాఘశుద్ధ ఏకాదశి గురువారమునకు సరియగు క్రీ॥ శ॥ 1427 జనవరి 9. చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకా, కర్ణపల్లెలోని శాసన మొకటి దానిలో శకవర్షములు 1332 (క్రీ॥ శ॥ 1410) నాటి సమ్మెటి (సంబెట) వీరబొబ్బళి దేవమహారాజు విజయరాయ ఉడయర్ కాలమున పేర్కొనబడెను. దంతెపల్లి తామ్రశాసనమునబట్టి యీ విజయభూపతి సూర్యవంశోద్భవుడైన మాంకభూపాలుని దౌహిత్రుడుగను కమాంబికా పుత్రుడుగను తెలియుచున్నది ప్రస్తుతశాసనములో చెప్పబడినట్లు ఈతని పూర్తిపేరు విజయబుక్కరాజనియు, దంతెపల్లి తామ్రశాసనములోని మాంకభూపాలుడు ఇందులోని మాంకయదేవచోడ మహారాజు నొక్కరేయనియు స్పష్టము. అతని కుమార్తె దేమాంబిక విజయనగరరాజుల భార్య యగుటచే సంబెటప్రభువులకు విజయనగర రాజులకు గల సంబంధము సువ్యక్తము.

గోదావరి వరదలలో రాజమహేంద్రనగరమునొద్ద మూర్యకంటి గజపతులవి రెండు తామ్రశాసనములు బయల్పడినవి. అవి గజపతి కపిలేశ్వరు పక్షమున ఆప్రాంతమును పాలించుచుండిన రఘుదేవ నరేంద్రునివి. ఆంధ్రదేశమును కొంతకాలము పాలించిన గజపతుల చరిత్ర కివి చాల ముఖ్యము. మహాబలపరాక్రమవంతుడు, గంగానది మొదలు శ్రీరంగమువఱకు గల దేశమున కంతకు సార్వభౌముడగు కపిలేశ్వర గజపతి తండ్రి తాత లెవ్వరో తెలియక అతడొక సామాన్యుడగు గొల్లపిల్లవాడనియు, పూరి జగన్నాథుని కృపవలన నాతడు రాజయోగము పట్టినదనియు పెక్కు పుక్కిడిపురాణము లింతవఱకు కల్పింపబడినవి. ఈ రెండుశాసనములబట్టి అతని, పితృ పితామహులు జాగేశ్వర, కపిలేశ్వరులు, సోదరులు బలరామ, పరశురామ నామధేయులందరు మహాబలపరాక్రమవంతులు విజయ క్ష్మీకైవారా

డుచు పశువులు గోల్పోయినట్లు తెలియుచున్నది. మరియు స్వబల పరాక్రమములచే గాంగరాజుని త్రోసిపుచ్చి సింహాసనము నధిష్ఠించినట్లు వర్ణింపబడెను. ఓరుగల్లు కోటలోగల రఘునాథ నరేంద్రుని శిలాశాసనములోగూడ ఈ వంశవృక్షమే కలదు. ఇందొక తామ్రశాసనము అడుమిల్లి నరసింహకవిచే చక్కని సంస్కృత శ్లోకములలో కలదు. కపిలేశ్వరుని పుత్రుడగు హంవీరదేవుని కఱువోలి తామ్రశాసనము శ్రీకాంత తిమ్మయార్యులను జంటకవులచే రచింపబడినట్లు చెప్పబడెను.

"శ్రీయా దక్షిణ భాగిభ్యా మహంవీర నృపాజ్ఞయా,
శ్రీకాంత తిమయార్యాభ్యాం కథితం ధర్మశాసనం."

ఆంధ్రదేశమున 15వ శతాబ్దమునసే జంటకవులు కలరనుట కిది నిదర్శనము కాగలదు.

ఉత్తర హిందూస్థానమున బీహారులోని సుప్రసిద్ధ గయాక్షేత్రమున దక్షిణదేశపు రాజులవి నాల్గుశాసనములు దొరకినవి. అందు మొదటిది కాకతి ప్రతాపరుద్రుని కాలమునాటిది. అతని గురువగు మల్లికార్జునుని భార్య గౌరియను నామె గయాశ్రాద్ధాదికములు నిర్వర్తించినటు కలదు. మల్లికార్జునుడు సుప్రసిద్ధ గోదావరి ప్రాంతమున గల మంత్రకూట నగర (మంథెన) వాస్తవ్యుడుగ చెప్పబడెను. సరిగా మంథెనలోని యొకశాసనములో ఈ మల్లికార్జునుడు, కాకతి మొదటి రుద్రదేవుడు పేర్కొనబడియుండిరి. దీనిని బట్టి కాకతి మొదటి రుద్రునికూడ ప్రతాపరుద్రుడనుటగలదనియు, విశ్వేశ్వర శంభు వెట్లు గణపతి దేవునకు దీక్షాగురువో అట్లే మల్లికార్జునుడు మొదటి రుద్రునకు గురువనియు తెలియుచున్నది. రెండవది హాసుపట వీర నారసింహకవుని పూజారి యొకడు గయవద్ద మఠమును కట్టించి తన ఋణములు తీర్చుకొనెనని గలదు. మూడవది విజయనగర శ్రీకృష్ణదేవరాయల తెలుగుశాసనము. అతని ఆస్థాన కవీశ్వరుడగు ముక్కు తిమ్మన తన ముద్దులొలుకు పలుకులతో

తిరుమల దేవీ వల్లభ!
కరుణామయ హృదయ! రాజకంఠీరవ! యీ
శ్వర నరసభూపురందర
వరనందన! బాసదప్పువర గండాంకా!

అని చక్కని తెలుగుపద్యమును గయలో చెక్కించెను. ప్రసిద్ధమైన ప్రబంధములలోని పద్యము లిట్లు శాసనములలో నుండుట చాల అరుదు. నాల్గవది విజయనగర అచ్యుతరాయలది. తన పితృ, పితామహ ప్రపితామహులగు నరసింహ, ఈశ్వర, తిమ్మభూపతులను గయాముక్తము సేయుటకు తిమ్మణన్న యనువాని పంపెనని కలదు.

శ్రీరంగములోని రంగనాథాలయపు కొట్టు ప్రాకారమునకు తెలుగు శాసనమొకటి గలదు. అందుగల సంస్కృత శ్లోకమున సింగభూపతి ప్రపౌత్రుడు, నాగాధిపుని పౌత్రుడు, మాదన్నపతి పుత్రుడునగు శ్రీ వల్లభరాజు (వల్లభ సేనింగారు) చేసిన కొన్ని దానములు వర్ణింపబడినవి. ఈతడు దామూలగోత్రజుడనియు, కన్నకంబ, లాటి రాయరాహుత మున్నగు బిరుదులుగల్గి గంగాతటమున గాంధారిగిరి ప్రాంతమునకు ప్రభువని చెప్పబడెను. ఈతడెవ్వడో విశేషముగా కూడ తెలియుటలేదు. రంగనాథాలయమునసే వెండిబంగారపు పల్లకి యొకదానిపై చిన్నశాసనము తెలుగులో చెక్కబడియున్నది. పూర్వము విజయరంగ చొక్కనాథునిచే దానమీయబడి ప్రస్తుతము శిథిలముకాగా శకవర్షములు 1735 శ్రీముఖ కార్తికశుద్ధ ఏకాదశి భృగువారము (క్రీ. శ. 1813 నవంబరు 4)న ఆ జిల్లా కలెక్టరు జార్జి ఫ్రాన్సిస్ డైసన్ అనువానిచే అది మరల బాగుచేయబడినది. ఆంగ్లేయులకు హిందూదేవాలయములందును, వారి దానధర్మములందును గల భక్తిశ్రద్ధల కిదియొక తార్కాణము.

స్థాలీపులాక న్యాయమున ఏవో కొన్నిశాసనములు మాత్రమే ఇచ్చట వివరించబడినవి. మన తెలుగు శాసనసంపుటములనుగూర్చి కొంచెము మనవి చేయుట అప్రస్తుతము కాదు. ఇప్పటికి 12 సంవత్సరముల క్రిందట 1948 లో కళాప్రపూర్ణ శ్రీ జయంతి రామయ్య పంతులుగారి ఆధ్వర్యమున తెలుగుశాసన సంపుటమొకటి వెలువడినది. అందు శాసన పరిశోధనశాఖ వారిచేత 1904 నుండి 1928 వరకు సంగ్రహింపబడిన తెలుగు శాసనములు మొత్తము 161 గలవు. విజయనగరరాజుల శాసనములుమాత్ర మందు చేర్చబడలేదు. అదేసంవత్సరములోగల విజయనగర రాజుల శాసనములను సుమారు మూడేండ్ల క్రిందట పరిష్కరించి ప్రత్యేకసంపుటముగా సిద్ధము చేసి ఆంధ్రప్రభుత్వమును దానిని ప్రకటించుట కభ్యర్థించగా వారి వద్దనుండి యెట్టి సమాధానములేదు. మద్రాసు, మైసూరు ప్రభుత్వములు వారి వారి తమిళ కన్నడ శాసన సంపుటములను ప్రకటించుట కంగీకరించి అచ్చు వేయుచుండెను. గత్యంతరములేక తెలుగు శాసన సంపుటము గూడ మద్రాసుప్రభుత్వమునకే ప్రకటించుట కివ్వబడినది. కాని ఇంకను అది ప్రారంభింపబడలేదు. ఆంధ్రదేశ రాజకీయ, సాంఘిక వాఙ్మయ చరిత్ర పూర్తిగ తెలియవలెనన్నచో మన తెలుగు శాసన సంపుటములు త్వరలో ప్రకటింపబడవలయును. ఇతరరాష్ట్రప్రభుత్వములవలె ఆంధ్రప్రభుత్వము తెలుగు శాసన సంపుటములను ప్రకటింపవలసినదిగా అభ్యర్థించుచు నాకీ అవకాశము కల్పించిన ఆంధ్రపత్రిక సంపాదకులకు కృతజ్ఞతా పూర్వకవందనములతో దీనిని ముగించుచున్నాను.

"తమసో మా జ్యోతిర్గమయ"

# త్రిశంకుఁడు

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

[ త్రీణి, పితుః కోపః - వసిష్ఠ ధేనోర్వధః - వృథా గోమాంస భక్షణం చేతి శంకుని శంకుతుల్యాని పాపాని యస్య - సః త్రిశంకుః—అని మహాభారతము ]

"పరదార వ్యవహారము - గుర్వాజ్ఞోల్లంఘనము - నిషిద్ధవస్తుభోజనము"—ఈ మూఁడు శంకులు - అనగా మేకులు - అనఁగా 'శూలములు' కలిగినందువలన ఆ రాజునకు త్రిశంకుఁడని పేరు వచ్చినదఁట. పూర్వ పుణ్యమువలన తుదకీ దోషములనుండి బయటపడి సింహాసనమునకు వచ్చి సర్వ ప్రజారంజనముగ రాజ్యమేలెను. అతని బిడ్డయే మన మెఱిఁగిన హరిశ్చంద్రుఁడు.

పృగకుత్స్థాం డనుకాని వంగడములోఁ బుట్టెన్ మహాశూరుఁ డా
త్ర్యరుఁ డవ్వాఁ డరుణుండు నాఁ బరఁగి లోకం బెల్ల నిగ్గింప ని
ద్ధర సౌఖ్యంబుగ నేలుచుండెను మహాదర్పంబుతో వాని క
వ్వరు కానేరరు సాటి - వాని గుణముల్ వర్ణింతు రవ్వారిగా.

అతనికి లేకలేక యొక యర్భకుఁ డుద్భవ మొందె - వాఁడె స
ద్గతి యొసఁగూర్చి శాశ్వత సుఖంబు లొసంగు నటంచుఁ బెద్దగా
మతిని దలంచి కానియు మున్నన లెల్లను సంతసంబు భూ
పతి యొనరించు ముద్దు మురిపంబులు లెన్నఁగఁ బ్రోదిసేయుచున్.

తనయుం డొంతయు రాణసోదనని యాతం డంత సత్యవ్రతుం
డని యా బిడ్డకుఁ బేరుపెట్టి సతతం బావంతయున్ లోపమున్
గనరానట్టి విశిష్ట మార్గమున విజ్ఞానంబు చేకూర్చు ధో
రణిలోఁ బెంచునుగాని వాని నుదుటన్ వ్రాఁతల్ పరీక్షింపకే!

అతఁ డొకనాఁడు బ్రాహ్మణ గృహంబున కేఁగి వివాహ వైభవం
బతి ముద మొందఁ జేయు సమయంబునఁ బెండ్లి కొమార్త కంటికిం
పితముగ సన్నదాను నవివేకిగ నామెను బట్టి తెచ్చెఁ గు
చ్చితముగఁ గోటలోని కిఁకఁ జింతలువందలు యయ్యె నయ్యెడన్.

అంతటఁ గొందలంపడి రయంబున రాజును గాంచి యార్తులై
వందురి విన్నవింప గుణవంతుఁడు కావున దేఁడు వైళమే
నందనుఁ బిల్వనంపి కఠినంబుగ వానిని మందలించె ని
ట్లందటిలోన - మందఁడవురా! యిఁక నిన్ను సహింపఁ యుందునా ?

నీ వొక దొడ్డబిడ్డవయి నేల సమస్తము నేలఁజాలి యు
చ్చావచ ధర్మకార్యములు సల్పి యశంబు గడింతువంచు నా
భావమునం దలంచితిని బార్థివజన్మము నెత్తలేదె? దు
ష్టా! వృథ నీదు నామ మకటా! నిను సైఁచుట దోసమే గదా!

ఒక నిముసంబుగాని యిట నుండఁగరాదిఁకఁ బొమ్ము నీచ స్వ
త్రికి నిటఁ జోటు లేదని మదిం గలిగింపుము; చూడరాదు ని

మొకమని తిట్టిపోయెఁగ నపూర్వ పరాభవమొంది యాగఁడున్
దికముకలై మొదర్చు బదింబదిగాఁ బదిమంది ముందఱన్.

తేనికిఁ గోపముం బొఁగి తీవ్రునఁ బెద్దలఁ బ్రోవుచేసి శి
ష్యావళియుండు లేర్చుటఁ గావలె నన్న — వసిష్ఠుఁడే సమా
ధానము చెప్పఁగాఁదగిన దక్షుఁ డటంచు సదస్యు లందఱున్
బూని వచింప నయ్యది నృపుండును మెచ్చి యుపక్రమింపఁగా.

గురువు వసిష్ఠుఁ డిట్టి దొక ఘోర దురాగతమంచు సూటిగా
గుఱిఁగొని యింట పాయకముఁ బూర్చిన యట్టులు తీర్పుసెప్ప — భూ
పాగఁ డది విశ్వసించి పొరపాటుగ రాజకుమారుఁ డట్లు తోఁ
దగఁ బడినన్న భావము మనంబున లేక విధించె నిట్టులన్.

శ్వపచులు సైత మెన్నఁడును నల్పని దుష్కృతి చేసి నాకు నీ
వపయశ ముంటఁగట్టితివిరా! యిఁక నెట్టులు సైఁతు నన్నుఁ? నీ
విపుడె యరణ్య భూములకు నేఁగి శ్వపాకుతోడఁ గూడి నీ
చపు బ్రదుకున్ వెలార్చి చవి, పారము చచ్చి మెలంగు మచ్చటన్.

అని యా వెంటనె తేఁడు పీరలుక చే నవ్వాని గెంటించి వై
చిన దిక్కేమియు లేక బిక్కుమొగమై చేష్టాంబు తోడ్పాటుగాఁ
జనియెన్ రాకొమరుం డరణ్యములకున్; శాపంబుగాఁ దండ్రి నో
సనటం బూర్చినఁ బ్రోచువా రెవరు నిర్భాగ్యున్ బరాభూతునిన్?

అట్టులు రాకుమారుఁ డనయం బొనరించుటచే నరణ్యముల్
పట్టె ధనుర్ధరుండయి శ్వపాకులె నెయ్యముఁ బూర్చి విచ్చలున్
జట్లములై తలిర్పఁ దన మూర్ఖికిఁ దగ్గ కిరాతవృత్తి చే
పట్టె వసింపఁగాఁ దొడఁగె, బాతక మట్టు లొనర్పకుండునా?

అరుణుఁడు పిమ్మటన్ దనయుఁ డట్లయిపోవుట కాత్మఁ గుంది యె
వ్వారు తన కోర్కె తీర్పఁగల వారలె లేక సుపుత్త్రుఁ బొందగా
నగిగొని పో వనంబులకు; నక్కడ రాజ్యములోన వర్ణ సం
కరమయి ధర్మ విప్లవము కల్గియు వర్షముపోయె బొత్తిగా.

కఱవును దాపరించె నధికారులు సాయము నినచేని యా
దరమునఁ జేయఁగాఁదగిన దక్షతఁ బూర్తిగఁ గోలుపోయి ర
త్రిపుఁ బ్రజలెల్ల రాఁకటికిఁ దల్లడమందుచుఁ గూడుగుడ్డలన్
దారకక బాధ నొంది రొకత్రోవయు దోఁకయు లేక యెల్లెడన్.

సరిగా ద్వాదశ వత్సరంబు లిటు వర్షం బన్నదే లేక యం
దఱు తబ్బిబ్బయిపోయి; రట్టి పెనుభూతంబైన క్షామంబు తి
వగమున్ సైఁపక గాధిజుండు చనియెన్ భార్యాదులన్ వీడి యె
వ్వరికిం జెప్పక యేడకో యతని దౌర్భాగ్యంబు ప్రేరేపఁగా.

బండేఁడు బిడ్డలం గలిగి భర్త యమాంతము లేచిపోవ నే
యండయు లేక భార్య, మరియాదకు లోఁగినదాఁటఁ దిండికై
నొందుచుఁ గాఁపురంబు భరియింపఁగలేక విషణ్ణచిత్తయై
గండములందు మున్గె; మును కర్మము లెట్టివి చేసియుండెనో!

ఆఁకట నెవ్వగం బాగిలి యాత్మజులెల్లరు స్రుక్కి సోలి య
ట్టాఁకలఁ బెట్టుచుండ నడిమానలు మాని గృహస్థధర్మమున్
జేకొనియుండఁగా దిటవుసెందక కౌశికుభార్య, బిడ్డలన్
సాఁకుట కొక్కమార్గము విచారణచేసి యపూర్వవైఖరిన్.

ఎవనికిఁ జెప్పుకొందు నను నెవ్వరు చూతురు? చీకుచింతలున్
దవులనివారె లేరకట! ధర్మము ప్రోవఁగఁ జాలి యేలు పా
ర్థివుఁడును లేఁడు-దైవము విధించిన యానతి మీఱఁజాలు ప్రా
భవము బలమ్మునుం గలుగువా రెవ రుందురు లోకమం దిఁకన్!

ధర్మ మధర్మమో యొకవిధాన మొనర్పఁగఁదప్ప దిప్పు డీ
కర్మము తీర్పఁగా సుతులఁ గావఁగఁ దోఁచిన మార్గమంతయున్
ధర్మమె కాన నిత్తఱి వ్యథం బడరా దొకబిడ్డ నింకులో
నర్మిలి వీడి యమ్మికొనియైన భరింతును దక్కువారలన్.

అని యా కౌశికుపత్ని దీనదశచే నల్లాడి యారీతి నా
యెను నాకర్మము చావురాదె యని యెంతేఁ జింతలో మ్రగ్గి కొ
య్యన డెందంబును రాయిచేసికొని యయ్యాపత్తుఁ బోశాగ్ర బు
త్త్రుని దానే యొకచోటఁ గట్టి నడచెన్ దూరంబుగా నేడకో!

తక్కినబిడ్డ లందఱును దల్లి చెఱంగిగు గేల లాగుచున్
గుక్కలు వట్టి బిట్టడలి కో యనియార్చుచు విహ్వలింప న
ల్దిక్కుల నెల్లవారలు పసింబదిగాఁ బరికించి నెవ్వగం
బొక్కుచునుండ దారిఁబడి పోవుచునుండెఁ గుటుంబ మంతయున్.

వనటం గూర్చెడి తల్లి-బిడ్డలను ద్రోవంబోవు నత్యవ్రతుం
డును నింపాదిగఁ జూచి, బిడ్డమెడ త్రాడుంగట్టఁగా నేల యం
చును బ్రశ్నించి విచారము దెలుపఁగా-శోకంబు రేకెత్తి య
వన్వితారత్నము వల్కె నిట్టు తనదౌర్భాగ్యంబు వర్ణించుచున్.

ఎల్లరి మెప్పువొందిన మునీంద్రుఁడు గాధిజుఁడంతవాఁడు నా
వల్లభుఁడయ్యె నిట్టి దురవస్థకుఁ జిక్కితి; బిడ్డ లాఁకటన్
దల్లడమందఁ జూచియును దాను దపం బొనరింప నేఁగె-నీ
పిల్లల దిక్కు మ్రొక్కు కనిపింపక యిల్లును వీడివచ్చితిన్.

కాపుర మీఁదలేక కడగండ్లకు నాఁగక త్రోవయేదియున్
జూపెడివారు గానక కుసుల్వడు బిడ్డల నోమఁజాలకే

పాపపుఁజేష్టకుం గడఁగి పైనము గట్టితి చేరికేని యీ
పాపను విక్రయించి తగుపాటి సహాయము మూటఁగట్టఁగా.

అనవుడు నా నృపాలసుతుఁ డక్కట! యిట్టి యవస్థ యేల? నా
మనవిని శ్రద్ధగా వినుము మౌనివరో! యిఁకనుండి బిడ్డఁగాన్
పెనుచుటలో రవంతయును భీతిలఁబోకుము-చాలినంత తిం
డిని గొనివచ్చి యిచ్చెదను నిచ్చలు మీ కని యూఱడించియున్.

వారిని బోడకే, నిజనివాసముచేర్చి సుఖంపఁజేయఁగా
భరము మీఁదవైచుకొని పార్థివపుత్త్రుఁడు నిత్య మాదటన్
వారు భుజింపఁగాఁదగిన వన్యమృగంబులఁగొట్టి మాంస ము
న్వారికిఁ దెచ్చియిచ్చు; నిది వాని విధాయకకృత్యమో యనన్.

మునివరు ధర్మపత్ని కనుమోదముగూర్చెడి యీ విధానముం
గని పదిమంది మెచ్చుకొనఁగా నిలుదీర్చుచు నామె పుత్త్రపో
షణమున శ్రద్ధతీసికొనసాగెను; త్రాటను గట్టఁబడ్డ యా
తనయుఁ గాలవుఁడనుచుఁ దద్జ్ఞులు పిల్తురు త్రాడుగట్టుటన్.

అక్కడ ఱేఁడులేని సమయంబునఁ బొంది వసిష్ఠమౌనియే
చక్కఁగఁ జేరి న్యాయ్యము విచారణ సేయుచు నెల్లవారికిం
జిక్కులుతీర్చి పెత్తనము చేతికిఁ జిక్కియు నాఁడునాఁడు పెం
పెక్కుచు నుట కొందఱ కనిష్టమె కూర్చెనదేమి చిత్రమో!

తన యిటువంటి దుర్గతికిఁ దప్పక యాతఁడె మూలమంచు న
మ్మునివరుమీఁద క్రోధముఁబూని యథావిధి రాజపుత్త్రుఁ డుం
డెను జగశాల మాపదలు డీకొని; యావల నొక్కనాఁడు కా
ననమున నేమృగంబును గనంబడదయ్యెను గొట్టి చంపఁగా.

అతనికి బెంగపుట్టె తన యాఁకలిమాట యటుంచి, తాను యా
శ్రితగతి చూపెనంచుఁ బాలించియు నమ్మినతల్లి-బిడ్డఁల
బ్రతుకఁగఁ జేయుటే తగినపద్ధతిగా నతఁడెంచి కంటి కిం
పితముగఁ గానవచ్చునొక పెయ్యను బట్టి వధించెఁ దిండికై.

చివరికిఁ జూడఁగా నది వసిష్ఠుని ధేనువియంచుఁ దెలె, గా
రవమును జూపకేలయని రాజకుమారుఁడు దానిఁగోసి యా
త్రమమునఁ దాను కొంతదిని తక్కినదానిని మూటగట్టి ప
త్త్వవిధిగ వారికిచ్చె; హృదయంబున స్వస్థత చిక్కెనాఁటికిన్.

నాఁడు మఱింత సంబరమునం దిని తల్లియుఁ బిల్లలాప్తుఁడై
వాఁ డొనరించుదానికి నవశ్యపు గౌరవమిచ్చి, దైవ మీ
కొడుకు నీర్చ హిని ననుకూలుఁడుగా నమకూర్చె- త్రుడ్డలోఁ
జూడఁగ మెల్లమె లనెడి చొప్పున నెంచియు నుండె; రంతటన్.

తనగూర్పుం బరిమార్చె నంచు విని యాతం డెంత దుర్మార్గుఁడో
యని హాస్యంబుగ నా వసిష్ఠముని క్రోధావేశముం బూని యా
తఁ డన్వెంటనె పిల్వఁ బంపి యవురా! దౌరాత్మ్య మీరీతిఁ జూ
పిన నిన్నేమని యందు మిట్టి పనుఁ జేపింజాలమే మున్నుఁ జేసి!

నీ చరితంబు నింద్య మవినీతుఁడ! నాఁ డొక బ్రాహ్మణాంగనం
దోఁచితి నాఁడయిన్ బరమ ధూర్తుఁడవై జగదేకవంద్య ధ
ర్మాచరణవ్రతున్ జనకు నట్టు లవజ్ఞ యొనర్చి తిప్పుడీ
నీచతఁ జూపినాఁడ విఁక నిన్నొక మానవుఁడన్నఁ జెల్లునే?

ఇదిగో! శపింతుఁ గాచుకొను మిట్టివి తప్పులు మూఁడు చేసి మా
యాదపున నుండవైతివి సుమా! యిఁక నీవు 'త్రిశంకు' నామమి
య్యాదనుఁ బొంది రాక్షసుఁడవై పదిమందికి భీతిపుట్టఁగా
మెదలుము పొమ్ము-నాపు డది మేలని కీడని యాడఁ డతఁడున్.

కదలెఁ బిశాచరూపమును గైకొని యాతఁడు-వానికర్మ మి
ట్టిదియని వ్రాసిపెట్టెను గడింది విధాత; విషణ్ణచిత్తుఁడై
మెదలియును దోఁప కే యొక మునీశ్వరు నాశ్రయభూమిఁ జేరి యు
ద్యానయముకొన మాతనికి నూడిగముం బచరించు నిచ్చలున్.

అతఁడు ననుగ్రహించి పరమార్థము గూర్చెడి మంత్ర మిచ్చి స
ద్గతి కనుకూలమైన సహకారము సూపఁగ నాతఁ డొక్క స
ద్వ్రతమును దీక్షగా నెఱపి రాక్షసరూపము నాఁడు నాఁటిక
ద్భుతముగ మార్పు సెంది ముదముం బెనుపొంది మెలంగ నయ్యెడన్.

పదపడి బ్రాహ్మణోత్తముల పజ్జకుఁ జేరి నమస్కరించి యి
య్యెదమున నాకు మీర లొక యక్కఱ దీర్పఁగ వేడికొందు న
మ్మదమున హోమకార్యము - నపూర్వవిధంబునఁ జేయఁ బూని య
య్యది నెఱవేర్ప మీరె కల రంచుఁ దలంచియు నిల్లు వచ్చితిన్.

అనవుడు వారు వాని కథయంతయుఁ బుట్టువుఁదొట్టి నెట్టనన్
విని యవురా! యిదేమి యవివేకము సూపెదు? హోమకార్యముల్
పనుపడ సేయఁగాఁ దగిన భాగ్యము నీ కెవ రిచ్చిరోయి? పో
మ్మని బెదరించి పైగ విరుకాడక వెండియుఁ బల్కి రిట్టులన్.

కులగురుఁ డా వసిష్ఠమునికుంజరుఁడే శపియింప నీకుఁ గా
వం సిన దాని నీయఁగలవా రెవ రుందురు భూమియందు? ని
మ్మంమిఁక నీ ప్రయత్నము; శుభం బొనరింపఁగ నర్హభావమే
కలుగను నీకు-రక్కసివిగావున బొత్తిగ నైంప మిత్తఱిన్.

అని కడుమాఱి యుద్ధపడి నాతని నెట్టన నెట్టివైన జీ
వన మిఁక దుర్భరంబగుటఁ బ్రాణము లేటి కటంచు సాహసం

బాహు గొని యాతఁ డొక్కఁడె యెకఁ బొందిక కట్టెలు పేర్చి యగ్నియుం
జొనిపి హరీయటంచు నటఁ జొచ్చియుఁ జావఁదలంచె - నంతలో.

మనమున నేదొ తోఁచి యనుమానముతో క్షణకాల మట్టె ని
ర్జనవనమందు నుండె నరునం బాడఁగూడదు సువార్త యాకనం
బున వినవాయె నిట్టు — లిది పోలదు రాజకుమార! రేపె వ
చ్చును శుభవార్త! యందనుక సుస్థిరచిత్తుఁడవై మెలంగుమీ!

నా విని వాఁడు వంతనమునన్ మరణోద్యమ మెల్ల మాని పో
నీ విరమించి నేఁడు గమనింతును - రిత్తకు రిత్తయైనచో
నావలఁ జావరాదె యని యత్తఱి నిబ్బర మావహిల్ల స్వే
చ్ఛావిధిఁ గాలముంగడుపసాగఁ; బదంపడి పట్టణంబులో.

కలఁతలు పుట్టి ప్రెగ్గడ లెకాయెకిఁ బోయి నృపాలుఁ బ్రేమఁ దో
యిలి గుదియించి భక్తి గురియించుచు నర్థము విన్నవింప నా
వలఁ దనజీవితం బిటులు వ్యర్థము కావుట కాత్మ రోసియున్
బలికెను వారితో నిఁక ముఖావము సూపుట చెల్ల దియ్యెడన్.

పొమ్మనినంతఁ గిమ్మనక పోయి వనమ్మున నొంటిగా విచా
రమ్మునఁ గాలముం గడుపు రాజకుమారుని జీవితమ్ము వ్య
ర్థమ్మయిపోయెఁ; బైగ - నపరాధము కల్గినదాని కల్గి శా
పమ్ము వసిష్ఠుఁ డిచ్చె; నిది పాపము పున్నెము చర్చ యేటికిన్?

తెలియక చేసినేయని మదిం గుఱుతింపక కన్నబిడ్డకే
యలమట గూర్చి యీ యడవులం దిటు లాకులలంబు మేయఁగా
వలసెఁ గదా! యిఁకేల? పరివారముతోఁ జని మీఁగ లాతనిం
గొలిచియుఁ దెండు రాజ్యమునకున్ ప్రభు నాతనిఁ జేసి పోయెదన్.

అది విని చిత్తమంచు వినయంబునఁ జాఁగిలి మ్రొక్కి మంత్రు ల
య్యదనున సంబరంపడి ప్రయాణము చేసి యరణ్యసీమ నా
పదం మునింగి రాచసిరిఁ బాసిన రాజకుమారుఁ జేరి యు
య్యది వినిపించి తండ్రికడ కప్పుడె వానిని దెచ్చి చూపినన్.

అప్పుడు నృపుండు బిట్టడలి యాదటఁ గౌఁగిట వాని గ్రుచ్చి చిం
తకు వశమ్ము దానముఖు దాంతివిభూషణు వానిఁ గాంచి స
ద్భావము సూపి, నాఁడు పొరపాటుగ సత్యమెఱుంగలేక మే
ధావిని గెంటివైచియు వృథా యొనరించితి నింతకాలమునన్.

అని విలపించి సిగ్గొనసి యా ధరణీశుఁడు స్వస్థచిత్తుఁడై
గొనకొని సింహపీఠమునకున్ శుభవేళఁ గుమారుఁ జేర్చి స
మ్మానమున నిబ్బరంపడి క్రమంబుగ సర్వము రాజనీతి యా
తని కుపదేశమిచ్చి బహుధా పరిశీలన చేసి యుమ్మగిన్.

# భావము, సంఘటన: ఏది ముందు?

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

మహావేగంతో పరుగెత్తుకొని పోయే యీ విశ్వం క్షణక్షణానికీ అనంతాకాశంలో చోటు మారుస్తూనే వుంటోంది; క్షణక్షణానికీ ఘటనా పరంపరల్ని కలిగిస్తూనే వుంటోంది. ఒక్క విశ్వమే కాదు ఈ పని చేస్తున్నది. విశ్వంలోవున్న సర్వస్వంకూడ యేవో ఘటనల్ని కలుగజేస్తూనే వున్నాయి గడియారం ఒక్కొక్క సెకండుకు ఒక్కొక్క ప్రత్యేక స్థితిని చూపిస్తూ కాలాన్ని కొలుస్తూనే సంఘటనల్ని లెక్కిస్తూనే వుంటోంది. చీమపిల్ల దగ్గర్నుంచీ సింహం వరకూ. బిచ్చగాడి దగ్గర్నుంచీ భూమీపతి భానుమరది వరకూ అంతా సర్వసాధారణంగా యేవో ఘటనలకి కారణమవుతూనే వుంటారు. ఈ ఘటనల సంఖ్యకు అంతూ పొంతూ లేదు.

ప్రతి సంఘటనకీ యెవరో ఒకరు కారకులుంటారు: మనుష్యులు కావచ్చు, మానులు కావచ్చు, పశువులు కావచ్చు, పక్షులు కావచ్చు. అలాగే ఆ ఘటనల ఫలితాన్ని యెవరో ఒకరు అనుభవిస్తూ వుంటారు. ఒక్కొక్క సంఘటన కొందరికి సుఖం కొందరికి కష్టం కొందరికి జుగుప్స కలిగిస్తుంటుంది కూడాను. ఆ ఘటనల్ని కలిగించేది ఒక వేళ యెవరో మనిషే అయినా అతడు సుఖం, కష్టం లాంటి అనుభూతుల్ని ఇతర్లలో కలిగించాలని అనుకోనుకూడ అనుకోకపోయివుండవచ్చు, అయినా ఆ పర్యవసానం వుంటూనే వుంటుంది.

జరిగిన ప్రతిపనీ ఘటనే అనవచ్చు. చెట్టుమీద నుంచి పండు క్రిందపడిందనుకొందాం. అదొక ఘటన. దీనివల్ల ఆపండు ఏరుకొన్న పసివారికి ఆనందం; రేపువచ్చి కులుకుకుపోదామనుకొన్న తోటమాలికి మనః క్లేశం; దానివల్ల న్యూటను వంటి గొప్పశాస్త్రజ్ఞునికి మహోద్బోధ కలిగితే అప్పుడు ఆ సంఘటనను గురించి సర్వకాలమూ జ్ఞాపకముంచుకొంటాము

ఒక ఘటనకూ, యింకో ఘటనకూ యేదో సంబంధం వుందనే మాట వాస్తవమే. కాని యీ రెంటికి మధ్య సంబంధం కలిపిన తంతువు యేమిటని ప్రశ్నిస్తే, శరీరతత్వశాస్త్రజ్ఞులు, మనస్తత్వశాస్త్రజ్ఞులు పోటీపడి భిన్నమైన సమాధానాల నేకరువుపెట్టి మనకు విచ్చిచెప్పటానికి ప్రయత్నిస్తారు.

శరీరశాస్త్రప్రకారం మస్తిష్కంలో మెదడనే పదార్థం వుంటుంది బహుశః, మెత్తగా బూడిదరంగుతో, ప్రతి చిన్న విషయానికీ పులకిస్తూ, కంపిస్తూనే వుంటుంది. దీన్ని శస్త్రపరీక్షచేసి పరిశీలించవచ్చు ఈ మెదడు శరీరంలో కలిగిన ప్రతి మార్పుని కాని విశేషాన్ని కాని తనలో నమోదు చేసి వుంచగలదు. ఒక సంఘటన లేక ఏదో ఒక సంగతి కన్ను, ముక్కు, చెవి లాంటి జ్ఞానేంద్రియాల ద్వారా యీ మెదడుకు తెలియజేయబడితే దానివల్ల కలిగిన ఫలితాలతో సహా మెదడులో ఆ ఘటన రచించబడుతుందని శాస్త్రజ్ఞుల కథనం.

పందొమ్మిదో శతాబ్దంలో ఈ శరీర శాస్త్రజ్ఞులు మన కర్థమవుతున్న "మనస్సు" అనేదది శరీరంలో లేనే లేదనుకూడ వుండేది. వీరు చెప్పే మెదడనే పదార్థం పైన చెప్పినట్లు తన శరీరంలో జరిగిన విశేషాల్ని జాబితాచేసి దానిపై జరిగిన ప్రతిక్రియతో సహా పొందుపెట్టి దస్తరం తయారు చేస్తుందికాని మన మనుకొనే "మనస్సు"లా యుక్తాయుక్త వివేచన శక్తిని కనపరచలేదు. ఐతే యీ భౌతిక సంఘటనలు మనుష్యుల కెలా అనుభవాన్ని కలిగించి వుపయోగిస్తున్నాయి? ఈ విషయం చెప్పటానికి డార్విన్ కూడ సాహసించలేదు. అతని సిద్ధాంతం ప్రకారం ఒకరకపు జీవుల్నుంచి మరొకరకపు జీవులు తయారు కావటానికి కారణం వాట చుట్టూవున్న వాతావరణంలోని మార్పులే—వాతావరణంలో మార్పు, శరీరాల్లో మార్పు—అన్నీ భౌతికమైన కారణాలే. అనుభవం అనే చైతన్యం కూడ కారణమని కర్మ సిద్ధాంతం చెప్పినవాడు మనువు. ఇక ప్రాణం అనేది యేమిటి? ఈ చైతన్యానికి మూలం యేమిటి అంటే, అది పదార్థమే; శరీరంలో యే గుండెలోనో యే మోకాలిలోనో యెక్కడో వుండి వుంటుంది; తెలుసుకోలేక పోతున్నామని పదార్థవిజ్ఞానులు అంటారు.

ఇలా యీ శాస్త్రజ్ఞులు చెప్తుంటే సంఘటనవల్ల భావం పుడుతోందనీ అలా పుట్టినభావం తిరిగి సంఘటనలను [illegible] పని చేసి ఘటనా పరంపరలకు దోహదాన్ని కలిగిస్తుందని అనిపిస్తుంది.

భావం అంటే మూలంగా సంకల్పమని సోహాని అనవచ్చు. ఈ భావం నిజంగా సంఘటనలవల్లనే పుట్టేట్టయితే అది రాతిలో పుట్టదేం? ఒకచట్టాతిసముద్రంలో జరిగే వేలాది సంఘటనలు రాతిలో యే మాత్రం చైతన్యాన్ని పుట్టించ గలుగుతున్నాయి? చెట్లల్లో మొక్కల్లో యేమాత్రం భావాన్ని కలిగింపజేయ గలుగుతున్నాయి? అనే ప్రశ్న వచ్చింది. దానికి జగదీశచంద్రబోసు సమాధానమిచ్చారు. టన్నులకు టన్నుల బరువుల్ని ఆకాశంలోకి మోసుకుపోయి కిలకాయలాడిస్తున్న చెట్లకి పైకి బరువునెత్తి కలిగిన శక్తి వుందనేమాట మరచిపోవద్దన్నాడు వృక్షజాలంలో కూడ భావం, రసం వగైరాలు వున్నయి. లీలామాత్రంగా ప్రయోగాల ద్వారా చూపిస్తారు. చూపెండన్నాడు. ఆ మాటకు వస్తే. అసలు జడపదార్థాలయిన రాళ్లల్లో కూడ భావం వుండే వుండవచ్చునేమో! ఆ భావాల్ని మనకు తెలియజేయడం అంతగా వాటికిష్టం లేక పోయి వుండవచ్చు అని కూడ అనిపిస్తుంది. ఇలా అనిపించి అనిపించి సంఘటనలే భావాల్ని కలిగిస్తున్నాయనే భావం నిజమనిపిస్తుంటుంది కూడాను.

ఐతే భరతఖండంలోని ఋషులలా అనలేదు. వారిదృష్టిలో భావమే ఘటనకు అంకురం. అసలీప్రపంచమంతా యిలా తయారు కాకుండా వున్నప్పుడు అదంతా అంధకారబంధురమై అణిగి మణిగి

లాగుపై నిద్రపోతూ యే పదార్థమనేదీ కనపడకుండా, కనీసం గాలి పైనా కాకుండా ఈథరు (ether) లేని వట్టి ఆకాశమల్లే వుండి పోయినప్పుడు సంఘటన కాని ఘటన కానీ యేవీ లేవు. పతే అప్పుడు భావమనేదిమాత్రం ప్రత్యేకంగా వున్నదా అంటే అది సుప్తమై ఆ అంధకారంలో కలిసిపోయివుంది. అంటే అంతపదార్థమున్నూ (Matter) యీ వివేదనశక్తి మొదలైన చైతన్యమున్నూ (life) అన్నీ యేకమై ఒకటై పోయినయి. ఆ పరిస్థితి అలా వున్న సమయంలో సృష్టికి ముందు వుపక్రమించిం దెవరంటే, సంకల్పమని ఆ ఋషు లన్నారు. ఇది యెలా? సంకల్పం వేరు, మరొకటి వేరుగానున్నప్పుడు ఎవడన్నావచ్చి 'సంకల్పమే ముందు సృష్టికి వుపక్రమించింది నేను చూశా'నని చెప్పితే ఆ మాటలు నమ్మి అవుననుకోవచ్చు. కాని అన్నీ కలిసిపోయిన ఒకటే పరిస్థితి వుండగా సృష్టికి మొదలుపెట్టింది "భావమే"ననటంలో ఔచిత్యమేమిటని కొంక.

సృష్టియెలా అయిందీ అనే విషయంమను యిలా చెప్పాడు. "అసలు మొదట అంధకారమయిన పరిస్థితే యిప్పుడు మనంవున్న పరిస్థితిగా మారింది" అన్నాడు. ఇదే అది అన్నాడు. అయితే అప్పటి పరిస్థితికి బ్రహ్మయనీ హిరణ్యగర్భుడనీ పేరుపెట్టాడు. Law of Indistructability of the matter అనే ఇంగ్లీషు పదాలను వాడిన మీదట అతనన్న అర్థం చెప్పినట్లయితే బాగా తెలిసేది. అలా అర్థం చెప్పటానికి యీనాడులో 'డాల్టన్" అనే మనువు సుళ్ళు పుటాల్సివచ్చింది. "అలా అంధకారంగావున్న పరిస్థితిలో—బహుశ చైతన్యశక్తి మేల్కొన్నది కాబోలు—ప్రాణం పోసుకున్నట్టుగా అయింది, తడిపి ఆరబెట్టిన శెనగగింజల్లే. అప్పటి ఆ పరిస్థితికి మనువు యేపేరు పెట్టినా అది ఒక పరిస్థితే గాని మనిషిగాని మనిషిలాటివాడు గాని కాదు. ఇంతవరకూ అయోమయంగావున్న ఆ స్థితి తనను తను అర్థంచెసుకున్నట్టు, ఆ అయోమయాన్ని వదలివేయాలన్నట్టు, ఏదో తెలివితేటలుపయోగించగలిగినట్లు, మార్పుకలుగుతున్నట్టు అనిపించింది. ఎవరికలా అనిపించిందంటే, ఆ పరిస్థితికే; కాదంటే దాన్ని యిప్పుడు వూహించే మనకు. అలా తెలివితేటలున్న సారించిన ఆ స్థితి తానేం చెయ్యాలంటే అది చేయగలననే ధీమాకూడా కల్గింపజేసుకొన్నది. చైతన్యం, అహంకారం రెండూ అక్కడ కరుడు గట్టి నిల్చినవి. ఆస్థితిలో కొన్నిచోట్ల సుఖం, తృప్తి, శాంతి, హాయి కలిగివున్నట్టు, ఇంకోచోట ప్రేమ, ఆశ, యేమిటో తెలుసుకోవాలన్న ఆసక్తి అన్నీ వున్నట్టు, మరోచోట మత్తు, నిద్ర, నిస్తబ్ధత మొదలైనవన్నీ వున్నట్టు తోచింది. వీటిని సత్త్వరజస్తమోగుణాలంటాడు మనువు. ఇవన్నీ తనలో యిలా వున్నాయన్న విషయం ఆ స్థితికి తెలియటం మొదలెట్టింది కూడాను. అంటే మనస్సనేది దానికి ఒకటి వుందన్నమాట.

ఆ మనస్సుతో అప్పుడు ఆస్థితి శబ్దాన్ని వూహించింది—స్పర్శనూహించింది—రూపాన్నూహించింది. ఇలా యివన్నీ వూహిస్తూండగానే ఆకాశం, గాలి, మంట, నీరు, భూమి అన్నీ ఆయా

ఊహించిన గుణాలతో పుట్టినయి. ఇవి నిజంగా మనం చూసిన గా కాని జ్ఞాపకముంచుకోండి. అవి వట్టి పేర్లే. వాటిని ) పేరు పెట్టుకొన్నా మంచిదే. ఎలెక్ట్రాన్లు, ప్రోటాన్లు, న్యూట్రాన్లు పాసిట్రాన్లు, ఇంకా, మహాన్‌లు, అన్‌లు- ఏమన్నా అనండి చిక్కులేదు. వీటిని వత్త్వరజస్తమో గుణాలతో కలిపి యాటములు, మాలిక్యూళ్లు, రసాయనిక వికారాలు కలిగింగి పర్వాన్ని సృష్టించ • పరిస్థితే జనిపింది. ఇవన్నీ యిలా కావటం ఆ హిరణ్యగర్భుని పేరు పెట్టబడ్డ అప్పటి పరిస్థితిలోని చైతన్య విశేషంవల్లనే అప్పటి చైతన్యం ఒకటి యిప్పటి చైతన్య మింకటీ కాదు. చైతన్యం అప్పుడూ యిప్పుడూకూడ ఒకటే. ఆ చైతన్య శక్తివిశేషంవల్లనే యీ ప్రపంచం జరుగుతుండటం, ఆ శక్తి భావమై. భావం సంఘట నవుతోంది. "యద్భావమ్ తద్భవతి."

ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే "భావం పుట్టినతర్వాతనే సృష్టి మొదలెట్టిందనే మాట నిజమయితే భావమే సంఘటనకు మూలం అనే మాటా నిజమై ఈ తర్కానికి మద్దతుగా మనువు వున్నాడూ" అని.

సృష్టికి ముందరిమాట అటుంచి సృష్టితరవాతి సంగతులు గమనిద్దాం అలా పరిశీలించిచూస్తే భావంలో మొదలెట్టిన సంఘటన కొత్త భావాల్ని పాదుగగా భావం, సంఘటన ఒకదానివెంట ఒకటి గుడ్డుపు పందెలాడినట్లు తేలతెల్లమవుతుంది. రాజకీయ ఆర్థిక సాంఘిక రంగాలలో యీ రెండు పరస్పరం మిత్రి పిరత్నించ్యాయంగా నడిచింది. ఒకటి ముందు, రెండోది తర్వాత అని చెప్పే అవకాశం లేనంతవరకు ద్వైవిధ్యంగానూ కనపడుతూనే వుంటుంది

ఉదాహరణకు రాజకీయ సిద్ధాంతాలు ముందర పుట్టే రాజకీయాలు తరవాత కలిగినాయేమో చెప్పమంటే యేం చెప్పగలం? రాజకీయ సిద్ధాంతాలు యెప్పుడు పుట్టినాయో అప్పుడే - లేదా అవి పుట్టకముందే - రాజకీయాలు మొదలైన నవని తప్పదు రాజకీయాలనేవి లేకపోతే అసలు రాజకీయ సిద్ధాంతం అనేది కావలసిన అవసరమే లేదుగా. రాజకీయ సిద్ధాంతాలు కూడా రాజకీయాల్లో భాగమని అందుకే అనటం. ఒక రాజకీయపు ఎత్తు వెయ్యటాన్ని కరించిన భావం అలా కోరిన ఫలితాన్ని పొందేమార్గం, దానికైన నీతిరీతులు, విటన్నిటినీ నడపాల్సిన యుక్తి యుక్తులు రాజకీయమైన వ్యూహాలు అన్నీకూడా రాజకీయాల్లో చిన్న చిన్న భాగాలైన అంగాలు - అంచేతనే అసలు వీటన్నిటిని గూర్చిన భావం మొదలయిన తక్షణమే తత్సంబంధమైన రాజకీయాలుకూడా సంభవించినాయి అనాలి.

క్రీస్తుకు పూర్వం 507 సంవత్సరాల క్రితం ఏథెన్సు అనే గ్రీసునగరంలో ఒక చక్కటి నగరసంస్థ నెలకొల్పబడ్డది. ఆ సంస్థ కొంతకాలానికి చాలాచిన్నది కాని యెంతో చక్కని పరిపాలనం చేసుకొంది. ఆ రోజుల్లో ఆ నగరవాసులు తమందరికి సంబంధించిన ముఖ్యమైన విషయాలు ఒకళ్ళనొకళ్లు కనుక్కోకుండా అర్థం చేసుకుంటూ నిర్ణయించేవాళ్ళట ఈ గుణం ఇప్పటికి ఎన్ని సంస్థల్లో ముఖ్యమైనా ఒకటి రెండు సంస్థల్లో సభ్యులుగా వుండే సభలకు హాజరయినవాళ్లకు తెలుస్తుంది. వాళ్లు అలాటి ముఖ్యమైన సంస్థను అంత బాగా యేలా నడుపుకో గలిగారంటే దానికి కారణం వాళ్ళ మనస్సుల్లోవున్న వాళ్ల రాజకీయ ఆశయాలు. ఆ నగరం గొప్పదిగా పరిగణింపబడటాని కలాంటి ప్రవర్తన కారణమన్నదే వాళ్ళ నరనరం ఏథెన్సును వాళ్ళు అంతగా ప్రేమించేవాళ్లు

పెరికిల్సు అనే ఆయన వ్రాసిన అప్పటి రచనల్లో ఏథెన్సు నగరాన్ని యెందుకు ప్రేమించాలి అనే విషయం చురుకుగా ప్రచారం చెయ్యబడ్డది. అతడు వ్రాసిన ఒక చిన్న ఖండంలో నగరవాసులకోసం ఇలా వివరించబడివుంది: "దినదినం మీ దృష్టిని ఏథెన్సు నగరపు గొప్పతనం చూడటంలో కేంద్రీకరించండి. మీ ప్రేమతో ఆర్ద్రమయ్యేదాకా చూడండి ఈ నగరపు విస్తృతమైన కీర్తి మీ హృదయంలో నప్పనీయండి ఈ రాజ్యం గొప్పవారైన నగరవాసులచేత—తమవిధులు తెలిసిగి వాటిని నెరవేర్చే ఉత్సుకత కలిగినవారిచేత నడపబడుతోందనీ, ఇతరులతో వైరం కలిగినప్పుడు కూడా తమపక్షం మర్యాదమయినట్లయితే యెంత తలవంపు లనుభవించవలసి వస్తుందో నిరంతరం మనస్సులో భయపడేటంతటి సహృదయులూ, విధివశంచేత ఒక విషయంలో కాలుజారితే దాని కారణంగా తమ దేశోన్నతికి పనికిరాకుండా పోయేటట్లు సత్ప్రవర్తన పాడుచేసుకోకుండా జీవితాన్ని త్యాగం చెయగలిగిన మంచి పౌరులూ ఈ రాజ్యంలో వున్నారన్న విషయం జ్ఞాపకముంచుకోండి. మీ సన్మార్గంచేతనే ఈ ఏథెన్సు రాజ్యం యింత గొప్పదై నిలుస్తోంది. మీ పౌరసత్వం, నిజానికి ఈ నగరపు కీర్తే." అన్నాడు. ఆ రోజుల్లో ఒక పౌరుడెవరైనా ఎల్లప్పుడూ స్వంతవిషయాల్లోనే మునిగిపోతుంటే అతడ్ని యితరులు విలువలు తెలియని ఒక అడివి మృగంలా లెక్కకట్టేవారు అది ఆనాటి చైతన్యంలోని నైతికత. సంఘ జీవితపు కీలకం తెలిసినప్పుడున్న సామ్యం అంతటిది. ఇది భావం. ఈ భావం వాళ్లల్లో వుండటం—ఈ ఏథెన్సు గొప్పది కావటం—గొప్పదవుతున్నకొద్దీ ఈ భావం ఉద్ధృతం కావటం ఇది ఒక గుడ్డుపు పందెం. ఇవి ఆదియుగంలోని మాటలు,

కాలం గడిచినకొద్దీ పాశ్చాత్యుల్లో గొప్ప గొప్ప వక్తలు అసలు రాజ్యసంస్థ ఎలా వుండాలో అది అమలులో పెట్టే నీతి ఎలా వుండాలో గ్రంథాలు వ్రాయటం మొదలెట్టారు సోక్రటీస్, ప్లేటో ఎరిస్టాటిల్ లాటివాళ్ళు, సిసిరో, సెనేక లాటివాళ్లు వాళ్ళ వాళ్ల భావాల్ని వెదజల్లారు. రాజకీయాల్లో మార్పులు రావటంకూడా మొదలెట్టినయి దేవుడు, ప్రకృతిశక్తి మొదలైన భావాలపై పునాదులు కట్టి మంచి, చెడు, సర్వోపయోగము వగైరా మనస్తత్వాల సహాయంతో నీతులు చెప్పటం ఆరంభించారు. ఇంతలో క్రైస్తవ మతం వచ్చింది. విశ్వ సూత్రాలప్రకారం రాజ్యపాలనలు కొంచెగా నడుమకోవటంకూడా జరిగింది. ముఖ్యంగా రోములో ప్రకృతి ననుసరించిన నీతిశాస్త్రం వుండాలనే పట్టుదల వుండేది. ఒక్క బానిసలుమాత్రం మనుషులుగా పరిగణింపబడేవాళ్లు కాదు. ఎందుకంటే, మరేం కాదు. ఆ వాళ్ళని కొన్నాళ్ల కేవీకీ పనికిరారన్నట్లు- ఇప్పటికీ కొన్ని దేశాల్లో ఓటింగుహక్కు ఇవ్వనట్లున్నాకి అంతే. ఇంతకూ బానిసల విషయాల్లో తప్ప మిగతావిషయాలలో Jus gentium, Jus naturale(రోమునగరంశాసనాలు) ఒకేరకంగా వుండేవి. ఇదంతా రాజనీతిజ్ఞుల వాక్కుల ఫలితం; వాళ్ళ భావాల ఫలితం

ఐతే కాలక్రమాన ఈ బైబిలు పేరుతో మతప్రవక్తలు ఘనులై స్వలాభాలు చూసుకోటానికి ఉపక్రమించారు తమకు వ్యతిరేకమయితే వాళ్ళకే తమని పొగిడేవాళ్లకి పాపపరిహారపత్రాలు అమ్మి వాళ్ళ పాపాల్ని నిర్మూలం చేస్తున్నట్టూ మిగతా వాళ్ళ మీద శాపాల వర్షం వెదజల్లుతున్నట్టూ వుండేవారు. చివరకు రోమునగరంలోవున్న అత్యున్నత మతాధిపతి. ఇటలీలోని ఇతర రాజ్యాలనీ యూరపులోని క్రైస్తవమత రాజ్యాలన్నిటినీ తనకు తాబేదార్లనే స్థితికి

వచ్చాయి. ఈ స్థితి రాజకీయవేత్తల్లో కొత్తభావాన్ని రేకెత్తించింది.

లేకను మొదలైన ఆలోచనాపరులు తీవ్రంగా తమ మెదళ్లలోనుంచి నిష్పాక్షికమైన ఆలోచనలు వర్షింపటం మొదలెట్టారు. మతం వేరు, మనుగోరాలు వేరు అన్నారు. రాజకీయాలు వేరు మతసూత్రాలు వేరు అన్నారు. ఈ మతప్రవక్తలుచేసే పనులకు సహించలేక ఇంచుమించు అన్ని రాజ్యాల్లోని ప్రజలూ యీ మేధావుల బోధల్ని వింటూ పైకి అనలేక లోపల దాచుకోలేక పిసుక్కు చచ్చేవారు. భావం యెలా ప్రజాబాహుళ్యంలో మెలకువెత్తి సంఘటనలకు దారితీస్తుందో పరీక్షగా చూస్తేగాని దానికీ లోకం తెలీదు. ఐతే యీ మాత్రపు భావాలకే చింతకాయలు రాలాయని దానివల్ల మాత్రమే యూరపులో పునరుజ్జీవనం వచ్చిందని అనటంలేదు. చిత్రకారుల దగ్గర్నుంచి మతసంబంధమైన చిత్రాల్ని వదిలేసి, ప్రపంచంలో జరిగే సామాన్యమైన ఘట్టాలు రచించటం మొదలెట్టారు. ఆ నాటి ప్రపంచంలో విజ్ఞాన మెలా వృద్ధి అవుతోందో తెలియజేశారు. కోపర్నికస్ భూమికూడా ఒక గ్రహమని కనిపెట్టాడు. కెప్లార్ గ్రహగమనాలకి లెక్కలు కట్టాడు. గెలీలియో అద్దాలయంత్రంతో ఆకాశంలో స్వర్గం చూపించాడు. అచ్చుయంత్రం కాశీ అన్నపూర్ణలా, ఆర్తులైన ఆలోచనాపరులకు అప్తమై నిలచింది. కోకొల్లలుగా పుస్తకాలు ముద్రింపబడాయి మహానుభావులకు మాత్రమే అందే విజ్ఞానం సామాన్యమానవునికి సునాయాసంగా దక్కింది. దిక్సూచియంత్రం కనిపెట్టబడింది. తీరాన్ని పట్టుకొని వాడే పడవలు, ఓడలు నడిసముద్రంలోకి వెళ్ళగలిగినయి. కొలంబసు వెళ్ళివెళ్ళి ప్రపంచపు కొత్తి భూభాగాన్ని కనిపెట్టాడు. పోర్చుగీసులు ఇండియాకువచ్చి వ్యాపారం చేసి అంతూ పొంతూలేని ధనం, ముడివస్తువులు సంపాయించారు. ఇక యీ మతప్రవక్తలుచేసే దుండగాలు వర్ణించి నిరసించటానికి కావలసినంత అవకాశం జనానికి దొరికింది. అంతే దాంతో మతంతో సిక్తమైనట్టి మటపెళ్ళ ఒక్కసారి లేచి బోర్లపడ్డట్టు క్రైస్తవమతం తలక్రిందులయింది. ఊడెక్, ఉబ్బి, పార్ల, పెటించిన భావాలు వివిధంగా "ప్రాటెసంట్" శాక్తోలిమతాన్ని తెప్పించిపెట్టాయో చూడండి.

మార్టిన్ లూథన్ ఈ కొత్తమతాన్ని పెట్టి జెసూట్లను తయారుచేసి అన్ని దేశాలకు వెళ్ళి ప్రచారానికి పంపాడు. ఈ సర్వతోముఖమైన చైతన్యంతో యూరోపులో మధ్యయుగం దాటిపోయి నవయుగం వచ్చింది. ఈ చైతన్యం ఆవిర్భవించటమనే సంఘటనకు కారణం మతిసుల దౌష్ట్యభూయిష్టమైన సంఘటన అనవచ్చు. లేకనూ మేధ అనవచ్చు. గలిలియో తెలివి, కాక్స్టన్ పరిశ్రమ, ఇరాస్మస్ తీవ్రభావాలు అన్నీ కారణమే అనవచ్చు. భావాలూ సంఘటనలూ అన్నీ కలగలసి ఈమార్పు తెచ్చినయి.

ఫ్రెంచివిప్లవం అనే సంఘటనకూడా చర్చనీయమైన సంఘటన. అప్పుడు ఫ్రాన్సురాజ్యంలో ఒమదుమకులు వచ్చి లక్షలాది తలకాయలు దొర్లినయి ఈ సంఘటనకుముందు ఎంత గూఢమైన ప్రచారాలు జరిగాయో, మనసులోపల ఎన్ని స్వయంపాకాలు ఉడికాయో, ఎలాంటి భావతరంగాలు పగిలి పారాయో ఒక్కసారి చరిత్రతరగేసి చూస్తే తెలుస్తుంది. విప్లవానికిపూర్వం అధికారంలో వున్న కొద్దిమందికే అనేకవసతులు వుండేవి. మిగతావాళ్ళు పన్నులుకడుతూ శ్రమచేస్తూ బాధలుపడుతూ తక్కువవాళ్ళుగా చూడబడుతూ కొరమాపుల్లో పస్తు కొరికేవాళ్ళు. లేమనింగ్ గోజుల్లోలాగా గొప్పవారి విందుల్లో పారేసిన పదార్థాలు కుక్కలుమాత్రమే తింటుంటే ఎండిన పెవులు చప్పరిస్తూ, బొడుగాటి బల్లేలు భూస్వాముల గుండెల్లోంచి దూసుకుపోతున్న టూహించి గుటకలు మింగేవాళ్ళు. ఇవి ఘటనలరూపాల్లో వ్రాసుకున్నా ఇవన్నీ వాళ్ల బుర్రల్లోని భావపరంపరలని మరవవద్దు. ఈ భావాలకు రూపం కల్పించింది రూసో, వాల్టేరు రచనలు మనుష్యులందరికి సమానహక్కులుండాలని సమానత్వాన్ని రాజ్యపాలకులు పాటించాలని వాళ్ళు చెప్పిన సిద్ధాంతాలు యీ బాధితుల బుర్రల్లో పీఠం వేసుకున్నాయి. అవే ఫ్రెంచి విప్లవానికి కారణమయినయి జరిగిన సంఘటన తలకాయలు దొర్లటం. ప్రజానీకంలో ప్రచండమైన 'భయం' ఒక్కటే దానిబరువైన ఫలితం, ఈ ఫ్రెంచి విప్లవానికి కారణం రూసో వాల్టేరుల తత్వమా? లేకపోతే అప్పటి ఘనులు సామాన్యులు అనే వ్యత్యాసమా?......

1760–1850 మధ్య యూరపులో పారిశ్రామిక విప్లవం వచ్చింది. ఇది ఒకే సంఘటన కాదు. అనేక సంఘటనలు. బ్రిటిషువారికి భారతదేశం మొదలైన వలసరాజ్యాలలో వస్తువిక్రయంగా ముడిపదార్థాలు దొరకటం జరిగింది. ఇదొక సంఘటన. అవి యెలా వుపయోగించాలా అనుకున్నారు. అది భావం. ఇంగ్లండుకు తీసుకుపోయారు. ఇదింకో సంఘటన. వాటిని వుపయోగించేందుకు కుటీర పరిశ్రమలు చాలక పెద్దపెద్ద యంత్రాలు కనిపెట్టారు అవి తయారుచేసే సరుకు వస్తువు తిరిగి కాలనీలకుపంపి చాలా ప్రియమైన ధరలకు అమ్మేవాళ్ళు. ఇది లాభసాటిగా అవుపడ్డది దీన్ని పురస్కరించుకొని ఒక కొత్త తత్వమం రేగింది - కొత్తభావం - ఇది రాబోయే రాజకీయ ఆర్థిక రంగాలలో పునాదిగా యేర్పడింది, దీని అంతర్యమేమిటంటే ఎవడి మట్టుకువాడు స్వలాభాన్ని చూసుకొని వ్యాపార వ్యవహారాలు చేసుకోవచ్చు వచ్చేలాభాలన్నీ ఎంతవరకు పుచ్చుకోగలిగితే అంతవరకు పుచ్చుకోవచ్చు (Laissez faire policy)-ధనం పెట్టుబడి పెట్టటం - ఇంకొకరిచేత పనిచేయించుకోవటం – వచ్చిన లాభాలు అనుభవించటం. ఇలా యెందుకు ఒప్పుకున్నారంటే యంత్రాలు నిర్మించటానికి తగిన పెట్టుబడి పెట్టవలసివచ్చింది ఆ యంత్రాగారల్లో కూలీలు లేక కార్మికులచేత పని చేయించుకోటానికి పెట్టుబడి కావలసివచ్చింది. ఇంగ్లండులో వుండే రాజ్యవ్యవస్థ యీ మిలుల్ని నడిపే బాధ్యత నెత్తినేసుకోలేదు. మిల్లులు నడవక తప్పదాయెను. ఈ పెట్టుబడి అనే దాని విలువ విపరీతంగా విజృంభించింది. యంత్రాలు నడపటానికి పెట్టుబడిదారీ విధానం తప్పితే మరేదీ లేదనే పరిస్థితికి ప్రభుత్వం వచ్చింది. అంతే. దాంతో యంత్రాగారాలు పోటీలుపడి లేచినయి. పత్తిరాటాలుపోయి బ్రహ్మాండమైన పనిముట్లొచ్చినయి. వందదారాలొక్కసారి వడికి తయారు చేసే యంత్రం వచ్చింది. ఇనుము బొగ్గు కనిపెట్టబడి బరువు యంత్రాలు తయారు కాబడ్డాయి అదేమిదేమని విద్యుచ్ఛక్తి నుపయోగించి యంత్రాలు నడపటం కూడా వచ్చింది. ఈ యంత్రాలు తక్కువ వస్తువులన్నిటిని తక్కువ చోటకు తీసుకుపోయేందుకు కావలసిన రవాణా సౌకర్యాలు కనిపెట్టబడ్డాయి.

ఈ పారిశ్రామిక విప్లవం వస్తున్న కాలంలోనే వ్యక్తిగతమైన స్వలాభాలు చూసుకోటానికి ప్రతి ఒక్కరికీ హక్కున్నట్టు జనబాహుళ్యంలో యెన్నబడుతూ ఈ భావమే పెట్టుబడిదారీ విధానానికి దోహదమై వుందని పైన చూశాం. ఇంకా యీ విప్లవపు ఫలితం చిలవలు పలవలు వేసింది. ఆ మాటకొస్తే యీ విప్లవ ఫలితాన్ని తెలుసుకోవటమే ఒక విద్యావ్యాసంగ మనవచ్చు. వ్యవసాయదార్లు భూములు, గ్రామాలు వదలి పట్నాలకు వెళ్ళి యంత్రాగారాల్లో పనిచేసి డబ్బు సంపాయించటం మొదలెట్టారు. గ్రామాలు వదిలించినా పట్నాల్లో పదిమంది ఒకచోట కలిసి, తమ సాధకబాధ

కాలు చర్చించుకోవటం ఆరంభించారు. ఐతే వాళ్ళ పరిస్థితి ఏమి? రాను రాను మారిమారి యంత్రాగారాలకు అధికారులైన వాళ్ళ కరకు చేతుల్లో నలులకంటే హీనంగా నలిగి చావటం దాకా వచ్చింది. తన స్వలాభం కోసం చూసుకొనే యజమాని నిరంతరం పని చేసే పనివాడి బాగోగులేన్నాం చూడగలడు? రోజుకు 18 గంటలుకూడా పని చేసేవాళ్ళు. తమ నిద్దట్లోకూడా చేతులాడిస్తూ తాము చేసేపనిని సూచిస్తుండేవాళ్ళు. అమాయకమైన నిద్దరలో వాళ్ళు చేసే యీ పనిని కనీసం చిరునవ్వుతో చూడగలిగే యోగ్యత ఆ యజమానులకు లేకపోయింది. చూస్తే ఆలోచించేవాళ్ళు కాదు. వాళ్ళు ఒకవేళ ఆలోచించినా అది మనుష్యుంటుందంటే నిద్దట్లోని కదలికలుకూడా యంత్రాగారాల్లో యెలా వుపయోగింపబడవచ్చా అనే. సరి వ్యక్తి స్వలాభం కదా! ఒంట్లో బాగుండక పని వెళ్ళకపోతే నిన్ను తీసి పారెయ్యటానికి చర్య తీసుకుంటున్నామని యింటికి ఒక ఆజ్ఞాపత్రం వచ్చేది. ఇవన్నీ కార్మికులకు చాలా విసుగును కలిగించాయి. తమకు తాము ప్రత్యేకంగా ఆలోచించుకోవటం మొదలెట్టారు. పని చేసేవాళ్ళు—చేయించుకొనేవాళ్ళు—రెండు తెగలయినాయి.

మార్క్సు, ఎంగెల్సు అనే మేధావులు సామ్యవాద సిద్ధాంతాన్ని లేవదీసి, కలిగినవాళ్ళు, కలగనివాళ్ళని ప్రజానీకాన్ని రెండు తెగలు చేసి, ప్రచారం చేశారు. ఇదొక ఉద్ధృతమైన కొత్తభావం. ఆ కలిగినవాళ్ళు అలా ప్రవర్తించకపోతే యీ సిద్ధాంతము నేడు యిలా వచ్చేది కాదేమో! ఘటనే భావానికి మూలమనిపిస్తుంది!!

కొన్ని సంఘటనలు భావాల్ని కలిగించకపోవచ్చు. కొన్ని భావాలు అలాగే పుట్టినవి పుట్టినట్టు చచ్చిపోవచ్చు. కాని యీ మార్క్సిస్టుభావం మాత్రం బలిసి 1917 నాటికి రష్యాలో విప్లవంగా [illegible] జార్ ప్రభువు చేయబోయే యుద్ధాన్ని ఆపించి అతడ్ని పారద్రోలి క్రొత్తప్రభుత్వం ఏర్పడేందాకా జరిపింది. అంతటితో పోలేదు. లెనిన్ అనే ఆయన అప్పటికే కమ్యూనిస్టు సిద్ధాంతాలు చెప్పి ఆ క్రొత్త ప్రభుత్వాన్ని నలిపేసి మరొక నూతన ప్రభుత్వాన్ని నిలిపాడు. కాదన్న వాళ్ళని తీవ్రంగా శిక్షించాడు. భయానకాని, భక్తిచేగాని బ్రతికున్న వాళ్ళు తా కమ్యూనిజంను ఒప్పుకున్నవాళ్ళే. మార్క్సు ప్రకారం బ్యాంకులన్నీ ప్రభుత్వం పుచ్చుకున్నది. పనివాళ్ళకు ధనంలో కాక పదార్థాల్లో జీతాలు ముట్టచెప్పటం సాగించారు. ఆఖరికి మొత్తం పొలమంతా ప్రభుత్వానికిచ్చివేయాలన్నారు.

దీంతో యెక్కడలేని గుమారం అంతర్గతంగా రష్యాలో రేగింది. బ్రహ్మాండమైన ప్రతికూల భావం మరొకటి పెనుభూతమై కనపడటం మొదలెట్టింది. భావుకుడైన లెనిన్ తమాయించాడు. ఈ ప్రతికూలభావానికి అనుభూతి భావం ఒకటి చూసుకొని మళ్ళీ చిన్నచిన్న యంత్రాగారాలు యెవరివి వాళ్ళని అట్టేపెట్టుకోమన్నాడు. ఎవడి పొలంలో పండించుకొన్న పంట వాడిష్టమొచ్చినట్టు అమ్ముకోమన్నాడు. మళ్ళీ ధనం వినిమయంలోకి తేబడింది. మట్టి అయిపోయిన వసకున్న పాతకరెన్సీనోట్లకు విలువలుగట్టి క్రొత్త ప్రభుత్వంచేత నగదిప్పించాడు. [illegible] కాపులచేత తీవ్రంగా సంక్షేమ కార్యక్రమం మొదలెట్టాడు. కాపులతో వున్నవాళ్ళకు కడసంగ్డు తీరేవరకూ సెలవులూ, భత్యాలూ యివ్వటం దగ్గర్నుంచీ మిలిటరీవాళ్ళ తర్ఫీదువరకూ అత్యంత జాగ్రత తీసుకొని కమ్యూనిష్టు ప్రభుత్వమంటే 1928 నాటికి ప్రజల్లో నమ్మకం కలిగించాడు. అప్పటికే, అతడు చెప్పేదేదో వింటామని, వెనక అతడ్ని వినిపించుకోవటం లేనివాళ్ళను ఉన్నారు— ఇలా భావం ఘటన, ఘటన భావం అనగి పెనగి క్రిందపడి మీదపడి "ఇవి రెండా ఒకటా" "ఏది ముందు ఏది వెనక" అని మాకేవాళ్ళకు భ్రమను కలిపించి పుట్టుకున్నాయి!!

మనువేదో అనువుగా చెప్పిన మాటలు నమ్మటానికి తగినంత ఆధారం దొరకకుంటేమానె. జరిగిపోయిన యెన్నో ఉదాహరణలు తీసుకున్నా అసలు విషయం అగ్రగణ్యంగా వున్నదానికి నిష్కృతి ఒక్కటేవాటి అవుపడాలి బహుశ అనిమిటంటే—జరగబోయే దాన్ని గురించి చూడటం!!

మనదేశం పారిశ్రామికదేశం కాలేదింకా; పైరు పంటల దేశమే. జనాభాలో చాలామంది మధ్యతరగతి వాళ్ళు. ప్రభుత్వం సోషలిస్టు సిద్ధాంతాల తెలివిడి. కార్మికులకు కావలసినంతగా శాసనాలు చేసి అమలు జరుపుతున్నది. కనీసపు జీతాలు యేర్పాటు చేశారు. పనిచేసే గంటలు నిర్ణయం చేశారు. కార్మికులు నిర్ణీతమైన శెలవు దబాయించి పుచ్చుకోగలిగేట్టు చేశారు.

ఇక ప్రభుత్వం మాద్దామంటే సంక్షేమ కార్యక్రమాన్ని తలమునకగా ధరించటానికి మొదలెట్టింది. పంచవర్ష ప్రణాళికలు రచించి నెఱవేర్చటానికి ప్రభుత్వం తయారయింది. ప్రణాళికననుసరించి పెద్ద పెద్ద పరిశ్రమలు, శిందిన్ఫ్యాక్టరీలు, ఫెర్టిలైజరు ఫ్యాక్టరీలు లాటివి ప్రభుత్వమే యేర్పాటుచేస్తున్నది. ధనవంతులు కూడా తమ స్వలాభం కొరకు పెట్టుబడిపెట్టి భారీ పరిశ్రమలుకూడా ఎక్కువ చెయ్యవచ్చుకాని, కార్మికుల మంచి చెడుల కొరకై చేసిన శాసనాలు సగర్వాలన్ని పాటించవలసి వుంది. ప్రభుత్వమే పిల్లలకు బళ్ళు, ఇల్లాళ్ళకు యిళ్ళు, రోసుపోశకు ఉద్యానవనాలు, వెళ్ళడానికి విధులు, వైద్యానికి వైద్యశాలలూ అన్నీ కట్టించటానికి పూనుకొంది. ఒకపక్క వ్యక్తుల ధనార్జన కృషికి నిలుంచి, మరొకపక్క ప్రభుత్వం సర్వసౌఖ్యప్రదాతగా నిలుస్తోంది. ఒకపక్క పెట్టుబడిదారి విధానం మార్థిపించివున్నా, మరో పక్క సామ్యవాదానుకూలమైన వనండి—లేదా—సంక్షేమకరమైన రాజ్యాంగమనండి—అది మా త్రిభవించి వుంది. ఇది ఒక కలగలపు వ్యవస్థ అవుతోంది.

ఐతే యీ వ్యవస్థ యిలాగంటే చాలా? ఇంకేమీ అక్కర్లేదనగలమా? ఈ మధ్యతరగతివాళ్ళ గతేమిటి? వాళ్ళకి కావల్సినంత తిండి కావాలి, బట్ట కావాలి తెలివితేటలు చూపే అవకాశం కావాలి. పిల్లలకు చదువు కావాలి. శరీరాల్లో ఓపిక కావాలి అన్నిటికంటే అతి ముఖ్యమైంది పోయగున పరువు నిలపాలి. వీటికోసం ఒక బ్రహ్మాండమైన సంఘటన జరిగేదాకా నోళ్ళు తెరుచుకు కూర్చుంటామా? ఏ సంఘటనకోసం? దేనికోసం వేచివుండటం? అలా అని యేం చెయ్యాలి? ఏంచెయ్యాలని యోచించటమే భావప్రకరణం. ఆలోచిస్తే ఇప్పుడు ప్రభుత్వం తయారుచేసిన ప్రణాళిక అంతా భావమే.

ప్రణాళిక తయారుచెయ్యటానికి చర్చలు జరగాలి. భావం వికసించాలి. సుహృద్భావం ప్రజల్లో కలగాల. అప్పుడు కర్తవ్యానికి దిగాలి. భావం అనే పునాదు మీద కట్టిన సంఘటనకు విలువ యెక్కువ. నెత్తీనెమో అంటేతొక్కమీద అడుగు వేస్తే కలిగే సంఘటనకి దుష్ఫలితమే వుంటుంది. ఆలోచించి అడుగు వేస్తే అంతులేని ఆనందం పొందవచ్చునంటారు. అందుచేత ఒక దివ్యమైన ఘటన కావాలంటే భావం అవసరం.

ఎంత సంక్షేమకరమైన రాజ్యమే అవుగాక—జరిగే సంఘటనలు కొత్త సాంబాంధకాలను కలిగించటం—కొత్తసమస్యలు వస్తూ వుండటం మామూలు. సంఘటనలు మానేస్తే భావాలు రాకుండా మానతాయా? భావాలు నశించేదెట్లా? సంఘటనలు జరగకుండా యెట్లా? మహావేగంతో సాగిపోయే యీ విశ్వంకూడా క్షణక్షణానికి అవకాశంతో పోటు సాగుతూ భావాల్ని, సంఘటనల్ని కలిగిస్తూనే వుంటుంది అది తప్పదు.

# గంగ: కాశ్యపి

శ్రీ శ్రీరంగం నారాయణబాబు

[ఒక గది ఆ గదిలో కాశ్యపి, గంగ. తెంబూరు గంగ అక్కడవుండే వస్తువులన్నీ సర్దుతూ వుంటుంది. కాశ్యపి కిటికీలోంచి ఆకాశంవైపు చూస్తూవుంటుంది.]

## మొదటి రంగం

గంగ: ఎంత గొప్ప బహుమానాలొచ్చాయ్ కళ్ళు మెరిసిపోతున్నాయ్ రకరకాల చీరలు, నగలూ, నాణ్యాలూ చూస్తే కళ్ళు తిరిగిపోతున్నాయ్ స్త్రీకి యీ లోకంలో కావలసినవి ఎన్ని ఉన్నాయో అన్నీ యిక్కడ ఉన్నాయి కాశ్యపి అందంగాని ఎవరూ ముగుడు కాకుండా వుంటారా! నాకు మళ్ళా వయసొస్తే బాగుండును—వీటన్నిటిని అలంకరించుకుని ఆనందిద్దును. మా కాశ్యపి తరహాలే వేరు. ఏది అక్కర్లేదు కదా. స్త్రీ ప్రకృతే ఒక్క పిసరుకూడా కనిపించదు. ఏదైనం పుట్టించాడో కానీ! కాశ్యపి!...

కాశ్య: ఎందుకక్కర్లేదు అస్తమానం అలా పిలుస్తూంటావు? కాస్త ప్రశాంతంగా నిలబడి ఆలోచించుకుంటూంటే.

గంగ: అస్తమానం ఆ కిటికీదగ్గర నిలబడి ఆకాశంకేసి చూస్తూ ఏమిటి ఆలోచిస్తుంటావ్? వయస్సులో చిన్నదానివి, ఆడుదానివి. ఓహోహో, ఎంతమంది ఎన్ని బహుమానాలు పంపారు నిన్ను వరించేందుకి, యిల్లు నిండిపోయింది కానుకలతో. రా, వచ్చి చూసుకో, నీకు నచ్చినవేవో—

కాశ్య: నాకు వస్తువులూ వద్దు, వాహనాలూ వద్దు చీరెలూ వద్దు. సింగారాలూ వద్దు నా మనస్సులో ఉండేది వేరు.

గంగ: నాకు తెలుసును లేగాని, నీ మనసులో వుండేది—అది ఎన్నటికీ జరగదు. ఈ పిచ్చి పిచ్చి వూహాలన్నీ మానేసి ఏవి చూసుకో నీకు నచ్చినవేవో!

కాశ్య: వచ్చిన బహుమానాలన్నీ నువ్వే తీసుకో. నాకు ఒక్కటి కూడా అక్కర్లేదు. బహుమానాలకి మోసపోయి, స్వయంవరం నా మనసుకి వ్యతిరేకంగా జరిగేందుకి, నేనెంత మాత్రం అంగీకరించను.

గంగ: బాగుంది కాశ్యపి వరస. చాలా బాగుంది రేపు స్వయంవరంలోకూడా నవ్వేందుకో నేర్చుకున్నావు ఈ మధ్య నీ మనసు పాడు చేసుకుంటున్నావు—నాకు తెలుసు. నీకు రాకూడని తలంపులూ. వూహించడానికి వీలులేని కోరికలూ పుట్టుకొస్తున్నాయి. అది నీకు తగదు. పోనీ, వచ్చి చూడకూడదూ నచ్చుతాయి ఇందులో. ఆ బహుమానాలు పంపినవాడ్ని వరించనక్కర్లేదులే! నీకిష్టమైతేనే వరిద్దు గాని!

కాశ్య: వచ్చి చూసేందుకు నాకేం అభ్యంతరము లేదు కాని పంపిన వజ్రాలనుబట్టి పంపినవాని అంతస్థు తెలుసుకోవడం దుర్లభం. విలువైన వస్తువులు అందమైన చీరలూ పంపినవాడు, హృదయంలో, పేదవాడు కావచ్చు.!

గంగ: అలా అనుకోవడం పొరపాటు నీమీద అభిమానం ప్రేమ వున్నవాడే తన అభిమానానికి, ప్రేమకు చిహ్నంగా పోలింపలేని బహుమానాలు పంపుతాడు. బహుమానాన్ని బట్టి అతనికి నీమీద ఎంత ప్రేముందో చిటికలో తెలుసుకోవచ్చు.

కాశ్య. అక్కా. నువ్వు వట్టి పూర్వకాలపు మనిషివి. ఇంకా నువ్వు మీనాడున్నట్టే లోకం వుందనుకుంటున్నావు లోకమంతా తలక్రిందులైందన్న సంగతి నీకు తెలీదు. బాహ్యాన్నిబట్టి హృదయానికి విలువకట్టి మోసపోవడమన్నది ఏనాడో రుజువైపోయింది. సంప్రదాయాన్నిబట్టి మనిషి విలువ, అంతరంగం తెలుసుకుంటాం. అంతేగాని, పై మెరుగుల్నిబట్టి, బహుమానాల్నిబట్టి కాదు.

గంగ సరే. ఈ మాటలకేంగాని, నా తల్లి, ఒక్కసారి వచ్చి చూడ్దూ వృథాగా కాలం గడపకు. ఒక్కొక్కటే చూపిస్తూ ఎవరు పంపిందీ నీకు చెపుతా.

కాశ్య: ఒక్క షరతు మీదయితే చూస్తా— మూల్యాన్ని బట్టి కాకుండా, సొగసును బట్టి కాకుండా, వచ్చినవన్నీ నాకు చూపిస్తానంటే - అన్న మాట తప్పకూడదు సుమా—నీవు బావగారి సత్తికెక్కువకనా అని నుగడికి. అన్యాయం చేయకూడదు సుమా! పాపం వస్తుంది సుమా!

గంగ: అపురూపమైనవి. అనన్యసామాన్యమైనవి, క్రతువులు చూసినా శ్లాఘించేవి మునుపెన్నడూ, కని విని యెరుగని కమనీయ వస్తుజాలం, చూడాలని వుంటుంది కాని, ఎందుకూ వటగోతి, ఖద్దరుచీరెలు, గన్నేరు పువ్వులూ - చూసేం చూడకేం?

కాశ్య బళ్ళకెత్తేందుకు తగినన్ని కానుకలొస్తే వీటినన్నింటిని చూపించక యేమ్మా పూర్తి కావాలిగదా, దీనికేమైనా సాధనం కనిపెట్టావా?

గంగ: మేటులుగా వచ్చిపడ్డ యీ బహుమానాలన్నీ పొద్దస్తమానం నీకు చూపిస్తూ కూర్చుంటాననుకున్నావా? దీంట్లో మహోత్కృష్టమైనవి ఒక్కొక్కటే ఎవరెవరు పంపారో అవి చెప్పేస్తా. అందులో నలుగురు తేలారు ఆ నలుగురే స్వయంవరానికి అర్హులు కూడా. ఆ నలుగురికే స్వయంవర వేదిక మీద ఆసనాలు వేయిస్తున్నా. వారే స్వయంవరానికి రావాలి. మరెవరినీ లోపలకు రానివ్వం. అందుకే స్వయంవర మంటపం తలుపులన్నీ మూయిస్తున్నా. మూకలు మూకలు వచ్చి

అక్కర్లేదు. కాలం పరిపక్వమైంది. ఒక రకమైన ప్రతీకారమే—

గంగ: చాలమ్మా. నీతో వాదించి ప్రయోజనం లేదు. స్వయంవరానికి వేళ అవుతూంది. వచ్చినవాళ్ళు నలుగురే అయినా నీవు వరించినా వరించకపోయినా జరగవలసిన కార్యక్రమం జరిగి తీరాలికదా. వెళ్ళి అలంకరించుకో......అఁ......నాకు తెలుసు—నువ్వెందుకలంకరించుకుంటావ్—పోనీ, ఆలోచించుకో—వ్యవధి చాలదు.

తెర

# రెండవ రంగం

(స్వయంవర మంటపంమీద, రాజు, సైన్యాధిపతి, వ్యాపారస్థుడు, అర్చకుడు సుఖాసీనులై ఉంటున్నారు)

గంగ: ఈ వచ్చిన మహానీయులని, మేము వేదిక మీదకి రావడం కొంచెం ఆలస్యమైనందులకు క్షమాపణ వేడుకుంటున్నాను. స్వయంవర పత్రికలో మేము ముందే ప్రకటించాము. బహూకృతులు పంపినవారందరిలో గొప్పదైనవి పంపినవారిని మేమెంచి, వారికే ఆహ్వానాలు పంపుతామని, వారే స్వయంవరానికి వచ్చేందుకు, అర్హులని. అందుకే మీ నలుగురికే ఆహ్వానాలు పంపడం జరిగింది. మీరు దయచేయడమైంది. కాశ్యపి. వీరు ఉత్తమ క్షత్రియ సంజాతులు, రాజాధిరాజులు. అఖండ తేజోశాలులు.

రాజు: ఈ అఖండ దిగ్విజయాన్నంతా జయించి పరిపాలన ధురంధరుడనన్న పేరన్నికగన్న నా రాజ్యాన్నీ, నన్నూ చూసి ఎవరు మోహించరు! నా రాజ్యంలో మా కీర్తిని చూసి వెన్నెల సిగ్గుపడుతుంది. సూర్యుని తేజస్సు నా కరవాల తేజస్సుకు బరాబరులిస్తుంది. పక్షులు వాటి కలరుతాల్లో నువ పేరే ఉచ్చరిస్తూంటాయి. గాలి నా సౌందర్య గాథలన్నీ మంత్రం చదుతూ వుంటుంది. నన్ను వరించినవారిలో ఎవరైనా, పట్టపురాణి అవుతారు! నీవు నన్ను వరిస్తే నిన్ను పట్టపుదేవిని చేయుటమేకాక, ఇంతవరకూ ఏ రాజూ సాహసించి చేయలేనిపని, గౌరవం నీకు చేయదలచుకున్నాను. నిన్ను నా రాజ్యానికి మంత్రిగా కూడా చేస్తాను. అప్పుడు రాత్రింబగళ్ళు మనిద్దరికీ వియోగముండదు.

గంగ: కాశ్యపి, స్త్రీ కింతకంటె గౌరవమేముంటుంది? ఆడది ఆడదేకాక, మగవానికి చెలికాడు వానోడేకాక, పురుషునికి పైచేయి సుమా, అని మంత్రిగా నిన్ను నియమింప తలంచిన యీ మహారాజు స్త్రీజాతిని ఎంత ఉదాత్తంగా చూస్తున్నాడో కనుపించలేదా నీకు? వీరిని వరిస్తే స్త్రీ జాతికి మహోపకారం చేసినదానవవుతావు. మాట్లాడవేం... సరే, నీ మౌనానికి అర్థం నాకు తెలుసునులే. ఎవరి భుజస్కంధాలమీద రాజులూ రాజ్యాలూకూడా ఆధారపడి ఉంటాయో ఎనలేని క్షాత్రతేజం ప్రతాపాగ్నియై శత్రు సమూహాన్ని భస్మీపటలం చేయగలదో అట్టివీరి అతుల తేజోనిధి సైన్యాధిపతి.

సైన్యాధిపతి: పిరికిపందలైన వారిలో ధైర్యం రేకెత్తించి ఆహవరంగంలో ప్రాణాలను ఆహుతి చేయగలిగే ధీరులుగా చేయ్యడం నాకు తెలుసును కాని. రమణీయమైన రాముల హృదయంలో ప్రేమ రగుల్కొలుపడం బాగా తెలిసినవాణ్ణి గాను. శత్రుసేనలమధ్య ఆహవరంగంలో వ్యూహాలు నిర్మించి, విజయాన్ని సాధించగలను కాని, మనోహరమైన రమణీయ రమణుల హృదయస్పందనం గ్రహించి, స్వయంవరాలతో జయం సంపాదించడం తెలీదు. ఈ రాజులూ, మహారాజులూ మామీద ఆధారపడి వుంటారు. రాజులూ, రాజ్యాలూ పోయి ఏనాడో అయింది. పరిపాలన సైనికాధిపతుల హస్తగతమైంది. వారి అధికారాన్ని తోసిరాజని, సైనిక పరిపాలన తీసుకొచ్చాం. మా పరిపాలన కడు భయంకరం. తిరుగులేనిదే. నామాటే శాసనము. ప్రజలు పిపీలికలు. ఎదురుచెప్పి ఎవ్వరూ బ్రతికి ఉండలేరు. నన్ను వరిస్తే నిన్నే రాణిని సైన్యాధికారిణిని చేసి నేను నీకింద సైనికుడనై తిరుగుతాను. నీ పూలమాలకోసం నా కంఠం దశకంఠమై ఎదురు చూస్తున్నది.

గంగ: ఈ లోకంలో తేజస్సూ, క్షాత్రతేజం కలుసుకోడం కడు అపురూపం. మీ రిద్దరు ఒకరినొకరు వరించుకుంటే వజ్రాలు తాపిన డాలు, పదును తేరిన కత్తి పాణిగ్రహణం చేసినట్లు వుంటుంది. శత్రురక్తాన్ని చవిచూచిన వీరఖడ్గానికి, తేనె పూత పూసినట్టుంటుంది. కఠినమైన కరవాలానికి పరిమళాలు విరజిమ్మే పుష్పాలమర్చి, పుష్పాలతో చేసిన ఒరలా వుంటుంది. కఠినాతి కఠినం, మృదులాతి మృదులం, కలుసుకుంటే, సౌమ్యత జనిస్తుంది. మారుమాటాడక వీరిని వరించి సుఖపడు. ఏం ముఖం దాచుకున్నావు? సరేలే. వెన్నెల గాని చేయిందగలవా నీచేత నా పనికి నేనెంత మోజు పడితే ప్రయోజనం వుంది? ఈ భూవలయంలో యీయన వ్యాపారసంస్థ లేని దేశంగాని, పట్టణాలుగాని లేవు. ప్రపంచానికంతటికీ ధనవంతుడని పేరెన్నికగన్నవాడు. రాజులకన్నా సైన్యాధికారులకన్నా యీయనకున్న సిరి ప్రబల బలవంతురాలు. ఈనాడు ప్రపంచంలో అది చేయలేని పని లేదు. సమస్త మానవులూ దీనిని సేకరించుకోవడం, వశపర్చుకోవడమే జీవిత పరమావధిగా తలుస్తున్నారు. యీ సుదేవుని వరించి ఎనలేని సౌఖ్యాన్ని గౌరవాన్ని సంపాదించు.

వ్యాపారి: మాబోటివారికి ఎంత ధనమున్నా గణనకు రాదు. ఎందుకంటే, అనాదినుంచి రాజులే ధనాఢ్యులని లోకానికి ఒక గుడ్డి నమ్మకం. ఈ భూవలయాన్ని యేలిన రాజునైనా, వేలంవేస్తే సులువుగా కొనేయగలను. నా దగ్గర అప్పు తీసుకోని రాజులూ, ప్రభుత్వాలూ మచ్చుకైనా లేరు. మానుంచి ప్రజలకి ఎంతో సౌఖ్యం జరుగుతున్నది. ప్రతివారికీ కావలసినవి, అక్కర్లేనివీ, దేశదేశాల్లో వున్నవి తీసుకొచ్చి, ప్రజల సౌఖ్యానికే పాటుపడుతున్నాం మేము. అయినా అన్నివర్గాల వారికీ మేమంటే కంటకోప. ఎవరివృత్తి వాళ్ళు చేసి, ధనమార్జించటం లేదూ? అదీతీగా నే, మావృత్తి మేం చేసి, మాకుండే తెలివితేటల్ని వినియోగించి, ధనాన్ని ఆర్జిస్తున్నాం. మమ్మల్నూ మా ధనాన్నీ చూసి, సహించక, అన్నివర్గాలవారూ కూడా, మమ్మల్ని నిందిస్తారు. నిందించిన కొద్దీ సిరి

మనుష్యుల్నే తరిగోంది ఎంతటి సౌందర్యమైనా పరికి లోకువే. లక్ష్మి వరించినప్పుడు నీకెంత అభ్యంతరం ఉంటుంది—నన్ను వరించేందుకు. నన్ను వరిస్తే నిన్ను భూమిమీద నడవనివ్వను. ప్రేమ విహంగాలమై, ఎప్పుడూ కూడా ఆకాశంలో విహరిస్తుందాం. ఉదయాన్నే ఢిల్లీలో కాఫీ తాగి, తొమ్మిదో గంటకి జపాన్‌లో చోటా హాజరీ ఆరగించి, ఒంటిగంటకి చైనాలో డిన్నర్ తీసుకుని, నాలుగో గంటకి పేరిస్‌లో టీ, ఆరు గంటలకి స్విట్జర్లాండ్‌లో వాహ్యాళి జరిపి రాత్రి సప్పర్ ఇంగ్లండులో తీసుకొని, అమెరికా చేరి ఆకాశ సౌధాల్లో ఆనందించి, ఉదయం కాఫీ మళ్లా ఢిల్లీలో పుచ్చుకుందాం. రోజుకో భూప్రదక్షిణం. దేశదేశాల పంటలు రకరకాల అనుభవాలు నా వ్యాపార సంస్థ కింతవరకు, నిన్ను కార్యదర్శినిగా కూడా చేస్తాను. నా గురించి చెప్పుకోవలసిం దేముంది? అందరికీ తెలిసిందే — తెలియనట్టుంటారు కాని. అంచేత నీ యిష్టం ఆలోచించుకో?

గంగ: స్త్రీ అన్నదానికి యిది చెల్లదు కాబట్టే లోకంలో ఉండే మహానుభావు లందరిలోనూ ఏరి కోరి స్వయంవర మండపం మీద కూర్చోబెడితే ఒక్కరు కూడా నచ్చలేదంటూ వచ్చేశావు. ఆధిక్యంలో, అందంలో, వీరిని మించినవారు లేరు. వీరే నచ్చకపోతే నీకిదో, మానసిక ఆరోగ్యం బాగులేన్న మాట. కాని ఆలోచించగా నాకొకటి స్ఫురిస్తోంది ఇంత మంది మహానుభావుల్ని వదన్న నీవు యీయన్ని వరించి తీరుతావు. ఇవాళ్ళి ఇంతకంటే అంతెంటూ ఉండదు అంతటివానీ కాలవన్నే నీవు ఎందుకోసం ప్రాకులాడుతున్నావని విదితమైపోయింది. ఈయన రసన ఎల్లప్పుడూ పరమేశ్వర నామాన్నే ఉచ్చరిస్తుంది. ఈయన చూపుల్లో పరమేశ్వరుని విగ్రహం బంధితమయి వుంటుంది. ఈయన చేతులు ఆ భగవంతుని సేవతో పవిత్రమయ్యాయి. ఈయన ముఖవర్చస్సు యీ లోకానికి చెందని, అనన్యసామాన్యమైన బ్రహ్మవర్చస్సు ఈయన్ని వరించి నీ జీవితం పునీతం చేసుకో. పరాన్నార్జించి గడ్డికి వేసుకో. వేయి దండ—యీయన మెడలో..

ఆర్య: ఎన్నాళ్ళు బ్రతికినా యీ బ్రతుకు శాశ్వతం కాదు ఈ పేరు, సంపదలు తుణికాలు. అందుకే విబుధులు బుద్బుదములన్నారు. ఈ అఖండ భోగభాగ్యాలన్నీ కూడా మనస్సుకి లంకెటాలు. క్రిమిపక్షిపిపీలికములై ఎన్నెన్నో జన్మలెత్తి పుణ్యం చేస్తే గాని మానవజన్మ ఎత్తడం దుర్లభం. అందుకే వాగ్గేయకారులు... ఎన్నో నోములు నోచిన కాని దొరకదుగదా యీ నరజన్మ... అన్నారు. అంతే కాదు—మానవ జీవితాన్ని ఆ పరాత్పరుని సేవలో గడిపి కాలుదరి బ్రహ్మపదార్థాన్ని కైవసం చేసుకున్న కులీనుణ్ణి నా జీవితాన్ని ఆ జగద్రక్షకుని ఆలయానికి—ఘంటారథ గా కూర్చాను. గంగా పద్యమైన నా వాక్కుతో ఆయన కాలక్షేపం చేస్తున్నాను. ఆ పరమేశ్వరుని సేవచేసి ప్రతిదినం ఆ పరాత్పరుని విగ్రహానికి పట్టుపుష్పములు కట్టే పవిత్రమైన హస్తాలు నీ కరగ్రహణం చేయడానికి ఉవ్విళ్ళూరుతున్నాయి నీవూ నేనూ కలిస్తే ప్రకృతి పురుషుడూ కలిసినట్టన్నమాట. పరమేశ్వర సంకల్పం యీడేరిందన్నమాట. మానవుని గమ్యమైన మహితార్థాన్ని సాధించినన్నమాట నే గ్రహించా. ఇవాళ నా అంతు చూసిన యీ మహానుభావుణ్ణి, ఎప్పుడు తృణప్రాయంగా చూశావో అప్పుడు నన్ను వరించి తీరుతావని. నేననుకున్నది యథార్థం. భక్తపరాధీనుణ్ణి. భక్తపారిజాతుణ్ణి నమ్మినవారికి యదార్థం అద్దంలా కనబడుతుంది. అందుకే యింకెవర్నీ దాటుకుని, దగ్గరకొచ్చావు తులసివనంలా! (స్వయంవర మంటపం తలుపు పెద్దగా చప్పుడై బద్దలవుతుండగా కర్షకుడు ప్రవేశం. అందరూ నివ్వెరపడి చూసి నవ్వుతారు.)

రాజు: తలుపు బద్దలుగొట్టి కళాకాంతులు లేకుండా, ఒక్కసారి వచ్చి దొంగలా ప్రవేశించాడు గోతికల్పించే రూపు వీడు దొంగలా వున్నాడు. స్వయంవరానికి వచ్చాడా! దొంగతనానికి వచ్చేడా!

రైతు. దొంగెవడో, దొరెవడో లోకం తెలుసుకుంది. గుజ్జువంది కూడా. సంఘంలో దొంగలు మీలో నెవరో అంత తెలుసుకున్నారు. నా రూపం యిలా అయిందుకు మీరంతా కారకులు. పై రూపంతో ఎంతేగు లోపల వుండాలి కాని. దొంగలు వేస్తారు రూపు వేషాలు—నాకేం కర్మ.

సై. పతి: ఒంటి నిండా కప్పుకు నేందుకు బట్టయినా నీకు లేకుండా బల్లిమీసాలూ — పిల్లి గుడ్డూ — శిఖలో గడ్డి పువ్వులూ, చేతిలో కొడవలి — నీ వెంగళి చిట్టు — స్త్రీ అంటే పంచన చేరనున్నావా!

రైతు: అవును. భగవంతుడు పుట్టించి పెంచితే పెద్దవాళ్ళని చేస్తే, కారణం లేకుండా కుత్తుకలు కోసి, పేగు తెమ్మనేంది?. ప్రభువు అయ్యిందికే, కత్తులూ కటార్లూ మీకు ఆయుధాలు. పుట్టలు పుట్టినచోట గట్లు వేసి కాయక్లేశపడి ఫలసాయాన్ని కోసి మీ అందరికి అన్నం పెట్ట కావాల్సేందుకే మా ఆయుధం ఇది మీ ఆయుధాలు వశించేందుకే, మా ఆయుధాలు సంఖ్య పెరిగింది. కాలం మారింది కాచుకోండి.

వ్యాపా: పెద్దలతో మాట్లాడ్డం నేర్చుకో ఫలసాయంతో తూగే పంట వేసేమైనా వుంటే, నాతో అప్పు మాట్లాడుకుందికి వచ్చావా యిక్కడికి? భుజంమీద ఆ నాగలెందుకు? భూషణమా ఏమిటది?

రైతు: అవును, భూషణం, ఆయుధం కూడాను. ఇంతవరకూ రాయి రప్పలతో నిండి పంటకు పనికిరాని బంజరు భూములన్నీ దున్ని ఫలప్రదం చేశాను. ఇప్పుడు స్థాణువులైపోయిన మీ హృదయాలు, గొప్ప, బీద వ్యత్యాసంతో పెరిగిన ముళ్ళ డొంకలూ పేదరైతు రక్తంతో పెన్నిధులు చేసుకొన్న మీ జీవితాలు, మీ హృదయాలు, మీ మనస్సులు దున్ని కష్టపడే నా శరీరంమీద పొటమరించిన చెమటతో తడిపి సేద్యం చేసి, న్యాయం పండించేందుకని, నాగలికూడా తెచ్చా. ఇప్పుడర్థమైందా!

అప్ప: ఏం సేద్యగాడా, కళ్ళు నెత్తిమీద కొచ్చాయా నీకు— ఇలాగ మీ వర్గధర్మాన్ని అతిక్రమిస్తున్నావు కాబట్టే, అతిక్రమించి పెద్దనక చిన్ననక తెలిసినవాడిలా కారుకూతలు కూస్తున్నావు కాబట్టే, యింత పంట పండిస్తున్నా మీకు

# ద్వితీయ ప్రణాళిక నేర్పిన పాఠాలు

శ్రీ బులుసు వేంకటసుబ్బారావు

భారతదేశ చరిత్రలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో కలిగినంతటి మహత్తరమైన ఆర్థిక చైతన్యము ఇప్పటివరకు ఎన్నడు కలిగి ఉండలేదని చెప్పవచ్చును. ఈ ప్రణాళికలో అనేక దోషాలుండవచ్చును. ఆశయాలు అనేక రంగాలలో నెరవేరక పోవచ్చును. కాని ప్రజలలో ఇది ఒకవిధమైన నూతన చైతన్యాన్ని తీసుకువచ్చింది. దేశముయొక్క పురోభివృద్ధి కార్యక్రమాలు, జటిలమైన ఆర్థిక సమస్యలు, వాటి పరిష్కారమార్గాలందలి వైవిధ్యం ప్రభుత్వవిధానముయొక్క సాఫల్య వైఫల్యములు, క్రమక్రమంగా విస్తృతమౌతూన్న ప్రభుత్వరంగ వ్యవహారాలు, ఇవన్నీ కూడా సామాన్యప్రజల ఆలోచనలలో, సంభాషణలలో, వివాదాల్లో స్థానం సంపాదించుకొన్నాయి. "మనదేశపు పురోభివృద్ధి విషయం ప్రభుత్వం చూసుకొంటుంది మనకెందుకు?" అనే ఉదాసీనత్వం పూర్తిగా అంతరించిపోయింది. దేశపు ఆర్థిక వ్యవహారాలలో వారెక్కువ ఆసక్తిని కనపరుస్తున్నారు. రాజకీయాలు ఆర్థిక పరిస్థితులపై ఆధారపడుతున్నాయి. ఒక రాజకీయ పక్షాన్ని ఎన్నిక చేసేటప్పుడు, వారి రాజకీయ ఆశయాలనుబట్టిగాక, ఆ పక్షపు ఆర్థిక కార్యక్రమాలనుబట్టి ప్రజలు తమ నిర్ణయాలను స్థిరపరచుకొంటున్నారు. ఆర్థిక సమస్యలు ప్రజలపై మహత్తర ప్రభావాన్ని చూపుతున్నాయి. ఉదాహరణకు: సహకార వ్యవసాయం ఆచరణీయమా, కాదా అనే విషయం, ఏ ఇద్దరు పౌరులు ఎక్కడ సమావేశమైనా తీవ్రమైన చర్చనీయాంశంగా మారుతున్నది. ఈ నవ చైతన్యంవలన దేశంలో ప్రణాళికాచరణపై మూడు విభిన్నాభిప్రాయాలు ఏర్పడినాయి. ప్రణాళికా పద్ధతులను అమితంగా విస్తృతపరచి, చైనా రష్యాలందువలెనే ప్రభుత్వ ప్రమేయాన్ని అత్యధికంగా పెంపొందించాలనేది వామపక్షీయుల అభిప్రాయం. దీనికి సంపూర్ణంగా భిన్నమైనది రాజాజీ అనుయాయుల అభిప్రాయం. ఇప్పటికే ప్రణాళికలలో ప్రభుత్వ ప్రమేయం ప్రబలమై, వ్యక్తిగత స్వాతంత్ర్యానికి తావులేకుండా పోతోందని, కాబట్టి, స్వేచ్ఛా వ్యవస్థను రూపొందించాలని వారి వాదం. ఈ రెండు వాదాలకు మధ్యమమార్గాన్ని నేడు ప్రభుత్వం అనుసరిస్తోంది.

వివిధ రంగాలలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పొందిన జయాపజయాలను ఒకసారి స్థూలంగా పరిశీలించి, ఆ ప్రణాళికానుభవాన్ని పురస్కరించుకొని తృతీయ పంచవర్ష ప్రణాళికలో లోటుపాట్లు కలగకుండా ఎట్టి విధానాన్ని అవలంబించవలెనో తెలుసుకొందాం.

## పరిశ్రమలు

మొదటి పంచవర్ష ప్రణాళికయందు వ్యవసాయ రంగానికి ప్రాధాన్యమిచ్చి రెండవ ప్రణాళికయందు పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్య మొసగేరు. మొదటి ప్రణాళికయందు భారీ పరిశ్రమలకు రూ 148 కోట్లను, గనుల అభివృద్ధికి రూ ఒక కోటి, గ్రామ, కుటీర పరిశ్రమలకు రూ 30 కోట్లను కేటాయించారు. అనగా మొత్తం వ్యయం రూ 179 కోట్లు. ప్రణాళిక వ్యయంలో సుమారు 7.6% రెండవ ప్రణాళికలో పరిశ్రమలకు మొత్తం రూ 890 కోట్లు. (భారీ పరిశ్రమలు రూ 617 కోట్లు, గనుల అభివృద్ధి రూ 7[illegible] కోట్లు, గ్రామీణ, కుటీర పరిశ్రమలు 200 కోట్లు.) కేటాయించారు. అనగా ఇది ప్రణాళికా వ్యయమందు సుమారు 18.5% ఇది కాక ప్రైవేటు రంగంలో సుమారు రూ 575 కోట్లు, రెండవ ప్రణాళికలో పరిశ్రమాభివృద్ధికి కేటాయించినారు. ప్రథమ ప్రణాళికలో కేటాయింపు రూ [illegible]00 కోట్లు. రెండవ ప్రణాళికలో రూర్కెలా, దుర్గాపూర్, భిలాయి ఇనుము, ఉక్కు కర్మాగారాలను పూర్తిచేసి ఉత్పత్తి ప్రారంభించాలని, తద్వారా ఉక్కు ఉత్పత్తిని 6.0 మిలియను టన్నులు అధికంచేయాలని అనుకొన్నారు. ఆ ఆశయం నెరవేరింది. 1960-61 నాటికి ఈ అధికోత్పత్తి ధారాళంగా లభించ కలదు. సిమెంటు ఉత్పత్తి 18 మిలియను టన్నులు అధికం కావాలని మనం లక్ష్యంగా పెట్టుకొన్నాము. ఇదికూడా దాదాపు నెరవేరవచ్చును. గంధకామ్లము, దాహకసోడా, సూపర్ ఫాస్ఫేటు, రంగులు, అగ్గిపెట్టెలు, రేయాన్, సిమెంటు, అల్యూమినమ్, కుట్టు మిషనులు, విద్యుత్పంకాలు, యంత్రసామగ్రి, కాగితం, రిఫ్రిజిరేటర్లు, సైకిళ్ళు మొదలైన అనేక పరిశ్రమలలో ఉత్పత్తి, ఉత్పాదక శక్తికూడా, అధికంగా పెంపొందినాయి. స్థూలంగా పారిశ్రామికోత్పత్తి 1951లో 100 అనుకొన్నట్లయితే, 1956-57 సంవత్సరంలో 1[illegible]5.7 కు, 1957-58 లో 187.9 కు, 1958-59 లో 141కి పెరిగింది. 1959-60, సంవత్సరపు మొదటి భాగమందు పారిశ్రామికోత్పత్తి ప్రోత్సాహకరంగా ఉంది. జనుము, ప్రత్తివస్త్రాలు మొదలైన కొన్ని పరిశ్రమలందు తప్ప మిగిలిన పరిశ్రమలందు విశేషాభివృద్ధి సూచనలు కనబడుతున్నాయి.

## వ్యవసాయం

ప్రథమ పంచవర్ష ప్రణాళికయందు. ఆహారసమస్య చాలవరకు పరిష్కృతం కాగలదని, కాబట్టి ద్వితీయ ప్రణాళికయందు పరిశ్రమలకు అధిక ప్రాముఖ్యం ఒసగవచ్చునని చాలామంది భావించారు. నిజానికి మొదటి ప్రణాళికయందు ఆహారోత్పత్తి, ఏ కారణాలవలననైతేనేమి చాల పెరిగింది. 1954 వ సంవత్సరానికే, లక్ష్యం కన్న సుమారు 7 1 టన్నులు అధికంగా ఉత్పత్తి అయింది. 1953-54 ఆహారధాన్యాల ఉత్పత్తి 68.7 మిలియను టన్నులు. కాని 1954-'55 లో ఉత్పత్తి 66.6 మిలియను టన్నులకు, 1955-'56 లో 65.8 మిలియను టన్ను

లకు తగ్గిపోయింది. తిరిగి ద్వితీయ ప్రణాళికా ప్రారంభ సంవత్సరంలో 68.7 మిలియను టన్నులకు పెరిగింది. కాని వరదల వలన, అతివృష్టి అనావృష్టి మొదలైన వలన 1957-'58 లో సుమారు 10% ఉత్పత్తి తరిగిపోయింది. అయితే 1958-'59 వ సంవత్సరంలో ఆహారోత్పత్తి అత్యధిక పరిమాణానికి పెరిగింది 73.5 మిలియను టన్నులకు; అనగా 1957-'58 ఉత్పత్తి కన్న 17% 1956-'57 కన్న 7% అధికము. 1958-'59 సంవత్సరంలో ఆహారపు దిగుమతులు 3.4 మిలియను టన్నులు, అనగా 1957-'58 లో కన్న 0.2 మిలియను టన్నులు తక్కువ. ప్రభుత్వపు నిలువలు కూడా తగ్గాయి 1958 ఏప్రిల్ నాటికి అవి 1.21 మిలియను టన్నులు. 59 మార్చి నాటికు 1.15 మిలియను టన్నులు. వాణిజ్యపు పంటల ఉత్పత్తి కూడా 1958-'59లో ప్రోత్సాహకరంగా ఉంది. 1956-57 లో ఆహారోత్పత్తి 128.6 అయితే 57-'58 లో 114.6 కు తగ్గి, 1958-59 లో 128.4 కు హెచ్చింది.

## నిరుద్యోగ నివారణ

రెండవ ప్రణాళికలోని వివిధ నిర్మాణ కార్యక్రమాల మూలంగా సుమారు ఎనిమిది మిలియనుల మందికి నూతనంగా ఉద్యోగం లభించగలదని భావించారు. ఉద్యోగుల సంఖ్యను నిర్ణయించేందుకు, నిరుద్యోగుల సంఖ్యను నిర్ణయించేందుకు సరైన గణాంకశాఖ మన దేశంలో ఏర్పాటు కాలేదు. ఉద్యోగాన్ని సంపాదించేందుకు దేశంలో ఉద్యోగసంస్థలను 19 నుండి 228 వరకు పెంచారు. ఈ సంస్థలలో ఉద్యోగార్థుల సంఖ్య 1959 మార్చి నాటికి 1,2[illegible]7,000. అనగా 1957 వ సంవత్సరం కన్న 285,000 ఎక్కువ. వివిధ ప్రణాళికా కార్యక్రమాల మూలంగా దేశంలో ఉద్యోగావకాశాలు ఎక్కువైనప్పటికి, నిరుద్యోగుల సంఖ్య ఆధిక్యమును అవి అంతగా తగ్గించలేకపోతున్నాయి. దీని కారణం మొదటి ప్రణాళికలో నిరుద్యోగ సమస్యను నిర్లక్ష్యం చేయడమే. ఈ జటిలసమస్యను పరిష్కరించడానికి ఒక విస్తృతమైన ఉద్యోగవిస్తరణ విధానం అవసరం. కేవలం ఉద్యోగసంస్థలను పెంచినంతమాత్రాన లక్షలకొలది నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించడం సాధ్యమైన విషయం కాదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు నిశ్చితమైన ఒక విస్తృతవిధానం లేకపోవడం వలన, లక్ష్యాన్ని సాధించలేకపోయాము దీని వలన తృతీయపంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగ సమస్య అతివిషమంగా మారుతుంది.

## విదేశీ మారకద్రవ్యం పరిస్థితి

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో అడుగడుగునా అడ్డుతగులుతూన్న అతిజటిలసమస్య విదేశీ మారక ద్రవ్యం సమస్య. రెండవ ప్రణాళికా కాలంలో, గతియందు ప్రస్తావించిన ప్రాజెక్టులు, భారీ ఎత్తున కర్మాగారాలు. ఇతర నిర్మాణ కార్యక్రమాలు అమలు జరపడం వలన దిగుమతులు అమితంగా పెరిగిపోయాయి. దేశంలో ధరలు పెరిగిపోవడం వలన ఎగుమతులకు గిరాకి తగ్గి, పరిస్థితి మరింత విషమించింది. దీనితో పాటుగా ఆహారసమస్య అపరిష్కృతంగానే ఉండిపోవడం వలన ఆహారధాన్యాల దిగుమతుల కొరకు అధికంగా ధనం విదేశీద్రవ్యాన్ని ఖర్చు చేయవలసివచ్చింది. 1956 ఏప్రిల్ నాటికి రిజర్వుబ్యాంకులో విదేశీద్రవ్యపు నిలవల మొత్తం విలువ రూ 7,461 మిలియనులు. 1957 మార్చి నాటికి ఇది సుమారు రూ 5,[illegible]68 మిలియన్లకు అనగా రూ 2,598 మిలియన్లు తరిగిపోయింది. ఈ కాలంలో అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి రూ [illegible]07 మిలియన్ల ద్రవ్యం వాడుకొన్నాము. మరొక సంవత్సరంలో, అనగా, 1958 మార్చినాటికి రూ 2,[illegible]98 మిలియన్లు తరిగింది. అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి మరొక రూ 346 మిలియన్లు వాడుకొన్నాం. మరొక సంవత్సరకాలంలో అంటే 1959 మార్చి నాటికి నిలువ రూ 2,181 మిలియన్లకు తగ్గింది. ఈ విధంగా విదేశీ ద్రవ్యస్థితి క్రమక్రమంగా విషమస్థితికి దిగజారింది. ఎగుమతుల విలువ దిగుమతుల విలువకన్న 1955-56 లో రూ 1,212 మిలియన్లు, '56-'57 లో రూ 4,648 మిలియను 1957-58 లో రూ [illegible],0[illegible] మిలియన్లు తక్కువ ఉంది. అయితే 1958-'59 సంవత్సరంలో ఈ లోటు రూ 4,704 మిలియనులకు తగ్గింది. దీనికి కారణం ఆ సంవత్సరంలో దిగుమతులపై విధించిన నిర్బంధమే.

## విదేశ సహాయం

మొదటి ప్రణాళికలో లభించిన విదేశ ఋణాల మిగులు ద్రవ్యం రెండవ ప్రణాళికయందు రూ 1,934 మిలియను వరకు ఉంది. 1956 ఏప్రిల్ నుండి 1959 జూన్ వరకు, ఋణరూపకమైన, ధనరూపకమైన విదేశ సహాయం మొత్తం రూ 11,092 మిలియన్లు. దీనియందు ప్రపంచబ్యాంకువారొసగిన ఋణం రూ 3[illegible] మిలియను డాలర్లు. 1959 నాటికి మొత్తం సహాయంలో రూ 7,000 మిలియన్లు వ్యయమైపోగా ఇంకా రూ 6,026 మిలియను మిగిలింది. ఈ విదేశసహాయంవలన ప్రైవేటు రంగంలో కూడా నూతన అభివృద్ధి పథకాలను అమలు జరపడానికి అవకాశం ఏర్పడింది. ప్రపంచబ్యాంకు, అమెరికా సంయుక్త రాష్ట్రాల ఎగుమతి దిగుమతుల బ్యాంకు, అమెరికా సంయుక్తరాష్ట్రాల అభివృద్ధి ఋణనిధి, మన దేశంలోని ఇనుము-ఉక్కు ఉత్పత్తిదారులకు ఋణ సహాయాన్ని ఒసగాయి. ఇట్టి భారీ సహాయం వలనే మన విదేశీ మారక ద్రవ్య సమస్య ఉద్ధృతం కొంత కాకపోతే కొంతైనా ఉపశమించడానికి అవకాశం కలిగింది.

## ధరల పరిస్థితి

ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు భారీ ఎత్తున (రూ 1200 కోట్లు) బడ్జెట్లు లోటు విధానాన్ని అనుసరించడం వలన, దిగుమతులను అధిక పరిమాణాలలో నిషేధించడం వలన, ఆహార ధాన్యాలు గిరాకీకి సరిపోకపోవడం వలన, దేశంలో ధరలు బాగా అధికమయ్యాయి. సాధారణపు ధరలస్థాయి 1952-53 లో 100 అయితే 1956-57 సంవత్సరాంతానికి 106 కు పెరిగింది (6%) తరువాత 1957-58 లో 109 కి పెరిగింది (9%) 1958-59 నాటికి ఆహారధాన్యాల కొరతమూలంగా మరొక 4% పెరిగాయి ధరలు. ఆహారధాన్యాల విషయాలలో మాత్రం 8% పెరిగాయి 1958-59 సంవత్సరంలో పండిన పంట మూలంగా ఆహారధాన్యాల ధరలను కొంతవరకు అరికట్టడానికి అవకాశం కలిగింది. అయినప్పటికి ఆ అవకాశాలు అనుకొన్నంత ఎక్కువగా లేవు. పంట ఎక్కువైనప్పటికి ప్రత్యక్షంగా బజారులో అమ్మకానికి వచ్చిన సరుకు పెరగకపోవడం వలన ధరలు

అంతగా తగ్గలేదు. చిన్న వర్తకులు తమవద్దనున్న సరుకునంతటిని అమ్మివేయడం మానుకొనగా, పెద్ద వర్తకులు సరుకునంతటినీ సంగ్రహించి, నిలవచేసివేయడం జరిగింది. ధరలు ఇంకా అధికంగా పెరిగి, లాభాలు పెరుగుతాయని వారి ఆశ. వీరీ విధంగా అత్యాశతో నిలవ ఉంచుకోడానికి ఇటు ప్రభుత్వంనుండి, సహకార పరపతిసంఘాల నుండి చౌకగా లభించే ఋణాలు చేయూత నిచ్చినాయి. ఈ విధంగా ఉత్పత్తిచరిత్రలో కని విని ఎరుగనంతగా పెరిగినప్పటికీకూడ ధరలు మాత్రం అధికమౌతూనే ఉన్నాయి. దీనిని అరికట్టడానికి ప్రభుత్వం కొన్ని చర్యలను తీసుకొంది. రాష్ట్రాలవారీగా ప్రభుత్వపు ఆహార ధాన్యాల నిలువలు వృద్ధిచేయబడ్డాయి. ఆహారపు దిగుమతులు అధికమయ్యాయి. వైవిధ్యమైన ఋణాలసరఫరా తగ్గింపబడింది. తమవద్ద నున్న ఆహారపు నిలువల వివరాలన్నీ పెద్దవర్తకులు ప్రభుత్వానికి తరచు తెలియజేసేటట్లు ఉత్తరువులు జారిచేయబడ్డాయి. 1958-వ సంవత్సరంలో చౌకడిపోల సంఖ్య 45 000 కు పెంచబడింది. అయినప్పటికీ ధరలు అంతగా అదుపులోనికి రాలేదు. ఇప్పుడు లభిస్తున్న పాఠాలు, సరియైనవిధంగా సకాలంలో బజారులోనికి తీసుకొని రాబడినట్లయితే ఆహారధాన్యాల ధరలు, తద్వారా ఇతర వస్తువుల ధరలు చాలవరకు తగ్గిఉండేవి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మూలంగా కలిగిన వృద్ధిని, ముఖ్యంగా 1958 59 ఆర్థికపరిస్థితిని సమీక్షిస్తూ కేంద్రం ప్రణాళికా సలహా సంఘం కొన్ని ముఖ్యవిషయాలను క్రిందివిధంగా సూచించింది "ద్వితీయ ప్రణాళిక పెట్టుబడి లక్ష్యాలు చాలవరకు సిద్ధించగలవు. అయితే, ధరల అనిశ్చలత, కొన్ని రంగాలందు కలిగిన లోటుపాట్లు మూలంగా, ప్రణాళికా లక్ష్యసిద్ధి నూటికి పదిహేను లేక ఇరవైపాళ్ళు తక్కువగా ఉంటుంది. ఈ కారణంవలన జాతీయోత్పత్తియందు అనుకొన్నదానికన్నా తక్కువవృద్ధి జరుగుతుంది. మొదటి ప్రణాళికలో యథార్థపు పెట్టుబడి జాతీయాదాయంలో నూటికి అయిదువంతులనుండి ఏడువంతులకు పెరిగింది తరువాత క్రమంగా ఈశాతము పది పదకొండువరకు పెరిగింది. ఈ పెట్టుబడి వ్యవహారాలు కొన్ని ఫలవంతములయాయి. మిగతావన్నీ కొద్ది కాలంలోనే ఫలితమివ్వగలవు. దేశంలో అభివృద్ధి కార్యక్రమం స్వయంపోషక స్థితికి ఇంకా రాకపోయినప్పటికి, కొంతవరకు పటుత్వాన్ని పొందింది. అయితే రానున్న రెండవప్రణాళికా కాలంలో మహత్తరమైన బాధ్యత నిర్వహింపబడవలసి యుంది. జాతీయోత్పత్తి నిరంతరాయంగా అధికమయేట్లు కృషి చేయాలి. పొదుపు ఉద్యమం పెంపొందింప బడాలి. ఎగుమతులు ఇప్పటికన్నా బాగా అధికమయేందుకు తగిన కృషిచేయాలి. ద్రవ్యవనరులను అధిక ఫలదాకయంగా వినియోగపరచుకోవాలి. ఇన్ని విషయాలందు మహత్తరమైన, బాధ్యతాయుతమైన కృషి జరుగుతేనే మూడవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా ప్రారంభం చేయడానికి వీలు కలుగుతుంది." స్థూలంగా పైఅభిప్రాయాలను ఆసంఘం వెలిబుచ్చింది.

## లోపాలు

మూడవ ప్రణాళికను రూపొందించేటపుడు, రెండవ ప్రణాళికాచరణమందు జరిగిన అనేకదోషాలు పునరుక్తం కాకుండా తగిన కట్టుబాట్లను చేసికోవాలి. సంగ్రహంగా ద్వితీయ ప్రణాళికాచరణంలో ఈ క్రింది లోపాలను పరిశీలింపవచ్చును.

ఒకటి: రెండవ పంచవర్ష ప్రణాళికలో లోటు విధానానికి హద్దుమీరిన స్థానాన్నిచ్చారు. నిజానికి కీన్సు మున్నగువారి అభిప్రాయాలప్రకారం దేశంలో ఉత్పాదనశక్తులన్నీ పూర్తిగా వినియోగం కానప్పుడు లోటువిధానం అధిక ప్రయోజనకరమైనది. అట్టి స్థితిలో నూతనంగా ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టబడ్డ ద్రవ్యంవల్ల, ఆర్థిక చైతన్యం ఎక్కువై, వస్తూత్పత్తి అధికమై, ధరలు అధికం కాకుండా అభివృద్ధిసాధ్యమౌతుంది. అయితే దేశంలో నూతనద్రవ్యం అధికోత్పత్తికారకం కాలేని సమయంలో లోటు విధానాన్ని హద్దు మీరకుండా ఉపయోగించుకోవాలి లేకపోయినయెడల ధరలు తారాపథాన్నంటుతాయి. ఈ ధరల పెరుగుదలవలన అనేక తీవ్రమైన అరిష్టాలు సంభవిస్తాయి. ప్రథమంగా ఎగుమతులు తగ్గిపోతాయి. ఎందుచేతనంటే మనదేశంలో తయారైన వస్తువుల ధరలు పెరిగినకొద్దీ, మన వస్తువులకు విదేశీయుల గిరాకీ తగ్గిపోతుంది. దీనివలన విదేశీ ద్రవ్య మారకపుస్థితి మరింత విషమతర మౌతుంది. అంతేకాక, ఈ ధరల పెరుగుదలవలన ఒక విధమైన అనిశ్చలత ఆర్థిక రంగాన్ని ఆవరించుకొని, వర్తక, వ్యాపారాలకు అధికోత్పత్తి కార్యక్రమాలకు పెద్ద ఆటంకంగా పరిణమిస్తుంది. ధనికులకు అధిక ధనం సంప్రాప్తించడం, పేదలకు పేదరికం అధికమవడం జరుగుతుంది. ధరలు పెరిగినా జీతాలు పెరగేందుకు అవకాశంలేని మధ్యతరగతివారు కష్టనష్టాలకు పాల్పడతారు. కాబట్టి లోటు విధానాన్ని పరిమితంగా వాడుకోవాలి. దీని పరిమాణం ద్వితీయ ప్రణాళికలో సుమారు రూ 1200 కోట్లు. ఇంత పరిమాణాన్ని, నూతనంగా పెంపొందుతూన్న మన ఆర్థిక వ్యవస్థ భరింపలేకపోయింది. కాబట్టి ముందు ప్రణాళికలలో ఈ విధానానికి కొంతకాలంపాటు స్వస్తి చెప్పడమో, పరిమితుల్లో ఉపయోగించుకోడమో చేయాలి.

రెండవది: ఆహార సమస్యా పరిష్కార విధానం వాస్తవిక పరిస్థితులకు అనుగుణ్యంగా లేదు. దీనివలన ఆర్థిక వ్యవస్థంతా తీవ్ర సంచలనాలకు గురయై, అయోమయస్థితిలో పడింది. ఒకవంక అత్యధిక వ్యయంతో ఆహారధాన్యాల దిగుమతి జరుగుతూనే ఉంది. మరొకవంక పంట చారిత్రిక ప్రమాణాలనందుకొంటూనే ఉంది. అయితే అంగట్లో బియ్యంమాత్రం కరువయింది. మన ఆహార ధాన్యాల ఉత్పత్తికి సంబంధించిన లెక్కలు మహా అస్తవ్యస్తంగా ఉన్నాయి మన వ్యవసాయిక గణాంకం వివరాలను అనేకమంది ప్రముఖ గణాంకశాస్త్రజ్ఞులు తీవ్రంగా విమర్శించారు. అయితే వీటిని సంస్కరించి ఈ లెక్కలలో ఎంత సత్యం వుందో తెలిసికోడానికి ఇటు రాష్ట్రప్రభుత్వానికు, అటు కేంద్రప్రభుత్వానికికూడా తీరికా లేదు, ఓపికా లేదు.

అట్టి సత్యదూరములైన అంశాల ఆధారంపై రూపొందించబడిన మన ఆహారధాన్యాల ధరల అదుపు విధానం ఎంత ప్రయోజనకారిగా ఉంటుందో వాస్తవిక పరిస్థితులే నిరూపిస్తున్నాయి. దేశంలో ఎక్కడెక్కడ ఎంత పంట పండుతోంది, అది ఎవరి చేతుల్లో కేంద్రీకృతమౌతోంది, ఏవిధంగా అమ్మకానికి తేబడుతోంది అన్న విషయాలపై కేంద్రప్రభుత్వం విశేషంగా ప్రసరించి, ఈ విపరీత పరిస్థితులకు కారణమైన వర్తకులందరిని సంఘద్రోహులుగా, నిష్పక్షపాతంగా శిక్షవేస్తే గాని ధరల స్థితి కొంత మెరుగు కావచ్చును. ఇప్పటి వరకు ఉన్న ఆహారమండలాలు, ధరల అదుపువిధానాలు, ప్రభుత్వ

వ్యాపారం ఇవన్నీ కూడా అసలు సమస్యలను అలాగే ఉంచి, ఇప్పటికే ఉన్న అయోమయ స్థితిని అధికం చేస్తున్నాయి. కాబట్టి వీటి మీద నైనా ఒక నిశ్చితమైన విధానం అవసరం.

భూసంస్కరణల విషయంలో కూడా ద్వితీయ ప్రణాళిలో ఆశించినంత కృషి జరుగలేదు. నాగపూర్ కాంగ్రెసు తీర్మానం ప్రకారం 1959 సంవత్సరానికి గరిష్ఠ పరిమితుల నిర్ణయం పూర్తి కావాలి. అయితే ఇప్పటికి ఏ రాష్ట్రప్రభుత్వం కూడా గరిష్ఠ పరిమితి ఎంత ఉండాలి అన్న ప్రాథమిక విషయంపైనే ఒక స్థిరాభిప్రాయానికి వచ్చినట్లు కనబడదు. ఇవేవీ నిర్ణయం కాకుండానే అప్పుడే కొన్ని చోట్ల సహకార వ్యవసాయం పరీక్షార్థంగా ప్రారంభింపబడుతోందని వార్తలు వస్తున్నాయి. ఇంచుమించు నాగపూరు సమావేశంలో కాంగ్రెసువారు కొన్ని తీర్మానాలు చేసుకొన్నారు. తీర్మానాలు, ఉపన్యాసాలు అద్భుతంగా ఉన్నప్పటికి వాటికీ, వాస్తవంగా జరుగుతున్న కృషికి అట్టే సంబంధం కనబడదు.

స్థూలంగా చెప్పాలంటే ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో దేశంలో వ్యవసాయరంగంలో ఒక అనిశ్చితస్థితి ఏర్పడింది. ఈ అనిశ్చితస్థితి ఏ ఒక్క విషయంలోనే గాక అన్ని విషయాలలోను ఉంది. భూసంస్కరణలు, ప్రభుత్వ వ్యాపారం, సహకార సంఘాల వ్యవహారాలు, వ్యవసాయ పరపతి, ధాన్యపు ధరలు, ఆహార మండలుల ఆర్భాటం, ధాన్యం టోకు విధానాలు, ఇవన్నీ మన వ్యవసాయిక వ్యవస్థను తలోవంక లాగుతున్నాయి. తృతీయ ప్రణాళికలోనైనా ఈ అనిశ్చితస్థితి తొలగేట్లు చేసుకోవాలి.

మూడవది. మన ప్రణాళికా వ్యయ లక్ష్యాలకు అభివృద్ధి లక్ష్యాలకు సంబంధం ఉండటంలేదు. అనగా మనం ఖర్చు చేస్తున్నాం కాని అభివృద్ధి తగినంత కలగడంలేదు. ఆహార రంగంలో ప్రణాళికలో అనుకొన్నంత వ్యయం చేస్తున్నాము. అయితే మన మనుకున్నంత ఉత్పత్తి వృద్ధి కలగడంలేదు. దీనికి కారణం ప్రణాళికా కార్యక్రమాల నిర్వహణలోని అసమర్థత. దానిమూలంగా డబ్బు దుబారా అయిపోతోంది. మనకున్న ద్రవ్యాధారాలే బాగా తక్కువ. వాటిని సాధ్యమైనంతవరకు, అత్యధిక ఫలోన్ముఖంగా వినియోగపరచుకొనేందుకే మనం ఈ ప్రణాళికలను రూపొందించుకొన్నాము. ఈ సంగతి జ్ఞప్తికి తెచ్చుకొంటే ఈ లోపంయొక్క తీవ్రత తెలియగలదు. ద్వితీయ ప్రణాళికలో ఈ దుబారా సుమారు నూటికి ఇరవై వంతులవరకు ఉండవచ్చని అంచనా వేసేరు. నిర్వహణాసమర్థత ప్రణాళికాకార్యమునకే భంగకరం కాబట్టి దాన్ని శీఘ్రంగా తొలగించేందుకు ప్రభుత్వం కృషి చెయ్యాలి. ఈ లోపం వల్లే ఖర్చుకు తగిన ఫలితం లభ్యం కాకపోవడంవలన మరొక తీవ్రనష్టమేమనగా దేశంలో ధరలు విపరీతంగా పెరిగిపోయి, అనిశ్చితస్థితిని పెంపొందిస్తాయి.

తరువాత ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో, దేశంలో నిర్మాణ కార్యక్రమాల వలన, ధరలు పెరిగి ఎగుమతులు తగ్గడంవలన, అనుకొన్నదానికంటె ఎక్కువ దిగుమతుల వలన, మన ఆర్థిక వ్యవస్థ విదేశీయ మారక ద్రవ్య విషయంలో విపరీతమైన ఒత్తిడికి గురియైంది. దీనికితోడు ఆహార ధాన్యాలను అధికంగా దిగుమతి చేసుకోవలసి వచ్చింది. ఈ విషమ పరిస్థితిని పరిష్కరించడానికి అనేక విధాలుగా (దిగుమతుల నిర్బంధం, ఆహార ఎగుమతులందు నిర్బంధాల సడలింపు, ఎగుమతి ప్రోత్సాహక సంస్థల స్థాపన) కృషి జరిగినప్పటికీ సమస్యయొక్క ఉద్ధృతము అంతగా ఉపశమింపలేదు. ద్వితీయ ప్రణాళికారంభ సంవత్సరంలో విదేశీ ద్రవ్యంమారకం రంగంలో మన స్థితి కన్న తృతీయ ప్రణాళికారంభ సంవత్సరంలో బాగా దిగజారుతుంది. కాబట్టి తృతీయ ప్రణాళికా స్వరూపాన్ని అంత అత్యాశయుతంగా కాకుండా దిద్దుకోవాలి. అయితే 1958-59 సంవత్సరంలో కలిగిన అత్యధిక ఆహారోత్పత్తి, ద్వితీయ ప్రణాళిక చివరిలో ఉత్పత్తి ప్రారంభించే భారీ కర్మాగారాలు, పరిస్థితిని మూడవ ప్రణాళికలో కొంత చల్లార్చవచ్చును. అయినప్పటికి తృతీయ ప్రణాళికా విజయానికి రెండవ ప్రణాళికలాగనే విదేశీ సహాయంపై ఆధారపడకుండా ఉండాలంటే, ప్రణాళికా స్వరూపాన్ని మితంగా ఉంచుకోవడం అవసరం.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందలి మరొక పెద్ద లోపము నిరుద్యోగ సమస్యా పరిష్కార విధానంలో గోచరిస్తుంది. తృతీయ ప్రణాళికయందు నిరుద్యోగ సమస్య అతివిషమంగా మారడానికి మొదటి రెండు ప్రణాళికలలోను అవలంబించిన విధానపు లోపమే కారణమవుతుంది. నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి దేశానికంతకూ ఒకే ఒక్క విధానాన్ని అనుసరించడం కుదరదు. ఎందుకంటే ఈ సమస్య దేశంలో అన్ని రాష్ట్రాలయందు ఒకే మాదిరిగా లేదు. ఆంధ్రవంటి వ్యవసాయిక రాష్ట్రాలయందలి గ్రామీణ నిరుద్యోగ సమస్య వేరు. బెంగాల్, బీహార్ మొదలైన రాష్ట్రాలలోని పారిశ్రామిక నిరుద్యోగ సమస్య వేరు. ఒరిస్సా మొదలైన వెనుకబడిన ప్రదేశాలలోని సమస్య వేరు. అస్సాం, మధ్యప్రదేశ్ మొదలైన ప్రాంతాలలోని గిరిజనుల నిరుద్యోగ సమస్య వేరు. ఇవన్నీ కాకుండా చదువుకున్నవారి సమస్య ఒకటి. ఈ ఉద్యోగాభివృద్ధికి, రెండవ ప్రణాళికలో అవలంబించిన విధానమందలి ముఖ్యమైన లోపం పైవిధమైన ప్రాంతీయ వ్యత్యాసాలను గమనించకపోవడమే. మరొక ముఖ్యలోపమేమంటే, నిరుద్యోగ సమస్యను ప్రత్యేక సమస్యగా కాక దేశాభివృద్ధిపైన ఆధారపడిన సమస్యగా పరిగణించడం. దేశాభివృద్ధి ప్రణాళికల మూలంగా కలుగుతూంటే, నిరుద్యోగ సమస్యా పరిష్కారం అవుతుందని భావించారు. ఈ భావం సత్యదూరం కాకపోయినా, అది సఫలదాయకం కాదు. కాబట్టి ఈ సమస్యపై ప్రత్యేక పరిశీలన అవసరం. రెండవ ప్రణాళికలో ఈ లోపాల వలన, ప్రణాళికా లక్ష్యమైన ఎనిమిది మిలియనుల మందికి ఉద్యోగ కల్పించడం సాధ్యం కాలేదు. రెండవ ప్రణాళికారంభానికి మన దేశంలో 15 మిలియను మంది నిరుద్యోగులున్నారు. కాబట్టి తృతీయ ప్రణాళికలో ఈ సమస్య విషమతరమవుతుంది. ఇకమీదటైనా ఆ లోపాలు సవరణ అయ్యేట్లు ప్రభుత్వం కృషి చేయాలి.

ద్వితీయ ప్రణాళికయందలి మరొక లోపము స్థానిక పరిస్థితులకు, స్థానిక ప్రణాళికలకు ప్రాధాన్యం ఈయకపోవుట. భారతదేశంలో సత్వర ఆర్థిక పురోభివృద్ధికి స్థానిక ప్రణాళికలు అత్యవసరం అని ఏనాడో గాంధీమహాత్ముడు హెచ్చరించాడు. ఏ ప్రాంతంలోని స్థితిగతులు ఆ ప్రాంతపువారికి, ఎక్కడో ఉన్న కేంద్రప్రభుత్వముకన్న సమగ్రంగా తెలుస్తాయి. ఆ ప్రాంతంయొక్క ద్రవ్యాధారాలను, అవసరాలను ఒక చక్కటి పథకంద్వారా అత్యధిక ఫలదాయకంగా సమన్వయపరచడంవలన సత్వర ఫలితాలు కలిగి అభివృద్ధి సాధ్యమౌతుంది. అటు కాక ఆ ప్రాంతపు అభివృద్ధికార్యక్రమాలను కేంద్రంనుంచే రూపొందిస్తే అవి పరిస్థితులకు అనుగుణంగా ఉండడం కష్టం.

మొత్తంమీద, అనేక లోపాలు ఉన్నప్పటికి రెండవ ప్రణాళిక చాలవరకు విజయాన్ని సాధించిందని చెప్పవచ్చును. లక్ష్యాలను బట్టి చూస్తే ఈ విజయం నూటికి డెబ్బైఅయిదు, ఎనభై పాళ్ల వరకు ఉంటుంది. అయితే మనం దీనితో సంతృప్తి పడకూడదు. ప్రణాళిక అన్నది ఆచరణలోనికి వచ్చినతరువాత జనం నూరుపాళ్ళు సాధ్యం కావాలి. ధరల విషయంలోను, విదేశీయ మారకద్రవ్యం విషయంలోను, ఆహారసమస్యా పరిష్కారం విషయంలోను ఇంకా ఇతర విషయాలలోను బ్రహ్మాండమైన కృషి అవసరం. పైన సూచించబడిన లోపాలు తృతీయ ప్రణాళికలోనైనా పునరుక్తం కాకుండా తగిన జాగ్రత్త అవసరం. ప్రణాళికాచరణ అఖండమైన జాతీయ కార్యం. దానిని దేశంలో ప్రతివారు గుర్తించి, నెరవేర్చినప్పుడే, సంపూర్ణ విజయం చేకూరగలదు.

# దేవరకొండ దుర్గము

శ్రీ ముకురాల రామారెడ్డి

చుట్టూ పాతిక మైళ్ళమేటు జనాన్ని కొట్టివచ్చేటట్టు కోటబొమ్మలతో నిలిచివున్న ఈ దేవరకొండ గిరిదుర్గం దాదాపు రెండు శతాబ్దాల పాటు వెలమప్రభువులకు స్థావరమైంది.

కాకతీయుల అనంతరం మొదటి సింగమనాయకుడు రాచకొండ రాజ్యాన్ని స్థాపించాడు. ఇతని కొమాళ్ళు అనపోతానాయకుడు, మాధవనాయకుడు రాచకొండ, దేవరకొండ దుర్గాలను దుర్భేద్యంగా నిర్మించి పాలిస్తూ, అటు గోలకొండ, ఇటు కొండవీడూ, అవలి తట్టు విజయనగరం, ఈ మూడు రాజ్యాలవారినీ ముప్పతిప్పలుబెట్టారు. మాధవనాయకుని కుమారుడూ సర్వజ్ఞసింగమనీనికి సమకాలికుడూ అయినవాడు పెదవేదగిరి. సంగీతనాటక కళాపోషకుడైన కుమారమాధవనాయకుడీ పెదవేదగిరి పుత్రుడే. ఇతని అనంతరం రాజ్యానికి వచ్చినవాడు లింగమనాయకుడు. కాలవశాత్తు ఇతడు స్వాతంత్ర్యాన్ని కోల్పోయి కళింగ గజపతులకు సామంతుడు కావల్సివచ్చినది. ఇది 15వ శతాబ్దం మూడో పాదం వరకూ లభ్యమయ్యే చరిత్ర. తర్వాత భీమరాయడూ, పర్వతరాయడూ మొదలైనవారు 16వ శతాబ్దం రెండవ పాదంవరకూ పాలించినట్టు తెలుస్తుంది. దాడిమీదదాడి చేస్తూవచ్చిన గోలకొండ ప్రభుత్వం దీన్ని ఎప్పుడు కబళించిందో సరిగ్గా తెలియదు. ఈ కొండకోటను కృష్ణదేవరాయలు కూడా ఓ సారి తాకిచూచినట్టు పారిజాతాపహరణం చెప్తూంది.

ఈ నా గేయకృతి కేవలం చారిత్రకసత్యాన్ని చాటేటందుకు కాదు. దేవరకొండ పూర్వవైభవాన్నీ, వెలమ బెబ్బులుల వీర ప్రతాపాన్నీ స్మృతికి తెచ్చే ఒక భావవీచిక మాత్రమే.

వీరలక్ష్మికి కేత
 నమే! యెంత గ
 ట్టిన కోట! యెంత నె
 ట్టన కోట! యెన్న డే
 మొనగాడు గట్టెరా
 మూడు గట్టుల మాట?

ఈ కొట్టకొన కొండ
 దాక రాళ్ళెత్తి యెం
 దరి జవ్వనము కరిగిపోయెరా?
 ఎన్ని భీ
 కర గ్రీష్మములు తిరిగిపోయెరా?

తెలుగుబంట్లు కటారి
 చిలుము బాయగ నూరి;
 తరిమాడి; పగఱ పొలి
 మెర దాట; పులివేట
 లాడిరట యొకనాట
 నేడు భగ్నకవాట.
 వాసి మాసినది దే
 వరకొండ కోట.

చూడరా తమ్ముడా
 వేడి కన్నీట.

ఒకనాటి మాట, వీ
 ర కళింగపతి గద్దె
 గదలించి, ప్రోలికిన్
 గదలుచో, దారిలో
 గదిసి, ఈ గిరిదుర్గ
 గండమున మూరు రా
 యర గండని నిశాత
 కర ఖడ్గమది ఖంగు
 మనినంత, గుహాలతో
 మారు మ్రోగినదిరా
 హోరెత్తి గాలిలో
 మారెత్తి యీ కొండ.

ఇదియె దేవరకొండ, ఇదియె దేవరకొండ,
ఇట యెన్నడో వేసెనట వెలమపులి గండ్రు.

పట్టి పన్నెండేండ్ల
 ముట్టడికి యెద గాచి,
 కుడి మీస మెక్కించె.

తోష జప్పరించి, లం
గోరి కెక్కి, ఫిరంగి
గుండ్లతో చెండ్లాడి,
ఆ నల్కి సాలారు,
'అల్లారో' యని దంతు
మలుపుకొని పోగ నుం
గలికోట దాట వెం
టాడిరట ఈ కోట,
అది వెల్మలకు ఆట.

వెలమ నగాన బొ
బ్బిలికోట, ముందు రెప
రెప లాడి మెరుగు పం
దెపు కోళ్ళు, కడగి సిడి
కిట మీద మెగడువ్వి
ఓటికేయు గడి దొరలు,
కదనత్తి తాండ్ర పా
పయ కత్తి, నా కంటి
పాపలో ఒక కొంగ
నేపు పాములు జూపు.

అలరాచకొండలో
వలరాచవాని తలి
రాకు మొలబాకు నా
జూకు భోగిని పోకు;
కవిరాజ రాజు సిం
గమనీని దర్బారు
కవులకే వాకట్టు
గట్టు వాక్యార్థములు;
తిరుగు నా కనులలో
గిరగిరన, నా యంత
రంగమే ఒక చిత్ర
రంగమై భ్రమియించు.
వెలమలన్నంత క
న్నులు మేలుకొని చూచు.

వెలమ బిరుదులు విన్న
పులకలే మొలకెత్తు.
వెలమలన కోడిపుం
జాలకె యీకలు నిక్కు
వెలమ లన్నపుడె గుం
డెలు గుబాళించురా.

ఒకనాడు వెలమలకు ఉనికిరా యీ కొండ,
ఇదె కొండ, ఇదె కోట, ఈ కొండ [illegible],
ఇట యెన్నడో యెగిరె నటరా తెలుగు జెండా,
ఏ నాటి దీ పిరధాని దేవరకొండ.

ఏకే యిపుడు బహి
ర్ద్వారాలలో నిల్వ
శిలాలు జేసేటి
బోతు బంట్లు?
ఈ మంగిళ్ళలో వి
రామాల పులి జూద
మాడ కేరింత లిడు
కోడె దొరలు?

బొందు చెక్కిన మొను
పీక ముద్దిడగా సె
బాసు శెహ్బాసు గట్టి,
మీస మెక్కిన వెల్మ
రాయుండు కొలువున్న
రచ్చబండలు ఇవ్వె,
రాచనగరులు ఇవ్వె,
రాచనగరులముందు,
రచ్చబండలముందు,
బహు పరాకులు వల్కు
భట్లు వరీ నేడు?
కేచెర్ల గోత్రాలు
కీచురాళ్ళే పాడు.

ఇవిగో యివియే నుహా
ర్నవమి కోలాటాల

డప్పు దరువులు—ఢాలు కత్తులు,
ఏవి తమ్ముడ? ఎచట తమ్ముడ?
ఏదిరా ఆనాడు మ్రోగిన వెలమదొర ఢంక?

పల్లి పాడుపడందు బెదరినమాట మంగలితోట యేదీ?
మంచినీళ్ళబావి ప్రక్కన మల్లె పందిరిచాలు యేదీ?
కంజీకటులలోన కాంతి బురుజుపై

ధగధగ మండెడి నెగడులేవి?
ఏమాయెరా కొండ రామాలయమ్ముపై
దివికి దారులు చూపు దీపకళిక?
రాణివాసపు మంగళారతు లేమాయె?

చావళ్ళముందు మషాలు లేవి?
దూరాలలో ధనాగారాలలో వెల్గు
పారా దివియ లెన్నడరిపోయె?
నిత్యదీపావళీ 'మహార్నిలయ'యగుచు
తెలుగు మొనగాని వలచిన కలిమికన్నె
రేక చెడి యేలకో, అమాసరేల మునిగి
మూల్గుచున్నది చుక్కల వెల్గు గనుచు.

కొక్కెరగ రాని కుంకుమపూల గరిసెల
గబ్బురెట్టలు పైచు గబ్బిలాలు
పెరుమాళ్లగుళ్లు కొబ్బరనీటి కోనేళ్ళు
ముళ్ళకంచెలు అడ్డి మూతపడియె
రసరాజు మాధవప్రభుని నాటకశాల
కప్పుబండలు నేల కరచుకొనియె
ఏనాటి కొండ కన్నెరుగని పూబోండ్లు
తిరిగినకడ లేచె పరికి పొదలు
భూనరుడులేని ఈ రుద్రభూమియందు
నిత్యతాండవ క్రీడా వినిరతుడగుచు
కాపలా కాయుచున్నాడు రేపుమాపు
కాళిసహితుడు మూడవ కన్ను దెరచి.

పారగుపురుగు మొదలు పోలిక లేదట,
నేలదక్క పైన నింగి దక్క
సాగిపోవుచుండు సర్వకాలమ్ముల
గాలిపిల్లవాని జాలిపాట

# ఆంధ్రప్రదేశ్ అవతరణ: అనంతర సాహితి

శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఇప్పటికి ఆంధ్ర ప్రదేశ్ అవతరణ జరిగి మూడు సంవత్సరాలు గడిచిపోయినవి, మూడు ఉగాది పండుగలు వచ్చి పోయినవి; తెలుగు ప్రజల చిరకాల మనోరథము ఈ విధముగా సిద్ధించిన పిమ్మట ఆంధ్ర సారస్వతానికి కలిగిన అభ్యుదయమేమి యను ప్రశ్న సహజముగా ఉత్పన్నమగుచున్నది. ఎందుకనగా భాషారాష్ట్రాల యేర్పాటుకు సారస్వత సంస్కృతుల అభివృద్ధియే మూలకారణము; ప్రధాన ప్రాతిపదిక. ఈ ప్రశ్నకు సమాధానమును గూర్చి ఆలోచించినప్పుడు, మనము సాధించిన ప్రగతిని గూర్చి నిరాశ చెందవలసిన ఆవశ్యకత లేదని వెల్లడియగుచున్నది; కనుచూపు మేరలో మనకు కాంతివంతమైన భవిష్యత్తు గోచరించుచున్నది.

ఆంధ్ర ప్రదేశ్ అవతరణ తరువాత సంస్కృత భాషపట్ల సాహిత్యరంగమున ఇతోధికమైన ఆదరాభిమానాలు ప్రబలుచున్న తార్కాణములు మనకు కనిపించుచున్నవి. సంస్కృత కావ్యాల ఆంధ్రీకరణ కృషిని యిందుకు నిదర్శనముగా చూపించవచ్చును. ప్రసిద్ధ కవి పండితులు, ఋతు సంహారము మేఘదూత వంటి కావ్యలను, ముద్రారాక్షసము, ఉత్తరరామ చరిత్రవంటి నాటకాలను, పండితరాజకృతులను తెనిగించి ప్రకటించియున్నారు. సాధారణమైన జనములో భారత భాగవత రామాయణాల ఆంధ్రీకరణము జరిగినది. పూర్వపద్ధతి కావ్యాల రచన ఆంధ్ర సాహిత్యలోకమున సంస్కృతభాష మీదనే కాక ప్రాచీన వాఙ్మయము మీద కూడ వ్యాప్తి చెందుచున్న అభిరుచికి నిదర్శనమైయున్నది. విశ్వనాథ రామాయణము కిష్కింధ కాండము చాలమట్టుకు ప్రకటితమై ఆంధ్ర దేశములోని ముఖ్యపట్టణాలలో స్వయముగా కవి సమ్రాట్టుగారి చేత పఠితమగుచు, ప్రజల ఆదరాభిమానాలను చూరగొనుచున్నది; కంబరామాయణము తెలుగులోనికి వచ్చినది; తులసీ రామాయణము ఆంధ్రీకృతమైనది; పుట్టపర్తి కవి కృతమైన మరొక రామాయణము త్వరలో ప్రకటితము కానున్నది. గోపీనాథ రామాయణము పూర్తి చేయు కృషి జరుగుచున్నది. చంద్రమౌళిగారు రామాయణ సుధాలహరిని తెలుగు సీమలో ప్రవహింపజేసినారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు భారతోత్సవాలను, భాగవతోత్సవాలను ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భమున నిర్వహించి, ఆంధ్ర భారత భాగవతాలమీద ఉత్తమ విమర్శ గ్రంథాలను ప్రకటించినది. ఇంకొకవైపున గాథాసప్తశతివంటి ప్రాకృత కావ్యముల తెనిగింపు జరిగినది; కంచుఢక్క వంటి ప్రౌఢప్రబంధములు ప్రకాశితమైనవి. ఈ రచనా వ్యాసంగమంతయు ప్రాచీన సాహిత్యరీతుల పట్ల ఆంధ్ర దేశానికి గల అభిరుచికి ఉదాహరణలై యున్నవి. మరికొందరు కవీశ్వరులు మధ్యయుగపు చారిత్రక గాథలను ప్రాచీన కావ్యధోరణిలో గానము చేసినారు. ఆంధ్రపురాణము, కృష్ణకథావిపంచి యీ శ్రేణికి చెందిన వాఙ్మయము. పోతన పవిత్ర జీవితమును వరదాచార్య కవి రసవంతమైన ప్రబంధముగా రచించినారు.

పూర్వ సాహిత్య రీతులపైన అభిరుచి, అభిమానము ఒకవైపు ఈ విధముగా అభివృద్ధి చెందుచుండగా మరొకవైపు దివ్యకావ్య కుసుమాలు అనేకము యీ మూడు సంవత్సరాలలో వికసించి పరిమళించినవి. విశ్వనాథ, శ్రీ శ్రీ ప్రభృతులైన కవుల రచనా వ్యాసంగము సాగుచునే యున్నది; రాయప్రోలు తమ కావ్యావళిని పునర్ముద్రణము గావించినారు. తుమ్మల, జాషువా కవీశ్వరులు అప్పుడప్పుడు గొంతెత్తి పాడుచునే యున్నారు. ఈ కవీశ్వరులచే ప్రభావితులైన యువకవుల కవన సామగ్రులు ఆంధ్రావనిలో బహుళముగా జరుగుచున్నవి. గానములను గేయాలుగా మార్చి, అంగారవల్లరులను కావ్యవీధులలో ప్రజ్వలింపజేసిన స్మృతులను గూర్చి కావ్యగానము చేసిన రచయితలు, తెలుగుసీమలో మనకు కనుపించుచున్నారు. భిన్న కావ్యకుసుమాలు, నార్ల వారి మాటలు, రాయని సుబ్బారావు కృతులు, దాశరథి కావ్యపరంపర; సి. నారాయణరెడ్డి కృతిగేయ కావ్యముల పుంఖానుపుంఖ ప్రకటన మొదలగు రీతులుగల కవితాప్రవాహము గడచిన మూడు సంవత్సరాలలో మన సాహిత్యరంగమున గమనింపదగిన విశేషములైయున్నవి. సమకాలిక రాజకీయాలపైన వ్యాఖ్యానాలు, వ్యంగ్యవిమర్శనలు, తిక్కనాది కవుల జీవితములు తెలుగు కవులకు ఇతివృత్తములైన ఉదాహరణములు మనకు ఈ కాలమున గోచరించుచున్నవి.

ఈ మూడు సంవత్సరాలలో ప్రకటితములైన ఉద్గ్రంథాలను ఈ సందర్భమున పేర్కొనవలసియున్నది. తెలుగుభాషాసమితి వారి విజ్ఞానసర్వస్వ సంపుటముల (అందులో ఆంధ్రసంస్కృతి సంపుటమును ప్రత్యేకముగా ప్రశంసించవలసియున్నది) తోపాటు ఆంధ్ర విజ్ఞానకోశ సంగ్రహము ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగిన తరువాత వచ్చిన ఉత్తమ గ్రంథములు. ఆంధ్రప్రదేశ్ అకాడమిచేత బహూకృతమైన నన్నెచోడుని కవిత్వము ఒక మేటి సాహిత్య విమర్శ; కళాపూర్ణోదయముపైన ఆంగ్లములో కృష్ణారావు గారు ప్రకటించిన సంపుటము మరొక ఉత్తమ సాహిత్య విమర్శ. త్యాగరాజ కృతులను చక్కగా, విశదముగా ఆంగ్లలిపిలో వాని అర్థమును ఆంగ్లభాషలోను సంపుటీకరించి, సకల ప్రపంచానికి ఆంధ్రగానమాధురిని, ఆంధ్రవాగ్గేయకారకుని, భక్తాగ్రేసరుని పరిచయము గావించిన ప్రయత్నము మనరాష్ట్ర అవతరణ తరువాతనే జరిగినది. తెలుగులిపి పుట్టుపూర్వోత్తరాలను తెలియజేసిన పరిశోధన ఫలము ఈ కాలముననే మనయొడిలో పడినది. చాలకాలమునుండి నిరీక్షితమైన శబ్దరత్నాకర పునర్ముద్రణము యిటీవలనే జరిగినది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సిద్ధము చేయించిన తెలుగు

శాసనముల సంపుటము నడికోరాల సంపుటము రాష్ట్రావతరణ తరువాత ప్రకటితమైన ఉద్గ్రంధాలు. ఈ సంస్థపక్షాన నన్నయపద ప్రయోగకోశము, వ్యవసాయవృత్తికి సంబంధించిన మాండలిక కోశము సిద్ధమై అచ్చు కానున్నవి. మాధవరామశర్మగారి నాట్యవేదము, అప్పారావుగారి నాట్యశాస్త్రము, రామరాజుగారి జానపద వాఙ్మయము, ఆంధ్రదేశ గ్రంధాలయ సంఘము ప్రకటించిన వ్యవసాయజ్ఞానము, శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారి ఆంధ్రకవయిత్రులు (రమణీ రమణీయ సాహిత్య సమితి) ఈ మూడు సంవత్సరాలలో ప్రకటితమైన ఉత్తమ వాఙ్మయము. ఈ వాఙ్మయము ఈనాడు మనభాషలో జరుగుచున్న బహుముఖమైన కృషిని వివరించుచున్నది

ఈ కృషితో పాటు సంస్థాగతమైన కృషినిగూడ ఈ సందర్భమున పేర్కొనవలసియున్నది. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రకటన కార్యమును త్వరలో పూర్తిచేయనున్న శుభవార్తతో పాటు ఇతర సాహిత్య కార్యక్రమాలను నిర్వహించనున్న వార్తగూడ శ్రవణగోచరమై సంతోషము కలిగించుచున్నది. హైదరాబాదులోని ఆంధ్రసారస్వత పరిషత్తు ఆంధ్రవాఙ్మయ చరిత్రను ప్రకటించినది. ప్రాచ్యపాశ్చాత్య తత్త్వశాస్త్రమును ఆంధ్రీకరించి, ప్రకటించుటకు నిర్ణయించినది. సంస్కృతి వాఙ్మయచరిత్ర ప్రకటనముగూడ త్వరలో యీ సారస్వత పరిషత్తుపక్షాన జరుగనున్నది. లక్ష్మణరాయ పరిశోధక మండలి కేంద్రప్రభుత్వమునుండి కొంత ఆర్థిక సహాకారముపొంది తెలంగాణ శాసనముల రెండవ సంపుటమును అచ్చువేయుటకు పూనుకొనినది. దక్షిణభారత పుస్తకసంస్థ గ్రంథప్రకటనము ద్వారా తెలుగు భాషాభివృద్ధికి తోడ్పడుచున్నది. విశాలాంధ్ర ప్రచురణాలయము ఉపయోగకరమైన విజ్ఞానవాఙ్మయము, బాలవాఙ్మయము, ఆంధ్రదర్శిని ద్వితీయసంపుటము, నృత్యరేఖ, గురజాడ కవి రచనలు, గిడుగు పండితుని గ్రంథములు మొదలైన ఉత్తమ వాఙ్మయము ప్రకటించుచు చేయుచున్న కృషి ప్రశంసనీయమై యున్నది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ యేర్పడి, నిర్ణీత కార్యక్రమముతో పురోగమించుచున్నది. రాబోవు సంవత్సరము చేనేతవృత్తికి సంబంధించిన మాండలిక కోశము, నన్నయ సమకాలిక కవుల శబ్దప్రయోగకోశము, తరువాతి తిక్కన పదప్రయోగ కోశమును సిద్ధముచేయించుటకు తీర్మానించి పురోగమించుచున్నది. ఉత్తమ సాహిత్య గ్రంథాలకు బహుమతులను ప్రకటించుచు రచయితలను ప్రోత్సహించుచున్నది. కేంద్ర సాహిత్య అకాడమి యితర భాషలనుండి ప్రామాణిక సాహిత్యమును తెలుగులోనికి దీసికొనివచ్చు కార్యక్రమమును నిర్వహించుచున్నది. రవీంద్ర శతవార్షిక జయంత్యుత్సవము వరకు రవీంద్ర వాఙ్మయమును సమగ్రముగా అన్ని భారతీయ భాషలతో పాటు తెలుగులోనికి గూడ అనువదింపజేసి, ప్రకటించుటకు నిర్ణయించినది; ఆంధ్ర కథా సంపుటమును ప్రకాశింప జేసినది. ఆంధ్ర కావ్య సంపుటము త్వరలో రానున్నది. ఆంధ్ర సాహిత్య చరిత్ర తెలుగులోను, ఇంగ్లీషులోను వ్రాయించుట పూర్తియైనది. త్వరలో ప్రకటనగూడ జరుగగలదు. ఆంధ్ర విశ్వవిద్యాలయము పక్షాన శబ్దల ఉత్పత్తికి సంబంధించిన నిఘంటువు సిద్ధమగుచున్నది. మద్రాసు

విశ్వవిద్యాలయము ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వ ప్రకటనను ప్రారంభించినది. ఆంధ్ర భాషలోను, ఉర్దూలోను ఉత్తమ చరిత్ర వాఙ్మయమును, విజ్ఞాన వాఙ్మయమును ప్రకటించు ఆశయముతో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారి యాజమాన్యమున ఉర్దూ తెలుగు అకాడమి యావిర్భవించినది. దక్షిణభారత హిందీప్రచారసభ దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారి జీవిత చరిత్రను ప్రకటించినది. శ్రీ కాళేశ్వరరావుగారు తమ జీవితచరిత్ర ప్రథమ భాగమును నవ్యాంధ్రము అను పేరుతో ప్రకటించినారు. ఈ విధముగా గడచిన మూడు సంవత్సరాలలో తెలుగుదేశమందలి సారస్వత స్థితిని, కృషిని స్థాలీపులాక న్యాయముగా పైన పేర్కొనుట జరిగినది; ఈ కృషి సర్వవిధాల ప్రశంసనీయమై, ఉజ్జ్వల భవిష్యత్తును సూచించుచున్నదని చెప్పవచ్చును.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుజరిగిన తరువాత తెలుగుభాష ద్వారా పరిపాలన జరుగవలసిన ఆవశ్యకత గుర్తింపబడినది. శాసనసభలందున పరిపాలనకు సంబంధించిన శబ్దకోశమును సిద్ధముచేయుటకు ఒక సంఘము నియమింపబడి పనిజేయుచున్నది. ఈ శబ్దకోశము పూర్తియైనదనియు, త్వరలోనే ప్రకటితము కాగలదనియు తెలియుచున్నది. ఆధునిక అవసరాలదృష్ట్యా తెలుగులిపిలో చేయవలసిన మార్పులను సూచించుటకు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నియమించిన సంఘము తన పనిని పూర్తిచేసినదని తెలియుచున్నది. తెలుగుభాషకు మంచి టైపు యంత్రములను నిర్ణయించువిషయమైకూడ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము శ్రద్ధవహించుట ముదావహమైన విషయము.

గడచిన మూడుసంవత్సరాలలో ఆఫ్రికా జాతీయోద్యమము ఈజిప్టుదేశచరిత్రము, తురుష్క ప్రజాస్వామ్యము వంటి చరిత్ర గ్రంథాలు ప్రకటితమైనవి. ఆంధ్రగాయకులచరిత్ర, ఆంధ్రవాగ్గేయకారచరిత్ర, దక్షిణదేశములోని నాట్యములు, గృహాలంకరణము—ముగ్గులు, అంటువ్యాధులు, వంటలు—పిండివంటలు మొదలైన వివిధ విషయాలమీద విజ్ఞానదాయకమగు వాఙ్మయము ప్రకటితమైనది. సరోజినీదేవి, శరచ్చంద్రుడు, చలం మొదలైన సాహితీపరుల జీవితములు ప్రచురింపబడినవి. ఆంధ్ర భాషలో జరుగుచున్న సారస్వతాభివృద్ధియొక్క వైవిధ్యమునకు యీ కృషి మంచి నిదర్శనమై యున్నది. ఇతర భాషలనుండి సాహిత్యము—ముఖ్యముగా నవలలు యీ మూడు సంవత్సరాలలో చాల ప్రకటితమైనవి. ప్రేమ్‌చంద్, శరచ్చంద్రుల రచనలు పూర్తిగా తెలుగులోనికి వచ్చినవి. జైనేంద్రకుమార్, ఇలాచంద్రజోషి, గోర్కీ, టాల్‌స్టాయ్, జోలా, హ్యూగో, పెర్ల్ బక్. మహాశా ప్రభృతుల రచనలు తెలుగు భాషలో పరివర్తింపబడినవి. దేశకవితామండలి, ఆదర్శ గ్రంథమండలి, దేశోద్ధారక గ్రంథమాల మొదలైన సంస్థలు తెలుగు భాషాభివృద్ధికొరకు చేయుచున్న పని గమనించదగియున్నది. స్వతంత్ర నవలలు కొన్ని యీ మూడు సంవత్సరాలలో ప్రకటితమైనవి. కొడవటిగంటి, భాస్కరభట్ల, బుచ్చిబాబు, శ్రీదేవి, సాంబశివరావు, ధనికొండ ప్రభృతులను యీ నవలా రచయితలలో పేర్కొనవలసి యున్నది. నోరి నరసింహశాస్త్రిగారి కవిత్రయానికి సంబంధించిన తమ నవలలలో మూడవదైన మల్లారెడ్డిని ప్రకటించినారు. మొత్తము మీద యీ రంగములో గడచిన మూడు సంవత్సరాలయందు అనువాదాలకే హెచ్చు ప్రాముఖ్యము లభించినట్లు స్పష్టమగుచున్నది.

ఆధునికాంధ్ర సాహిత్యములో ప్రత్యేకముగా ప్రశంసించదగినది కథావాఙ్మయము. ఈ మూడు సంవత్సరాలలో యీ రంగమున చక్కని అభివృద్ధి జరిగినదని చెప్పవచ్చును. చలం, దీక్షితులు, గోపీచంద్, మునిమాణిక్యం, పద్మరాజు, రామకృష్ణశాస్త్రి, మొక్కపాటి ప్రభృతులైన ప్రముఖాంధ్ర కథకులు తమ కథానికలను సంపుటాలుగా ప్రకటించినారు. ఈ కథకుల రచనలను పరీక్షించుచు, 'అక్షరాభిషేకము' జరిగినది. యువ కథకులు ఎందరో ప్రతిభావంతములైన కథానికలను వ్రాసి భారతి, ఆంధ్ర వారపత్రిక, స్వతంత్ర, ఆంధ్రప్రభ, గోలకొండ మొదలైన పత్రికలలో ప్రకటించుచున్నారు. జాగృతి, చుక్కాని, ఆంధ్రజ్యోతి (యువ ప్రచురణ) మొదలైన పత్రికలలో కథాసాహిత్యము బహుళముగా ప్రకటితమగుచున్నది. నవ్యసాహితీ సమితి గడచిన సంవత్సరము కథానికల పోటీని నిర్వహించి, ప్రకటితములైన వానిలో ఉత్తమ కథను యెన్నుకొని, ఆ కథకుని సత్కరించి యున్నది. కథానికతోపాటు నాటిక మన యువరచయితలు ఈ మూడు సంవత్సరాలలో ప్రత్యేకముగా ఆదరించి, ఉపాసించిన వాఙ్మయ విశేషము. ఈ కాలమున శ్రీ రాజనున్నారు, శ్రీ గోపాలరెడ్డిగారల వంటి పెద్దలు తమ నాటికలను సంపుటీకరించి, ప్రకటించినారు. బాలసాహిత్యము యీ కాలమున విశేషముగా ప్రకటితమైనది; కేంద్ర ప్రభుత్వము కొన్ని పుస్తకాలకు బహుమతులను ఇచ్చి ప్రోత్సహించుచున్నది. రచయితలు వ్యక్తిగతముగా నేకాక, సంస్థలు గూడ బాలవాఙ్మయము ప్రకటనము పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసికొనినవి. తెలుగుభాషలోని ఉత్తమ ఖండకావ్యములను యేరి కూర్చి ఇంగ్లీషులో ప్రకటించుటకు ఈ కాలమున యువకులు కృషిగావించి యున్నారు. East and West, త్రివేణి మొదలైన పత్రికలను యీ సందర్భమున ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది.

ఈ విధముగా గడచిన మూడు సంవత్సరాలలో ఆంధ్రభాషాభివృద్ధికి వ్యక్తిగతముగాను, సంస్థాగతముగాను, జరిగిన కృషి గణనీయమై యున్నది. ఈ కృషిలోని వైవిధ్యము కూడ గమనించదగియున్నది. ఆధునిక అవసరాల దృష్ట్యా విజ్ఞానవాఙ్మయ ప్రకటనము పట్ల మనవారు ఇప్పుడిప్పుడే శ్రద్ధ జూపుట ప్రారంభించినారని చెప్పుటకు మనముందు తగినన్ని ఉదాహరణాలు కనుపించుచున్నవి. బహుముఖమైన యీ సారస్వత కృషి మన భాషను శక్తిమంతమును సంపన్నమును గావించుటకు తోడ్పడుచున్నది. ఇప్పటివరకు జరిగిన పని అల్పముగానప్పటికిని, యింక ముందు చేయవలసినది అపారము కాగలదు.

# సింధు చరిత్రలో సిందూరరేఖ

శ్రీ "రంగారావ్"

ఓంగాగు సీమంతాన కుంకుమ రాసుకున్నది పశ్చిమకన్య. మబ్బుల ముంగురులను గాలివేళ్ళతో సర్దుకుంది. మహమ్మద్ బిన్ కాసిము నమాజ్ నుండి లేచి నిల్చున్నాడు. అరనిముషం కనుమోడ్చి అల్లాకు మళ్ళీ తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు. మోకాలి కిందికని పరచిన బట్టను వంగి తీసుకున్నాడు. తూర్పు వైపు తిరిగాడు.

రావాడ్ కోట బురుజుమీద హరితకేతనంపు నవుము తెల వంక నాట్యంచేస్తూంది. నాలుగురోజుల క్రింద అచోట రెపరెపలాడిన సూర్యధ్వజం అదృశ్యమయి హిందూదేశ చరిత్రలో మాసిన పుటగా మారింది.

మహమ్మద్ కాసిము తనచేతుల వంక చూచుకున్నాడు. ఎన్ని గాయాలు! ఎన్ని హత్యలు! మొక్కనంటి పూవును త్రుంచినంత సునాయాసంగా తలలు తీయించిన కాసిము—దేహం ఒక్క క్షణకాలం వణకిపోయింది. ధైర్యమే మూర్తిపులై తన్నెదిరించగా, ఆ ధైర్యవాహినిలో చిలికి తిలపాలిట కవచమయింది. 'నీరూం' కోట సాధించిన తర్వాత చిన్న చిన్న నావలతో ఉత్తుంగతరంగ సముపేతమయిన సింధునదిని దాటటమూ, రణరంగంమీద రావాడ్ రాజా దహీరుడి నాయకత్వాన ఢీకొన్న రాజపుత్రులను ఓడించడమూ ఒకఎత్తయితే—రావాడ్ కోటను ముట్టడించి, బురుజుమీద ఖలీఫావలీద్ జెండా ఎగురవేయటం మరొక ఎత్తు అయింది. అయినా ఈ రాజపుత్రులకు ఎంతపట్టుదల!! ఇంత రక్తంలోనూ స్నానం చేసి బురుజుమీద యవన పతాక ఎగురవేసినా పరిపూర్ణత్వం విజయలక్ష్మిని పరిహసించింది. దహీరుడి అంతిపుర కాంతలు అగ్నిలో దూకారు.

'ఇబ్రహీంఖాన్!" అని హఠాత్తుగా పిలిచాడు మహమ్మద్ కాసిం.

పరుగెత్తుకుంటూ వచ్చాడు ఇబ్రహీంఖాన్. నడుమునుండి దేహాన్ని వంచి సలాముచేసి నాల్గడుగుల దూరాన నిల్చున్నాడు.

"దహీరుడి కుమార్తెలిద్దరూ దొరికారా?"

"లేదు హుజూర్! మన సైనికులు ఒళ్ళంతా కళ్ళుచేసుకుని వెతుకుతున్నారు. పొద్దుపొడిచేలోగా వాళ్ళిద్దరూ మీముందు నిల్చోగలరు హుజూర్..."

"మాటలు కాదు ఇబ్రహీం, పనికావాలి!" అంటూ కోట వైపు నడిచాడు కాసిము. ఇబ్రహీంఖాన్ నవ్వుకున్నాడు.

'ఏమిటే భయ్యా, ఆ నవ్వు?" అంటూ ఎదురయ్యాడు తోటి దళనాయకుడు సలీము.

"ఇంకేముంది సలీం! మామూలే! మదిరా - మగువ—"

"ఏమిటి కథ?"

"చనిపోయిన రాజాకూతుళ్ళమీద కాసింగారి కన్నుపడింది."

"సహజమే కద!"

"అదికాదు సలీం! కాకలు తీరిన నాయకులోడిన రంగం మీద ఈ కుర్రవాడు జయించటమే అపూర్వం. అలాంటప్పుడు—సామ్రాజ్యం సుస్థిరం కాకముందే, శత్రుశేషం పూర్తిగా నాశనం కాకముందే కోట బయట రాబాగుల చప్పుడు మాయకముందే, దహీరుడి రాణి దూకిన మంటలు ఆరకముందే – మన నాయకుడీన దగినవాడీవిధంగా కోటల కౌగిలో పడితే, ఇంకా సైన్యం ఏం కావాలి? క్రమశిక్షణ, శాంతి భద్రత ఏమయిపోవాలి? ఆలోచించు..."

"నీవింతా మరీ ముసలివాడవోయ్ ఇబ్రహీం! లేకపోతే ఇంతగా కలవరిం . యుద్ధం జయించిన తర్వాత కుర్రాళ్ళకు కొంతయినా ఉపహారం లేకపోతే ఉత్సాహం చచ్చిపోదూ? దండశాసనుడు కాసిమున్నంతకాలం శాంతి భద్రతలు గుండెమీద చేతులు వేసుకు కండ్లు మూసుకోవచ్చు.. ... కదనరంగం మీదయినా, కామిని అధరం వెనకయినా - ఎటూ పుని, కాదనకపోవటం భోగుల లక్షణమనీ, కాసిము ఇంకా శైలాపచ్చీసుని దాటలేదనీ తెలుసుకో ఇబ్రహీం!"

"కాఫరు కన్నియ కౌటుకరేఖ వినా పలకరించినట్లుందే సలీం..."

"నిజంగా ఈ హిందూకన్యలను చూస్తుంటే దేహం పరదలా పొంగి మొగ్గలా ఉబుకుతుంది సుమా!" అని సలీం కండ్లు మూసుకుంటే ఇబ్రహీంఖాన్ పెద్దగా నవ్వాడు; సలీము వీపుని చరిచాడు.

వారిద్దరి నవ్వుకూ రావాడ్ కోట కండ్లు చెమర్చాయి.

* * * *

"మట్టినీ, రాయిని కైవసం చేసుకున్నానని కైపులోకి పోకు కాసిమ్! మేము మనుష్యులం; అందులో మా అగ్నివంశజులం. మాలో ప్రవహిస్తున్నది నీరు కాదు; రజపుత్రుల రక్తం. యుద్ధభూమి మీద జయం మాది కాకపోవచ్చు, కాని మా వ్యక్తిత్వానికి, మా జాత్యభిమానానికి నాశనం వుండబోదు. సెతుగమకుల నీతి మా సిరి సంపదల మీద కోరలు చేతులు జాచిన దోపిడికొండ్రు ఒక్కరు కాదు, ఇద్దరు కాదు. ఇలాటి దండయాత్రలూ, గంపె యాత్రలూ మా చరిత్ర నిండా కన్నాము, దండిగా విన్నాము. అయినప్పటికీ మా లక్ష్మి అకళంకం, మా జాతీయత చిరంజీవి. నేటి రాహువుల ఆయువు అల్పమాత్రమే, మా సూర్యాంగ్రగులు కతికి కొంత అతిథులు...మా నాన్నను చంపావు. మా అమ్మను అగ్నిలో

దూకించారు. మా వారిని నాశనం చేశారు. మా ఇల్లంతా కొల్లగొట్టేసు కున్నారు. ఇక మిగిలింది మేము. మహావీరుడయిన ముగధీరుడి ఎదుట ముడిచికట్టిన హస్తాలతో నిల్చున్నాము—ముగుదలం! నీ చేతిలోని ఆ కరవాలాన్నిలా పారవేస్తే......"

హుంకరించి దూకబోయిన ఇబ్రహీంని చిరునవ్వుతో వారించి ఇటు తిరిగి అడిగాడు కాసిము—"...పారవేస్తే ఏం చేస్తావు చందన్ దేవి?"

"నీ గుండె నెత్తురుతో మా తలిదండ్రులకు తర్పణ చేస్తాను. తర్వాత వాళ్ళను చేరుకుంటాను. మధు కలశాన్ని అందించే బల హీనలకు బానిసలకు మగలయిన మీకు రాజపుత్ర కాంతలంటే జీవ చ్ఛవాలు కారనీ, రాజపుత్ర నిప్పురవ్వలనీ క్రొత్త పాఠం నేర్పుతాను..."

"చందన్ దేవి...అందం ఆకారంగా, ఆనందం ఊపిరిగా వున్న నీలో ఈ ఆవేశాన్ని చూస్తుంటే..."

"...చూస్తుంటే—?" అని మొదటిసారిగా పెదవి కదిల్చింది రాగిణీదేవి.

"మా చెల్లెలు ఫాతిమా గుర్తుకు వస్తున్నది..." అన్నాడు కాసిము మెత్తగా.

"ఛీ! దుర్మార్గుడా! సగం నిముషం తర్వాత శయ్యను చేర లేనిదానిని కూడా సోదరీ అనగల్గిన జంతువులు మీరు!"

"నోర్ముయ్!" అని గర్జించాడు ఇబ్రహీంఖాన్. మహాముద్ బిన్ కాసిము పలికాడు. అతడి కళ్ళలోని లాలన చూసి ఇబ్రహీము రసికత్వం మౌనం గవ్వుకుంది.

"చందన్ దేవీ! రాగిణీదేవీ! మీ ఇద్దరికీ రానున్న భాగ్యాన్ని ఊహించారా?"

"బురకాలు తొడిగి మొరకవీధి వారమై, నీ ఇంటిలో సేవకురాళ్ళుగా, మధుపాన మధురగానాల మధ్య గడిపే జీవితం విషాటికే మాపాలిటి భాగ్యం కాజాలదు కాసిం! ఈ మాట మరవకు!" అంది చందన.

"నీ ప్రేమ లాలన లాలకించి, నీ హస్తస్పర్శకు పులకించేవి మా శవాలని తెలుసుకో!" అంది రాగిణి.

"మీ ఇద్దరి వివేకం ప్రశంసనీయమయినా ఈ విషయంలో మీరు పొరబడ్డారు. ఈ దేశమంతా మావారిదిగా చేసి, ఇక్కడి పౌరులందరిని ఏకం చేసి, వారందరికీ ఒక్క దేవుడి నేర్పరచాలన్నది నా జీవితాశయం. ఆ ప్రయత్నంలో ఆనందానికి అనందానికి చోటు లేదు. నా శవం కూడా మిమ్మల్ని స్పర్శించదు. మీ భవిష్యజ్జీవితం మరొక తీరున వుండగలదు."

అక్కచెల్లెళ్ళిద్దరూ ఆశ్చర్యంతో చూశారు. ఇబ్రహీం మొహం మీది ప్రశ్నను చూసి నవ్వాడు కాసిము.

జవాబు చెప్పలేదు.

*　　　*　　　*

అటూ ఇటూ అశ్వికదళం అనరాగా సాగిపోతూంది పల్లకి.

"అక్కయ్యా!" అంది చందనదేవి. రాగిణి చెల్లెలివైపు చూసింది.

"ఆ ఖలీఫా ఎలా వుంటాడో..."

"ఏమో...?"

"కొండలు దాటి ఎరగని మనం జన్మసీమను దాటుతున్నామంటే వింతగా వుందక్కయ్యా!"

"నాన్నగారు వీరస్వర్గం అలంకరించిన తక్షణం దేవి ఆల యంలో వుండకపోతే అమ్మావాళ్ళతో 'జౌహార్' చేసి వుండే వాళ్ళం. అయినా..."

"ఆ అవకాశం లేదు మనకు...అక్కయ్యా...ఈ వుంగరాన్ని మింగి—"

"తొందరపడకు చందనా, తొందరపడకు! అమ్మకు, నాన్నకూ మనలను దూరం చేసిన మహావీరుడికి జవాబు చెప్పొద్దా చందనా?"

"అంతేకాదు...మన కవుర్ని వశమూనం చేసి మన ఆలయా లను కూల్చి—తన దేవుడిని, తన మతాన్ని, ప్రసాదిస్తాడట ద్రోహి!"

"చందనా! మన మతం ఎంత గొప్పదయినా మన ధర్మం ఎంత ఆదర్శవంతమయినా, మనవారు ఎంత వీరులయినా—లౌకికంగా ఘోరపరాజయాలు మనవవుతున్నాయి. అనైకమత్యమూ, అనవస రపు ఆవేశమూ మనవారి పాలిట శని నతలయి మన చరిత్రను అప కీర్తులతో నింపి, మన భవితవ్యాన్ని అపహాస్యం చేస్తున్నాయి. చనిపోయిన మన అమ్మ, ఆమెతోటి వారూ, ఒక్కొక్క తురక నొప్పున చంపి, పోయివుంటే ఎంత బాగుండేదో ఆలోచించు చందనా!"

"వందల వేల ప్రజల ప్రాణాలుతీసి, అబలలపై అత్యా చారాలు జరిపిన ఆ కసాయివెధవ, ఆ అవినీతిపరుడు, మనలను తన ఎదుట నిల్చోబెట్టి బుద్ధిశాలిలా నీతులు మాట్లాడుతుంటే నిప్పుల వర్షంలో తడిసినట్లయింది..."

"నీ కన్న పెద్దదాని అవమానభారం నీ వెరుగవా చందనా? పరువంపు మగువలు పరాయిచేతుల జిక్కి మరో దేశానికి వెళ్ళి పోవడం కన్న ప్రాణాలు కోల్పోవడం వాంఛనీయమే—కాని ఆత్మహత్య—పాపమే కాదు, అజ్ఞాన శిఖరం కూడా. ముష్కరులు ముట్టడించినప్పుడు మూగలమై మన ప్రాణాన్ని మనమే చులకన చేస్తే వైరుల కంటు బ హీనుల మనసంతేనా? తద్వారా వారి దురం తాలకు రాచబాటలు వేయడం లేదా?... అందుచేత — చందనా! నెమ్మదిగా ఆలోచిద్దాం. దేహంకన్న దేశం ముందనుకుని పనిచేద్దాం మన మగవారు వీగినచోట విజయధ్వజం విప్పుదాం. చతుర్విధోపాయాలలో మూడో దానిమీద మేడ కడదాం. యాదవ కులంలోకి ముసలం విసురుదాం!" అంది రాగిణీదేవి—పల్లకీపరదాల గుండా అవలోకిస్తూ. అక్క కళ్ళల్లోని వింతవెలుగులను అర్థం చేసు కోవడానికి ప్రయత్నించింది చందన.

"చేతజిక్కిన రాచిలుకల కదంటావే కాసిము! తెలివితక్కు వనుకూడా రాజభక్తి అంటారు కాబోలు—" అని నవ్వుకున్నాడు అశ్వదళాధిపతి అల్లాబక్ష్.

ఎదుట నిల్చిన వసంతాన్ని కాదని, గిరుగనుకతలి శిశిరానికి సయనమయిన జగాగండ్రుడి చిత్తములు తెలియక మీసాలు పీక్కు న్నాడు ఇబ్రహీంఖాన్.

అశ్వతరంగాలమధ్య పల్లకీ పవన పక్షిలాగా సాగిపోయింది.

* * *

కిటికీగుండా ఎత్తుగా, గుండ్రంగా స్తంభాలూ గోళాలూ కనిపిస్తున్నాయి.

రాగిణి వెనక్కు తిరిగింది. కిటికీకి ఎట్టఎదుటనున్న అద్దంలో పెద్ద మసీదుబింబం తొంగిచూచింది. రాగిణి అద్దందాక నడిచింది. పాదరసపులను పరిశీలించింది.

ఎత్తుగా, వెడల్పాలుగావున్న అద్దంలో—మెత్తటి మేఘశకలమై తెల్లటి సాగరతరంగమై ప్రతిఫలించింది. పర్షియను తివాసీ; ఆ తెలుపుమీద, హృదయంలా చీలిన రాగిణి కేశి నల్లగా మెరిసింది. ఆసామ్యాన్ని, దాని తారతమ్యాన్ని పోల్చిచూడదీయసాగింది మౌలగా కూర్చున్న చందన.

రాగిణి చప్పట్లు కొట్టింది; దాసీది వచ్చింది.

"ఆకిటికీని మూసెయి."

మసీదు కనబడటం మానేసింది.

చిన్నగిన్నెలు రెంటిని, ఒక వెండికలశాన్ని పాలరాతి పలక మీదవుంచి వెళ్ళింది దాసి. తొంగిచూసింది రాగిణి. కలశంలో రావాడ్ పీగుల రుధిరం పలకరించింది మయూరాసనంమీది గాయం నమచూపింది "ఈ పైజామా, కుర్తా నాకెంత అందంగా వున్నాయో తెలుసా?" అని నవ్వ ప్రయత్నించింది రాగిణి.

"వేషమింకా ఎంతకాలం ధరించాలో?"

రాగిణి పలకలేదు; నవ్వింది.

"క్షణమొక కల్ప మనిపించడంలేదూ ఈ తురకకొంపలో?"

"చెల్లెలా! హిమాలయాల ప్రక్కన నగమెంత? హిందూమతం ఎదుట మతభాగమెంత? ఆలోచించు. దాశరథీపతి దర్శనార్థం దశకంఠుడు రాగానే అతనికి తొలగుతుంది బుద్ధ్యౌర్వంగుడి శృంగభంగం మొదలవుతుంది. హృదయానికి కళ్ళెంవేసి, మెదడు గొళ్ళెంతీసి—వేడుక చూడు!"

"శిఖరం చివరకూచుని సరదాగా సముద్రంలోకి కాళ్ళాడించగల స్థితప్రజ్ఞత్వం నాది కాదక్కయ్యా!"

"చందనా!" అని కౌగిలిని అక్కున చేర్చుకుంది రాగిణి

చందన రుద్ధకంఠంతో పలికింది "కన్నవాడినీ కట్టుకున్నవాడిని అన్నదమ్ములనూ తక్క మరొక్కరిని చూడరాని మనం ఇలా వుండడం జాతిగౌరవానికి విరుద్ధంకాదా అక్కయ్యా? అభిమానం ఆయువుపట్టయిన సంప్రదాయానికి మన నీచప్రవర్తన కళంకం తేదా?"

"చందనా! నువ్వన్నది నిజమే. కానీ—సుస్థిరమయిన పరిస్థితులవేళ మన జీవితాలను నిర్ణయించి శాసించగల మున్నితంపు సూత్రాలోకటి రెండింటిని అపత్సమయాన మీరవలసిందనం దోషం కాదని నా మతం. దేహాలెక్కడవున్నా మన మనసు లెక్కడో వున్నాయిగదా......తలలమీద నిలిపి కొలిచే మన వేలుపులను సోపానాలు చేసుకున్న పాపాత్ములకు ఒకపాఠమయినా నేర్పవద్దూ......"

—దాసీది రొప్పుతూవచ్చింది; వెళ్ళింది.

హెగ్గడికత్తెల ఉగ్గడింపులు ఉన్నత్తుగా లేగి, తగ్గగా—పర్షియా సామ్రాజ్యాధిపతి ఖలీఫా వలీగా—తన నమ్మకస్తుంటు కొనితెచ్చి పంపిన నజరానాల వయగారాల నేత్రపర్వంగా తిలకించడానికి విజయంచేశారు.

"రాచకార్యాల తొందరలో సౌందర్యారాధనకు జాప్యమయింది. ఇందుకుగాను అంగుకు మన్నిస్తారు కదూ?" అన్నారు ఖలీఫా గడ్డం సవ్వుకుంటూ.

మోటు వేళులు మీటిన తీగలా కంపించిన చెల్లెలిని—గుర్వలా పాదిలిసట్టుసుంది రాగిణి

"నా మందిరాలలో అత్యుత్తమమయిన హమామహల్ మీదిగా చేశాను. అన్ని సౌఖ్యాలూ అమరినాయా మీకు?"

"కొదవ లేవి మా కందుతున్నాయి."

"ఓహోహో!...క్షణమాత్రం వీనులవిందొనరించినది రాగిణీదేవి కదూ?"

"చిత్తం" అన్న కంఠం ఖలీఫా పాలిటి జిత్తమయింది.

"ఇలాటి సంగీతజ్ఞానూ, కుసుమకోమలులనూ సృష్టించ కలిగిన భరతవర్షం ఎంత ఐశ్వర్యవంతమో కదా!"

"పురుషోత్తముడినీ, చంద్రగుప్తుడినీ కన్నది మా దేశమేనని విన లేదు కాబోలు!"

ఖలీఫా కనుబొమలెగిరాయి. రాచరికపు పొర్వొకటి అతడి అధరాలను కిరంచేసుకుంది. "ఓహో! చందన్‌దేవి అందానికి అగ్రహారందిద్దిన మెరుగులు ఎంత రమణీయంగా వున్నాయి?" అని రసికలాలసతో, రాణీరీతితో మోహించిన ఖలీఫా కిరీటపు కెంపులు అతడి అంగరకామీది రతనాలతో సరాగాలాడాయి. ఆగ్రహాల వెనక ప్రాణవతినాలనూ, కెంపు వెనక కొంప ముంపునూ గణిస్తూంది చందన

"జహాపనా!"

"రాగిణీదేవి!"

"మేము మా దేశందిలి ఇన్నివేల మైళ్ళుదాటి మీ నాట ప్రవేశించాము; మీ కోట నివసిస్తున్నాము"

"ధన్యుడిని దేవి! నా సర్వస్వమూ చేతులుకట్టుకుని మీ పాదాలచెంత నిలుస్తున్నాయి"

"సువిశాల సామ్రాజ్యానికి ఏకచ్ఛత్రాధిపతులు కదూ—మీరు?"

"మీ ఇద్దరి హృదయ సామ్రాజ్యం నాదవని నమ్మలేకున్నాను రాగిణీ!"

"సకల జననేతలూ, సర్వస్వతంత్రులూ కదు - మీరూ?"

"సన్నికత్తెల సన్నిధానంలో స్వాతంత్ర్యం చేతకాదు సుందరీ!"

"సంకెళ్ళో మొట్టమొదట మీకు తగిలించడం రివాజుకదు జహాపనా?"

"శబ్దాలందుతున్నాయి కానీ, అర్థాలు చిందిపోతున్నాయి రాగిణీ!"

"మరొక్కరి పాదంతొక్కిన పుష్పాన్ని ఆఘ్రాణించడం మీకు అలవాటైనా, జహాపనా?"

"ఏమిటీ రాగిణీ నీ మాటలు?"

"ఎంగిలిపాత్రకు నాలుక జాచడం శత్రువు దుర్బలలక్షణం కావలసు కదూ?"

"ఏమిటీ!" అన్న ఖలీఫా కళ్ళలోని సింధూరకాంతులు రాగిణీ హృదయానికి తాకి జల్లులయ్యాయి.

అక్కడ్యున్న దిక్కు విశ్వాసానికి తలిక్కిపడింది దంపతిదేవి.

*　　*　　*

"ఇబ్రహీంఖాన్!" కాసింగుక్క దిగంతాలను తాకింది.

బాణంలా వాలాడు ఇబ్రహీం.

"ఇది చదువు"

గదివాడు ఇబ్రహీంఖాన్ తలెత్తిమాసి అరిచాడు — "కాదు. కాదు. ఇది నిజంకాదు!"

నిశ్చేష్టంగా నిల్చున్న మహమ్మద్‌ని చూసి నిర్విణ్ణుడయ్యాడు. కాలికింద నేల కదిలిపోతుంటే ఉత్తరంలోని అఖరి వాక్యం మళ్ళీ చదివాడు — 'నీతికీ, రాజనీతికీ అతీతమయిన అహంకారంతో ఆఘ్రాతపుష్పాలను మాలిక్‌కు పంపడం మహా నేరం; క్షంతవ్యం కాని అత్యాచారం. అందుకు మరణమే శిక్ష.' — శూన్యదృష్టితో చూశాడు ఇబ్రహీం.

"ఎద్దుచర్మం సిద్ధంగా వుందా ఇబ్రహీం?"

"హుజూర్! హుజూర్!"

"నిందితుడా బిరుదు కనర్హుడు!"

"ఆ మొనకి తల ......"

"ష్! ప్రస్తుతపు పని చాలావుంది ఇబ్రహీం! ఇదిగో నా కరవాలం; ఇదిగో రాజముద్ర. విటిని గ్రహించు నేటినుండి ఈ నాటిమన సేనకు అధిపతివి నువ్వు..."

"హుజూర్! ...ఇంత అసత్యం! ఇంత అన్యాయం!"

"రాజు శాసిస్తే దేవుడిని కూడ బంధించడం సైనికధర్మం ఇబ్రహీం!"

"నా చేతులార మిమ్మల్ని బంధించలేను హుజూర్!

"నువ్వు పురుషుడివి; ఆపైన సైనికుడివి — ఇబ్రహీం! నాయకుడిగా నా ఆఖరిశాసనం పాలించు; నువ్వు నాయకత్వం వహించు. నా నవుడిగా నా ఆఖరి కోరిక ఆలకించు ఎద్దుచర్మంలో కుట్టి నన్ను మాతృభూమికి పంపించు

*　　*　　*

"పరమ నీచుడు కాసిం శవాన్ని కళ్ళారా చూస్తేగాని దగిరకి రానివ్వనన్నది — రాగిణి. అంటున్నది ఆమె అనంబసౌందరీమణి.

చల్లని వెన్నెలకలశం రాగిణిలో నా కలలు స్నానమాడాలి; ఊదయిస్తున్న విరజాజిపువ్వు చందనలో నా ఊహాలు ఊయాలలు ఊగాలి...మంటలం నిండినా, ఎద్దు చర్మం ఎండినా ఆ పాపి ఆయువు అ సమించలేదు...ఆ వార్త తెచ్చిన రెక్కలతో. విహంగము పై హావామహల్లో వాలి ఆనందంలో తేలి, అంతంలో వాలి పోగల సుముహూర్తం ఎన్నడో కదా?...ఆ అదృష్టం ఇవాళ రాత్రి నా దయితే..."

—ఆఖరుసారిగా గోతిలోకి మట్టినిలో న ఉస్సురంటూ కూలబడ్డాడు చీకటి మనుష్యులిద్దరు.

"ఆలంపనాహ్!"

"కళ్ళు తెరిచాడు ఖలీఫా."

"సింధురాష్ట్రంనుండి ఇబ్రహీంఖాన్ కమ్మ పంపాడు!"

"వెన్నెల వేళ కమ్మలు కమ్మటివి కావు వజీర్!"

"ఇబ్రహీం ఖాన్ పంపిన సైనికుడు దారిలో చనిపోవడంచేత—దీనిరాక ఇప్పటికే ఆలస్యమయింది ఆలంపనాహ్! చాల అవసరమయిన వార్తను తెచ్చింది ఇది!"

"ప్రధానాంశం పఠించండి, వింటాం!"

'—అకుంఠిత విశ్వాసంతో మిమ్ము కొలిచి మీ ఆధిపత్యాన్ని అత్యంతశౌర్య సాహసాలతో విస్తరించి, అసమానులయిన రాజపుత్రులను అవలీలగా జయించి, తన భక్తి సూచకంగా మీకు ఇద్దరు కన్నెల పంపిన పాతికేళ్ళ మహావీరుడు, రాజభక్తుడు, మహమ్మద్ బిన్ కాసిము తమ ఆగ్రహానికి పాత్రుడయినవార్త తమ భృత్యులయిన మాకు ఆశ్చర్యాన్ని, బాధను, కల్గించింది. అప్పటికే అనంచలుడై తమ ఆజ్ఞను నిర్వహించి బందీగా బాగ్దాదుకు మరలిన విశ్వాసపాత్రుడు గళధక్తుడు కాసిము!—ఆ గుండ్రుపవంతుని తమ కోపానికి పాత్రుడయిన కారణం అశ్వదళాధిపతి అల్లాక్ ద్వారా ఇప్పుడే తెలిసింది. ఆరసపుత్రికన్నెల పల్లకిమోసిన సేవకులు చెప్పిన వివరాలివి......'

హంసతూలికలు కంటకాలుకాగా ఉలిక్కిపడాడు ఖలీఫా.

వజీరుగారు వుత్తరాన్ని మడిచేసరికి ఖలీఫా స్థానం ఖాళీగా వుంది.

కోటబురుజులో నాలుగు ఘంటలు కొట్టారు. ఆ శబ్దానికి భయపడి హావామహల్లో గుండ్లకూబ కలవరించింది

వెన్నెలకలశం పగిలి—రాలిన విరజాజిని కప్పింది.

తడిసి వేడిగావున్న కత్తిని ముద్దు పెట్టుకున్నాడు ఖలీఫా.

పతాకంమీద చంద్రుడు వాలిపోతే, ఆకాశం ఎర్రగా కొప్పడింది.

# నవ్వులు కురిపించే నేటి రచనలు

శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

నవరసములలో హాస్య మొకటి. మిగిలినవి శృంగార, కరుణ, వీర, భయానక, రౌద్ర, భీభత్సాద్భుత, శాంతములు. నవరసములందును శృంగారము సకల ప్రాణి సమ్మోదజనకమై, యాదరపాత్రమైనదనుట యనుభవపూర్వకముగ నందఱకుఁ దెలిసిన విషయమే. కాళిదాసాదికవులచే రసలోకమున దీనికే కిరీట మొసంగఁబడి, యితర రసములకంటె శ్రేష్ఠమైనట్టిది ప్రతిపాదింపఁబడినది శృంగారముపై నంతటికి గౌరవము మెండు. కాని, యీ రసము నెవరికి వారు ప్రత్యేకముగా, నేకాంతమున ననుభవింపఁదగినదే కాని, బహిరంగముగ నందఱు కలసి యనుభవింపఁదగినది కాదు. శృంగారరసానుభవమునకు నాయికకు నాయకుఁడో, నాయకునకు నాయికయో యుండి వారిద్దరకు పరస్పరానురాగములు మొదలైన కొంత తంతు జరుగవలయును. ఇది యెంత మనోహరమైనను నిందు స్వాతంత్ర్య మనుభవించువారికి తక్కువ. రహస్యము నిగూఢత్వము నిందుండును. ఇఁక కరుణరసము హృదయమును ద్రవింపఁజేయు సానుభూతి సంపాదించి భవభూతి మహాకవి చేతిలో 'ఏకో రసః కరుణ ఏవ' అను ప్రఖ్యాతిని గణించుకొనినది. కాని దీని స్థాయీభావమైన శోకము దుఃఖప్రాయము గాన దీని ననుభవించునపుడు మనస్సునకు వ్యాకులపాటు తప్పదు. ఈరసము తీవ్రమైనకొలఁది సాత్త్వికభావముతో ననుభవించువారికి దుఃఖానుభవము గల్గింపక పోదు. కాన నిందు సంతోషానందానుభవము తక్కువ. వీర రౌద్ర భయానక రసములు మూఁడును క్రూర రసములగుటచే సుకుమారహృదయులు వీని ననుభవించుటకు వెనుదీయుదురు. ఇందు రామణీయకము మృగ్యము. కాన నివి విశేషాదరమును బడయజాలవు. ఈ మూఁడు రసములను క్రూరమైనవైతే, భీభత్సరస మసహ్యమై యనుభవింపరాని జనించునదగుటచే దీని నెవరును ప్రత్యేకముగ నాదరింపరు. ఇంక శాంతి రసమనినచో దీని కొక ప్రాధాన్యమే లేదు. కొందఱిది యొక రసమే కాదనిరి. పోతే యింక యద్భుత రసమున్నది. ఇది యనుభవించి యానందింపఁదగిన చక్కని రసమే. కాని యిందు విశ్వాసత్య భ్రాంతి గల్గి యింద్రజాలమువలె నుండును. కాన దీనివలనఁ గల్గు రసానందముగూడ భ్రాంతియేమో యనిపించును. ఇఁక మిగిలినది హాస్యరసము. ఇది బాహాటముగ శక్తికొలఁది, తోచినకొలఁది, యెంతమందైన, నెప్పుడైన ననుభవింపఁదగినది. ఇందు రహస్యముగాని, యుపద్రవము గాని, క్షోభగాని యనుభవించువారి కుండదు. ఇది యెవరి యంతస్తుకు, విజ్ఞానానికి, నాగరకతకుఁ దగినట్లు వారి కనుభవించుటకు వీలున్నది. ఈ రసము ననుభవించుటకు శ్రమప్రయాసలు పొందుట కాని, పరాధీనమగుట కాని యుండదు. ప్రపంచములో నుండు వస్తువులను గ్రహించుటలోను, పరిశీలించుటలోను నీ హాస్యరసదృష్టి కలవారి కిది ప్రత్యక్షమగును. లేనివారి కిది లేదు. ప్రత్యేకముగ చూపించిన వెంటనే స్వయంస్ఫురణతో గ్రహించినవారు మాత్రమే దీని ననుభవించి యానందింపఁగలరు. ఇది దీనిలో విశేషము. కాని యీ రసమునకు తాత్కాలిక ప్రభావము మాత్రమే యుండును. హాస్యరస ప్రధానమైన రచనల నొకటి రెండు మార్లు చదివిన తర్వాత దాని ప్రభావము చదువరులపై సన్నగిల్లును, శృంగార వీరము లట్లుగావు. హాస్యరసములేని యే కావ్యమైనను నాద్యంత మొక్కటే తీరుగ నుండి విసుగు జనింపక మానదు. అందుచేతనే వైవిధ్యముకొఱకు కవులు నవరస భరితముగా కావ్యమును వ్రాయ సంకల్పించుకొనుట.

## హాస్యరస ప్రాశస్త్యము

హాస్యరసము నాస్వాదించి యనుభవింపనివాఁడు ప్రపంచమున నుండఁడు. దుఃఖశ్రమభూయిష్ఠమైన యీ ప్రపంచమున హాస్యము జనులకుత్సాహము గలిగించు రసాయనము (Tonic) వలె నూతనశక్తి నొసఁగును. కాన నేమాత్రము అవకాశమున్నను గూడ మానవుఁడు నవ్వి యానందించుటను ప్రయత్నించును. ఇందుచేతనే జనులు వినోదముల నాశించుట. హాస్యరసమయములగు వినోదములకే గౌరవమున్నది. హాస్య మారోగ్యమునకు కారణము. ఇది మనోవికాసమును ప్రదర్శించును. మనస్సుయొక్క యుల్లాసస్థితి కిది బాహ్యచిహ్నము. చక్కిలిగింతలు పెట్టినచో హాసము గల్గును. మనస్సునకు గిలిగింతలు పెట్టునది హాస్యరసము. హాస్యరస మనగా మనస్సునకు వికాసము గల్గించి యాత్మానందము పెట్టునది. ఆంగ్లమున దీనికి హ్యూమర్, విట్ అందురు. హాస్యప్రియునకు నలుగురిలో గౌరవముగల్గుటయే కాక, తనకుఁ దా నెప్పుడు నుల్లాసముగనుండి చీకుచింతలు గప్పిపుచ్చుకొని ఖులాసాగ నుండును. హాస్యము మనస్సునకు వికాసము గల్గించుటచే, బుద్ధికి చాకచక్యము గూర్చును. ఇందుచే వాని ముఖ మెప్పుడుగూడ నాహ్లాదకరముగ నందఱికిఁ గనుపించి, చూచువారికిఁగూడ సంతోషము గల్గించును. ఇది హాస్యరస మాహాత్మ్యము. హాస్యరసప్రియుల కెట్టి యాదరము గలదో సంఘమున, హాస్యేతర రసప్రియుల కట్టి యనాదరముగూడఁ గలదు. శృంగార రసప్రియుఁడు గిరీశమువలెఁ జూడఁబడి యనుమానింపఁబడును. వీరరౌద్ర రసప్రియులనుపద్రవకారకులని సంఘమువారు దూరముగ నుంతురు. భయానక రసప్రియుఁడనఁగా భీరువు సంఘములోనికి రా వెఱచును. భీభత్సరసకారకునకు సంఘమున స్థానమే లేదు. కరుణరసప్రియుని ప్రవేశము జాలిగొల్పునే కాని సంఘమునకుఁ బ్రయోజనము లేదు. ఇఁక నద్భుతరస ప్రతిపాదకుఁ డైంద్రజాలకుఁడు కొంత వినోదము గల్గించును. కాని యది కనుకప్పు విద్య, నిలిచి యనుభవింపఁదగినది కాదు. మంత్రతంత్రములవాఁడని సంఘము కొంత జాగ్రత్తగా నండు నతని విషయమై. శాంత రసప్రియుని లోకము కర్తవ్యముగాఁ

జాగును. కాన హాస్యరస ప్రియునియందుఁ గల యాదరాభిమానములు మిగిలిన వారియందు గోచరించవు.

## ఆలంకారికుల హాస్యరస లక్షణము

హాస్యరసమునకు హాస్యము లేక నవ్వు స్థాయీభావమని యాలంకారికుల మతము. వికృతాకార వాగ్వేష, చేష్టాదులవలన హాస్యరసోత్పాదన మగునని యభిప్రాయము.

"వికృతాకార వాక్వేషం యమాలోక్య హసేజ్జనః,
తమత్రాలంబనం ప్రాహుస్తచ్చేష్టోద్దీపనం మతం"

"ఆత్మనం పరస్యేవ యే వేష భాషాకార వికార విగర్హాలంకారా స్సర్వభౌమాః సుబద్ధాద్యాదయ స్తద్దర్శన శ్రవణజన్యానో వికారః హాసః" అని యాలంకారిక వచనానికి వివరణము. మానవ సంఘమందలి యాచారవ్యవహారములందును, వేషభాషలందును, హావభావములందును సర్వసాధారణస్థితికి విపరీతముగా నుండుట హాస్యరసకారణ మగును. నిద్రాలస్యావహిత్థాదులు వీనికి సంచారిభావములు. అనఁగా ననుపయోగితములును సౌందర్యహీనములును హాస్యమున కుద్దీపకములు. అందుచేత నీ సర్వసాధారణ వైలక్షణ్యమును, ననుపయోగిత్వాది దోషములును హాస్యజనకములని లాక్షణికులు దెలిపిరి. ఇందు సర్వసాధారణ వైలక్షణ్యము క్రింద ననౌచిత్యము గూడఁ జేరును. అనౌచిత్యమితర రసము లన్నింటికి రసభంగ కారణమే యగును, కాని యీ హాస్యరసమునకు మాత్రము పోషకమే యగును. అందుచేతనే మృచ్ఛకటిక నాటకమున శకారుఁడు పలికిన యనౌచిత్యము లన్నియు హాస్యరస జనకములుగా నొప్పినవి. భరతుఁడు "శృంగారానుకృతిర్హాస్యః" మన్నాఁడు. ఇక్కడ యనుకృతి యనఁగా సాదృశ్యము నాశ్రయించుకొని యనుల వెడలిన వైరూప్యమని వ్యాఖ్యానము చెప్పవలెను. శృంగారరసాశ్రయమైనది హాస్యము. హాస్యరసములో శృంగార మంతర్లీనమైయున్నదని భావము. శృంగారరసాశ్రయమైన సన్నివేశము శృంగారమునకు పరిణామము లేకుండ ప్రవర్తింపఁబడినచో నది హాస్యరసపోషక మగును. అందుచేతనే శృంగారరసమునకును హాస్యరసమునకు నాలంకారికులు మైత్రిఁ గల్పించినారు. ఆలంకారికుల హాస్యరసలక్షణము చాలవఱకు సంస్కృత నాటకములందలి విదూషకుని పాత్రను, రూపకములలోని విటచేటాదులను దృష్టిలో నుంచుకొని చేసినట్లగపడును. కాని యంతకు మించిపోలేరు.

హాస్య భేదములివి యని లాక్షణికు లిట్లు దెలిపినారు.

"స్మితమిహ వికాసినయనం, కించిల్లక్ష్యద్విజం తు హసితం స్యాత్,
మధురస్వరం విహసితం సాంసశిరఃకంప మిద ముపహసితం,
అపహసితం సాస్రాక్షం, విక్షిప్తాంగం భవత్యతిహసితం"

(ధనంజయః)

వీనిలో మొదటి రెండు భేదములు నుత్తమములు, తర్వాతి రెండును మధ్యమములు చివరి రెండు నధమములు వీని నే విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో నిట్లాంధ్రీకరించినాఁడు.

క॥ స్మితమును, హసితము ననఁ ని
ద్వితయము నుత్తమము గాఁగ దీపించు తగన్,
స్మితము వికాసి కపోలము,
మితదర్శిత రదన మైన మెఱయు హసితమై.

క॥ విహసితమును బ్రహసితమున్,
మహి రెండును మధ్యమములు మదిఁ బరికింపన్,
విహసితము మృదుల నినదము,
ప్రహసితము శిరఃప్రకంప పరిమిత మనఁగన్.

క॥ అపహసితము, నతిహసితము
నెప్పుడును నధమంబులనఁగ నేపారు; శిర
శ్చపలము నశ్రుయుతంబును
నపహసితము, మేనుగదల నతిహసిత మగున్॥

అ. II 94 96

## గ్రామ్యనాగరక హాస్యము-వికృతిచమత్కృతులు

పైఁదెల్పిన వికృతమైన యాకార వేషభాషా చేష్టలవలనఁ గలిగించు హాస్యము నాగరికులు మెచ్చుకొనునది కాదు. వికృతమైన వేషభాషాచేష్టలతోడ నవ్వింపఁజేయుట కష్టముకాకపోవుటయే కాక శ్రేష్ఠముకూడ కాదు. ఇట్టిది వీథిభాగవతము, పగటివేషగాండ్రలో హాస్యగాడు చేయునది. ఇది చౌక రకమగు హాస్యము. దీనిని గ్రామ్యహాస్య మనఁదగును. సరసమైన నాగరకహాస్యమునకు వికృతికి బదులు చమత్కృతి యుండును. వక్రోక్తి, రసోక్తి, ఛలోక్తి, వక్రోక్త్యాదు లిట్టివి. చమత్కారోక్తితో నవ్వింపఁగలుగుట యొక నేర్పు. ఇది యందఱికి సాధ్యము గాదు. కాని కొందఱికిది సహజమైన శక్తి. ఇది కూడ నొక విధమైన ప్రతిభ యని చెప్పవచ్చును. ఇట్టి హాస్యము ప్రయత్నములేనఁ గూడ పదింపగు, ప్రయత్నపూర్వకముగఁ గూర్చిన హాస్యము కృత్రిమమై వికారముగ నుండును. ఉక్తి చమత్కారముగలవాండ్రు నోరెత్తినచో హాస్యరస మొలుకునట్లు మాట్లాడగలరు. వారు విషయమైనను హాస్యోచితముగ మార్చి పలుకఁగలరు. అవ్యాజమైన వాక్చమత్కారము మనోహరమై శ్రోతల నానందాబ్ధిఁదేల్చును. ఇది యితరులమనసునకు నొప్పి గల్గింపదు; కేవల మానందదాయకమైనది. ఇదియే మందస్మితమును గూర్చు యుత్తమతరగతికిఁ జెందిన హాస్యము సున్నితమైన యిట్టి హాస్యమును సుకుమారహృదయులును, నాగరికులు ను మాత్రమే యభినందింతురు. ఇట్టి హాస్యమును మెచ్చుకొనుట కెదుటవండు వారు గూడ సమానమైన విద్యావంతులును, రసజ్ఞులును గావలెను; లేనిచో నది వ్యర్థమగును. వీరి హాస్యము స్మితముగనే యాగిపోవును.

కాని ప్రపంచమున నందఱు నిట్టి సున్నితహాస్యప్రియులు గాలేరుకదా. హాస్యరసమును నాగరికులు మాత్రమే గుత్తకుఁ బుచ్చుకొనలేరు. గ్రామసీమలలోని వారు కొంచెము నాటు హాస్యమును గాని యర్థముచేసికొని మెచ్చుకొనలేరు కాన వారికి నాటు హాస్యము గావలసివచ్చును దీనికిఁగూడ హాస్యకారుఁడును శ్రోతలు గూడ సమాన చిత్తసంస్కారము గల్గియున్నప్పుడే యిది పొసగును. కాని యిందు సభ్యత తక్కువగ నుండును. చమత్కారోక్తిగల హాస్యమునకును, వికృతోక్తి గల నాటుహాస్యమునకును బహు భేదమున్నది. ఈ భేదమును గుర్తింపలేక ప్రతి వికారమైన రచనయు హాస్యరసమయమే యని కొందఱు భావింతురు. అట్టివి మైత్య ప్రలాపములే కాని, హాస్యప్రసంగములు గావు. సత్యమైన హాస్యరస

మెట్లుండవలెనో తెలుపుటకంటె, ఏది యథార్థమైన హాస్యము గాదో తెలుపుట మాత్రము సుకరము. ఈ విషయమును స్పష్టపఱచుట కన్యాపదేశ రూపమున దాని వంశవృక్షము నిరూపింపఁబడును. దీనికి మూలపురుషుఁడు 'సత్యము'. అతనికి 'వివేకము' లేక 'సద్భావ' మను నాతఁడు పుత్త్రుఁడు. ఆ సద్భావమునకు జనించిన చమత్కారము, స్మితిమును బరిణయముగాఁగ వారిద్దఱకుఁ బుట్టినది హాస్యరసము. దాని వంశవృక్షమిది.

సత్యము (Truth)
|
(వివేకము) సద్భావము (Good Sense)
(Wit) చమత్కారము—స్మితము (Mirth)
|
హాస్యరసము (Humour)

కాని యీ హాస్యరసస్థానము నన్యాయముగ నింకొకటి యాక్రమించి, దానిపేరితో వ్యవహరించి లోకమును మోసగించుచున్నది. దాని వైకృతినిబట్టియే యది గుర్తింపఁదగినది. దాని వంశవృక్షమిది.

అసత్యము (Falsehood)
|
(అవివేకము) దుర్భావము (Non-sense)
|
వికారము — వెకిలినవ్వు (Laughter)
|
దుష్టహాస్యము (False humour)

దీనికి మూలపురుషుఁడు 'అసత్యము'. అతనికి దుర్భావము లేక యవివేకమను నాతఁడు కుమారుఁడు. ఆ యవివేకికి జనించిన వికారము, వెకిలినవ్వును వివాహము చేసికొనఁగ వారిద్దఱకుఁ బుట్టినది దుష్టహాస్యము. ఇది గ్రామ్యహాస్యమని కూడ చెప్పనగును. దీనిని గురించియే 'నవ్వు నాలుగువిధాల చేటు' అను నానుడి యేర్పడినది.

## హాస్యభేదములు

హాస్యమును బరుల మనస్సును నొప్పించు వ్యాజమునఁ బ్రయుక్తమైనచో నది యపహాస్యము, లేక యెత్తిపొడుపుగా పరిణమించును. ఇది నిందాగర్భితము. దీని నాంగ్లమున ఐరనీ (Irony) యందురు. ఇది పరులపైఁ గసిదీర్చుకొనుట కుపయోగించు కట్టు హాస్యము. ఇందు హాస్యము నతిశయించును. ఉదా:— అర్జునుఁడు ద్రుపదమహారాజును గట్టి తెచ్చి తన కాళ్ళ ముందర నుంచగ, ద్రోణుఁ డతని జూచి

> వీరవర్య ద్రుపద మ
> హారాజులె? యిట్లు కృపణులయి పట్టుపడన్
> నీకి వచ్చెనె? యహహా! మ
> హారాజ్యమదాంధకార మది వాసెనొకో!

అని, తాను పూర్వము పొందిన యవమానమునకు సమాధానముగ చెప్పి కసి తీసికొనెను. కాని యమాయికురాలైన దమయంతి యరణ్యములో సార్థవాహులను గాంచి 'నలుని జూచితిరా' యని ప్రశ్నింపఁగా, వారు

> నలుఁగాన మిర్వనంబునఁ
> గల వెప్పుడుఁ గాంతు ముగ్రకగులను కిరాతం
> బుల బుభుక్షంబుల నిది మ
> ర్త్యుల కవిషయము మాతపమ్ము దూఱుము దీనన్.

అనిరి. "మఱికొంద ఱధిక హాస్యంబు సేసిరి, యదరి కేమి సో కాదనిరి." ఇది మాత్రము నిందాగర్భితము గాదు. కాని విపరీతస్థితినిఁ దెలియఁజేయును. ద్రోణుని విషయమున నపహాస్యము గాఁగ, నిది యతిహాస్యమై, వెనుకఁ దెలిపిన యీ రెండువిధములైన హాస్యములలో రెండింటికి నుదాహరణము లగుచున్నవి.

అపహాస్యమును మించినది యన్యాపదేశముగఁ జెప్పి యాక్షేపించుట. దీని నాంగ్లమున సెటైర్ (Satire) అందురు. ఇది తిట్టుహాస్యమగును. వ్యాజస్తుతి, వ్యాజనిందలు దీనికి పరికరములు. ఇది బాగుగ ముదిరిన హాస్యము. ఇందు వాచాలతయు, సున్నితత్వము నేమాత్ర ముండవు. హాస్యము నింకను సాగదీసి, సభ్యత నేటఁ గలపి బండబూతులతో హాస్యమాడువారుగూడఁ గలరు. కూచిమంచి జగ్గకవి కృత చంద్రరేఖావిలాసము, పిడిప్రోలు లక్ష్మణకవికృత రావణదమ్మీయము, అడిదము సూరకవి, వేములవాడ భీమకవి మొదలైనవారి చాటువులిట్టివి. ఇది హాస్యమును గుప్తముగా ప్రయోగించుట యగును. సామాన్యముగా సంఘములో నుండక, యొకానొక వ్యక్తియందు మాత్రమే విశిష్టముగా నుండు తల్లక్షణములు గాని, రచనను గాని, స్వరమందు గాని చేష్టయందు గాని యనుకరించి యా వ్యక్తిని వెక్కిరించుట యొకవిధమైన యపహాస్యము. దీని నాంగ్లమున పేరడి (Parady) యందురు. కాని దీనియం దనుకరింపఁబడిన మూలవిషయముతో వినువారికిఁ బరిచయముండినఁ గాని యది యర్థము గాదు. ప్రకృతిలో సహజముగా నుండు వికృతిని చూపించి సున్నితముగా చెప్పుట మఱియొకవిధ హాస్యము. దీని నాంగ్లమున 'హ్యూమర్' (Humour) అనవచ్చును. ఇది పరుల మనస్సును బాధపెట్టదు. అది స్వాభావికముగ నుండి, సంభావ్యముగా దోఁచును. ఉదా.—నాను శ్రీరాములుగారి తెనుఁగునాటులో,

> లేవరు లెండు లెండనిన, లేచినవారయినం దటాలునన్
> బోవరు పోవుమన్ నిలిచి 'పోగుము—పోదుము త్రోయుమం' డ్రాం
> చివరు పంగు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్య సం
> భావనవాఁడు మాపటలె బాపనపాముల పామున్నయున్.

ఈ లలితహాస్యమును మించినది చమత్కారహాస్యము. దీని నే యాంగ్లమున 'విట్' (Wit) అందురు. ఇందులో బుద్ధికౌశలము చే నొక విషయమున వికృతి యాకస్మికముగా నారోపింపఁబడి చమత్కరింపఁబడును. లేదా వాక్చమత్కారమైనను జూపఁబడును. ఒకప్పుడు వికృతి లేనిచోఁ గూడ వికృతి నారోపించి దానిపై వ్యాఖ్య సంధించి, సంతృప్తిపఱచి, చమత్కరింపఁబడును. సామాన్యముగా చాటుపద్యములలోఁగల చమత్కారమిట్టిది. ఉదా.—

వల్లిభోజను మెచ్చి చమత్కారముగా నొక కవి యిట్లు చెప్పినాఁడు చాటువున

> శివుఁ డద్రిని శయనించుట,
> రవిచంద్రులు మింటనుంట, రాజీవాక్షుం
> డవిరళముగ శేషుని పైఁ
> బవళించుట, నల్లిబాధ పడలేక సుమీ.

ఇందు శివాదిదేవతలు గూడ వస్త్రబాధను తప్పించుకొనలేక యెట్టి యుపాయాంతరమును గనిపెట్టిరో తెలుపుటకు కారణములను చమత్కరించి చూపి కవి, మనలను సంతృప్తిపఱచి, సంతోషపెట్టి, మనకు చిఱునవ్వు దెప్పింపఁగల్గినాఁడు. ఇట్టిదే చాకలివారితోఁ బడిన బాధలనుగూర్చి క్రింది పద్యమున మఱియొక కవి చమత్కరించినాఁడు.

> చాకివానితోడ జగడాలు పడలేక,
> సిరిగలాఁడు పట్టుచీరఁ గట్టె
> శివుఁడు తోలు గప్పె నీ యని మదిరోసి,
> భైరవుండు చీర పాఱవైచె.

వీనిని జదివినను, వినినను నెవరు మందస్మితము చేయకుండ నుండఁగలరు. ఆయా దేవతలకుఁగల సహజగుణముల నతికౌశలమున గ్రహించుకొని, సందర్భమునకు సరిపడునట్లుగ సమన్వయించి, కొరతను గల్పించి వారియందలి వికృతిని వాక్చమత్కారముతో కవి యుత్ప్రేక్షించినాఁడు. ఇది యెవరి మనసులను నొప్పింపక పోఁగా, మీఁగుమిక్కిలి యానందింపఁజేసి నవ్వించును. అదియు విరగఁబడి యట్టహాసము చేయనీయక, మృదువుగా మందహాసమును మాత్రము చేయించును. ఇట్టి మందహాసమే నాగరికులకు బలమైన మెప్పును గల్గించును. ఇటువంటిదే మఱియొక చాటువు, శ్రీనాథునిదని ప్రసిద్ధికలది యీ క్రిందిది.

> సిరిగలవానికిఁ జెల్లును,
> తరుణుల పదియాఱువేలఁ దగఁ బెండ్లాడన్
> తిరిపెమున కిద్దఱాండ్రా,
> పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్.

కేవలము, త్రిమూర్తుల నే పరిహసించిన మన కవుల కితరులన్నా? భళా? లక్ష్మీపార్వతుల యన్యోన్యపరిహాసములను తిరుపతి వేంకట కవు లెట్లాఘువుగా వర్ణించినారో చూడుడు.

> దొంగవాఁడు నీ మగండని సత్యంగ,
> వేషధరుండు నీ పెనిమిటనియె,
> పెదపెక్కను నీదు పెమ్మికొఁడని నవ్వ,
> గ్రద్ద నెక్కును నీ మగండటం చనియె,
> వల్లకాడిల్లు నీ వల్లభున కనంగ,
> నడిసంద్రమిల్లు నీనాథున కనె.
> నాట్యంబు సేయు నీ నాయకుం డన నంతఁ
> గావించు నెవ్వ నీకాంతుఁ డనియె.
> ముష్టి కొక్కఁడి కేగ నీయిష్టుఁ డనిన,
> బలిముఖంబున కేగ నోలలన! యనియె,
> నిట్లు అన్యోన్య మర్మంబు లెంచుకొను
> పర్వతాంభోధి కన్యలఁ బ్రస్తుతింతు

ఇందు పురాణముల విశేషవిషయములు సముచితముగ సమకూర్చి కౌరణకలాపముగ నెంచుకొనుటలో కవుల ప్రజ్ఞ ప్రదర్శితమై, మనమెప్పును చిరునవ్వును గూడ సంపాదింపగలిగినవి. ఈ కూర్పు వ్యాజమైనది. వ్యాజనిందకాని, వ్యాజస్తుతి కాని లేదు. చమత్కారోక్తి మాత్రమున్నది. ఇఁక వ్యాజస్తుతిగల చాటువు నీ క్రిందిది తిలకింపనగును. తిరుమలరాయనిఁగూర్చి చెప్పఁబడినది.

> అన్నాతిఁగూడ హరుఁడవు,
> అన్నాతిని గూడనప్పు డసురగురుఁడవౌ
> దన్నా! తిరుమలరాయా,
> కన్నొక్కటి మిగిలెఁగాని కౌరవపతి వే.

ఇందు కవి తిరుమలరాయని యేకాక్షిత్వమువలన నాక్షేపింప దలఁచి వ్యాజపూర్వకముగ శివశుక్రులతోఁ బోల్చి స్తుతించి, ధృతరాష్ట్రునివలెఁ బూర్తిగ గ్రుడ్డివాఁడవుగాలేదే యని తిరస్కరించినాఁడు. ఈ యపహాస్యము, వ్యాజపూర్వకస్తుతిగా నుండుటచే చమత్కారమున్నది. కాని ద్రుపదుని ద్రోణుఁడు చేసిన యపహాస్యమున వ్యాజస్తుతి లేకపోవుటచే పచ్చిగానుండి, తిరస్కారము, కసితీర్చికొనుట పట్టపగలైనది. ఇదియే భేదము. దీనికంటె చాటుమాటులేని యవమానపూర్వకహాస్యము ఉద్ధతిక్కన క్రతువుల కోడి యింటికి మరలి వచ్చినప్పు డతని భార్య యాతనికి స్నానమునకై మఱుగుపట్టున నులకమంచ మడ్డుపెట్టి పసపుటుండ దానిపై నుంచి నీళ్ళబిందె తెచ్చిపెట్టఁగ నిదేమని యతఁడడిగిన ప్రశ్నకు నామె సమాధానము.

> పగలు వెన్నిచ్చినచో,
> నగరే నిను మగతనంపు నాయకులెంగన్
> ముసరాడువారమైతిమి,
> జగపేటికి జలకమాడ వచ్చినచోటన్.

తర్వాత భోజనము వేళ విరిగిన పెఱుగు తీయనని తల్లిపోయఁగ, నిదేమి యని ప్రశ్నించిన యాతనికి

> అపదృశముగ నరిపీకుల.
> మసిపుచ్చక విఱిగివచ్చు మగపంద్రకియన్
> గసవున్ మేయఁగఁబోయిన
> పసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగన్.

అని తల్లియు భార్యయు చేసిన పరిహాసము తిక్కనను వలయెత్తనీయలేదు; గొడ్డపలుగు కాల్చి వాతపెట్టినట్లయినది యతనికి.

దళమ్రగహ మువఁబసి జాయాతి యొక పిడగానుండ గృహస్థునకు కష్టపాటు గల్గినపుడు వ్యాజనిందాపూర్వకమైన హాస్యచాటూక్తి యిది.

> అల్లుఁడు బహుమానస్తుఁడు,
> అల్లిన కొకపనియుఁ జెప్పనైనంగానీ
> చెల్లును మూఁడుపనులకై
> యిల్లలుకను పేడఁజేసి యెంగిలి తీఁతన్.

ఇంకటితో నాతనివిసుగు దీరినది. అవ్యాపదేశముగ నీ క్రింది చాటువునఁ గొందఱు ఆక్షేపింపఁబడిరి. ఇదె పెద్దయైన యుదాహరణము కాదగును.

> ఉష్ట్రములదైన వైవాహికోత్సవమున
> గాన మొనరించినవి వేసరగార్దభములు,
> ఎంత చక్కదన మొహొ, మఱెంత సుస్వ
> రమ్మొహో నా మెచ్చుకొనియెను బరస్పరమ్ము.

సర్వసామాన్యముగా నూతిపదముగలె తిట్టఁబడు 'గాడిదకొడుకు' అను పదముపై చమత్కరించినాఁ డొక చాటుకవి యిట్లు.

> ఆడినమాటలు దప్పిన,
> గాడిదకొడుకంచుఁ దిట్టఁగా విని మదిలో

వీఁడా కొడుకని యేడ్చెను,
గాడిదయును సంసారపు చోడెప్పా.

ఇట్టి వనేక చాటూక్తులు గలవు.

## హాస్యరసమును ప్రతిపాదించు మార్గములు

ఇఁక హాస్యమును ప్రతిపాదించు పద్ధతులేవో విచారింపవలసి యున్నది. శబ్దగతముగా వికృతిని కల్పించి హాస్యమును ప్రతిపాదింపవచ్చును. ఇందు శ్లేషప్రయోగము ముఖ్యమైన సాధనముగ నుపయోగించును. సినిమాలయందు నెట్టిచమత్కారమైనను చేయవచ్చును సంభాషణలో నిది విశేషముగ లాభకారి. కాని దీని నుపయోగించు వక్త మంచి మాటకారియైయుండి, సమయోచితమైన యర్థమును జెప్పఁగల సమర్థుఁడు కావలెను. చమత్కారముగా మాట్లాడగల్గినవారర్వాచీనులలో నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రిగారును, తర్వాత గుంటూరు పురవాస్తవ్యులు కస్తూరి సీతారామశాస్త్రిగారును ప్రసిద్ధికెక్కినారు. గుంటూరు మిషనరీకళాశాలలో సంస్కృతపండితులుగా విశేషకాలమునుండి పనిచేయుచున్న సీతారామశాస్త్రిగారి నుద్యోగమునుండి విశ్రాంతి నిప్పింపఁగోరి యాకళాశాల ప్రిన్సిపాలగు వుల్ఫుదొరగారాయనవద్దకు వచ్చి 'మీ కెన్నేండ్ల'ని ప్రశ్నించిరట. అంత శాస్త్రిగారు వెంటనే 'తొమ్మిదేండ్ల'ని జవాబిచ్చిరట. దానికి దొరగారు విస్మయము చెంది 'ఏమిటి తొమ్మిదేండ్లా' యని ప్రశ్నించినవారితో గొంచెముకోపముతో నరట. అంత వారు 'తొమ్మిదేండ్లు అరవైయూడ'ని వ్యాఖ్యానించిరట. అందులకు దొరగారు చకితులై చిఱునవ్వునవ్వి శాస్త్రిగారిని మఱికొన్ని సంవత్సరము లుద్యోగములో నుంచిరట. ఇది కీ.శే. వారి విశిష్టత్వ'మను వ్యాసములో చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు ముచ్చటించిన విషయము. ఇందు 'ఏండ్లు' శబ్దముపై శ్లేషింపఁబడినది.

ఒకనాఁడు సీతారామశాస్త్రిగారు శిష్యులకు పాఠము చెప్పుచుండఁగా నింటివద్దకొక రిటైరైన తాసీల్దారువచ్చి తనకు సంస్కృతము చదువుకొనవలెనను కాంక్ష కల్గినదని తెల్పి, యందు చక్కని ప్రవేశముగల్గుటకేమి కావలెనని యడిగెరట శాస్త్రిగారిని. అంత శాస్త్రిగారు 'మంచి లింగబలమును, ధాతుపుష్టియు గల్గినచో తేలికగ ప్రవేశముగలుగును'అని సమాధానమిచ్చిరట. అంత ప్రక్కనున్న శిష్యులు ముసిముసి నవ్వులు చేయసాగిరి. కాని యా రిటైర్డు తాసిల్దారేమియు గ్రహింపలేక యుక్కిరిబిక్కిరై వాఁడట. ఇఁట ధాతు లింగ పదములపై నర్థశ్లేష. హాస్యరసప్రియులెంత విద్యావంతులైనను, పాండిత్యముతోఁబాటు కొంటెతనము, గడుసుతనము గూడ బాగుగ గల్గియుందురు. శాస్త్రిగారు జ్యోతిషపండితులగూర్చి నగుటచే వారి బావమరదులు కొఁదఱాయనను దమకు జ్యోతిషమును జెప్పవేధింపగా వారిని 'ఖరకుముందు పుట్టితివా వెనుక పుట్టితివా' యని ప్రశ్నించిరట. అంత వారు చిన్నబుచ్చుకొనిరివారట. ఇందు 'ఖర' శబ్దమునకు గాడిదయనియు నాపేరిట సంవత్సరమనియు ద్వ్యర్థము. ఇటువంటి వనేకములు గలవు శాస్త్రిగారి వాక్చమత్కృతిని దెలుపునవి.

ఒకమారు సీతారామశాస్త్రిగారింటికి తిరుపతి వేంకటకవులు వచ్చినారు. అప్పుడక్కడ కాశీ కృష్ణాచార్యులుగారుకూడ నుండిరట. కొంతసేపు సిష్టాగోష్ఠియైనతర్వాత తిరుపతి వేంకటకవులలో నొకరిదంక నుండిన కొల్లాయి జారి క్రిందపడినదట. అంత కృష్ణాచార్యులుగారు చమత్కారముగ 'మీ రుమాల' యనిరట. వెంటనే కవిగారు, "ఆ, మా దిగా" యనిరట. వారిద్దరి వాక్చమత్కృతిని ప్రక్కనున్న పండితు లభినందించినారట. ఇది ప్రతిభావంతులైన వారి హాస్యరస చమత్కారము. ఇందు సభంగ శబ్దశ్లేష పాటింపఁబడినది. ఒకమారొక విద్వత్సభలో నొక ప్రతిభావంతుఁడెద్యోతకుఁడుగా నుండఁగొందఱు వక్తలుపన్యసించిరి తర్వాత నొక హరిజన కవి కార్యక్రమము ననుసరించి వేదికపై రావలసియుండెను. అంత నా యగ్రాసనాధిపతి నాహ్వానించి 'ఇఁక పంచమస్వరము వినఁబడు'నని నుడివెను. అంతట నా హరిజనకవి 'కాకస్వరమును వినుటకు ముందు పంచమస్వరమును వినుడు' యని యుపక్రమించెనఁట.

హాస్యరసము వక్రోక్తి, వ్యాజనింద, వ్యాజస్తుతి మొదలైన వాని చేఁగూడ ప్రతిపాదింపవచ్చునని యనేక చాటుపద్యముల నుదాహరించిన సందర్భమునఁ దెలిసికొంటిమి. శబ్దగతమైన హాస్యమును అనేక భాషలను మిశ్రముచేసి కల్పింపవచ్చును. కాని యది యంత శ్రేష్ఠమైనది కాదు. అది చౌకరకమైన హాస్యమే యగును. ఇది పామరులును, జనసామాన్యము నెక్కువ తేలికగ, శీఘ్రముగ నాకర్షించి నవ్వించును. విద్యావంతులు దీనిని విశేషముగ నభినందింపరు. ఉదా—

"అదో దొమ్మరిమంగి గర్భజననం, దాసీగృహే నందనం,
మాయామంగల పోతిగాడి మరణం, ఏటోడ్డు రామాయణం,
పశ్చాత్ చాకలిపాలితో డజగడం, వపాఘ నిర్వాణం,
కాకచ్ఛేదన కల్యపాపహరణం ఏతన్మహాభారతం".

(భామాకలాపమునుండి)

ఇందు సంస్కృతాంధ్రభాషలు మిశ్రము చేయఁబడినవి. ఈ క్రింది దానిలో తెనుఁగు నాంగ్లమును మిశ్రముచేసి గిరీశము మాట్లాడును.

"ఒపినియన్సు (Opinions) అప్పుడప్పుడు ఛేంజి (Change) చేస్తుంటేనే కాని పాలిటీషను (Politician) కానేరడు. నాకు తోచిన క్రొత్త అర్గ్యుమెంటు (arguement) విన్నావా? ఇన్ఫెంటు మారేజీ (Infant marriage) లు అయితేనే కాని యంగ్ విడోస్ (Young widows) వుండరు. యంగ్ విడోస్ వుంటేనే కాని విడో మారేజి రిఫారంకి అవకాశం ఉండదుగదా! సివిలిజేషన్కల్లా గ్రేట్ విడో మారియేజ్ అయినప్పుడు యిన్ఫెంటు మారేజీ లేకపోతే, సివిలిజేషన్ పోల్లవుతుంది. మా ముందు అడుగు పెట్టలేదు. కనక తప్పకుండా యిన్ఫెంటు మారేజి చెయ్యవలసిందే. ఇది వోహా కొత్త డిస్కవరీ నంబర్ టూ. చిన్నపిల్లల్ని ముసలాళ్ళకిచ్చి పెళ్లి చెయ్యడం కూడా మంచిదే అని నేను వాదిస్తాను" (కన్యాశుల్కమునుండి)

ఇట్లే, ప్రతాపరుద్రీయము, రామదాసు, రసపుత్రవిజయము మొదలైన నాటకములలో తెలుగు తురకము కలుపఁబడినవి. ఈ క్రిందిది రసపుత్రవిజయంనుండి (నవగుద్దీను మాటాడునది.)

"బలే! ఎన్ని రోజుల్కి నిఖా సెయ్యడానికి మాకి మంచి దఖాత్ వచ్చిందిరా భాయి అల్లాకి మెహర్బానిసే అచ్ఛా హోగకావం నీకుంది. అల్హమ్దులిల్లా ఈ యిమ్మా మాకి నిఖాసేసి మక్కాలో మసీదీ కట్టిస్తాన్ కీరకీ దరోబస్తు ఫులాల్ బాల్ సేస్తాం. అయితే ప్రస్తుతం ఇమ్మాని వుడాయించే బందోబస్తు చేయ్యాల బత్ హా

జహూర్ మె హలహార్ సే సెఝోవాల. అరే కొజా సిద్ధిరాం. ఇద్రావ్. మనం ఇదర్ రసామె యెంక్కి వచ్చివాం నీకే మాలుం?"

ఈ క్రిందిది తెలుగు తమిళము మిళితము చేయబడిన సంభాషణ "వ్యామోహ" మనే నాటకమునుండి (కర్త–వేదం వేంకట్రాయ శాస్త్రి) కూలి ప్రసంగము.

"శామీ, నిండా బరువు. ఎన్నా బరువుడా అప్పా. పాణ బరువాయిరుగు. అంతా చూసండి సామీ. ఎంచి లెక్క చూడండి. తిర గ్గతి ఏమయినా పోయింది అని చెప్తే నేను జవాబ్దారీ లేదండీ... ఆఁ...ఆఁ.........నేను కూలివాడు శామీ కష్టం చేస్తాను శామీ. మీరు దొరలు శామీ, కడుపులో కొట్టవద్దు శామీ. వీపుమీద కొట్టు శామీ. మీరు ఇస్తేదానే మేం తినాల. మీరు ఆంధ్రవాళ్ళు శామీ నిండా దారాళం, నిండా దారాళం......శామీ, రండ, రండ పోతాము. (రండి యనుటకు)

కుటుంబరావు: ఎవ్రడా రండ. నీ అబ్బ రండ, నీ తాత రండ. నీవు వెదవముండ రండ అంటావు రోగ్.

కూలి: లేదు శామీ, లేదు శామీ, బుద్ధి బుద్ధి. అయ్యయ్యో, అట్లా కోపంచేస్తావే. నేను నిండా మర్యాదగా చెప్తే నువ్వు కోపం చేస్తావే. రండ అంటే తప్పా సామి. అయ్యో కడవులే. ఇదు ఎన్నాడా ఇదు. నల్ల తుకు కొలమిల్లేడా కడవులే కాఁమిల్లే.

జానకిరామయ్య: అంతేలే, ఇక్కడ రండలకే మర్యాద.

కూలి: అవును శామీ. వాళ్ళకి ఒక రోడ్డుకూడా వుండాది. రండాల రోడ్ అంట రు శామీ. రండి పంతులుగారూ. టాక్సీ వస్తాది.

సూర్యారావు: మళ్ళీ పందు ఁంటావేం? మేం పందులమైతే నువ్వేమౌతావ?

కూలి: అయ్యో! మురుగనే! అంతవనే యారు మూంజిలే మళిద్పండా శివా. నాకు ఇదంతా తెలీదు భగవంతుడా. (పదమధ్యమున తమిళులు పరుషాక్షరమును పలుకరు.)

ఇది కడుపు చెక్కలయేటట్లు నవ్వించె హాస్యమే. సందేహము లేదు. కాని ఇది యుత్కృష్టమైనట్టియు సున్నితమైనట్టియు హాస్యము కాదు. ఇందు చమత్కారముగాని, ప్రజ్ఞగాని లేదు. షడ్విధ హాస్యములలో కడజాతికిఁ జెందినది. ఈ నాటకమందే యంతర్వాహినిగా నున్న ప్రధానవిషయము నాయికయైన సుశీలయే పారిజాతమను పేరుతో నుండి, నాయకుడగు కుటుంబరావుకు కామె తన స్వంతభార్యయే యను జ్ఞానము లేకపోవుట యనువిషయ ముత్తమ హాస్యముగా నొప్పినది. ఇది చమత్కారయుతము, నుత్తమోత్తమ హాస్యమును. దీనివలన మందహాసము చిరకాల మనుభవింతుము కాని పైశబ్దగత హాస్యము తాత్కాలికము మాత్రమై చౌకరకమైనది.

అనౌచిత్యమువలనఁగూడ హాస్యము పుట్టునని వెనుక గ్రహించితిమి. అదికూడ రెండవ రకమునకుఁ జెందినదే కాని యుత్తమ శ్రేణికిఁ జెందినది మాత్రము కాదు. ఏఁన నది పిచ్చివాని యసంబద్ధ ప్రలాపమువలె నుండును. ఉదా: మృచ్ఛకటికము నుండి.

శకారుఁడు: వసంతసేనా! పల్లవ పరభృతిఁ నే కాగ. వసంతమాస మంతముఁ దఁలఁ కొని యేడ్చినను సరియే, నేఁవును చుండ నిన్నుఁ గాపాడువా డెవ్వండు?

విను దుశ్శాసనునివలె నిపుడు నీను,
కొప్పు దొంకొంను, జమదగ్ని కొడుకు భీమ
సేనుఁ జేతెంచి యాపుకో! చాన కుంతి
కాత్మజుండగు దశకంఠుఁ డాపఁగలఁడో!

*  *  *

శకారుఁడు: బావా, బావా, నేను వసంతసేనను వెదకెదను. (చీకటిలో)

విటుడు: వెదకి కనుఁగొనుటకు గుర్తులేమైన నెరుఁగుదువా నీవు?—

శకా: బావా, ఏమి గుర్తులని?

విటుడు: పూవుదండల పరిమళమును, నగల నవ్వడును.

శకా: మాల్యగంధము వినఁబడుచున్నది. కాని ముక్కులలోఁ జీఁకటి దూఱుటవలన నగలచప్పుడు మాత్రము స్పష్టముగాఁ గనఁబడుట లేదు.

ఇటువంటి యనౌచిత్యపు మాటలు, నసంబద్ధ వాక్యములు వినినప్పుడు గలుగు హాస్యము పిచ్చివాని మాటలు విన్నప్పుడు వచ్చు నవ్వుకంటె విశేషము గాదు. కావ నిట్టి హాస్యము శ్రేష్ఠమైనది కాదంటిని. కోతిచేష్టలు చూచినప్పుడు గూడ నట్టి హాస్యవినోదము లే కల్గును.

మఱియొకవిధమయిన హాస్యము లోకమున సక్రమముగా నుండవలసిన చోట నక్రమముగా నుండిఁచో వికృతిగల్గి హాస్యము గల్గును. సామాన్యముగ నొకటే కుటుంబమున నేకమతస్థులుండుట సహజము, సక్రమమును. అట్లుగాక భిన్నమతస్థులుండుట యక్రమమై యాచార వ్యవహారములందు భిన్నమై మత సాంకర్యమునకుఁ గలహమునకుఁ గారణమగును. దీని నిట్లు చమత్కరించినాఁడు వేణుగోపాల శతక కర్త.

"తండ్రి మధ్వాచారి తనయుఁ డారాధ్యుండు,
తల్లి రామాంజ మతస్థురాలు,
తనది కూచిమతము, తమ్ముఁడు శాక్తుండు,
సర్వేశ్వర మతము సద్గురునిది
ఆలు కోమటిజాతి, యక్క జంగమురాలు,
మరదలు కోడలు మారువాడి
కలియుగంబున వర్ణ సంకరులు ప్రబలి,
యుత్తమ కులంబు లౌకయూల కొత్తిగిల్లె
మదన భువిపాల మునిజన హృదయలోల,
వేణుగోపాల భక్తసంత్రాణ శీల.

ఇట్టి వికృతిని విని నవ్వ పోము. దీనిని చూచియే కాఁబోలు దీనికి పారడీగా—

"తండ్రి కమ్యూనిస్టు, తనయుఁడు కాంగ్రెసు,
తల్లి ప్రజాపార్టీ, తాను సోషలిస్టు......"

అని కూర్పఁబడినది. ఇట్టి వికృతియందుగూడ చక్కని హాస్యమున్నదని యంగీకరింపక తప్పదు. ఇట్టి యనుకరణమే (Perady) చంద్రశేఖర శతకమునందు గలదు. ఈ క్రింది పద్యమున వికృతమైన పామరభావమును, మూర్ఖభావము గూడ ననుకరింపబడినవి.

సంగిత కాడ పాడ కిక సాలిచు, నీవది పాడినంగుకున్
ఇంగితమెంచి నేను మరి యున్నదుకున్ సరిపోయె వింపేవా,

అంగన నే తలాపినటి అన్నకు తంబుర ఈను పెట్టిపో
బాగుగు శాపనాస యని పక్కను మూర్ఖుడు చంద్రశేఖరా.

ఈ శతకమంతయు నిట్లే వ్రాయఁబడినది. ఆ పామర భావార్థ్యుని రసికతకు నవ్వుపుట్టకపోగు, దానికిఁదగినట్లే యతని భావయున్నది.

మఱియొక విధమైన హాస్యరసప్రతిపాదన ప్రక్రియ గుణమును గూడ దోషముగా వ్యాఖ్యానించి పరిహాసము చేయుట. ఈ క్రింది పద్యమున భీముడు శ్రీకృష్ణుని వేళాకోళము చేయును.

మొదల నత్యంత కాముకుఁడవౌటకుఁ
గొల్ల యిల్లాండ్ర గుబ్బ పాలిండ్లు సాక్షి,
యతినీచ రతికేళినగుటకు హీన
కనుతనూకర విగ్రహములు సాక్షి,
అవ్యాపివగుటకు బ్రహ్మాండకోట్లను
బూరింపలేని నీ బొజ్జ సాక్షి
స్త్రీలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము నెఱుంగ
ధరకుఁ దెచ్చిన వేల్పుతరువు సాక్షి,
జడసముత్సాహి వగుటకు జలధి సాక్షి,
వామనుఁ డగుటకు బలీశ్వరుఁడు సాక్షి,
మందమతివౌట నది మఱిపాండదఁగాక,
పరవఁ జేర్కొనఁ దరమె నీనటలు కృష్ణ.

ఒకప్పుడొక పదమును ప్రయోగించి హాస్యము చేయఁబడునప్పుడు దానినే తిరిగి ప్రయోగించి ప్రతిహాస్యము చేయుట ఇంకొక పద్ధతి. ఒకప్పుడొక పండిత యుపాధ్యాయుడు విద్యార్థుల 'ఎక్సర్‌సైజ్' పుస్తకములను దిద్దుటకు బడినుండి ఇంటికిఁ దీసికొనిపోవుచుండఁగా నొకకొంటె విద్యార్థి వారితో "ఒక గాడిదబరువు మోసికొనిపోవుచున్నా"రని ఎగతాళి చేసినాఁడట. అంత కుశలుడైన యా యుపాధ్యాయుఁ డా విద్యార్థితో "ఒక గాడిదబరువుకాదురా, నలభై గాడిదల బరువురా" యని జవాబిచ్చినాఁడట. విద్యార్థుల తరగతిలో 40 మందుండుట వాస్తవ. ఇక్కడ 'గాడిద' శబ్దమే తిరిగి వాడబడినది. మఱియొకమారొక సంస్కృత పండితుఁడు బడిలోన నభిజ్ఞాన శాకుంతల నాటకమును పాఠము చెప్పుచుండగా నొక కొంటె విద్యార్థి ప్రక్కవాని శాకుంతల నాటక పుస్తకమును తీసికొనఁగా నతఁడు "నా శకుంతల తీసుకొన్నా"డని చమత్కరించి యా పండితునితో ఫిర్యాదు చేసినాడు. అంత విచారింపగా నా పండితునితో నా మొదటి విద్యార్థి తన శకుంతలను నిన్న నాటిఁ డింటికి తీసికొనిపోయినాఁ డనియు, నడుగగా రేపిస్తానని చెప్పి యియ్యలేదని జవాబిచ్చినాడట. అంత నా పండితుడు రెండవవానితో "నాతని శకుంతల నాతనికి నేఁడే యిచ్చివేయుమని, రేపు చేయవద్దని" యన్నాఁడట. ఇది చమత్కారము. ఇక్కడ శాకుంతలమునకు బదులు శకుంతల పదమును సామాన్య స్త్రీవాచకార్థమున వాడఁబడి చమత్కరింపఁగ, నా పదమునే తిరిగి యుపయోగించి పరిహాసము చేయఁబడినది. అట్లే 'రేపు' శబ్దముగూడ నాంధ్రాంగ్ల శబ్దశ్లేషగా వాడఁబడి చమత్కారము చేయఁబడినది. హాస్యము హాస్యముకొఱకుఁగాఁ జేయఁబడినటు కనఁబడకుండ సహజముగా నున్నట్లు, యథాతథముగా వాడినప్పుడే యెక్కువ రక్తికట్టి కొల్పును.

వేమనయు, త్యాగరాజులవారు నింకొక ప్రకారముగా హాస్యమును పుట్టించుదురు. కొన్ని పోలికలను జూపి యొకమారును, భేదమును జూపి కొన్నిమార్లును హాస్యమును గల్గింతురు. ఈ క్రింది పద్యములోఁ బోలిక చూపబడినది:

"గొడ్డుటావును బిదుక గుండ గొంపోయిన, పండ్లు రాలఁదన్నుఁ బాలనీదు, లోభివాని నడుగ లాభంబు లేదయా, విశ్వ—"

ఇందు లోభివాఁడు గొడ్డుటావుతోఁ బోల్పఁబడి చమత్కరింపఁ బడినాఁడు. అట్టిదే మరియొక పద్యము వేమనది:

"మేక గుతుకఁబట్టి మెడచన్ను గుడువగా, ఆకలేల మాను నాకిగాక, లోభివానినడుగ లాభంబు గల్గునా, విశ్వ..."

'అజాగళ స్తనమని' సామెతయే కలదు. ఇట్టివానిని విని చిరునవ్వు నొందకయుండలేము. ఇఁక భేదమును వివరించి హాస్యమును గల్గించు రీతి యిది:

"ఆలివంకవారు ఆప్తబంధువులైరి, తల్లివంకవారు తగినవారు
తండ్రివంకవారు దాయాదిపగవారు, విశ్వ..."

ఇట్లే త్యాగయ్యగారుగూడ గొంత హాస్యప్రియత్వమును జూపుదురు:

ఆభోగిరాగము — ఆది తాళము

ప॥ మనసునిల్ప శక్తిలేకపోతే —
మధుర ఘంట విరులపూజ ఏమి చేయును॥ మ॥
అ॥ ఘనదుర్మదుఁడై తా మునిగితే —
కావేరి మందాకిని యెటు బ్రోచును॥
చ॥ సోమిదమ్మ సొగసుగాండ్రను గోరితే —
సోమయాజి స్వర్గార్హుడౌనో,
కామక్రోధుఁడు తపంబొనర్చితే —
కాచి రక్షించునో త్యాగరాజనుత॥

అని త్యాగరాజులవారు పాడిరి. సోమిదమ్మను గూర్చి చేసిన పరిహాస మిట్లున్నది. అట్లే మరియొక కీర్తనలోఁగూడ నిట్లు దెలిపినారు:

ఉదయరవిచంద్రిక రాగము—ఆది తాళము

ప॥ ఎంత నేర్చిన నెంత జూచిన —
నెంతవారలైన కాంత దాసులే॥ ఎంత॥

పదములో నేకదేశసామ్యము నుపయోగించి చమత్కరించగ హాస్యమును ప్రతిపాదించుట యొక పద్ధతి. చూడుడు. క్రింది తిరుపతి వెంకటేశ్వరుల రచన, గీతమునుండి:

ఱేఁడు పరాపరోక్తుల నెఱింగి విచారణ సేయఁడేని మా
ఱేడును కాఁడె. తన్ననుసరించిన శ్రీ ఫలమిచ్చుచుండు, నే
రేడును కాఁడె. యయ్యది భరించు ద్విజప్రకరమ్ము నెల్ల, బూ
రేడును కాఁడె. యయ్యది చరించెడు పత్రరథంబుగుంజూడగన్.

ఒకప్పుడు హాస్యముగాని హాస్యముగూడ పుట్టుచుండును. ఇది సామాన్యముగా మాండలిక భాషాభేదము వలనఁ గల్గును. కొన్ని ప్రాంతములలో భోజనము పెట్టు పూటకూళ్ళ ఇల్లిక్కడ యని యడిగినప్పుడు జవాబుగా "అటపో, గుద్దుచ్చుకొని వేస్తారు" అందురు. ఇది యుక్తి రాదియాంధ్రులకు "క్రరపెట్టకొండరా"ని యర్థమగును. కొన్ని ప్రాంతములవారికి దుడ్డు అనగా డబ్బు అని యర్థము. పెట్టుదురనుటకు

కుడి కాలుకూడ పిసుకమని చెప్పినాను. అంత వాడు "వాడి కాలు నే పట్టుకొనండి" అన్నాడు. అంగలకత డది వాని కాలు, కాదు. తనకాలురా యని యెంత చెప్పినను మొరాయించి "వాడి కాలు పట్టుకో మంటారేమి టండీ" అన్నాడు. ఇది గురువుగారికి చిరు నవ్వు తెప్పించినది.

ఒకమారొక కోర్టులో సాక్షి దేవునియెదుట ప్రమాణముచేసి యంతా నిజము చెప్పతానని చెప్పి సాక్ష్యము ప్రారంభించి తన వయస్సు 34 సం॥లని తెలిపినాడు. అంత నెదుటిపక్షపు ప్లీడరు క్రాసుపరీక్షచేయుచు రెండు సం॥ల క్రితము నీ వయస్సు 34 సం. లే యని ఫలానా కోర్టులో నీవు చెప్పినావా కాదా యని యడుగ, నతడు "అప్పుడొకమాట నిప్పుడొకమాట చెప్పతానా అండి" అన్నాడు. అంత నందఱు పక్కున నవ్వినా రతని సత్యసంధత్వమునకు. కావున హాస్యమనునది యే రూపమునందైనా, యెక్కడనైనా, నెవరి యందైనను, ప్రయత్నపూర్వకమైనది యంత సహజముగా నుండదు. కొందఱేవో కొన్ని హాస్యరసఘట్టములను పట్టుకొని వానినే వివిధ సందర్భములలో ననేకసార్లు దొర్లింతురు. అవి మొదట విను నప్పుడు మనోహరముగా నుండును కాని రెండుమూడుసార్లు వేవిను నప్పుడవి మొదటెంత వినోదముగా నుండునో, తర్వాత నవి యంత వికారముగా తోచును. కావున హాస్యమునకు నవ్యత సందర్భశుద్ధియు లేనిదే శోభింపదు, మఱియు హాస్యరసము నప్పటికప్పుడు వండుకొన దగినదే కాని, యాద్యంతము భుజింపదగినది కాదు.

## వచనరచన - హాస్యము

19 వ శతాబ్దము చివరభాగమున కందుకూరి వీరేశలింగముగారి కాలమునుండి యాంధ్ర వాఙ్మయమున నొక నూతనయుగ మారంభమైనది. ఆంగ్లభాషాపరిచయ ప్రభావ మాంధ్రభాషపై బాగుగ నెఱపి నూత్న సారస్వతాభిరుచులను నెలకొల్పినది. సారస్వతవికాసమునకు పద్యముకంటె వచనమే ఎక్కువ ప్రయోజనకారిగ దోచినది. ఆ వచనముగూడ దీర్ఘసమాసభూయిష్ఠమై, యలంకార రచనగల దీర్ఘవాక్యములతో గాక, సరళమైన శైలితో తేటతెలుగుమాటలతో సులభగ్రాహ్యమైన వచన రచన పరిగ్రహింపబడి యామోదింపబడినది. ఇట్టి వచనరచనా విధానము సమస్తమైన శాస్త్ర విషయ చర్చలకు, సారస్వత మీమాంసలకు, సాహిత్యశాఖలకు నవసరమని గుర్తింపబడినది. దానికి దారితీసి చూపినవాడు వీరేశలింగముగారే. వచన రచనతోబాటు సారస్వత రంగమున నూతనశాఖలు మొలకలెత్తినవి. అట్టివానిలో నవల రచన, నాటకములు ముఖ్యమైనవి. నవలలాంధ్రసారస్వతమునకు గ్రొంగ్రొత్తలు. ఇవి యాంగ్లభాషా ప్రభావ విలసితములు. ఆంగ్లదేశమున 18వ శతాబ్దమున వెలసిన నూతన సారస్వతశాఖ లీకాలమున నాంధ్రదేశమున మొలకలెత్తినవి. ఆంగ్లమున Oliver Goldsmith రచించిన Vicar of Wakefield అను నవల ననుసరించి వీరేశలింగముగారు రామచంద్రవిజయమును నవలను సరళశైలిలో రచించిరి. Jonathan Swift రచించిన Gullivers Travel అను పరిహాసపూర్వకమైన (Satire) గ్రంథము నాశ్రయించి "సత్యరాజా దేశయాత్ర"లను గ్రంథమును సంఘసంస్కార ప్రయోజనమునకై వ్రాసిరి. ఇందు మూలమున సనాతన మతాచారములు పరిహసింపబడినవి. ప్రహసనములు నాటికలుకూడ నీప్రయోజనముకొఱకే వీరేశలింగముగారు ఉపయోగించుకొనిరి. ఇందుచే నిందలి హాస్యము గొందఱి మనస్సులకు నొప్పి కల్గించి కటుహాస్యముగ పరిణమించినది.

వీరి సమకాలికులు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారుకూడ సంఘసంస్కారప్రియులేయైనను, నా ప్రయోజనమునకై యంత కంకణమును గట్టుకొనక, సారస్వతవినోదమునకు నవలరచనను కొనసాగించి యాంధ్రసంఘమునగల లోటుపాటులను ప్రదర్శించి "గణపతి"యను చక్కని నవలను రచించిరి. గణపతి పరిహాసపాత్రమైన యొకపాత్ర. సోమరి, పోకిరి, మొద్దబ్బాయి యంటివాడు. వీని నాశ్రయించుకొని యనేకవిధములైన హాస్యరసప్రతిపాదకములైన సన్నివేశములు, సంఘటనలు, సమకూర్చి, కథలో ననేకమైన వంపులు, సొంపులును కల్పించి, సంఘములోగల యవకతవకలును, లోపములును నిందు చిత్రింపబడినవి. ఇందు చక్కని హాస్యము జీవము పోసికొనినది. లక్ష్మీనరసింహంగారి ఇతర రచనలలోగూడ హాస్యము సుమారుగా బాగుగనేయున్నదని చెప్పవచ్చును. కాని హాస్యమున వీరు సిద్ధహస్తులని చాటినది "గణపతి"యే.

వీరితర్వాత పరిగణింపదగిన హాస్యరచయిత పానుగంటి లక్ష్మీనరసింహముగారు. ఆంగ్ల సాహిత్యములోని స్పెక్టేటరు (Spectator) వ్యాసముల ననుసరించి తెలుగున "సాక్షి" యను పేరుతో వ్యాసరూపమున హాస్యరసమును ప్రతిపాదించిరి. సంఘమునగల యవినీతి, యహంభావము, మోసము, డాంబికము మొదలైన యనేక దుర్గుణములను దురాచార దురభ్యాసములను నిర్దాక్షిణ్యముతో, నిర్మొగమాటముగా విమర్శించి, వెక్కిరించి, వేళాకోళము చేసి; పరిహాసముపాలు చేసిరి వీరు. వీరి వ్యాసములందలి హాస్యము కటువుగా గొన్నిచోట్ల మోటుగాగూడ నున్నది. సామాన్యముగా నాకాలమున ప్రబలియున్న సాంఘికలోపములన్నింటిని వీరు విమర్శించి యధిక్షేపించినారు. వ్యక్తిగత దూషణ నెక్కడను చేయలేదు. కావున వీరి వ్యాసములు గౌరవింపబడినవి. కాని వీరివ్యాసముల కాంగ్లభాషలోని స్పెక్టేటరునకు వచ్చిన సాహిత్యగౌరవముమాత్రము సిద్ధింపలేదు. కారణమేమన నాంగ్లమున ఎడిసన్, స్టీలు (Addison, Steele)ల శైలి మృదుమధురమై బహుసరళముగా నడచినది. సాక్షి వ్యాసముల శైలి ముతకబారి, వారి హాస్యమువలెనే కటువుగా తయారైనది. వీనిలో లాలిత్యము, మాధుర్యము తక్కువ. అందుచే వీనికి సాహిత్యగౌరవము రాదగినంతగా రాలేదు. పానుగంటివారి పౌరాణిక నాటకాలు సుప్రసిద్ధములు. వానిలోగూడ హాస్యరసము తగిన చోట్ల జొప్పించిరి. కాని వీరి సాంఘిక నాటకాలగు కంఠాభరణము, సరస్వతి, వృద్ధవివాహము మొదలైన నాటకాలలో చమత్కారము; సంఘమునందలి ఛాందసాచారములు, దుర్నీతి మొదలైన వానిని నవ్వులపాలు చేసి వారు హాస్యరసమును కడు సామర్థ్యముతో పోషించిరి. హాస్యరసమును పరిపాలించుటలో వీరు కడుదక్షులు. ఆరసమునకు దగిన పాత్రపోషణమును, సన్నివేశ నిర్ణయమును, పాత్రోచిత వాక్చమత్కారమును నిర్వహించుటలో వీరికి సాటి యాంధ్రలో లేరని చెప్పవచ్చును.

"వదరుబోతు" వ్యాస సంపుటియు సాక్షి వంటిదియే. దీనిలో శ్రీ పప్పూరి రామాచార్యులు మున్నగు ముగ్గురి రచనలు కలవు. వీనిలో సున్నితమగు హాస్యము విద్యావంతులను రంజింపజేయును. దీనికి 'టాట్లర్' (Tattler) వ్యాసములు ఒరవడియుండును.

యవివేకమును శారపాటుగ ప్రతిపాదించుచు ప్రతి సంఘటనలోను హాస్యమును పుట్టించినాడు. ఇంకొకవిధముగ చెప్పవలెననగా పార్వతీశము మఱియొక ఋష్యశృంగుడనవలె. ఇతనికంతయు క్రొత్తయే ప్రతియు దనకు క్రొవలసినదే ప్రతిదానిలోను దన యవివేకము, నవీనతయు ప్రత్యక్షమగును. కాని యితడు గణపతి యంత మొద్దబ్బాయిగ కనబడడు. గిరీశమంత తుంటరియు గాడు. ఇందులో మిశ్రభావముల వలన గలుగు హాస్యముగాని, దుష్కార్యోద్యోగుల వలనఁ గలుగు నవ్వుగాని యుండదు. వివిధ సంఘటనలందు, సన్నివేశములందును పార్వతీశము చూపు నవివేకమువలననే నవ్వు గలుగును. అట్లు నవ్వించు సందర్భములు మాత్రము విశేషముగా నిందులోఁ గూర్చఁబడినవి. ఇదియే దీనిలో విశేషము. మొత్తముమీద నాంధ్రభాషలో నిది క్రొత్తరకమైన రచన యగుటచేతను, రచనయుఁ గూర్పును జాగ్రత్తతో నిర్వహింపబడుటచేతను జనుల యాదరమును బడసి కర్తకు కీర్తిని సంపాదించిపెట్టినది. ఇందొక వ్యక్తిని గాని సంఘమును గాని వెక్కిరించినట్లుండదు.

క్రొత్తతిరమున కూచిపూడిభాగవతులలో వెంపటి వెంకట నారాయణ, యీతిరమున నాటకరంగమున స్థానం నరసింహారావు గార్లు స్త్రీపాత్ర నభినయించుటకు స్త్రీల కుచితమైన వేషభాషల నంగుకొనుటలో పెట్టి సమర్థులని పేరుగాంచిరో, యీ కాలమున మధ్యతరగతి కుటుంబములలో గాంచెడు నాగరికత కల స్త్రీల హావభావములు, మాటలపొందిక, మృదుమధురవాక్కులతో భర్తను మెప్పించు లక్షణము లన్నియు జీర్ణించుకొని, పుణికిపుచ్చుకొని హృదయంగమముగా స్త్రీస్వభావమును రచనలో ప్రతిపాదింపఁగల వారు మునిమాణిక్యం నరసింహారావు గారు. అసంగతమాటలన్నియు వలపరచుకొనివారు వీరు వీని మూలముగా కాంతంకథలను వ్రాసి చేర్చి యాబాలగోపాలము, స్త్రీపురుషులందరిని వశ్యము చేకొని, హాస్యరచనాచాతుర్యమును సంపాదించినారు వీరు. ఇవి బహు స్వాభావికములును, లలితములుగూడ నుండును. కాని కాంతం భర్త మాత్రము బియ్యే ప్యాసయినను తన భార్యకు తెలివితేటలలో క్రిందు చేయియై యవివేకిగా పరిగణింపబడును. ఇట్లని రిప్ వాన్ వింకిల్ (Rip Van Winkle) వలె స్త్రీరాజ్యమున కధీనుడుగాడు గాని, యన్నియు సరసముగను, సమ్మతముగను సర్దుకొనిపోవును. సంసారములోఁ గల కష్టసుఖములను పంచుకొనుచు నిరువురు దంపతులు సరదాతో కాలమును గడుపుదురు. ధనవంతులు కాకపోయినను పరస్పరానురాగము, పరస్పరగౌరవములను గలిగిన యమాయకమైన దాంపత్య సౌఖ్యమిందులోఁ బ్రతిపాదింపబడినది. కాంతముయొక్క మృదు స్వభావమునకు దగినట్లుగనే భాషయు నతికిపోయినది. ఈ కథలలోని హృదయాకర్షణత్వమునకుఁ గల కారణము భావములను మించిన సౌకుమార్యముగల భాషలలోనున్నదో, లేక భాషను మించిన భావలాలిత్యములో నున్నదో నిర్ణయించుటకూడఁ గష్టమే. భావమునకుఁ దగియు రచనయును గాగు. భావవ్యక్తీకరణవిధానమని నా యుద్దేశము. ఇది కాంతం కథలలోని మాహాత్మ్యము. ఈ కథను జదువుకొని మసిముసి నగవులు చెందని యువతీయువకులు గాని, వృద్ధదంపతులు గాని యుండరని నా తలంపు. ఇందలి భావములు, రచన హాస్యముగూడ నవ్యాజమనోహరములై, సహజసుందరములై, యనుభవింపఁ దగినవి. ఇందు విశేషము కథకూడ నుండదు. కొన్ని సన్నివేశములు, సంఘటనలు చిత్రింపఁబడును. సుకుమారసుందరమైన స్త్రీజాతి విరి రచనలో ప్రతిబింబించును. ఈ కథలు హాస్యసరస్వతికొక యలంకారము వంటివి.

కథలు వ్రాసి నవ్వించుటలో పేర్పొందినవారు చింతా దీక్షితులు, డి. వి. నరసరాజు, కొడవటిగంటి కుటుంబరావుగార్లు మొదలైనవారు కూడ మఱికొందఱు గలరు.

## వ్యామోహ నాటకము

కాని సామాన్యముగా ప్రహసనములోని నాయకుడు అవివేకియో, సోమరిపోతో, మూర్ఖుడో, లేక ఏ యనుచితలక్షణము గల్గి పరిహాసపాత్రుడై నవ్వింపగల్గుట జరుగును. కాని యీ వికారలక్షణములు గాని, వికారచేష్టలు గాని, మాటలు గాని లేకుండ హాస్యరసమును పోషించుట యసాధ్యముగ నటుల నాటకకారకులే లక్షణగ్రంథములలో తెలిపినారు. ఇంతవరకు పరిశీలించిన గ్రంథజాలమందంతట నట్లేయున్నది. ఇందుచే వికారలక్షణములు లేకుండ హాస్యరసమును ప్రతిపాదింప వీలున్నదా, లేదా యనుభావముకూడ నప్పుడప్పుడు గలుగఁగలదు. ఈ సమస్యాపరిష్కారార్థముగ నొక చిన్న నాటక మిటీవల 1952 సం.లో వెలువడినది. కర్త [illegible] లో జనించి, ఎం. ఏ. పట్టభద్రుడై, నటుడు, నాటకప్రయోగదర్శకుడు గూడ నగువాడు. కాన విద్యాసంస్కారానుభవముల దృష్ట్యా నారితేరిన యువకుడు, రసజ్ఞుడు కూడ.

అతి బాల్యమునందే దలిదండ్రుల ప్రేరణమున నొక పల్లెటూరి యందలి చిరుతవయస్సులో నున్న బాలికను పెండ్లిచేసుకొనిన తర్వాత కళాశాలలో విద్యనభ్యసించి, నవనాగరికుడైన యువకుడు, పాశ్చాత్య నవ్యనాగరికతా పరిసరములలో పెరిగి కళాశాలలో తనతోగూడ విద్య నభ్యసించుచున్న విద్యార్థినుల తళుకుబెళుకులు, నాచార వ్యవహారములు చూచి వ్యామోహితుడై, చిన్ననాడు పెండ్లిచేసుకొనిన పల్లెటూరిపిల్ల మోటుదనియు, నాగరకతాశూన్య యను నెపమున నామెను పరిత్యజింప నిశ్చయింపగా, నాతని వ్యామోహమును దీర్చి, యాతనికి సంతృప్తిచేసి, మఱియొక నాగరక యువతియే యను భ్రాంతితో స్వభార్యనే పరిగ్రహించునట్టుల నాతనిని జేయుట నాటకమందలి యితివృత్తము. ఇందనేక చమత్కారములు కథాకల్పనమందు గలవు. కథానుగుణముగ యౌగంధర మంత్రి తంత్రమువంటి తంత్రముకూడ నిందు గలదు. తనభార్య నేలినచో ధనము, నాస్తియు నిచ్చెదమని యెంతమంది బంధువులును, స్నేహితులును బ్రతిమాలి చెప్పినను వినక, వారితోఁ గలహించి, దుఃఖపడి నివసించుకొని, యతి నాగరికురాలగు పరస్త్రీయను భ్రాంతితో స్వభార్యయగు సుశీలను రహస్యముగా బుద్ధిపూర్వకముగ లేవదీసికొనిపోయి, చెన్నపట్టణమున సంతోషముతో సుఖజీవనమును జేసిన బుద్ధిమంతుడు కుటుంబరావీ నాటకమునకు నాయకుడు. ఈతని బుద్ధిజాడ్యజనితోన్మాదమునకుఁ జక్కని చికిత్స చేసిన యౌగంధర ప్రజ్ఞాధురంధరాలు, కళాశాలా విద్యార్థినియు, నవ్యనాగరికురాలును, నాయికయగు సుశీల స్నేహితురాలునగు మిస్ పారిజాతము. యావజ్జీవము భార్య జీవితమును భ్రష్టము చేయుదలఁచుకొనిన కుటుంబరావును మరల తన భార్యను స్వీకరించు

కటువులచేసి కుటుంబరావు కుటుంబము నుద్ధరించి, నిలువఁబెట్టుట యను మహోదాత్త విషయము పవిత్రమైన యాశయము గగలది యీ నాటకము. స్వభార్యను స్వీకరింపుమని యెంతమంది నయమునను భయమునను జెప్పినను వినక, తిరస్కరించి, యన్యసుందరి యను భ్రాంతితో నామెను వెంటాడి, యామె కొంగు తగిలిన బంగారమని యుంగరాల్చి యామెకు దాస్య మొనర్చిన కుటుంబరావును తలఁచుకొనిన వారికి చిఱునవ్వు పుట్టకుండ నెట్లుండగలదు. ఈ కథలో నాదినుండి చివరవరకు నీ హాస్యరస విషయము ప్రధానమై యంతర్వాహినిగా సాగుచుండును. ఇంతటి హాస్యము వికృతాకార వాక్చేష్టలవలన జనించినది కాదు. అలంకారికులు సెలవిచ్చినట్లు వాక్చమత్కారములవలనఁగూడ నా హాస్యము పుట్టలేదు. చిత్రవిచిత్ర సంఘటన లిందెంతయుఁ బూర్వమే లేవు నవ్వు దెప్పించుటకు. మిశ్రభాషా ప్రయోగమున నొక్కచోట మాత్రము హాస్యము గల్గినను, ప్రధాన హాస్య విషయమున నీ సాధన ముపయోగింపఁ బడలేదు. ఇఁక నింతటి హాస్యము చమత్కార కథా కల్పనా చాతుర్యమున ప్రాణము పోసికొనినది.

ప్రతాపరుద్రీయ నాటకమునకును వ్యామోహ నాటకమునకుఁ గొన్ని సామ్యతములును, గొన్ని భేదములునుగూడ గలవు. ప్రతాపరుద్రీయ నాటకమున రాజ్యభ్రష్టుఁడగు ప్రతాపరుద్ర మహారాజు నుద్ధరించుట మహోదారాశయము గాఁగా, వ్యామోహ నాటకమున కుటుంబభ్రష్టము గానున్న సుశీలా కుటుంబరావుల నుద్ధరించుట యను నవి పవిత్రోదారాశయ మైనది. ప్రతాపరుద్రీయమున యుగంధర మంత్రి ప్రజ్ఞావిశేషము కాంక్షిత ఫలము సాధింపఁబడఁగా, వ్యామోహమున విద్యావంతురాలగు మిస్ పారిజాతము యొక్క బుద్ధివిశేషమువలన వాంఛిత ఫలప్రాప్తి సిద్ధించినది. ప్రతాపరుద్రీయమున సాధకుఁడగు మంత్రి యుగంధరుడు తన కార్యసాధనకొఱకు చివరకు వేషాంతరము పిచ్చివాడుగ నటింపగా వ్యామోహమున సాధకురాలగు మిస్ పారిజాతము, తన నామరూప వేషములను నాయికయగు సుశీలకొసంగియు, తాను తురకబూబు వేషమును నటించెను. ప్రతాపరుద్రీయమున కార్యసాధన మన్యదేశమగు ఢిల్లీ పట్టణమున జరుగగ, వ్యామోహమున కార్యసాధనము తమిళదేశమగు మద్రాసు పట్టణమున జరుగును. ప్రతాపరుద్రీయమున తెలుగు తురక పదములు మిశ్రితములై హాస్య ముత్పాదింపఁగ, వ్యామోహమున తెలుగు తమిళపద మిశ్రమము హాస్యమును బుట్టించినది. ప్రతాపరుద్రీయమున చాకలివానికి రాజు వేషము వేయింపగ, వ్యామోహమున పాచురస్త్రీకి విద్యావతి వేషము వేయింపఁబడినది. ఇంత సంబంధమున్నను నాటకముల కర్తలు మాత్రము సంబంధము లేనివారగుదురా! ఆ తాతమనుమల సంబంధము — పేరును నొకటే. వేదం వేంకటరాయ శాస్త్రిగార్లు

ఇందలి కథ ప్రస్తుత కాలమునకు సంబంధించినది. పల్లెటూరిలో పుట్టి విద్యావిహీనయై నాగరకతాశూన్యయను నెపముతో, చిన్నతనమున మేనమామకూతురగు సుశీల యను బాలికను పెండ్లి చేసికొనిన కుటుంబరావను యువకుఁడు బి. ఎ. ప్యాసయిన తర్వాత నామెను నేలక, చదువుకొనిన నగరియొక యువతిని పెండ్లి చేసికొందునని యూహించిన విషయమును దెలిసికొని, బి. ఎ. ప్యాసయిన యామె (నాయిక) స్నేహితురాలగు పారిజాతమను నొక యువతి. యాతని పిచ్చికుఁ దగిన చికిత్స చేయఁ దలఁచి సుశీలకు తళుకు బెళుకు సాధనలు చేయించి, నలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్పించి, తన పేరామెకు మార్చి పెటి కుటుంబరావు పోయే క్లబ్బుకే పంపించి, యాతనికి సుశీలయొక్క నూత్న విద్యావతియను భ్రాంతి గల్పించి, యామెను ప్రేమింపఁజేసె. చివర కామెను రహస్యముగా నతఁడు లేవదీసికొనిపోయి చెన్నపట్టణములో రిజిష్టరీ మ్యారేజి చేసుకొని సుఖముగా నుండఁజేయు నిందలి కథ. ఈ తంత్రాంగములో పారిజాతమునకు సూర్యారావను కుటుంబరావు మిత్రుఁడు కూడ సాయపడును. (ఇది 18 రంగములుగల్గిన 80 పుటలుగల 1/8 క్రౌను సైజులో గ్రేటు ప్రైమరు టైపులో ముద్రింపఁబడిన చిన్న గ్రంథము. కాని యిందలి దృశ్యకావ్యశిల్పమును, హాస్యమును దీని నొక గొప్ప గ్రంథముగాఁ జేసినవి.) ఇందు నాటకాంగములగు పంచ సంధులు చక్కగ కుదిరినవి. కథ స్వకపోలకల్పితమయ్యు నెక్కడను కుంటుపడలేదు. ఇందలి సమస్యా పరిష్కారము చమత్కృతమైనదైనను నిందలి వాక్యములును, సన్నివేశములును పూర్వాపర వ్యాఘాతములుగాక చక్కగ యౌచిత్యముతోఁ గూర్పఁబడి గ్రంథకర్త ప్రతిభానైపుణ్యములు వేనోళ్ల చాటుచున్నవనుటకు సందేహము లేదు.

ఇందు 13 వ రంగమును, 18 వ దృశ్యమును పరమ ముఖ్యములైనవి. మిగిలినవన్నియు కథానిర్వహణకు మాత్రము పనికి వచ్చునవియే. 15, 17 దృశ్యములు రెండును తమిళ తెలుగు భాషా మిశ్రమము వలనఁ గూర్పఁబడిన హాస్య రంగములు. ఇందలి 13 వ రంగమున గర్భసంధియు 18 వ రంగమున నవమర్శ నిర్వహణ సంధులును నిర్వహింపఁబడినవి. ఇందు రెండవ రంగమున సుశీల తండ్రి సుబ్బయ్యగారి మిత్రుఁడగు రామయ్య కుటుంబరావును సుశీలను గ్రహింపుమని ప్రార్థించి విఫలుఁడగుట ముఖసంధిగా నిలచినది. ఏడవ రంగమున పారిజాతము సుశీలకు తన వేషమును వేయించి క్లబ్బుకు పంప కుటుంబరావును మోహింపఁజేయుట ప్రతిముఖ సంధి యగును. అవమర్శసంధి చివర [illegible], [illegible] మంత్రియు బయటపడుటవలన నాయకుఁడగు కుటుంబరావు మూలమున ప్రతిపాదింపఁబడెను.

ఇందులో 13 వ దృశ్యములో నాటక చమత్కార శిల్పమును, సంగుమూలమున గొప్ప హాస్య మంతర్వాహినిగా సాగుచుండి నిర్వహింపఁబడినవి. పారిజాత సూర్యారావుల ప్రయత్నములమూలమున సుశీలా కుటుంబరావులు పార్కులో నొక చెట్టు క్రిందఁ గూర్చొని, పారిజాతమను భ్రాంతితో నామెతోఁ కుటుంబరావు ప్రణయ సంభాషణమును గావించుటయు, సుశీలను నిందించుటయు జరుగును. ఇందు చక్కని పతాకస్థానము (Dramatic Irony) లు నొద్ది యుత్తమ నాటక శిల్పముగా రూపొంది, కథా పరిణామమునకు చక్కగ తోడ్పడినవి.

కుటుంబరావు ప్రత్యక్షముగా సుశీల ప్రక్కనే కూర్చుండి మాట్లాడుచు "ఆ అమ్మాయిని (సుశీలని) ఇక ఎంతమాత్రం దగ్గర చేర్పదలచుకోలేదు ఆ నిధివ పే వెళ్ళను' అటుకన్న తమాడను" అని సుశీలతో చెప్పుచుండగా, సుశీల కోరక చూచే ప్రేక్ష

కుల కెంత నవ్వు పుట్టించును. సుశీల కుటుంబరావుతో "సుశీల ఫేస్ గా ఉందండి. చాలా గ్రేస్ గా ఉంటుంది చాలావరకు. దూరంలో నుంచి చూస్తే నేనేనని అనుకుంటుంటారు వాళ్ళు నాన్న మోస పోతే" (పుట 47) అని పలుకుటమూలమున చాలా చమత్కరింపఁ బడినది. గిట్టనివార రఘురామయ్య కుటుంబరావుతో 'ఆమె గూడ సుశీలయే' యని చెప్పినపుడు కుటుంబరావు ఆ మాటలు జ్ఞాపకము చేసికొని "ఆం. అన్నావు కాదూ, వారిద్దరూ ఇంచుమించు ఒకేలా గుంటారని" (పుట 76) అని సమాధానపఱచుకొనినాడు. ఈ సన్నివేశ మొక 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' (Comedy of Errors) వలె తయారైనది. విజయవిలాసములో తాపసవేషములో నున్న నర్జునుని ద్వారకలో సుభద్రతో మాట్లాడుచుండఁగా నామె యాతని నర్జును నెక్కడ కంటిరని యడుగగా నతఁడు

"ఏమని చెప్పవచ్చు నొకయించుక భేదము లేక యాయనే
కోమయి యున్నవారలు సుమీ, వికచాంబుజపత్రలోచనా"

(విజయ II, 16౯.)

అను రీతి సన్నివేశము తయారైనది ఈ నాటకమున. సుశీల పైమాటలను బట్టి, ఆమాటలు విన్న తర్వాతఁగూడ కుటుంబరావు తనభార్యను గూర్చి సుశీలతో నే "నాకు నమ్మకం లేదు. మీ రెక్కడ, అదెక్కడండీ! హస్తిమశకాంతరం. ఈ ఎడ్యుకేషనూ, ఈ పాలిషూ, స్టైలు, ఆ రెడ్డి ఎన్లైటెన్మెంటు వస్తాయా? అకడమిక్ క్వాలిఫికేషన్, ఎక్స్పీరియన్స్ వీటితో సమానమా?" (పుట 47) అని యనుట వినుచుండఁగా రసజ్ఞుఁ డెంతను నవ్వాపుకొనలేక యీ సన్నివేశ సంధానవిధానమునకు సుగ్రహించిపోవును. ఇదియే యీ నాటకమునందలి యుత్తమమైన హాస్యమును గల్గించు కారణము. ఈ సన్నివేశమునందలి సంభాషణము బహుజాగ్రత్తగా నిర్వహింపఁబడినది. సుశీల ప్రత్యక్షముగా తనభర్తను తన్ను పరిత్యజించు విషయమై యడుగఁదలఁచుకొనిన సందేహనివారణ ప్రశ్నలన్నియు నడుగుటకు మంచి యవకాశము గల్గినది కాని పరస్త్రీని తనభర్త ప్రేమించినాడని తెలిసికొనినపుడు సామాన్యముగా స్త్రీలందఱుఁ బొందు నసూయా ద్వేషములుగాని, భర్తలు దూషింపఁదగు నుద్రేకముగాని పొందక, బహుజాగ్రత్తగ, నెమ్మదిగ నంతయు నాతని పూర్వపు భార్యయగు సుశీలపై దయాదాక్షిణ్యములు గల దానివలె ప్రవర్తించి యాతని మెప్పునుగూడ సంపాదించుకొనును. ఈ జాలి సన్నగూర్చినదే యింత రౌంతయు నుచితముగనే యుండును. అల్పభేదము సాదృశ్యమున నున్నను, నీ సన్నివేశము భాసకృత స్వప్నవాసవదత్త నాటకమందు, తలనిండ ముసుగుపెట్టుకొని పరుండిన వత్సరాజును తిరోధానభార మనుభవించు పద్మావతి యను భ్రాంతితో, నాతని శయ్యపై పరుండిన వాసవదత్త, రాజాక వరించిలను విను సన్నివేశము తోడను, నుత్తరరామచరిత్రమునందలి ఛాయాంకమున శ్రీరాముడు సీతకై పడు పరిదేవనమును సీత చాటుననుండి విను సన్నివేశము తోడను పోల్పదగినది. ఆ రెండు నాటకములందు పూర్వభార్యలపై నాయకుల కభిమాన ముండఁగ నీ వ్యామోహ నాటకమున పూర్వభార్యపై తిరస్కారము చూపును నాయకుఁడు. ఇంతే భేదము. ఈ మూడు నాటకములందుఁగూడ నాయకులకు యథార్థము దెలియఁబోయినను నాయికలుమాత్రము ప్రత్యక్షముగా ప్రక్కనే యుండి నాయకుని యవస్థను చూచుచుందురు. ఇదియే వానిలోఁగల సాదృశ్యము. ఈ వ్యామోహ నాటకమున పూర్వభార్యయే దాసిగుట మరింత విచిత్రముగ నుండును. అట్లయ్యు నాటకతంత్రము చెడగొట్టకుండ ప్రథమభార్యను పరిత్యజించి కుటుంబరావు తన్ను వివాహమాడ దలఁచుట యధర్మమని సుకుమారముగా యాతనితో వాదించుచు, "తాను కుటుంబరావును వివాహమాడుట తన స్నేహితురాలకు ద్రోహము చేయుటయే యనియు, నట్టి దుష్కార్యము నతనికొరకు చేసినతర్వాత తిరిగి ఆమెముఖము మెల్లు చూడఁగలననియు, దగుపుకొనిన యాడవాళ్ళందఱు నిలాగ చేయుదురని నింపాలు కావా" యనియు, సుశీల కుటుంబరావుతో వాదించి, యాతని గౌరవాదరములను సంపాదింపఁ గల్గును. ఇదుచే నీ సన్నివేశము బహు సుప్రసన్నమును, చమత్కారముగను, రసవంతముగను, హాస్యరసకరముగ నుండి, పాత్రపోషణముగూడ చాల స్వభావికముగ నిర్వహింపఁబడినది. ఈ నాటకములో విశేష మిది. చూడండి కుటుంబరావు సుశీలతో నేమనుచున్నాడో.

కుటుంబరావు 'నీవు చేసిన త్యాగం దానికంటె కూడా చాల ఉత్తమురాలివి. నీలో ఇన్ని సుగుణాలున్నవని గ్రహింపలేక పోయినాను. నీ మాటలు వినేకొద్దీ నాకు నీమీద గౌరవం ఎక్కువవుతూ వుంది. నీవంటి సుగుణరత్నాన్ని సంపాదించుకోవడానికి నేను ఏ పాపమన్నా చేస్తాను. ఎంత అధర్మమన్నా చేస్తాను. నా భార్యతో నాకు స్నేహమే లేదు. పరిచయమే లేదు. నీ వెంత చెప్పినా అటువైపు నామనస్సు తిరగదు. నీవే నా దేవతవు. ఏమైనా సరే. నా ప్రార్థన కాలితో తన్నేస్తావా?.. నీలో తప్పులేదు. నాదే తప్పు... నాకుమాత్రం నీవు కావాలి." అను మాటలు ప్రేక్షకు లొకచెవితో విని హాస్యమును, మరియొక చెవితో విని జాలియు పొందుదురు. సుశీలకూడ నాతనిమాటలు విని, నొకవైపునుండి కోపాపహాస్యములును, మరియొకవైపునుండ లజ్జయు పొందఁగలదు. ఇదియే ఈ నాటకమున ముఖ్యమైన చమత్కారము. సుశీలగూడ లోలోపల నవ్వుకొనక యుండలేదు. ప్రేక్షకులవలె. మరియొకవైపు జాలియు పొందకుండ యుండలేదు. పైఁదెల్పిన యుత్తరరామ చరిత్ర, స్వప్నవాసవదత్తలోని సన్నివేశములలో నాయకుని కొరకే నాయికలు జాలిపొందలేదా అట్లే యిక్కడను. కాని ఇక్కడ కథలో నొకవిశేషము. పై రెండు నాటకములలో నాయిక చనిపోయినదని నాయకుని భ్రాంతి. వ్యామోహ నాటకములో పూర్వపుభార్య వేరని భ్రాంతి. కుటుంబరావునకు పూర్వపుభార్యయు ప్రస్తుతము ప్రేమించుభార్యయు నొకతెయగుటచే పై నుదాహరించిన కుటుంబరావు వాక్యములకు రెండువిధములైన భావములు ప్రేక్షకులకును నాయికకును గల్గుటకవకాశము గలిగిన ఈ నాటకమున. ఇదియే ఇందలి ముఖ్యచమత్కారము. ఇదే యీ నాటకమున నుత్తమమైన హాస్యమును పుట్టించుటకు ప్రధానకారణమైనది. పై కుటుంబరావు వాక్యములే నాటకమున పతాకస్థానములై (Dramatic irony) గా పరిణమించి విగళితవేద్యాంతరత్వమును గల్గించుచున్నవి ప్రేక్షకులకు. చివరకు సుశీల కుటుంబరావుతో "మీరు చేస్తున్నది అధర్మమని మీరే ఒప్పుకొంటున్నారు. కాబట్టి తమ అధర్మాన్ని ఒప్పుకోవడమే సగం మార్గానికి రావడం.

మీ భార్య మీవద్దకు వచ్చి మీరు ఆవిడను గ్రహించేపద్ధతికే నేను మార్గం చూస్తాను. నా స్నేహితురాలి కోసం త్యాగం చేస్తున్నాను. మీ రిద్దరు ఒకటి కావటానికోసమే నేను మిమ్మల్ని వివాహం చేసుకొంటాను. మీరు ఒక కుటుంబం అయిన మరువివిషం పారిజాతం మిమ్మల్ని వదలి అక్రమస్వీకారం చేస్తుంది." అను మాటలలో ఎంతైనా వ్యంగ్యమున్నది. పై వాక్యములలో "మీ రిద్దరు ఒకటి కావటానికి......" అనుటకు బదులుగా "మే మిద్దరము ఒకటి కావటానికోసమే నేను మిమ్మల్ని వివాహం చేసుకొంటాను" అని వ్యంగ్యార్థము ప్రేక్షకులకు స్ఫురించి మరల నవ్వుకోకుండ నుండలేరు. ఈ విధముగా ప్రసన్నముగా, ప్రశాంతముగా కుటుంబరావుతో నిద్దరి భార్యలకు సంధి (రాజీ) కుదిరింది ఇదియే యీ నాటకములోని గొప్ప చమత్కారము. మఱియొక విషయము. కుటుంబరావు మాటలవలన గలుగు ద్వివిధభావములు సుశీలకు స్ఫురించినట్లుగా, సుశీల వాక్యములలోఁ గల వ్యంగ్యము కుటుంబరావుకు దోఁచదు. ఏలన కుటుంబరావు పూర్వపు భార్యయు, ప్రస్తుతపు ప్రేయసియు నొకతేయను తంత్రాంగము సుశీలకును ప్రేక్షకులకుఁ దెలిసినట్లుగా కుటుంబరావుకుఁ దెలియకపోవుటే. ఇదుచేత నే 18 వ దృశ్యమున చివరకు కుటుంబరావు తబ్బిబ్బుగు పడెతాఁడు. అక్కడొక (Comedy of Errors) వలెను, కళాపూర్ణోదయమందలి నిజరంభా మాయారంభలవలెను, మరియొక సన్నివేశము జరుగును. కాని కళాపూర్ణోదయమునను, షేక్స్పియరు రచించిన కామెడి ఆఫ్ ఎర్రర్స్‌లోను మాయారంభ సత్యరంభ లిద్దరును, రూపసాదృశ్యముగల సోదరు లిరువురు నుండిరి. కాని వ్యామోహ నాటకమున నావిధమైన కలత, చీకాకు పడనక్కర లేకుండ, నిద్దరు నాయికలు నొకరియందే సంవర్ధపడుదురు. ఇందుచేగూడ నీ నాటకము స్వప్నవాసవదత్త ఉత్తర రామచరిత్రలందలి చమత్కారమును, కళాపూర్ణోదయము కామెడీ ఆఫ్ ఎర్రర్స్ లందలి చమత్కారము నుయోగించి, వానియందుగల మాయలను, చీకాకు కలతలు నిందు లేకుండ ప్రసన్నముగ భాసించినవి. ఇది మరియొక విశేషము.

ఈ నాటకము చివరరంగము ప్రారంభమున రామయ్య మద్రాసు చింతాద్రిపేటలో నున్న సుశీలా కుటుంబరావులను జూచుటకు వచ్చుటతో నాటకకథ నిర్వహణముఖము పెట్టి తంత్రి మంతియుఁ గ్రమముగా విడిఁగుచు వచ్చినది. సంవర్ధానుకూలముగా, సర్వమెఱిగిన రామయ్యగూడ కుటుంబరావుతో "నువ్వు ప్రబుద్ధుడివి గనక సంకష్టుండా అల్లసుహోబలం వెంకట్రావుగారి కూతురు పారిజాతాన్ని లేవదీసికొని చక్కా వచ్చావు." అని పరిహాసపూర్వకముగా ఎత్తిపొడుస్తాడు. ఇది యెంతయు చమత్కారముగా విరసములో సరసము సాగినదైనది. అంతటితో చాలక రామయ్య "అల్లాడిపోతున్నాడు వెంకట్రావు. పాపం పెద్దవాడు. నింగా లేదు, కక్కా లేదు. నాతో నే వచ్చాడు. హోటల్లో ఉన్నాడు. సాయంత్రం పిలుచుకొస్తానుగా ఇక్కడికి." అని డబాయించి కుటుంబరావును భయపెట్టి, తన్ను పూర్వ మేడిపించినందుకు కసి తీర్చుకొనుటకో యనునట్లతని నేడిపించును. చెన్నపట్టణములో కుటుంబరావును కలుసుకొనుటకు దొంగదారిగా చేసిన యీ యుపక్రమణ. హాస్యములో హాస్యముగా నున్నది. కుటుంబరావును లాంగదీసుకొని వచ్చుట కిది యొక పై యెత్తు. అంత కుటుంబరావు సుశీల యుపదేశించినరీతిగా "నేను నా సొంత భార్యతో కాపురము చేస్తున్నానుగాని, ఎవరినిగాని వాళ్ల యిష్టంలేకుండా, బలాత్కారంగా లేవదీసికొని రాలేదు. భగవత్ప్రీతిగా నేను ప్రేమించిన కన్యను వివాహమాడి సుఖజీవనం జరుపుతున్నాను. నాలో ఏ దోషమున్నూ లేదు. ఐతే సివిల్ రెజిస్ట్రేషను మ్యారేజి చేసుకున్నాము." అని వాంఛికముగా చెప్పిన జవాబులో పతాకస్థానము (Dramatic Irony) ధ్వనించుచున్నది తర్వాత మ్యారేజి సర్టిఫికేటులో 'సుశీల' యని యుండుటను చూచి 'మా సుశీలేనా' అని లోపలికిపోయి యామెనుచూచి పలకరించి కుటుంబరావుకు విస్మయము గల్గించును. ఇక్కడ యద్భుతరసమునకు తావేర్పడినది. రామయ్య యేమియు నెరగనివానివలె "నేను ఈ మధ్య సుబయ్యాగారింటికి వెళ్లలేదు. వెళ్లుంటే ఈ అమ్మాయి అక్కడ నాకు కనిపించి ఉండదు. నిజం తెలిసేది. అంచేతే గావును సుబ్బయ్య ఖంగారేమీ లేకుండా హాయిగా ఉన్నాడు. లేకపోతే కబురంపి ఉండేవాడు" అని అబద్ధమునుగూడ నిజమువలె మాటాడినాడు. ఇదంతా చూచి కుటుంబరావుకు విస్మయమధికమై రామయ్యకు మతిపోయిందని చెప్పసాగినాడు. యథార్థమున కాతనికే మతిభ్రాంతి గల్గినది. తర్వాత వెంటనే పారిజాతము కుటుంబరావింటికి వచ్చి సుశీల తన స్నేహితురాలని చెప్పగా నతడు బిత్తరపోయి, "వాటీజ్ దిస్. నేను నిద్రపోతున్నానా, మేలుకొన్నానా! పారిజాతం కాదు సుశీల లంటాడు రామయ్య. ఈ మెవరో వచ్చి తానే మిస్. పారిజాతం. బి. ఎ. అని అంటుంది. వీళ్ల మాటల ధోరణి చూస్తే అలాగే ఉంది. రెజిస్ట్రారాఫీసులోను, తన పేరు సుశీల నే యిచ్చింది. నన్నేమన్నా వేళాకోళం పట్టిస్తున్నదా, లేకపోతే ఇద్దరి పేర్లూ ఒకటేనా." అని కుటుంబరా వాశ్చర్యపడును. ఈ యద్భుతరస మవమర్శసంధిలో చక్కగ కుదిరిపోయినుహానాటకలక్షణముగా సమన్వయింపఁబడినది. మరియు, కుటుంబరావు "ఇదేమిటో, ఇదంతా నా కేమి అర్థం కావడంలేదు" అంటాడు. అందులకు రామయ్య "అన్నావుగా, నాకు మతిపోయింది, చిత్తచాంచల్యం, అని ఇందాకా. అదే, ఆ బాపతే" అని మాట ఒప్పగించును.. ఇంతలో సుబ్బయ్య వచ్చి యాశ్చర్యరసమును పూర్తిచేయును. అప్పుడు పారిజాతము సుబ్బయ్యతో "నే నిక్కడనే మద్రాసులో ఉన్నాను మామయ్యా, నా జాబులు మా నాన్నకి రెండుమూడు చేరలేదు. అంచేత ఖంగారు పడ్తున్నారు." అని సమర్థించి జవాబుచెప్పును. అప్పుడు కుటుంబరావు తనలో "ఈ విడ మిస్. పారిజాతం. నే నిన్నాళ్లు పారిజాత మనుకుంటూవచ్చిన నా భార్య సుశీలే" అనుకొని (Comedy of Errors) లాగాను, కళాపూర్ణోదయములో మాయారంభా, సత్యరంభల స్థితివలెను భావిస్తాడు. కాని యిక్కడ యొక్కటే రూపములో నిద్దరు వ్యక్తులు లేరు కాని, యొకటే వ్యక్తి రెండుపేర్లతో వ్యవహరించినది. అందులో నొకపేరు గలవ్యక్తి మరియొకరుగూడ నుండుటచే నిద్దరు వ్యక్తులుగూడ తయారైనారనే చెప్పవచ్చును. ఇది యీ నాటక

# మదనోత్సవమ్

శ్రీ ఆవంత్స సోమసుందర్

నాంది :

ఆమని బ్రతుకున పూచెను,
కోమల మోదోత్సవాల కుందకుసుమసుముల్;
సీమలు, కోనలు, కొండలు—
సీమంతపు మిసిమి మీరి శ్రీల వెలార్చెన్!
ఆ ప్రేమాంకురమ్ము లందాల లన్నిటి కోసి,
మేసి కోకిల మదే కూసె నేడు!
గ్రీష్మాగతాతపశ్రీ విహాగమ్ముచే
ఎలదేని సెలయేగా లిగిరె నేడు!
పాలయల్లుండలు వంచు పూల చెక్కిలినొక్కి—
వలపించి పులకించె భ్రమరి నేడు!
కొంపలి గాకున్ సందడించెను కీర
వాణీ మయూరి రవాలు నేడు!
సొగసులూరు పూలు, చుక్కలు, తావులు,
పులుగుమూక రొదలు సొగసు రేలు,
వింపుటాలవనలు, వలిపపు కెరటాలు,
తోట గుబుగ హోగు తోచె నేడు!
అడవులు, పచ్చికబీడులు,
తోటవుల మార్చిన విధాన తోచెను; వలపుల్
మాడిచిన పూ పడతులవలె
ఎడదలె చివురించె పల్లవి తిరుపులకున్.

కాలాత్మ :

నవ వసంత మధుర స్వప్న
భవన బంధనములు వీడ;
జవనాశ్వములై ఉరికెను—
యువజన హృదయములు!
జ్యోత్స్నా ఘనకేశయామిని,
మహోత్సాహ పికకామిని,
రసతుందిలమైన వసుం
ధర రాగోదయ మానిని!
జాగునాడు తేజ రంగా,
మ్రోగెను కోకిల కాహళి!
మీ కొరకే నిరీక్షించి—
కొనకొలను లిగురునేమొ!!

ప్రపూత కిరణాదిత్య సు
భోదయ భాగ్యమ్ము లమరె—
సుధాకరుని కృపాహేల
కాసార సమీప మాయె!
రండు రండు నరులారా—
గండుతుమ్మెద మ్రోతగ!
లెండు లెండు జీవన స్వ
ప్నాలి పండు కాల మిదే!!

కవి :

ఇదే ఋతువు మదీయ రస
హృది పొంగించెన్;
ఇదే ఋతువు పికవాణి
ఎద కదిలించెన్;
ఇదే లలిత సంగీతో
త్సవముల నింపెన్;
ఇదే నవ కవితా
వాహిని పొంగించెన్;
ఇదే మధుర మధుమాసము—
ఇదే హృదయ సంకాశము—
ఇదే మధుకర స్వనమ్ము—
ఇదే సురంగ ప్రసవమ్ము—
ఇపుడే నే నాలపింతు
జీవన సంగీతము!
బ్రహ్మానంద స్వరూప
సహోదరత్వమ్ము!
ఓహో మదనదేవా! గై
కొనుము స్వాగతమ్ము!
ఓ వసంత ఋతు రాజా!
హృదయాంజలి గొనుమయ్య

ఇదే మనికి కామని—
కాముని కోలాహలము;
ఇదే ఉనికి కోమల
జలతరంగాళిరవము;
ఈ మధుమాసమ్మే—యెద వ
సందుల నెల విందు;
వలపు చెలియ మధురాధర
రాగ రేఖ కందు;
ఇదే ఋతువు మదీయ రస
హృది పొంగించేదీ;
ఇదే ఋతువు పికస్వామి
ఎద కదలించేదీ!

చాతకం:

ఏల విలయకాల మిప్పుడే తోచెను?
చల్లతనముపోయి—ఉల్లమార్పు?
ఇది వసంతఋతువు ఏగుదెంచెను బోలు,
నాదు హృదికి సమరనాద మగుచు!
చటుల నీహార హార సంచయము క్రీల—
గగన గళసీమలో తారకాళి వెలసి—
జలద మాలిక లలవోక చదల కదల—
వెతల పొకార్పు నవతిటిల్లతలు మెరసి!
దేహ మడలించుకొనును సందేహవార్ధి
గళము వికసించబోదు మంగళము రాదు;
శాత్రవ సమూహములు రేగె; ధాత్రి రగిలె—
పికగళమ్ముల కాహళుల్ పిచ్చి రేగ!
విలయ మిదియె, మృత్యువిన్యాస మిద్దియే—
చలన మణచు క్రూరసమయ మిదియె!
కొండగుహాంధకారి కొనప్రాణము నైన
నిల్పుకొందు సృష్టినియతి కరగి!!

పికస్వామి:

మన బ్రతుకుల కిది హోళీ!
మన తలపుల కిది మోళీ!!
వలపుల తొలకరి పాటలు...
చెలిమి మిటారపు తోటలు;
కోరిక తలిరాకు విందు—నేడే నాకు;
భారములు తొలంగు హాయి నేడే నీకు!

మరంద మవిరళ ధారా—
స్నపిత స్వాదు విహారీ!
రావె సఖీ—మధుపాయీ;
వాసంత సురభిళము తేవె!
రావె సఖీ—మధుపాయీ!
మత్తస్వాంత చకోరీ!!

వికచ గళద్గళ సన్నాదమ్ముల—
ప్రకట మధుక్వణ విన్యాసమ్ముల—
నను పాలించవె మనోహారీ!
నిగళిత గళ మధుహారీ!
విచలిత స్వాంతాల మనోజ మనస్వీ;
ప్రసరిత కోమల గాన సరస్వతి!
కొసరి కొసరి కోరిక సత్త్రావులు—
విసరి విసరి వినిపించిన నవ్వులు;
ఎలమావులు చివురించిన గసగస
లెలనాగా ప్రియులారా రావే!
మన తలపుల కిదె మోళీ!
మన బ్రతుకుల కిదె హోళీ!!

ప్రసవమంజరి:

మధుర మధుర మరందాల—విభజే నేనే!
విధుల విషాదాలగాడ్పు—లెపుడూ రావె!
మసృణ మధుఝరీ—రావె!
విస్మృత శుభకరీ—తేవె!
రావె, రావె — మధుకరీ!
తేవె, తేవె — శుభకరీ!
వలపుల తొందరల మనసు—దోబూచులాడెనో?
తలపుల ఒత్తిడితో యెద—మైరేయము మరగెనో?
కోడెగాలి ఈదురులో—దురుసుతనం హెచ్చెనే!
చేడియ మోదగనీకల—రాగరసము పంచెనే!
రావె, రావె — ప్రియంకరీ!
తేవె, తేవె-శుభంకరీ!!

మధువ్రతం:

చల్లని తెల్ల వెన్నెల పోకను ప్రణయారాధనమై—
పల్లవపాణులు హారతులిచ్చిరి ప్రసవస్తబకములనే!
మత్తువాసనల నెగజిమ్మినదే రాధామాధవము—
కుత్తుకనిండా తేనె పోసినది కోమలి చుంబనము;

చలిత సరోవర తరంగముల ముద్దిడెను పంకజములు—
మలయ పవన వీచుల చెంగరేగెను మృగమద పంకములు;
కలనాదమ్ముల ఎలనాగలతో తోట మొనలె పులకించెన్.
విలవంతల క్రొవ్విరులమురిపముల తరిమెను సురభిళముల్.

గులాబీ:

దక్షిణపుగాలి తో తెంచి తగుల కురుల
చిక్కు విడదీసి ముస్తాబు చేయుచుండె;
కాని యిపుడేల నా హృదయాన భీతి
క్రమ్ముకొనుచుండె పెనువిషాదమ్ము భ్రాంతి!
ఎదలో గునగున లేవో
ముదిమి గనలెన్ తోచి, ముగ్ధమోహన కాంతుల్
విదళించుచున్న గీతిక
చెదరెను భవితవ్యాంబుధులు: చేతన కాంతుల్!
అదె మనోహరమార్దవ హాస రేఖ,
అదియె హేమంత కామినీ హృదయసీమ;
అదియె శృంగార సౌమ్యసంపద కవాట
పాటకమ్మది: శృంగార నాటకమ్ము!

కవి;

వారల నవవసంత మగే —
అగుపడెంచెనే!
నగలు విరుల కమ్మ లెత్తి—
మరుల గొల్పెనే!
ఓహో రండు పథికులార—
అహో రండు భ్రమరులార
రహో వనాంతర సీమల
సుహాసముల నేగకొండు!
ప్రతపాద్యుద వీడి పిలిచె
పికి నిస్వనములు!
శుభాకరుడు నవోత్పలిని
కపోలముల గీరెన్!
లోకము నవ్యాలోకన
రసకావ్యమ్మాయెన్!
తరుణి హృదయోద్వేగము
కరుణా పూర్ణమాయెన్.
సురలు, అచ్చరలు—పుడమికి
పరువు లెత్తినారో?
నగలు విరహజ్వాలల—కడ
తేర్చి నవ్వినారో!
సకల జగజ్జీవులార—
వికల హృదయ మేల, లెండు!
అదే మదను డవతరించె
నోహో విరులార రండు!

ఫలిత ప్రకృతి:

చిరతరానంద సుఖమయ స్నేహవీచి
శిశిరమే నాకు హృదయ వాంఛిత ముచితము!
మాఘ ఫాల్గుణ మాస సంజనితహాస
మృగముల శృంగార తల్పమ్ము మిథునములకు!,
నాకు ముక్తి నొసగి, చేకూర్చి సౌఖ్యమ్ము
బాధలేని బ్రతుకు బాట లొసగి;
నావ రీతి జీవనానంద యాత్రలో
మనసు వెలుగజేయు మమత తెంచి!

మయూరి:

వసంత విలాస హేలీ—
హాసంత వికాస వల్లీ!
హాసన్మయూఖ నీహారీ—
సన్మరీచీ రింఛోళీ!
పులకిత హృదయ విభావరీ—
చలత్ చలిత మానస భ్రమరీ!
రండు, రండు—శారి, కీరీ!
తెండు విలసిత సుమాళిన్.
విధుగ విలాసము వలగు లెండు!
మధుమాస వికాస సురాళిన్.

మాకందం:

ఇదె వసంత మిదె సుఖాంత
విపుల హాస సుమధనమ్!
ఇదే స్వప్న మిదే స్వర్గ
సుఖాన్వేష ప్రమదమ్!
ఇదె వసంత మిదె మృదంగ
క్వణిత హాసరాగమ్;
ఇదె ప్రమోద మిదె వినోద
మిదె మరంద నాట్యమ్!
ఇదె గోకుల బృందావన
మిదే ప్రణయ రాజ్యమ్!

ఇదె రాధామధూళి హృద
యోత్సవ నవ తేజమ్!

ఇదె రసాల మిదె సుమాళ
మిదె మరంద సారమ్;
ఇదె మయూర మిదె చకోర
మిదె ధరణి లాస్యమ్!

మాధవి:

వికసిత వసంత తరుణ యామినీ —
చుంబిత పులకిత రాగ తరంగిణి!
విపుల పరిమళ భావ తటిన్మణి —
శుభ్ర విహాయస వీధీ విహారిణి!

నేటి రేయి రావోయీ, సఖా—సుధాకరా!
రాగరసము చిందితి నోయీ—శుభంకరా!
తోట విడిది క్రీముడిలో కైసేస్తినిరా —
పాటల గంధిని యెలప్రాయము దాచితిరా!

రాగలత:

ఈ మునిమాపున —
నా కనుపాపల —
ముసురుకొను నెవో రూపములు;
పాయని తలపుల —
తీయని గొంతుల —
ముసురుకొను నెవో కోరికలు;
తీయని మాపుల —
ఏవో రూపులు —
వలపుల తీవల ఊరికలు;
పాటల పాయలు —
తోటల మాయలు —
మునగకొను నెవో చోద్యములు;
ఒత్తుక గుండెల —
హత్తిన మాటలు —
ఈముని మాపుల ముసురుకొనెన్;
ఈ మునిమాపున —
ఆమని రాగము —
మూగెను నీరద శకలముగా;
తామర కొలనుల —
మూగిన హంసలు —
రేగిన భావ పరంపరలు;
పూసిన కొమ్మల—
ఇంపుల చిమ్ముచు—
ఊగెను కోర్కెల కెరటములు;
కిరణప్లుతముగ—
అరుణోదయముల—
సురుచిర హాస మయూఖములు;
తలిరు జొంపములు—
వలపు తొందరలు—
ఒలికి హాసముల బరపెన్;
ఈ ముని మాపుల—
ఆమని తూపుల—
తారానివహము తోచెన్:
ఈ మునిమాపున—
జీవన యామిని—
కనుసైగ లెవో చూపెన్;
ఈ మునిమాపున—
నా ముని వాకిట—
మదన మనోహర స్యందనముల్!

రసాలం:

మదన విక్రాంతోత్సవ స్ఫూ
ర్జితములైనవి భూరుహాల్;
తోచె లోకము సర్వమున
ఘనవిజయ భేరీ నాదముల్;
కుసుమ లాస్యచ్చరణ చారణ
ప్రణయ లాక్షా రక్తిమల్;
వనములే—కవనములుగా
సుమ శరుని భవనములై;
కోమలీ జనకపోలద్యుత
సిందూర రాగ పరాగమై;
మృదు మృదంగ ధ్వనుల గతులకు,
కాహళుల కలనాద కళలకు,
ఢంకభీ పటహాది ధ్వాన శ్రీ
కలస్వన మంజునిక్వణ గానమై;
అశాంత మధుర తరంగమై...
విశ్రాంత లలిత లవంగమై...

**అశోకం :**

ఉల్లములు సంఫుల్లమై, లో
కమ్ము లానందామృతములై
జీవములె సంజీవ కౌతుక
భావనా సమ్మోద తుందిల
సాంద్ర సౌరభమై; రుచి
రానవాంజలులై; మనోరుచి
హార రసిత మంజరులై;
అభయ ముద్రాకలితమై;
కుసుమోత్సవోజ్వలమై; శో
భారామమై! సౌందర్యమై!

**చంపకం :**

మాధుర మాధుకరనికర
గాన ఝుంగలకు సొంగయు —
నవనవోన్మిషిత ప్రసూనాళి నాట్యమై!
స్రవిత మకరంద రస శీకర విలాసమై;
ప్రవిమల స్నిగ్ధతర
ప్రణయ స్వరూపమై;
ఘోషవతి కలనాద మానసామృతమాయె!
నా బ్రతుకు పరిమళించినది నీ దయవలన —
వేడుకొందును సుదన దేవా!...నీ కీర్తి
పాడుకొందును వసంతాన!...రాగిన
వార్ధిధుల తేలియాడెద సంతసాన!!

**మధువ్రతం :**

క్షణక్షణ ప్రవర్ధితము —
సుఖస్ఫూర్తి శుభప్రదము —
ఉద్యాన వనాంతరాత్మ
చిత్రవర్ణ శోభితమ్ము!
తరుణ తరణి కిరణ నివహ
కదుష్ణ పరిచుంబితమ్ము,
సరోరుహ ద్యుతి హారమ్ము;
ఇంద్ర చాప యష్టి భాతి
సముద్విగ్న మానసమ్ము —
పులకిత నవమాలికా
లతాకుడుంగము సోలెను;
పుష్పరజమె దుమారమై
ముకుళిత వకుళముల చేరె;
పల్లవ ప్రవాళాధర
కనత్కామణీ సహస్ర
కలిత చర్చరీ ధ్వానము —
జలధరాసదృశమాయె!
ఆర్ద్రీకృత గిరి సానువు
లందు చేరి మార్దవమున —
పటవాస చూర్ణపంకమాయె!

**విరహిణి :**

చుక్కలు రాలిన కన్నీరా? మది
క్రుక్కిడి దీ యిసు లత్తగువు?
ఆకల మోపిన ఆకసమా? ఇం
కేల దురాగత మాశయము?
భూజము లెత్తిన ధ్వజమ్ములా?
మనసిజ చాప నిబద్ధములా?
లలిత శుభ్ర పద రుచిరములా? వన
లీల హృదయముల చీల్చెడిని?
కోటుల పాటల పొదరిండ్లా? ఇం
దీటుల మ్రోతలె వినిపించెన్!
ఫుప్పొడి రేపిన దుమారమా? ఇం
కేల విద్రవ మొలికెడిని?

**కవి :**

ఈ సుదన సంరంభ మీ మహోత్సవము,
ఇటులనే యిటులనే సాగించుకొనుము;
ఈ పురాజగతి కభయము లీయవోయి—
ఈ వసుంధరకు మంగళము కూర్పుము దేవ!
మధురాంధతమఃపటలి దూరీకృతముల్ బొనర్చి
మరల మరల నాగృహాంగణద్వారము తెరవనిమ్ము!
బాధా సంక్షుభిత కవిత మహాయుధస్వరూపాల
వ్యర్థ మొనరించి సుఖ శాంతు లిమ్ము వసంతమా.
విగత మోహ నాశా! నవజగతీ సంకాశా!
దరహసితాశా! మరుడా! ఉన్నతుడా! శ్రీకరుడా!
చైతన్య వశంకరుడా! సౌందర్య స్వరూపుడా!
రారమ్మా దేవా! ఈ వసుమతి పాలింపుమోయి!!

**భరతవాక్యం :**

భ్రాంతిలోకనమ్ము వమ్మ్ము-శ్రాంతి మనోహారి సుమ్ము
నేడె లెమ్ము, నేడె లెమ్ము-కాంతి రేఖకనుము, గనుము
అదె జీవన మహానంద సుఖసంపద చేకొనుమా!
ఈ వసంత మహోత్సవమె చిరశాంతి ప్రసాదనమ్ము.

# నవభారత రాజ్యాంగం: స్థూలపరిశీలన

శ్రీ చిత్తజల్లు వరహాలరావు

స్వాతంత్ర్య సముపార్జనానంతరం భారతదేశం సాధించిన ఘన విజయాలలో ఒకటి భారత రాజ్యాంగ నిర్మాణం. భారత రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు ప్రథమ సమావేశం 1946 డిసెంబరు 9 వ తేదీన జరిగింది. 1949 నవంబరు 26 వ తేదీతో రాజ్యాంగ రచన పూర్తి చేయబడింది. ఈ రచనలో అత్యంత ప్రధానమగు పాత్ర నిర్వహించిన వ్యక్తి, స్వర్గీయ డాక్టరు అంబేడ్కరు. మన రాజ్యాంగం 1950, జనవరి 26 వ తేదీన అమల్లోకి వచ్చింది. 1947 ఆగస్టు 15 వ తేదీ, 1950 జనవరి 26 వ తేదీ యివి రెండూ, స్వతంత్ర భారత చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన చారిత్రాత్మక ప్రాధాన్యంగల దినాలు.

భారతదేశ పరిస్థితులకున్నూ, ప్రజల తత్వానికిన్నీ, తగినట్లుగా ప్రపంచమందలి ప్రజాస్వామ్య రాజ్యాంగాలలోని ప్రధాన విశేషాలను స్వీకరించి మన రాజ్యాంగ నిపుణులు నవభారత రాజ్యాంగాన్ని రచన చేశారు. ప్రధానంగా ఈ రాజ్యాంగ రచనకు తోడ్పడినవి— అమెరికన్, బ్రిటిష్ ఐరిష్ రాజ్యాంగాలు. అమెరికన్ రాజ్యాంగంలోని శాశ్వత హక్కులకు చెందిన భాగం; బ్రిటన్‌లోని పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతి; బ్రిటిష్ ప్రభుత్వం చే మనదేశంలో ప్రవేశపెట్టబడిన 1935 చట్టం; మన రాజ్యాంగ రచనకు కొంతవరకు దోహదం చేశాయని చెప్పవచ్చు.

స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం, మన సర్వతంత్ర స్వతంత్ర ప్రజాతంత్ర రిపబ్లిక్‌కు మూల స్తంభాలని, రాజ్యాంగమందలి, ప్రస్తావన (ప్రియాంబుల్) ద్వారా విశదమవుతోంది. ఇండియన్ యూనియన్‌లోని పౌరులందరిలో, యిష్టపూర్వకంగానూ చట్టబద్ధంగానూ ఎన్నికలలో ప్రకటించిన అభిప్రాయం మీద ఆధారపడిన ప్రజారాజ్యంగా భారతదేశం రూపొందాలన్నది మన రాజ్యాంగానికి ప్రధాన ప్రాతిపదిక.

రాజకీయ చైతన్యం, విషయ పరిజ్ఞానంగల వివేకులగు ప్రజల అభిప్రాయంమీదనే ప్రజాతంత్ర విజయం ప్రధానంగా ఆధారపడి వుంటుంది. ఒక దేశంలోని ప్రజలను, వారి సంస్థలను, పాలక పాలితుల చపలచిత్తవృత్తులచే గాక చట్టబద్ధంగా పరిపాలింపవలెనన్న, ఆ ప్రజలు తమ ప్రభుత్వ కార్యకలాపాలను, నిర్వహించేందుకు ఒక ప్రాథమిక చట్టాన్ని అమల్లోకి తీసికొని రావాలి. రాజ్యాంగ చట్టానికి విధేయులై దాన్ని గౌరవించి దాని నియమ నిబంధనలను శిరసావహించుటే, ఆ దేశ పౌరులు నిర్వర్తించవలసిన పవిత్ర విధ్యుక్తధర్మం. ఇదే పౌరునికీ రాజ్యాంగ చట్టానికీ వుండే నిరంతర మగు బాదరాయణ సంబంధం.

పురాతన గ్రీసుదేశ చరిత్రలో, ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త అగు సోక్రటీసు రాజ్యాంగచట్టం ప్రకారం, నాటి ముష్కర ప్రభుత్వం విధించిన మరణశిక్షను నిర్భయపూర్వకంగా అనుభవించేందుకైనా సిద్ధపడ్డాడు గాని, ప్రాణరక్షణకై మోసంచేసి కారాగారం నుండి పలాయనం చేయుటానికి మాత్రం విముఖత్వం వహించాడు. దీన్నిబట్టి ఆ మహావ్యక్తి రాజ్యాంగ మూలసూత్రోల్లంఘనం ఎంతటి తీవ్రమైన నేరంగా పరిగణించాడో స్పష్టం. ఒక దేశ రాజ్యాంగంలో అన్యాయ శాసనాలుంటే, అవి ప్రజల శాంతియుత పురోగతికి ప్రతిబంధకములై వారి అభ్యుదయాన్ని అడ్డుకుంటే అట్టి శాసనాలను చట్టబద్ధమగు ఆందోళన ద్వారానే సవరించాలి. ఇలాంటి రాజ్యాంగబద్ధమగు పోరాటాన్ని చేసిన వ్యక్తులు బ్రిటిష్ చరిత్రలో కోకొల్లలుగా కన్పిస్తారు. రాజుజాన్ నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా పోరి, మాగ్నాకార్టాఅను పేరిట స్వాతంత్ర్య ప్రదానపత్రాన్ని బ్రిటిష్ ప్రజలు సాధించారు; అక్రమ ఓడపన్ను విధింపుకు వ్యతిరేకంగా జాన్ హాంపెన్; నిర్హేతుకంగా వ్యక్తిని అరెస్టుచేసే జనరల్ వారెంటుకు వ్యతిరేకంగా జాన్ విల్కీస్; ఐరిష్ కేథలిక్కుల రాజకీయ విమోచనకు పాటుపడ్డ డేనియల్ ఒకానెల్; బానిసల విముక్తిని సాధించిన అబ్రహాంలింకన్ చరిత్రలో అమరులు.

ఏ ప్రజాస్వామ్య ప్రభుత్వానికైనా, రాజ్యాంగం ప్రాథమిక చట్టం. (Fundamental Law.) ఒక రాజ్యముయొక్క ప్రభుత్వాన్ని పరిపాలించే ప్రాథమిక శాసనాల సముదాయాన్ని రాజ్యాంగమని వ్యవహరించవచ్చు (A constitution is a collection of fundamental rules and regulations according to which a state is to be governed )

ప్రపంచంలోని రాజ్యాంగాలను రెండుభాగాలుగా విభజించవచ్చు.

1 లిఖితపూర్వక రాజ్యాంగాలు; లిఖితపూర్వకం కాని రాజ్యాంగాలు.

2 రిజిడ్ రాజ్యాంగాలు; ఫ్లెక్సిబిల్ రాజ్యాంగాలు.

3 యూనిటరీ రాజ్యాంగాలు. ఫెడరల్ రాజ్యాంగాలు.

4 పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతి అమల్లోవుండే రాజ్యాంగాలు; ప్రెసిడెన్షియల్ ప్రభుత్వపద్ధతిఅమల్లో వుండేరాజ్యాంగాలు.

ప్రపంచంలో బ్రిటిష్ రాజ్యాంగమొక్కటే "వ్రాయబడని" రాజ్యాంగం. అలా అన్నంతమాత్రాన, బ్రిటిషు ప్రజలకు రాజ్యాంగ మూలసూత్రాలే లేవని అనడంగానీ, అలా అవగాహన చేసికోవడం గాని శుద్ధతప్పు. అప్పుడప్పుడు పార్లమెంటులోనూ, బ్రిటిష్ రాజుల చేత ఆమోదింపబడిన, మహాస్వాతంత్ర్య ప్రదానపత్రం (Magna carta 1215); హక్కులపత్రం; (The Petition of Rights-1628); హేబియస్ కార్పస్ చట్టం; (The babeas corhus Act-

1679), ఆంగ్లజాతి స్వాతంత్ర్యానికి మాగ్నాకార్టా పిదప అంతటి ప్రధానమైనదైన బిల్ ఆఫ్ రైట్స్-1689, అర్థశతాబ్దంపైగా, )1761-1763 వరకూ) ఎన్నో అంతరాయాలను, ఉపద్రవాలనూ ఎదుర్కొని అభివృద్ధిచేయబడిన కేబినెట్ ప్రభుత్వపద్ధతి, జాన్ విల్కీస్‌ను జనరల్ వారెంటుద్వారా అరెసు చేసినపుడు అలాంటి వారెంటు వ్యక్తిస్వాతంత్ర్యానికి విరుదమని కోర్టు ఇచ్చిన తీర్పు, 1832 పార్లమెంటు ప్రాతినిధ్యానికి సంబంధించిన ప్రథమ సంస్కరణల చట్టం, రహస్యపుబాలెట్ చట్టం, ఇత్యాదిచట్టాలు, ఆనవాయితీలు, సంప్రదాయాలు, ఇవన్నీకలిసి బ్రిటిష్ రాజ్యాంగం రూపం దాల్చుతూ, వాటిద్వారా నేటి ఆంగ్లప్రభుత్వం పరిపాలింపబడుతున్నదని మనం గుర్తించాలి

బ్రిటిష్‌రాజ్యాంగమొక్కటే లిఖితపూర్వకంగాని రాజ్యాంగం మిగతా అమెరికన్ స్విస్, కెనెడియన్, ఐరిష్, సోవియట్, ఫ్రెంచి, ఆస్ట్రేలియన్ యిత్యాది రాజ్యాంగాలు లిఖితపూర్వకాలు సవరణను ప్రతిపాదించి ఆమోదించుటకు ఏ రాజ్యాంగంలో మిక్కిలి కష్టసాధ్యమో, అలాంటి వానిని రిజిడ్ రాజ్యాంగమనీ, సవరణలు ప్రతిపాదించి సులభసాధ్యంగా ఆమోదించుటకు వీలున్న దానిని ఫ్లెక్సిబిల్ రాజ్యాంగమనీ అంటారు అమెరికన్ రాజ్యాంగం రిజిడ్, బ్రిటిష్ స్విస్ భారతరాజ్యాంగాలు ఫ్లెక్సిబిల్ రాజ్యపరిపాలనాధికారం, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలమధ్య ఏరాజ్యాంగంప్రకారం పంపకమై విభజింపబడుతుందో అట్టిదాన్ని ఫెడరల్ రాజ్యాంగమనీ, రాజ్యాధికారమంతా ఒకే ఒక కేంద్రప్రభుత్వం హస్తాల్లో వుంటే, అలాంటి దానిని యూనిటరీ రాజ్యాంగమనీ అంటారు అమెరికా, సోవియట్ రష్యా, స్విట్జర్లాండ్, కెనడా, ఆస్ట్రేలియా యిత్యాది దేశాలలో ఫెడరల్ రాజ్యాంగంపద్ధతి అమల్లో వుంది బ్రిటన్, ఫ్రాన్సు, ఇండియావంటి దేశాల్లో యూనిటరీ రాజ్యాంగం అమల్లో వుంది అయితే, కొంతమంది రాజ్యాంగనిపుణులు, మన రాజ్యాంగాన్ని, ఫెడరల్ రాజ్యాంగమనిఅంటారు ఈవిషయంలో భేదాభిప్రాయాలున్నాయి

నవభారత రాజ్యాంగం లిఖితపూర్వకమైనది, సవరణలు ప్రతిపాదించి ఆమోదింపజేయుటకు సులభసాధ్యమైనది, రాజ్యాంగం ప్రకారం కేంద్ర రాష్ట్రప్రభుత్వాల మధ్య అధికార పంపిణీ జరిగినప్పటికీ, మన రాజ్యానికి (State) ఇండియన్ యూనియన్ అను నామకరణం చేయుటవల్ల, మనది తప్పకుండా యూనిటరీ రాజ్యాంగమే మన రాజ్యాంగంలో ప్రతిపాదింపబడిన రాష్ట్రీయ స్వయం పరిపాలనాధికారం ఛాయామాత్రమే దేశానికి సంబంధించిన సర్వాధికారం కేంద్రప్రభుత్వంలో కేంద్రీకృతమై వుండడమే, దీనికి కారణం.

## ప్రస్తావన

నవభారత రాజ్యాంగ చట్టం, ప్రస్తావనతో ప్రారంభించబడింది ఈ ప్రస్తావన రాజ్యాంగనిర్మాతల భావాలనూ, వాంఛలను, సాధించదలచిన లక్ష్యాలను స్పష్టపరుస్తోంది "భారత ప్రజలము మేము, ఇండియాను సర్వతంత్ర స్వతంత్ర ప్రజాతంత్ర రిపబ్లికుగా నెలకొల్పుటకూ, పౌరులందరికి ఆర్థిక, సాంఘిక, రాజకీయ, న్యాయాన్ని, భావ, భావప్రకటన, విశ్వాస, మత ప్రార్థనా స్వాతంత్ర్యాన్నీ, సమానమగు అవకాశ ప్రతిపత్తులను చేకూర్చుటకునూ, పౌరులందరిలోనూ వ్యక్తిగౌరవాన్ని, జాతి ఐక్యత ను అభివృద్ధిచేయునటి సౌభ్రాత్రాన్ని పెంపొందించుటకు తీర్మానించుకొని, 1949 నవంబరు 26-వ తేదీన మా రాజ్యాంగ పరిషత్తులో ఇందుమూలంగా ఈ రాజ్యాంగాన్ని ఆమోదించి శాసనం చేసి స్వీకరించాం" ఈ ప్రస్తావన రాజ్యాంగములోని నాలుగు ప్రధాన లక్ష్యాలను వివరించుతోంది

1 అంతర్గత, బహిర్గత స్వాతంత్ర్యములను కలిగిన సర్వతంత్ర స్వతంత్ర రాజ్యమై, ఇండియన్ యూనియన్ ఉండాలి. (Sovereign)

2 దేశమందు ప్రజాతంత్ర ప్రభుత్వం నెలకొల్పబడాలి

3 వంశ పారంపర్యంగా వచ్చే రాచరికం గాక, ప్రజలచేగాని ప్రజాప్రతినిధులచే ఎన్నుకోబడ్డ వ్యక్తియే భారత రిపబ్లికునకు అధిపతిగా వుండాలి

4 వ్యక్తి గౌరవాన్ని, జాతి ఐక్యమును పటిష్ఠం చేసేందుకు వ్యక్తులమధ్య సౌభ్రాత్రాన్ని నెలకొల్పాలని, రాజ్యాంగము నిర్దేశించింది

## పౌరస్వత్వం

భారత రాజ్యాంగంలో అత్యంత ప్రధానమైన భాగాలలో ప్రాథమిక హక్కులకు (Fundamental Rights) సంబంధించిన భాగం ఒకటి తన హక్కులను గూర్చి వివరించబడిన యీ భాగంపై ప్రతి పౌరుడు నిరుపమానమగు శ్రద్ధాసక్తులను కేంద్రీకరించాలి. రాజ్యానికి (State), వ్యక్తికి మధ్యనుండే సంబంధబాంధవ్యం, ప్రభుత్వాధికార వ్యక్తిస్వేచ్ఛల సమన్వయం, ఇత్యాది విషయాలు అత్యంత ప్రధానమైనవి ప్రభుత్వం ఏ పౌరుని విషయంలోనూ జాతి, కుల, మత, లింగభేద, జన్మస్థానాల కారణంగా, లేక వాటిలో దేని కారణంగానైనా, యెలాంటి వివక్షతను చూపకూడదని, రాజ్యాంగమందలి 15-వ సూత్రం స్పష్టపరుస్తోంది. వాక్, సభా, మత, ప్రార్థనా, అంతఃకరణ, పత్రికా స్వాతంత్ర్యాలను పౌరులకు రాజ్యాంగం గ్యారంటీ చేసింది అయితే, ఈ హక్కులను రాజ్యభద్రతకు భంగం వాటిల్లనంతవరకే, పౌరులు కలిగివుంటారు ప్రభుత్వాధికారానికీ, స్వేచ్ఛకీ మధ్య నిరంతరం ఘర్షణ వుంటూ వుంటుంది ప్రభుత్వం తన పోలీసు, రక్షణబలాల ద్వారా అత్యంత విశాలము శక్తివంతమగు అధికారాన్ని కలిగి యుంటుంది గాబట్టి, అలాంటి అధికారంబారినుండి వ్యక్తి స్వేచ్ఛను రక్షింపవలసిన అగత్యం ఎల్లప్పుడూ వుంటుంది ఈ విధమగు రక్షణను పౌరునికి కల్పించుటే, ప్రాథమిక హక్కుల బాధ్యత

మన దేశంలో తరతరాలనుండి కొంతమంది వర్ణస్థులు, అంటరానివారుగా అస్పృశ్యులుగా పరిగణింపబడారు వారిని సంఘదూరులుగా చేయడం జరిగింది వారికి నేటివరకు సాంఘిక న్యాయంకూడా ప్రసాదింపబడలేదు అలాంటివారికి, మనరాజ్యాంగం సాంఘిక న్యాయం కలుగజేయ సంకల్పించింది ఈ విషయం, ప్రస్తావనలోనే స్పష్టీకరింపబడింది ఏ పౌరుడు కూడా, జాతి మత, కుల కారణంగా షాపులలో, పబ్లిక్ హోటళ్ళలో, వినోదస్థలాలలో,

ప్రవేశించేందుకు ఎట్టినిషేధం వుండరాదనీ, పబ్లిక్ భావులూ, చెరువులు, స్నానవాటికలు, సమావేశస్థలాలు, మున్నగువాటిని ప్రతివారుడు వుపయోగించుటకు హక్కున్నదనీ, చాటిచెప్పింది. తరతరాలుగా, కులతత్వం, అస్పృశ్యత, అధిక, అధమ, కులములనే వర్ణ భేదంలాంటి సాంఘిక దురాచారాలవల్ల, తక్కువ వర్ణస్థులు, ప్రధానంగా హరిజనులు అసంఖ్యాక కష్టనష్టాలకు గురయ్యారు. అందువల్ల, అట్టికష్టాలనుండి, వారిని తప్పించేందుకు, రాజ్యాంగం సాంఘికన్యాయాన్ని సర్వులకూ ప్రసాదించింది. వ్యక్తిగౌరవాన్ని జాతిఐక్యమును, వ్యక్తులమధ్య సౌభ్రాత్రాన్ని పెంపొందజేయాలనే ఉత్తమాశయానికి రాజ్యాంగం కలుగజేయదలచిన సాంఘిక న్యాయం అనుగుణ్యంగానేవుంది.

వ్యక్తి, ప్రైవేటు ఆస్తిని కలిగి వుండడానికీ, ఆస్తిని ఆర్జించడానికీ, అన్యాక్రాంతం చేయడానికీ, రాజ్యాంగం హక్కునిచ్చింది. ఒకవేళ, ప్రజాయోగక్షేమం దృష్ట్యా, ప్రభుత్వం వ్యక్తిగతమగు ప్రైవేటు ఆస్తిని, స్వాధీనం చేసికొన్నప్పుడు, ఆ వ్యక్తికి, నష్టపరిహారాన్ని తప్పక యివ్వాలని శాసించింది. వ్యక్తుల అమ్మకం, వెట్టిచాకిరీవంటి నిర్బంధ వూడిగపుపద్ధతులు నిషేధింపబడ్డాయి. అలాగే, అస్పృశ్యత నిషేధింపబడ్డది.

రాజ్యాంగం యీ ప్రాథమిక హక్కులను గ్యారంటీ చేసినప్పుడు, వాటిని వ్యక్తిగానీ, సంస్థగానీ, ప్రభుత్వంగానీ, అపహరించేందుకు లేదా అమలుపరచ నిరాకరించినప్పుడు, ఆ ప్రాథమిక హక్కులను అమలుజరుపుటకు, సుప్రీం కోర్టు, హైకోర్టువంటి ఉన్నత న్యాయస్థానాలకు అధికారమివ్వబడింది. వ్యక్తులు, సంస్థలు ప్రభుత్వం పౌరుని పౌరసత్వహక్కులను, వ్యతిరేకంగా ప్రవర్తించినపుడు హెబియస్ కార్పస్, మాండమస్, ప్రొహిబిషన్, కోవారంటో, సెర్టియొరారి, అనబడు రిట్టులద్వారా వాటిపై కోర్టులో దావావేసి రాజ్యాంగం తమకు భద్రపరచిన హక్కులను సాధించవచ్చును. ఈ రిట్టులన్నిటిలోను హెబియస్ కార్పస్‌రిట్టు వ్యక్తిస్వేచ్ఛని పరిరక్షించు ఉక్కు కవచంలాంటిది. ఈ రిటుకు ల్యాటిన్ భాషలో "వ్యక్తిని రప్పించుకొనవచ్చును" అని అర్థం. క్రీ. శ. 1660_1685 వరకూ, ఇంగ్లడును పాలించిన రెండవ ఛార్లెసు ఏ కారణం చూపించకుండా, తోచినప్పుడల్లా యిష్టంలేని వ్యక్తులపై దొంగకేసులు బనాయించి జైలులో వుంచుతుండడంవల్ల, వ్యక్తి స్వతస్సిద్ధ స్వేచ్ఛను రాచరిక నిరంకుశత్వంనుండి రక్షించేందుకు 1679 లో కెవలియర్ పార్లమెంటు ఈ చట్టాన్ని ఆమోదించింది. దీని ప్రకారం, ఏ వ్యక్తిని విచారణలేకుండా అక్రమంగా జైలులోవుంచుట చట్టవిరుద్ధం. ఎట్టి ఆలస్యం చేయకుండా, ఖైదీలను, వారు చేసిన నేరాల్ని విచారించి తీర్పుయిచ్చేందుకు కోర్టు యెదుట హాజరుపరచాలి. ప్రభుత్వం, లేక ప్రభుత్వోద్యోగులు, నేరారోపణగానీ, తీర్పుగానీలేకుండా ఏ వ్యక్తినైనా, జైల్లో వుంచితే ఈరిట్‌ను ప్రయోగించవచ్చు. అలాంటి వ్యక్తిపై మోపిన కేసును త్వరగా కోర్టుముందు విచారణకు తెచ్చుటయే దీని వుద్దేశ్యం.

ప్రభుత్వం తన అధికార పరిమితులను హద్దుమీరి, న్యాయమూర్తివలె ప్రవర్తించుచున్నపుడు, యింకా ఆ హద్దులను దాటి, ముందుకు సాగిపోకుండా అడ్డుపెట్టు కోర్టు ఆదేశాన్ని "ప్రొహి

2 కేంద్ర ప్రభుత్వానికి విధానాలను సిఫారసుచేస్తూ తీర్మానాలు చేసే అధికారం; ఐతే ఈ సిఫారసులను ప్రభుత్వం తప్పకుండా అనుసరించాలనే నిర్బంధం మాత్రం లేదు

3. ప్రభుత్వం పన్నుల రూపంలో ధనాన్ని వసూలు చేయడానికి, ఆయా ప్రభుత్వశాఖలు ప్రజోపయోగకరమగు పనుల నిమిత్తం ఖర్చుచేయడానికి అవసరమగు ధనాన్ని మంజూరుచేయడం.

పన్నులు విధించడానికి, ఖర్చుపెట్టడానికి ప్రభుత్వమే ప్రతిపాదనలు చేస్తుంది. పార్లమెంటుగాని, దానిలోని ఏ సభ్యుడుగానీ ఈ ప్రతిపాదనలు చేసేందుకు పూనుకొనరాదు. ఐతే సాంవత్సరిక పన్నులు, వ్యయం, యిత్యాది వ్యవహారాలు మాత్రం పార్లమెంటు ఓటుద్వారా ప్రతిసంవత్సరం మంజూరవాలి. ఈ క్రింది వాటిని మాత్రం పార్లమెంటు తన ఓటుద్వారా మంజూరు చేయవలసిన అవసరం లేదు

(ఎ) రాష్ట్రపతియొక్క ఇమాల్యుమెంట్లు ([illegible]), బత్తాలు, తదితర వ్యయాలు.

(బి) రాజ్యసభ అధ్యక్ష ఉపాధ్యక్షులయొక్క, లోక్ సభ స్పీకర్, డిప్యూటీ స్పీకర్లయొక్క జీతబత్తాలు.

(సి) భారత ప్రభుత్వం బాధ్యతవహించిన ఋణాలు, వాటికయ్యే వడ్డీ, నిక్షేపనిధి మున్నగునవి.

(డి) సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తుల జీతాలు, బత్తాలు. పెన్షనులు.

(ఇ) ఇండియా ప్రభుత్వ కంట్రోలరు – ఆడిటర్ జనరల్ కు ఇచ్చే జీతబత్తాలు.

(ఎఫ్) కోర్టుల నిర్వహణకయ్యే ఖర్చులు.

(జి) సంచితనిధి (కన్సాలిడేటెడ్ ఫండ్) నుంచి చెల్లించాలని రాజ్యాంగంగానీ, పార్లమెంటుగానీ ప్రకటించినఋణాలు.

పైన ఉదాహరించబడిన, యీ ఖర్చులు శాశ్వతమేగాక, తప్పనిసరైనవి. అంచేత పార్లమెంటు ఓటుతో నిమిత్తంలేనివి. వీటిని సంచిత నిధినుండి భరించాలి.

ప్రభుత్వ పరిపాలనకు సంబంధించిన చర్యలపై, పార్లమెంటు ప్రశ్న సమయంలో తీర్మానాల, ప్రభుత్వాన్ని, మంత్రులను, అదుపు ఆజ్ఞలలో పెట్టేందుకు ప్రయత్నిస్తుంది మంత్రివర్గ విధానాలు, మంత్రుల పరిపాలన, లోక్ సభకు అంగీకార యోగ్యం కాకుండా వున్నపుడు ఆ సభ ప్రతికూలముగ ఓటుద్వారాగాని, మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానాన్ని ప్యాస్ చేయడం ద్వారాగాని మంత్రివర్గాన్ని పదవినుంచి తొలగించగలదు.

## కేంద్ర న్యాయాధికారవర్గం—సుప్రీం కోర్టు

ఇండియన్ యూనియన్‌లోని న్యాయనిర్వహణ వ్యవస్థ అంతా సుప్రీంకోర్టుచే నడుపబడుతుంది. ఈ కోర్టుయొక్క కార్యకలాపాలూ, వివిధ సమస్యలపై యివ్వబడిన తీర్పులూ, రికార్డుచేయబడి సాక్ష్యంగా ఉదాహరింపబడతాయి (Court of Record). కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల మధ్య వుత్పన్నమైన వివాదాలనుగానీ; కేంద్ర ప్రభుత్వం కొన్ని రాష్ట్రప్రభుత్వాలూ ఒకవైపూ, మరికొన్ని రాష్ట్రప్రభుత్వాలు యింకొకవైపున వుండగా ఏర్పడిన వివాదాలనుగానీ; రాష్ట్రములమధ్య ఏర్పడ్డ వివాదగ్రస్త సమస్యలనుగానీ; చట్టం లేక యథార్థం—(Law or fact) వీటికి సంబంధించిన న్యాయశాస్త్ర సమస్యలనుగాని విచారించి తీర్పునిచ్చేందుకు సుప్రీం కోర్టుకు సర్వాధికారం వుంది. ఏ రాష్ట్రమందలి హైకోర్టు యిచ్చిన తీర్పులపైనా డిక్రీలు మున్నగు వ్యవహారాలపైనా, వ్యక్తులుగానీ, సంస్థలుగానీ ఈకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు (Court of Appeal). సివిలు, క్రిమినలు, వ్యవహారాలపైనా, రాజ్యాంగ చట్టానికి సంబంధించిన వివాదగ్రస్త సమస్యలు యిమిడివున్నాయని ఏ రాష్ట్ర హైకోర్టైనా సర్టిఫై చేసినట్లయితే అలాంటి ప్రధాన సమస్యలపైనా ఈ కోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు రాజ్యాంగ చట్టంలోని 141—142 ఆర్టికల్స్ ప్రకారం సుప్రీంకోర్టుచే ఆమోదింపబడిన శాసనాన్ని తీర్పుని, ఇండియన్ యూనియన్‌లోని కోర్టులన్నీ శిరసావహించాలి. ఈ కోర్టుయొక్క తీర్పులు, డిక్రీలు, ఆదేశాలు, ఇండియన్ యూనియన్ అంతటా అమలుచేయబడాలి ఏ వ్యక్తినైనా హాజరగునట్లు చేయడానికి, ఎలాంటి దస్తావేజులనైనా ప్రకటించడానికి, తనకు జరిగిన అవమానాన్ని (Contempt of Court) విచారించి వ్యక్తులను లేక సంస్థలను శిక్షించడానికి ఈ కోర్టుకు సర్వాధికారమున్నది.

సుప్రీం కోర్టుతో సమాలోచించడానికి రాష్ట్రపతికి అధికారము ఇవ్వబడింది ఒక అసాధారణమగు శాసనం, లేక యథార్థము (Law or Fact) నకు సంబంధించిన సమస్య ఉత్పన్నమైనదని గానీ, ఉత్పన్నం కావచ్చునని గానీ, రాష్ట్రపతికి తోచినపుడే ఆయన ఈ కోర్టుతో సమాలోచించును ఇలాంటి విషయాలపై సుప్రీంకోర్టు తన అభిప్రాయాన్ని రాష్ట్రపతికి నివేదించవచ్చును" అని అనడంద్వారా రాజ్యాంగం జాగ్రత్తపడినది అంతేకాని నివేదించవలెను అని అనలేదు. ఎంచేతనంటే, రాష్ట్రపతి చేసే అలాంటి సమాలోచన ద్వారా సుప్రీంకోర్టుయొక్క స్వేచ్ఛకు, నిష్పాక్షిక ప్రవర్తనకు భంగం వాటిల్లవచ్చు.

కార్యనిర్వాహకవర్గాధికారం దాడినుండి, న్యాయాధికారవర్గం లేక కోర్టుల స్వేచ్ఛను, (Independence of the Judiciary from the raid of the Executive) రక్షించేందుకు జడ్జీల జీతబత్తాలు, ఆఫీసు నిర్వహణకయ్యే వివిధ ఖర్చులు, పార్లమెంటు ఓటుకు పెట్టకుండా, వీటిని నేరుగా కన్సాలిడేటెడ్ ఫండు—సంచిత నిధి—ద్వారా చెల్లించేందుకు రాజ్యాంగంలో ఏర్పాటు చేయబడింది. ఎగ్జిక్యూటివ్ అధికారబారినుండి జ్యుడీషియరీ స్వాతంత్ర్యాన్ని కాపాడదలచిన ప్రతి, ప్రజాతంత్ర రాజ్యాంగంలోనూ యిలాంటి యేర్పాటు చేసి తీరతారు.

సుప్రీం కోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తి, ఆరుగురు సాధారణ న్యాయమూర్తులు వుంటారు. ప్రధానన్యాయమూర్తి సలహాను తీసుకుని, రాష్ట్రపతి ఇతర న్యాయమూర్తులను నియమిస్తారు. 65 సంవత్సరాల వయస్సువచ్చేదాకా వీరు పదవిలో వుంటారు. నిశ్చితమగు దుష్ప్రవర్తన, అసమర్థత, అనే కారణాలను ఆధారంగా ఒక న్యాయమూర్తిని పదవి నుంచి తొలగించవచ్చును. పార్లమెంటులోని ఉభయ సభలు, ఒకే సమావేశంలో కూర్చున్నప్పుడు ఆ సమావేశంలోని సభ్యులలో అధికసంఖ్యాకులచేతను, ఆ సమావేశానికి

హాజరైన మొత్తం సభ్యులలో ఓటు చేయువారిలో అధిక సంఖ్యచేత ఆ నేరం ఆమోదింపబడి దానిని రాష్ట్రపతికి సమర్పించిన పిదపనే తప్ప. సుప్రీం కోర్టు న్యాయమూర్తిని పదవీచ్యుతుని గావించుటకు వీల్లేదు. న్యాయమూర్తి యొక్క స్వేచ్ఛని సర్వవిధముల అధికార వర్గ దాడినుండి భద్రపరచుటకే యింతటి అసాధారణమగు ఏర్పాటును రాజ్యాంగం చేసింది.

## ప్రజాధనం - రాజ్యాంగం అదుపు

"ధనమూల మిదమ్ జగత్" అనే ప్రాచీన ఆర్యోక్తి ప్రకారం లోకవ్యవహారమంతా ప్రధానంగా ధనంమీదనే ఆధారపడి వుంది. యూనియన్ పార్లమెంటు కేంద్రప్రభుత్వానికీ, వివిధరాష్ట్రాలలో వున్న శాసనసభలు రాష్ట్ర ప్రభుత్వాలకీ, దైనందిన ప్రభుత్వ పరిపాలనా నిర్వహణకొరకు, అవసరమగు ధనాన్ని ప్రజల తరఫున మంజూరుచేస్తాయి. సైన్యం, పోలీసుశాఖ, సెక్రటేరియట్ ఉద్యోగ బృందం, జిల్లా ఆఫీసులు, మొదలగు వివిధ ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గశాఖలను నిర్వహించేందుకూ, విద్య నేర్పుట, ప్రజా ఆరోగ్యము కాపాడుట, హాస్పిటళ్ళ నిర్వహణ, రోడ్లు, బావులు, మున్నగు ప్రజోపయోగకరమగు కార్యములకు, కేంద్ర రాష్ట్ర శాసనమండలులు ధనాన్ని మంజూరు చేయును.

పన్ను చెల్లించేది, ప్రభుత్వం కోరిన ఋణాలను చందా రూపంగా అప్పిచ్చేదీ కూడా ప్రజలే. అందుచేత, ఏ కార్యనిర్వహణ కోసం, ప్రభుత్వం ధనాన్ని మంజూరుచేయమని కోరిందో ఆ పనుల కొరకే ప్రభుత్వం ఖర్చుపెట్టిందా, లేదా యని పరిశీలించుట; గ్రాంటు చేసిన మొత్తాలను పొదుపుగా వాడిందా లేక దూబరాగా ఖర్చుపెట్టిందా అని గమనించుకోవడం ప్రజల కర్తవ్యాలు. రాజ్యాంగ చట్టం, ప్రజాధనం నిష్ప్రయోజనం గాకుండేందుకు, యీ క్రింది పద్ధతుల్ని ప్రవేశపెట్టింది.

1. పార్లమెంటు శాసనసభలు, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు మంజూరుచేసిన మొత్తాలు, ప్రభుత్వం కోరినట్టి, శాసనసభ ఆమోదించినట్టి, నిర్దిష్ట ప్రయోజనాల కొరకే, ఖర్చుపెట్టాలి. ఏ ఒక్క ప్రత్యేక పద్దులో గానీ, మొత్తంమీద గానీ, మంజూరు చేసినదానికంటే ఖర్చుచేసిన సొమ్ము ఎక్కువ కారాదు.

2. బ్రిటిషు కామన్సుసభ ఆచారాల ననుసరించి, కేంద్రంలోనూ రాష్ట్రాలలోనూ ఒక్కొక్క పబ్లిక్ ఎకౌంట్సు కమిటీని, ఏర్పరిచారు. ఆయా రాష్ట్ర లెజిస్లేచరులు ఎన్నుకొన్న సభ్యులలో యీ కమిటీ, ఏర్పడుతుంది. రానున్న సంవత్సరపు అంచనాలను, ఖర్చులను, పరిశీలించి, లెజిస్లేచరు ఆమోదించిన ఖర్చులకు, ఇచ్చిన ఆదేశాలకు సూచించిన పాలసీకి భిన్నంగా ప్రభుత్వం లేక ఎదైనా పరిపాలనశాఖ ఖర్చుచేసిందా, యిత్యాది విషయాలను పరిశీలించి బహిర్గతంచేయడం. అనేవి ఈ కమిటీ కర్తవ్యాలు.

## కంట్రోలరు - ఆడిటర్ జనరల్

ప్రభుత్వంచేసే వ్యయాన్ని తనిఖీ చేసేందుకు పబ్లిక్ ఎకౌంట్సు కమిటీతో పాటు, కంట్రోలర్-ఆడిటర్ జనరల్ అను పేరట, నిష్పక్షపాతుడగు కేంద్రప్రభుత్వోద్యోగిని రాజ్యాంగం ఏర్పాటు చేసింది. ఈయన చేసే తనిఖీ, సమర్పించే నివేదికలు, సాధ్యమైనంత వరకు ఖండితంగానూ, నిష్పాక్షికంగానూ వుండేందుకూ, కార్యనిర్వాహకవర్గ అధికారుల దాడినుండి యీయన స్వాతంత్ర్యాన్ని కాపాడేందుకూ, ఈయన ఉద్యోగనియామక పదవీకాల పరిమితులు కేంద్రప్రభుత్వం చేతుల్లో వుండవు. రాష్ట్రపతే యీయన్ని నియమిస్తారు. పార్లమెంటు ఓటుచేత తప్పితే, వేరవిధంగా యీయన్ని పదవినుండి తీసివేయడానికి వీల్లేదు. ఈయన జీత, బత్తాలు, కన్సాలిడేటెడ్ ఫండునుండి యివ్వబడతాయి.

## ఫైనాన్సు కమిషన్ (ఆర్థిక సలహాసంఘం)

భారత రాజ్యాంగచట్టంలోని 280 వ ఆర్టికల్ ప్రకారం, రాష్ట్రపతి ఫైనాన్సు కమీషన్‌ను స్థాపిస్తాడు. ఈ సంఘంలో ఒక చైర్‌మన్, నలుగురు ఇతరసభ్యులూ వుంటారు. ఇండియన్ యూనియన్‌లో, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు వున్నవి కదా. కస్టమ్సుడ్యూటీస్ వంటి సుంకాలనూ, ఇన్‌కంటాక్సులాంటి పన్నులనూ కేంద్రప్రభుత్వము విధిస్తే, వివిధ రాష్ట్రాలలోని పౌరులు వాటిని కట్టాలి. ఈ పన్నులలో, ఆదాయపుపన్ను, కస్టమ్స్ డ్యూటీస్ లాంటివి, విపరీతమైన ఆదాయాన్ని తెస్తాయి. దేశానికంతకీ ప్రాతినిధ్యం వహించే కేంద్ర ప్రభుత్వానికున్నంత ఆదాయం, రాష్ట్రప్రభుత్వాలు కుండేదుకదా? ఎందుచేతనంటే దేశంలోని ప్రధానమైన పన్నులన్నీ కేంద్రప్రభుత్వ ఖజానాలోకే ప్రవహిస్తాయి. అలాంటప్పుడు రాష్ట్రప్రభుత్వాలు తమఖర్చులను కొద్ది ఆదాయంతోనే సరిపెట్టుకోలేవనేది నిర్వివాదాంశం. కాబట్టి, దేశంలో వసూలయ్యే పన్నుల ద్వారా వొచ్చే నికరాదాయాన్ని, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య వాటి వాటి భాగాలను ఏ నిష్పత్తిలో, ఎలా పంపకం చేయాలో రాష్ట్రపతికి సిఫారసుచేయడం; కేంద్ర ప్రభుత్వాదాయం నుండి ఏ రాష్ట్రానికైనా మంజూరు చెయ్యాల్సిన గ్రాంటులను శాసించే సూత్రాలను సిఫారసుచేయడం, ఫైనాన్సు కమీషన్ యొక్క ప్రధాన కర్తవ్యాలు.

## రాష్ట్ర ప్రభుత్వం — దాని సంస్థలు

రాష్ట్రమండలి పౌరులకు ప్రాతినిధ్యం వహించేది రాష్ట్ర శాసనమండలి లేక స్టేట్ లెజిస్లేచర్. దీనిలో శాసనసభ, (Legislative Assembly) శాసనపరిషత్తు (Legislataive Council) వుంటాయి. చిన్న రాష్ట్రమైతే శాసనసభయే వుంటుంది రెండు సభలను (Two Houses - Legislative Assembly and Council కలిగివున్న దానిని ద్విసభా శాసనమండలి - బైకేమిరల్ లెజిస్లేచర్ అని, ఒకే సభను, అనగా శాసనసభను మాత్రమే కలిగి వున్నదాన్ని యూనికేమిరల్ లెజిస్లేచర్ అని రాజ్యాంగ నిపుణులు అంటారు.

రాజ్యాంగంలోని 160 వ ఆర్టికల్ ప్రకారం ఇండియన్ యూనియన్‌లోని ప్రతి రాష్ట్రానికి ఒక శాసనమండలి లేక లెజిస్లేచర్ వుండాలి. బీహారు, ఉత్తరప్రదేశ్, మద్రాసు, ఆంధ్రప్రదేశ్ లాంటి పెద్ద రాష్ట్రాలకు ద్విసభా శాసనమండలి, చిన్న రాష్ట్రాలకు ఏకసభా శాసనమండలి లేక యూనికేమిరల్ లెజిస్లేచరూ వుండాలనీ, ఈ లెజిస్లేచరులు గవర్నరుతో కూడ వుండాలనీ, రాజ్యాంగం ఆదేశిస్తోంది.

బిషన్" (నిషేధం) అంటారు. ప్రభుత్వానికి గాని, దాని సంస్థలకు గానీ, కోర్టు ఇచ్చే ఆదేశాన్ని మాండమస్ అని పిలుస్తారు. ప్రభుత్వంగాని ప్రభుత్వోద్యోగులు గాని ఒక వ్యక్తిని నిర్బంధించుటకు గల లీగల్ కారణాన్ని చూపించమని కోర్టు ఆజ్ఞాపించడాన్ని "కో వారంటో" అంటారు. ఈ రిట్లలో ఏదైనా ఒకదాన్ని వుపయోగించుకొని, ప్రభుత్వంవల్ల గానీ, దాని సంస్థలవల్ల గానీ, వ్యక్తులచేత గానీ తనకున్న ప్రాథమిక హక్కులలో, ఏ ఒకదానికైనా అన్యాయం సంభవించిందని అనుకొన్న పౌరుడు, తనకు జరిగిన అన్యాయానికి పరిహారం పొందవచ్చు, దానితోపాటు నష్టపరిహారం కూడా సంపాదించవచ్చును

## కేంద్ర ప్రభుత్వం - దాని సంస్థలు

ప్రభుత్వమనగా శాసన నిర్మాణ (లెజిస్లేచర్). కార్యనిర్వాహక (ఎగ్జిక్యూటివ్), న్యాయాధికారం (జ్యుడీషియరీ) వర్గాలని మూడు వర్గాలు సమిష్టిగా పరిపాలన సాగించు విధానం అని చెప్పవచ్చును. రాజ్యానికి (State), ప్రభుత్వానికి (Government), మధ్య చాలా వ్యత్యాసం వుంది. రాజ్యంయొక్క నాలుగు ప్రధాన లక్షణాలలో ప్రభుత్వం ఒకటి మాత్రమే 1 జనాభా, 2. భూభాగం; 3. ప్రభుత్వం; 4 సార్వభౌమాధికారం; అను ఈ నాలుగు లక్షణాలు రాజ్యానికి వున్నాయి. ప్రభుత్వానికి రాజ్యానికీ మధ్య వుండే తేడాను గుర్తించకుండా వుంటే, ఫాసిజానికి అంకురార్పణ జరిగి, వ్యక్తి స్వతస్సిద్ధమగు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, మట్టిలో కలిసిపోతాయి [illegible]. పాశ్చాత్య రాజనీతి శాస్త్రవేత్తలైన ప్లేటో, హాబ్స్, రూసో హెగెల్ లాంటి వారు, యీ వ్యత్యాసం గుర్తించలేదు.

## రాష్ట్రపతి

భారత రాజ్యాంగచట్టంలో రూపొందించబడిన కేంద్ర ప్రభుత్వం. దానియందలి వివిధ సంస్థలను పరిశీలింతాము భారత రిపబ్లిక్ అధిపతికి, రాష్ట్రపతియని, అధ్యక్షుడని పేరు. రాజ్యాంగ చట్టం ప్రకారం సర్వాధికారం (Sovereign authority) యీయనలో నిహితమైవుంది. 53-1 వ ఆర్టికల్ ప్రకారం భారత ప్రభుత్వ కార్య నిర్వాహక సర్వాధికారం యీయనకుంది. దీన్ని యీయనే స్వయంగాగాని, లేక తనక్రిందనున్న ప్రభుత్వోద్యోగుల ద్వారాగాని, అమలు పరుస్తాడు. ఇండియన్ యూనియన్‌లోని రక్షణ బలాలకు కూడా ఈయనే అధిపతి.

పార్లమెంటుకు చెందిన ఉభయసభలలోని సభ్యులూ, రాష్ట్ర శాసనసభలలోని ఎన్నుకోబడిన సభ్యులూ కలసి ఏర్పడిన ఎలక్టోరల్ కాలేజీ, భారత రిపబ్లిక్ అధ్యక్షుణ్ణి ఎన్నుకొంటుంది. ఈ ఎన్నికలలో, అల్పసంఖ్యాకవర్గాలకు కూడా స్థానముంటుంది. దామాషా ప్రాతినిధ్య పద్ధతి ప్రకారం సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ ఓటు ద్వారా యీ ఎన్నిక జరుగుతుంది. ఎన్నికల వుద్యోగులు వేసిన లెక్కల ప్రకారం. ఓటర్ల యొక్క అభిమతాన్ని రాష్ట్రపతి పదవి ఎన్నికకు నిలబడిన ఏ అభ్యర్థి అధికంగా సంపాదించుకొనగలడో, అతడు ఎన్నికైనట్లు ప్రకటింపబడతాడు.

రాష్ట్రపతి పదవీకాల పరిమితి ఐదు సంవత్సరాలు. ఆయన మరణంవల్లనైనా, రాజీనామావల్లనైనా, పార్లమెంటు అభిశంసన తీర్మానాన్ని ఆమోదించుటవల్లనైనా, ఈ కాలపరిమితి ముందుగానే రద్దుచేయబడుతుంది. 35 ఏండ్ల వయస్సు కలిగి, లోక్ సభకు ఎన్నుకోబడేందుకు అర్హుడైన ఏ భారతీయ పౌరుడైనా ఈ పదవికి అర్హుడే

పార్లమెంటులోని ఉభయసభల్లో, ఏ ఒక్కదానిలోనూ, ఆయన సభ్యుడు కాకపోయినప్పటికిని, ఆయన్ను భారత పార్లమెంటులో ఒక భాగంగానే రాజ్యాంగం పరిగణించింది పార్లమెంటు ఆమోదించిన శాసనాలన్నింటిపై, రాష్ట్రపతి తమ ఆమోద ముద్రను వేయాలి. అలా ఆయన ఆమోదముద్రను పొందనిది, శాసనం కావడానికి వీల్లేదు. అలాగే, వివిధ రాష్ట్రాలలోని లెజిస్లేచరులు లేక శాసనమండలులు, ఆమోదించిన బిల్లులు, చట్ట రూపం దాల్చవలెనంటే వాటిని ఆయన. ఆమోదించాలి. ఇంతకు క్రితమే చెప్పినట్లు. రాష్ట్రపతి భారతప్రభుత్వ కార్య నిర్వాహకవర్గాధిపతియే గాక, పార్లమెంటులో అంతర్భాగంకూడా. ఈవిధంగా బ్రిటన్‌లోని పార్లమెంటరీ ప్రభుత్వపద్ధతి, అమెరికాలోని ప్రెసిడెన్షియల్ ప్రభుత్వ పద్ధతి ఈ రెండూ మన రాజ్యాంగంలో మిశ్రితం చేయబడ్డాయి. ఐతే ఒక్క విషయం మాత్రం గమనార్హం. అమెరికాలోని అధ్యక్షపదవిని మన రాజ్యాంగంలో ప్రవేశపెట్టినా అది నామమాత్రమే ప్రపంచమందలి ఏ రాజ్యాధినేతకూ లేని విశేషాధికారాలు అమెరికన్ ప్రెసిడెంటుకు వున్నాయి. కాని భారతరాష్ట్రపతి [illegible] సర్వాధికారంగల ప్రభుత్వాధినేత అయినా, నామమాత్రానికి బ్రిటిష్ రాజు లేక రాణివంటివాడు

"బాధ్యతాయుత ప్రభుత్వవిధానం క్రింద ఆయన ప్రతి విషయంలోను మంత్రివర్గం యిచ్చే సలహాను అనుసరించాలి. మంత్రులతో ఆయనకు అభిప్రాయభేదం వస్తే ఆయన రాజీనామా చేయవలసి ఉంటుంది. దర్బారు మర్యాదలకు సంబంధించిన ఆయన కార్యకలాపములు ముఖ్యమైనవి ఇంగ్లండులోని రాజు లేక రాణిలాగ ఆయన రాజ్యానికి (దేశానికి) అంతటికి ప్రతినిధి" ((ప్రా[illegible] స్వామి) బ్రిటిష్ రాజ్యాంగంప్రకారం, బ్రిటిష్‌రాజు (లేక రాణి) ఎట్టివాడో, మన రాష్ట్రపతికూడా అంతే. ఒక నిర్దిష్ట సమస్యపై బ్రిటిష్ పార్లమెంటు, మంత్రివర్గం తమ ఆమోదాన్ని, సంతృప్తిని ప్రకటిస్తే దానిని బ్రిటిష్ రాజ్యాధినేతకూడా అంగీకరించాలి. ఎందుకంటే అంగీకరించకుండా చేసేదేమీ లేదు గనుక. అలాగే, కేంద్ర మంత్రివర్గం తన సంతృప్తిని, ఆమోదాన్ని ఒక ప్రధానసమస్యపై తెలిపితే, తద్విరుద్ధంగా భారతరాష్ట్రపతి ప్రవర్తించడం రాజ్యాంగంప్రకారం సాధ్యంకాని విషయం. ఈ విషయాన్ని భారత ప్రధానమంత్రి ఒకసారి నొక్కి వక్కాణించడం జరిగింది.

నేరస్థుని కివ్వబడిన శిక్షవిషయంలో క్షమాపణ, విలంబన, శిక్షాపరిహారం. శిక్షను తగ్గించడం లాంటి అధికారాలు రాష్ట్రపతికి వున్నాయి కేంద్రప్రభుత్వ మంత్రివర్గ నిర్మాణంలో, ఆయనకో [illegible]మున్నది లోక్‌సభలో మెజారిటీ ఉన్న పార్టీ నాయకుని ఆయన ప్రధానమంత్రిగా నియమిస్తారు. కేంద్రంలో ఉన్నది,

లోక్ సభా విశ్వాసాన్ని చూరగొని, ఆ సభకు బాధ్యత కలిగివున్న మంత్రివర్గం కెబట్టి, ప్రతి విషయంలోను కేంద్ర మంత్రివర్గం యిచ్చిన సలహాను అనుసరించాలి. మంత్రివర్గ నిర్ణయాలతో ఏకీభవించలేకపోతే, పదవినుండి బయటికి రావాలి.

ఉపరాష్ట్రపతిని, పార్లమెంటులోని ఉభయ సభలూ, ఒకే సమావేశంలోకూడి, సింగిల్ ట్రాన్స్‌ఫర్ బుల్ ఓటు ద్వారా, దామాషా ప్రాతినిధ్యం ప్రకారం ఎన్నుకొంటారు. మరణంవల్ల గానీ, రాజీనామా యివ్వడంవల్ల గానీ, రాష్ట్రపతిస్థానంలో ఖాళీ ఏర్పడితే, మళ్ళ మరో రాష్ట్రపతిని ఎన్నుకొనేంతదాకా, రాష్ట్రపతి తరఫున ఈయనే పనిచేస్తాడు. అపుడు రాష్ట్రపతికుండే అధికారాలన్నీ యీయనకుంటాయి. సాధారణంగా, రాజ్యసభకు యీయన అధ్యక్షుడుగా వుంటాడు. పదవీ కాలపరిమితి 5 సంవత్సరాలు. అమెరికాలో అధ్యక్షుని పిదప ఉపాధ్యక్షుడు వున్నట్లే, మన దేశంలోకూడా రాష్ట్రపతి, పిదప ఉపరాష్ట్రపతి పదవిని ప్రవేశపెట్టారు. ఐతే, ఈ పదవుల్లో నామమాత్రముగు పోలికే వుంది గాని, వాస్తవానిక అమెరికాలోని అధ్యక్ష ఉపాధ్యక్షులకూ, మన రాష్ట్ర, ఉపరాష్ట్ర పతులకూ అధికారాల్లోమటుకు ఏమాత్రం సామ్యంలేదు.

కేంద్ర ప్రభుత్వంలో మామూలుగా శాసనాలను చేయునది పార్లమెంటు. ఐనా, రాజ్యాంగంలోని 123 వ ఆర్టికల్ ప్రకారం, రాష్ట్రపతికి, శాసన నిర్మాణ విషయంలో అసాధారణాధికారాలు యివ్వబడ్డాయి. పార్లమెంటు ఉభయసభలు సమావేశమై వున్నపుడుగాక, ఏ యితర సమయంలోనైనా, తాను సత్వరంగా చర్య తీసికోవాల్సిన విపరీత విపత్కర పరిస్థితులు ఏర్పడ్డాయని నమ్మిన యెడల, అపుడు ఆయన యీ అసాధారణాధికారాలను వుపయోగించి, ఆర్డినన్సులను జారీచేస్తాడు. వాటికి, పార్లమెంటు ప్యాస్ చేసిన చట్టములకున్నంతబలం, అధికారముంటుంది. కాని, అలాంటి ప్రతి ఆర్డినెన్సును పార్లమెంటుయొక్క ఉభయసభలముందు ప్రవేశ పెట్టవలయును. పార్లమెంటు సమావేశమైన పిమ్మట, 6 వారాల అనంతరం, ఆ ఆర్డినెన్సు వర్తించకుండా నిలిచిపోవును; లేక, ఆ వ్యవధి గడువకపూర్వమే, ఆ ఆర్డినెన్సుకు అసమ్మతి తెలియజేస్తూ, పార్లమెంటు ఉభయసభలూ తీర్మానాలు చేస్తే, దానికి ఏబలమూ వుండదు.

భారత ప్రభుత్వానికి న్యాయశాస్త్ర (లీగల్) సంబంధముగు విషయాలలో సలహా యిచ్చే వుద్యోగిని, ఇండియా ఎటార్నీ జనరల్ అని పిలుస్తారు. ఈయన రాష్ట్రపతిచే నియమింపబడి, ఆయన అనుగ్రహం పర్యంతం, తన పదవిలో నుండును. రాష్ట్రపతి అప్పుడప్పుడు తనకు నిర్దేశించిన న్యాయశాస్త్ర సంబంధముగు కర్తవ్యాలను, నిర్వహించాలి. భారత ప్రభుత్వం, వాదిగాగాని, ప్రతివాదిగాగాని, ఏ కేసులోనైనా పాల్గొన్నప్పుడు, కోర్టులో ప్రభుత్వప్రతినిధిగా ఈయన వాదిస్తాడు.

భారత రాజ్యాంగంలోని 74వ ఆర్టికల్ ప్రకారం, ఇండియన్ యూనియన్ యొక్క కార్యనిర్వాహక అధికారాలను ఆచరణలో పెట్టేందుకూ, రాష్ట్రపతికి సహాయపడుటకూ, సలహా నిచ్చుటకు, లోక్ సభకు పూర్తి బాధ్యతను కలిగివున్న ఒక మంత్రివర్గం వుంటుంది. దానిలో ప్రధానమంత్రి ముఖ్యుడు. ప్రధాన మంత్రిని రాష్ట్రపతి నియమించును. ప్రధానమంత్రి సలహాతో, యితర మంత్రులను కూడా నియమించును. రాష్ట్రపతి, అనుగ్రహం పర్యంతం, ఆ మంత్రులు పదవుల్లో వుంటారు. బాధ్యతాయుత ప్రభుత్వానికి సంబంధించిన సూత్రాలను, కన్వెన్షనులనూ పాటిస్తూ, మంత్రివర్గం పనిచేస్తుంది.

## పార్లమెంటు

రాజ్యాంగంలోని 79వ ఆర్టికల్, యూనియన్ పార్లమెంటును గూర్చి వివరించింది. పార్లమెంటులో, రాష్ట్రపతి అంతర్భాగంగా చేయబడ్డాడు; దీనిలో లోక్ సభ, రాజ్యసభ అనే రెండు సభలుంటాయి.

లోక్ సభ, ఇండియన్ యూనియన్‌లోని ప్రజల కందరికీ ప్రతినిధి. బ్రిటిష్ పార్లమెంటులోని కామన్సు సభకీ, లోక్ సభకీ, చాల సామ్యము లున్నయి. వివిధ రాష్ట్రాలలో, వయోజనులగు (ఓటుచేయుటకు అర్హులు) ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడ్డ 500 నుండి సభ్యులు దీనిలో వుంటారు. ఈ సభా కాలపరిమితి 5 సంవత్సరాలు 25 సంవత్సరాలు వయస్సునుండి భారత పౌరసత్వాన్ని కలిగియుండి, రాజ్యాంగం నిర్దేశించిన అనర్హతలులేకుండిన ఏ వ్యక్తియైనా, ఈ సభకు సభ్యుడుగా ఎన్నిక కావచ్చు.

ప్రజాసభగాక, రిపబ్లికులోని వివిధ రాష్ట్రాలకు రాజ్యసభ ప్రాతినిధ్యం యిస్తోంది విజ్ఞానశాస్త్రం, సారస్వతం, కళ, సాంఘిక విషయాలలో పాండిత్యాన్ని, అనుభవాన్ని గడించిన 12 మంది సభ్యులు, రాష్ట్రపతిచే ఈ సభకు నామినేటు చేయబడతారు. ఈ సభకు చెందినమిగతా సభ్యులంతా, దామాషా ప్రాతినిధ్యం ప్రకారం సింగిల్ ట్రాన్స్‌ఫర్ బుల్ ఓటుద్వారా ఎన్నికవుతారు. దీనిలో 238 సభ్యులకు మించకుండా వుందురు. భారతీయ పౌరుడుగావుండి, 30 సంవత్సరాలవయస్సు కలిగినవ్యక్తి, ఈ సభకు ఎన్నిక కావచ్చు. ఐతే, పిచ్చివారూ, దివాలాదారులూ, ప్రభుత్వోద్యోగులూ, పార్లమెంట్ లోని ఏసభ సభ్యత్వానికైనా, అనర్హులు. రాజ్యసభను డిసాల్వ (రద్దు) చేయడానికి వీల్లేదు ప్రతి రెండు సంవత్సరాలకొకసారి, ఈసభలోని మూడవవంతు సభ్యులు, పదవీవిరమణ చేస్తారు.

రాజ్యాంగములోని, 85 ఆర్టికల్ ప్రకారం, పార్లమెంటు ఉభయసభలు, ప్రతి సంవత్సరం కనీసం రెండుసార్లైనా సమావేశమగుటకు ఆహ్వానింపబడాలి. ఏ రెండు సమావేశాలమధ్య 6 మాసాల కంటె అధికవ్యవధి వుండరాదు. ఐతే, రాష్ట్రపతి, తనకు యుక్తమని తోచినపుడెల్ల, పార్లమెంటునుగానీ, లేక ఉభయసభలలో దేనినైనా గానీ ఆహ్వానించవచ్చును.

## పార్లమెంటు అధికారాలు

1 రాజ్యాంగం కేంద్ర ప్రభుత్వానికి అప్పగించిన అంశాలపై ఇండియన్ యూనియన్ కంతటికి వర్తించే శాసనాలను చేసే అధికారం;

ప్రజోపయోగకరమగు ఉత్తమ శాసనాలను పాస్ చేయడం, ముఖ్యంగా ప్రజలకు ప్రాతినిధ్యం వహించడం, శాసన మండలి యొక్క ప్రధాన కర్తవ్యాలు. స్త్రీ పురుష విచక్షణ లేకుండా 21 సంవత్సరాల వయస్సు కలిగిన వయోజనులందరికీ ఓటు చేసే హక్కున్నది. రాజ్యాంగం నిర్దేశించిన అనర్హతలు లేని పౌరులు, ప్రత్యక్ష ఎన్నికల ద్వారా రాష్ట్రశాసనసభకు సభ్యులను ఎన్నుకొంటారు. శాసనసభకు ఎన్నుకోబడే అభ్యర్థి పౌరుడైవుండి, 25 సంవత్సరాల వయస్సు కలిగి వుండాలి. శాసనసభకు ఎన్నుకోబడే వ్యక్తిని, యం. యల్. ఎ. అని అంటారు (Member of the Legislative Assembly.).

శాసనసభతోపాటు, మద్రాసు, ఆంధ్రప్రదేశ్, యిత్యాది పెద్ద రాష్ట్రాలలో, రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ కూడా వుంటుంది. దీనిలో వుండే మొత్తం సభ్యుల సంఖ్య ఆ రాష్ట్ర శాసనసభలో వుండే మొత్తం సభ్యుల సంఖ్యలో నాలుగోవంతు కంటె ఎక్కువగా వుండరాదు ఐతే, ఈ కౌన్సిల్లోని మొత్తం సభ్యుల సంఖ్య 40 మంది కంటె తక్కువగానూ వుండరాదు. అలావుంటె, కౌన్సిల్ నిర్మాణమే జరగదు. దీనియందలి మూడవ వంతు సభ్యులు, మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, యితర స్థానిక సంస్థల చేతనూ; పన్నెండవవంతు సభ్యులు యూనివర్సిటీ పట్టభద్రుల చేతనూ, మరో మూడవ వంతు రాష్ట్ర శాసనసభా సభ్యుల చేతనూ, ఎన్నుకోబడతారు. సారస్వతం, విజ్ఞాన శాస్త్రం, కళలు, సహకారోద్యమం, సాంఘిక సేవ, యిత్యాది రంగాలలో విశేషానుభవము కలిగిన వ్యక్తులను, గవర్నరు నామినేటు చేస్తాడు లెజిస్లేటివ్ కౌన్సిల్ యొక్క సభ్యునికి, యమ్. యల్. సి. (Member of the Legislative Concil) అని పేరు ఈ పోటీకి నిలబడే అభ్యర్థికి 30 సంవత్సరాల వయస్సుండాలి.

రాజ్యాంగమందలి 172 వ ఆర్టికల్ ప్రకారం, ప్రతిరాష్ట్ర శాసనసభ యొక్క కాలపరిమితి, దాని ప్రథమ సమావేశపు తేదీ మొదలు, 5 సంవత్సరాలు ఐతే, అసాధారణ పరిస్థితులేర్పడినపుడు గవర్నరు ఈ సభను కాలపరిమితికి పూర్వమే రద్దుచేయవచ్చును కాని రాష్ట్ర శాసనపరిషత్తు మాత్రం రద్దుచేయబడదు. దానిలోని సభ్యుల్లో దాదాపుగా మూడోవంతు ప్రతిరెండు సంవత్సరాల పిదప, భారత పార్లమెంటు చేసిన నియమాల ననుసరించి, పాక్షికమైనంతర్వరలో రిటైరుకావాలి.

## శాసనసభ అధికారాలు

రాజ్యాంగచట్టం నిర్దేశించిన పరిపాలనాంశాలపై శాసనాలను పాస్ చేసే అధికారం రాష్ట్ర శాసనసభకున్నది. లెజిస్లేచరులో రెండు సభలు వున్నటయితే, ఆ రెండింటిచేతా, శాసనాలకు సంబంధించిన అన్ని ప్రతిపాదనలు ఆమోదింపబడాలి, పిదప, చట్టరూపం దాల్చేందుకు అవి గవర్నరు ఆమోదాన్ని పొందాలి. పిదప, గవర్నరు, రాష్ట్రపతికి, ఆ బిల్లును పంపుతాడు. రాష్ట్రపతి ఆమోదాన్ని బడసిన అనంతరం, అది చట్టమై అమలులోకి వస్తుంది.

ప్రభుత్వ దైనందిన పరిపాలన నిర్వహణకు అవసరమయ్యే ధనాన్ని, రాష్ట్ర ప్రభుత్వానికి మంజూరుచేసే అధికారం లెజిస్లేచరుకుంది. ప్రజాశ్రేయస్సుకు సంబంధించిన తీర్మానాలను ప్రవేశపెట్టి చర్చించేందుకు, ఆమోదించేందుకు లెజిస్లేచరుకు అధికారం వుంది. ఐతే, ఆ తీర్మానాలలోని సూచనల ప్రకారం, ప్రభుత్వం తప్పకుండా చర్యతీసుకోవలెననే నిర్బంధంమాత్రం లేదు. రాష్ట్ర వ్యవహారాలను పరిపాలించునపుడు, ప్రభుత్వాన్ని అదుపులో పెట్టేందుకు, లెజిస్లేచరుకు అధికారం వుంది.

శాసనసభా కార్యక్రమాన్ని క్రమబద్ధంగానూ, మర్యాదగానూ, సమర్థవంతంగానూ నిర్వహించేందుకు, శాసనసభా స్పీకరు వుంటాడు. అలాగే శాసన పరిషత్తు కార్యకలాపాలను నిర్వహించేందుకు అధ్యక్షుడుంటాడు. వీరిద్దరూ ఈ రెండు సభలను క్రమబద్ధంగాను, పార్లమెంటరీ సంప్రదాయానుగుణ్యంగాను నడిపేందుకు అధికారం కలిగివుంటారు. సభలోని ప్రతి సభ్యుడు తన అభిప్రాయాన్ని వెలిబుచ్చేందుకు స్పీకరు నిష్పక్షపాతంగా అవకాశమిస్తు, అక్రమమగు పార్లమెంటరీ సభా సంప్రదాయాలను అతిక్రమించిన సభ్యులను విమర్శించి, తగు మార్గంలో పెడుతుంది. రాష్ట్రశాసనసభలో అనుసరించె కార్యకలాపం బ్రిటిష్ కామన్సుసభా సంప్రదాయాల ననుసరించి రూపొందించబడింది

1. ప్రశ్నసమయం (ఇంటర్ పెలేషన్):— దైనందిన పరిపాలనకు సంబంధించిన అంశాలపై శాసనమండలి సభ్యులు, మంత్రివర్గ సభ్యులకు ప్రశ్నలు వేయడంతో, సభా కార్యక్రమం సాధారణంగా ప్రారంభమౌతుంది.

2 తీర్మానాలు:—లెజిస్లేచరులో ప్రతి ఒక చర్చా, నిర్ణీతమగు సమస్యనుగూర్చి చర్చించాలని తేబడిన తీర్మానం. లేక మోషన్ (Motion) మీద ఆధారపడి వుంటుంది. ప్రజలకు సంబంధించిన అత్యవసర సమస్యపై చర్చించవలసిన అవసరంవుంటే, ఆ సమస్యపై శ్రద్ధకలిగిన సభ్యుడు, సభయొక్క జరుగుతున్న కార్యక్రమాన్ని వాయిదా వేయమని కోరుతూ, ఒక మోషన్ను ప్రవేశపెట్టవచ్చును. ఇలాంటి దాన్ని ఎడ్జర్న్మెంటు మోషను లేక వాయిదా తీర్మానం అని అంటాడు దీనిని స్పీకరుగానీ, శాసనపరిషత్తు అధ్యక్షుడుగానీ, అంగీకరించితే అపుడు చర్చ ప్రారంభించవచ్చు.

3 బిల్లులు: ప్రతి చట్టంయొక్క ప్రస్తావన మూడు దశల ద్వారా సాగిపోతుంది. ఈ మూడుదశలను బిల్లుయొక్క మూడుపఠనాలు అని అంటారు.

మొదటి పఠనం. (ఫస్ రీడింగ్): లాంఛనప్రాయంగా బిల్లును సభకు సమర్పించడం. సభా కార్యదర్శి, ఆయన యితర ఉద్యోగులు ఆసనులైవున్న సభా మధ్యభాగంలో టేబుల్ పై బిల్లును బహుకృతంగా వ్రాసివుంచుతారు.

రెండవ పఠనం: ఈ దశలో బిల్లులోని సూత్రాలను వివరంగా చర్చిస్తారు

మూడవపఠనం: ఈదశలో బిల్లు సెలక్టు కమిటీకి పంపబడుతుంది. ఈ కమిటీ, బిల్లులోని వివరాలనన్నింటిని పరిశీలించి, దానిపై శాసనమండలికి, రిపోర్టును యిస్తుంది. అపుడు బిల్లు, సభ్యుల ఓటుకు పెట్టుబడుతుంది. అధిక సంఖ్యాక సభ్యుల ఆమోదాన్ని పొందితే, బిల్లు పాస్ అవుతుంది లేకపోతే నిరాకరింపబడుతుంది. లెజిస్లేచరు ఆమోదించిన బిల్లుపై గవర్నరు తన ఆమోదముద్రను వేస్తే చట్టమౌతుంది.

4. డబ్బు బిల్లులు (Money Bills):—రాష్ట్రప్రభుత్వమే ఈ బిల్లులను శాసనమండలిలో ప్రవేశపెడుతుంది. వీటి రూపంగా విధింపబడిన పన్నులను, వ్యయానికి సంబంధించిన యితర తీర్మానాలను (Motions) ప్రభుత్వంమాత్రమే ప్రవేశపెడుతుంది. శాసనమండలిగానీ, అందలి సభ్యుడుగానీ, ఈ బిల్లులకు సంబంధించిన దేనినీ ప్రవేశపెటరాదు. వ్యయాన్ని పెంచమనిగానీ, కొత్తపన్నులను విధించమనిగానీ, వీరు తీర్మానం తీసుకు రాకూడదు. ఐతే, వ్యయాన్ని తగించమనిమాత్రం కోరవచ్చును శాసనమండలిలో రెండు సభలు వుంటే, మొదటశాసనసభలో ప్రవేశపెట్టి బిల్లును ఆమోదింపజేయాలి. పిదప శాసనపరిషత్తు ఆమోదాన్నికూడా పొందాలి. ఐతే శాసనసభ పాస్ చేసిన డబ్బు బిలులో శాసన పరిషత్తు ఏదైనా మార్పులు చేస్తే, అలాంటివాటిని శాసనసభ అంగీకరించకుండా, మళ్ళీ వున్న బిల్లును యధాతధంగానే అంగీకరించినటయితే, పరిషత్తుచేసిన మార్పులకు ఎలాంటి ఫలితం (effect) వుండదు.

5. ఫైనాన్సుబిల్లులోనూ, ప్రభుత్వ సాంవత్సరిక పు బడ్జెటులోనూ వేయబడిన పన్నులు, చేయబడిన వ్యయాలకు సంబంధించిన తీర్మానాలు (Motions) రాబోవు సంవత్సరానికోసం ప్రతి సంవత్సరం రాష్ట్ర లెజిస్లేచరులలో పాస్ కావాలి.

ఐతే గవర్నరు, ఆయన సిబ్బంది, ఆఫీసు ఖర్చులు, అలవెన్సులు, స్పీకరు, డిప్యూటి స్పీకరు, శాసనపరిషత్తు అధ్యక్షు ఉపాధ్యక్షుల జీతబత్తాలు, హైకోర్టు న్యాయమూర్తుల జీతబత్తాలు. కోర్టు నిర్వహణకయ్యే ఖర్చులు, అప్పులు, వడ్డీలు, ప్రభుత్వ ఋణాలు యిత్యాదిపద్దులు, లెజిస్లేచర్ ఓటుతో అవసరం లేకుండా, రాష్ట్రప్రభుత్వ కన్‌సాలిడేటెడ్ ఫండు లేక సంచితనిధి నుండి ఖర్చు చేయబడతాయి. ఈ పద్దులకు సంబంధించిన ఖర్చులను శాసనమండలి ఓటునుండి మినహాయించుటలోగల కారణం ఏమిటంటే రాష్ట్రప్రభుత్వ గౌరవ మర్యాదలను సంబంధించిన ఉద్యోగుల (గవర్నరు, ఆయన సిబ్బంది) కోరకూ, న్యాయ నిర్వాహకవర్గ స్వేచ్ఛనూ, న్యాయమూర్తుల నిష్పక్షపాత ప్రవర్తనను లెజిస్లేటివ్, ఎగ్జిక్యూటివ్ అధికార వర్గాలబారినుండి కాపాడ ప్రయత్నించటమే, వారి ఖర్చుకు సంబంధించిన పద్దులను లెజిస్లేచరు ఓటుకు పెట్టకుండా వుండడం.

## కార్య నిర్వాహకవర్గం—గవర్నరు

రాజ్యాంగమందలి 104వ ఆర్టికల్ ప్రకారం, రాష్ట్రపతిచే నియమింపబడిన గవర్నరు రాష్ట్రప్రభుత్వానికి అధిపతి; రాష్ట్ర కార్యనిర్వాహక వర్గాధిపతి. గవర్నరు తనఅధికారాన్ని స్వయంగాగానీ, అధీనులైన వుద్యోగుల ద్వారాగానీ, చలాయిస్తాడు. రాష్ట్ర పరిపాలనా యంత్రాన్ని నడుపుటలో గవర్నరునకు సహాయపడేందుకు, సలహా యిచ్చేందుకూ రాష్ట్ర శాసనసభా విశ్వాసాన్ని చూరగొన్న మంత్రివర్గం వుంటుంది. దీనికి ముఖ్యమంత్రి నాయకుడు, శాసనసభలో మెజారిటీగల రాజకీయ పార్టీ యొక్క నాయకుని, ముఖ్యమంత్రిగా గవర్నరు నియమించును. ముఖ్యమంత్రి సలహా ననుసరించి ఇతర మంత్రులను కూడా నియమించును. గవర్నరు అంగీకార మున్నంతదాకా మంత్రివర్గం అధికారంలో వుంటుంది. అంటే వాస్తవంగా చెప్పాలంటే, రాష్ట్ర శాసనసభలో మంత్రి వర్గానికి మెజారిటి ఉన్నదాకా మంత్రులు అధికారంలో వుంటారు. కాని కొన్ని "అసాంతర పరిస్థితుల" సంఘటనలు ఏర్పడినప్పుడు శాసనసభలో మెజారిటీ వున్నప్పుడు కూడా మంత్రివర్గం రద్దు చేయబడగలదు.

రాష్ట్రపౌరుల ప్రతినిధిగా లెజిస్లేచరు, రాష్ట్రాన్ని పాలించేందుకు అవసరమైన శాసనాలను పాస్ చేయడానికీ, ఏ జనరల్ పాలసీ ప్రకారం రాష్ట్ర ప్రభుత్వ పరిపాలన నిర్వహింపబడవలయునో సూచింపడానికీ అధికారం కలిగివుంది. అలాగే రెవెన్యూను వసూలు చేయడం, శాంతిభద్రతలను కాపాడడం, విద్య, ఆరోగ్యం, పరిశ్రమలు ప్రాజెక్టులు మున్నగు ప్రజోపయోగకర కార్య నిర్వహణను రాష్ట్ర మంత్రివర్గం పూనకొంటుంది

## బాధ్యతాయుత మంత్రివర్గం

రాష్ట్ర శాసనసభకు మాత్రమే మంత్రివర్గం సమష్టిగా బాధ్యత కలిగి వుండాలని రాజ్యాంగం ప్రధానంగా ఆదేశించింది. దీనికే కలెక్టివ్ రెస్పాన్సిబిలిటీ, లేక సమిష్టి బాధ్యత అని పేరు. మంత్రివర్గంలోని ప్రతి ఒకమంత్రి, ఒక్కొక్క పరిపాలనాశాఖకి వ్యక్తిగతంగా బాధ్యుడై దానిని నిర్వహించాలి. దానితోపాటు యితర పరిపాలనా అంశాలకు కూడా, తను తదితర మంత్రులతో పాటు, సమష్టిగా బాధ్యుడై వుండాలి. ఈవిధంగా మంత్రివర్గం అవిభాజ్యము ఏకైక నికాయం లేక బాడీలాగ (Single Body) వుంటుంది. ఇది అవిభాజ్యతను, సమష్టితత్వాన్ని గవర్నరు యెడ శాసనమండలి ఎదుట ప్రదర్శిస్తుంది. శాసనసభకు మాత్రమే బాధ్యత కలిగివున్న యిలాంటి మంత్రివర్గ ప్రభుత్వ పద్ధతికి కాబినెట్ ప్రభుత్వ పద్ధతి (Cabinet system of government) అని పేరు. ఇట్టిదానినే పార్లమెంటరీ కార్య నిర్వాహక పద్ధతి (Type) అని అంటారు. ఈ పద్ధతికి, రాష్ట్రపతి చేత నియమింపబడు కార్య నిర్వాహకపద్ధతికి వ్యత్యాసం వుంది. ప్రెసిడెన్షియల్ ప్రభుత్వపద్ధతి అమెరికాలో వుంది. అమెరికాలోని అధ్యక్షుడు ప్రజలచే ఎన్నికొనబడతాడు. ఆయన క్రింద కార్యదర్శులుగా పనిచేసే వారు, ఆయనచేతనే నియమింపబడి, ఆయనకే బాధ్యులుగా వుంటారు. వారు అమెరికన్ కాంగ్రెసులో (శాసనమండలి) సభ్యులు కారు. అందేత దానికి బాధ్యులూ కారు. కాని మనదేశంలోని ప్రభుత్వ పద్ధతి ప్రకారం, కేంద్ర ప్రభుత్వ మంత్రులు విధిగా పార్లమెంటు సభ్యులై వుండాలి. తద్వారా దానికి బాధ్యులై వుండాలి. ఇదే, పార్లమెంటరీ ప్రభుత్వ పద్ధతిలోని సుగుణం.

రాజ్యాంగం ప్రకారం గవర్నరు రాష్ట్ర కార్యనిర్వాహక వర్గాధిపతి ఐనప్పటికీ, మంత్రులు ఆయనకి సలహా యిచ్చేవారే ఐనప్పటికీ, ఆ రాజ్యాంగం ప్రకారమే మంత్రులంతా శాసనసభకు బాధ్యులనియూ, గవర్నరు కేవలం నామమాత్రము రాష్ట్ర ప్రభుత్వాధినేత అనియూ మనం గమనించాలి. గవర్నరు సలహా యిస్తాడు; హెచ్చరిస్తాడు; లేక ఒప్పించేందుకు ప్రయత్నిస్తాడు; అంత మాత్రమేం అంతిమనిర్ణయాన్ని చేసే బాధ్యతను, మంత్రివర్గానికి వదలివేస్తాడు. ఎందుచేతంటే మంత్రులు రాష్ట్ర శాసన

పడతారు, తద్వారా ప్రజలకూ బాధ్యులుగాబట్టి. గవర్నరును రాష్ట్రపతి తాను నియమించేవాడేగాని, ఆయనను ప్రజలు ఎన్నుకొనలేదు." (ప్రొఫెసర్ రత్నస్వామి.)

## న్యాయ నిర్వాహకవర్గం—హైకోర్టు

ఇంతవరకూ, శాసన నిర్మాణ, కార్యనిర్వాహక వర్గాల కార్యకలాపాలను సమీక్షించాం. ప్రస్తుతం రాష్ట్రమందలి న్యాయ నిర్వాహకవర్గం, రాజ్యాంగం ఆదేశించిన ప్రకారం ఎలా పని చేస్తుందో పరిశీలిద్దాం రాజ్యాంగంలోని 214 వ ఆర్టికల్ ప్రకారం, ప్రతి రాష్ట్రంలోనూ ఒక హైకోర్టు వుంటుంది. ఈ కోర్టుయొక్క తీర్పులు, డిక్రీలు, పలవాలు, యిత్యాది వాటిని రికార్డు చేయాలి (Court of Record). హైకోర్టు ఆజ్ఞలను, ఆదేశాలను, ధిక్కరించినవారినీ, దాని గౌరవప్రతిష్ఠలను కించపరచినవారినీ, (Cont of court) శిక్షించేందుకు, హైకోర్టుకు సంపూర్ణ అధికారం వుంది. రాష్ట్రంలో ఏర్పడే సివిల్, క్రిమినల్, అప్పిలేట్, కేసులను విచారించి తీర్పుల్ని యిచ్చేందుకు దీనికి అధికారం వుంది.

217 వ ఆర్టికల్ ప్రకారం, (బి) సెక్షనులో వుదాహరించినట్లు ఈ కోర్టు న్యాయమూర్తుల స్వేచ్ఛ, దటరీత్యా సంరక్షింపబడింది. పార్లమెంటులోని ఉభయసభల సభ్యులు, (మెజారిటీ సభ్యులు) హైకోర్టు జడ్జిపై దుష్ప్రవర్తన, అసమర్థత అనే నేరాలను ఆరోపించి, పార్లమెంటులో ఆమోదించి, రాష్ట్రపతికి నివేదించినప్పుడే, రాష్ట్రపతి అలాంటి న్యాయమూర్తిని పదవినుండి తొలగిస్తాడు. అంతవరకూ, ప్రతిజడ్జి, 60 సంవత్సరాల వయస్సు వరకూ పదవిలో వుంటాడు. తన వుద్యోగ ధర్మ నిర్వహణలో న్యాయమూర్తి ఏమి చెప్పినా, ఏమి చేసినా ఆయనపై ఎట్టి చర్యా తీసుకొనకూడదని రాజ్యాంగం నిర్దేశించింది.

## కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సంబంధబాంధవ్యాలు

ఇంతవరకూ సమీక్షించినదాన్నిబట్టి, ఇండియన్ యూనియన్‌లో, రెండు రకాల ప్రభుత్వాలున్నాయని చూచాం. 1. యూనియన్ ప్రభుత్వం; 2 రాష్ట్ర ప్రభుత్వాలు. వీటిమధ్య ఎలాంటి సంఘర్షణరాకుండా, మంచి సంబంధాలు వుండేట్లు రాజ్యాంగం నిర్వచించి తగిన ఏర్పాటులను గావించింది. రాజ్యాంగమందలి 245 వ ఆర్టికల్ ప్రకారం యూనియన్‌లిస్టు అను జాబితాలో, ఏయే పరిపాలనాంశాలు వుల్లేఖింపబడినవో, ఆ అంశాలకు సంబంధించిన చట్టాలను కేంద్రప్రభుత్వం మాత్రమే పాస్ చేసేందుకు అధికారం యివ్వబడింది.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన పరిపాలనాంశాలను మొత్తంమీద మూడు లిస్టులు లేక జాబితాలుగా, రాజ్యాంగం విభజించింది.

1. యూనియన్‌లిస్టు (కేంద్రప్రభుత్వం లిస్టు.)—ఈ జాబితాలో వుల్లేఖింపబడిన పరిపాలనాంశములు, భారతదేశాని కంతటికీ, వర్తించునట్టి జాతీయ స్వభావాన్నీ, ప్రయోజనాన్నీ కలిగినట్టివి. ఈ అంశాలను వివిధరాష్ట్రప్రభుత్వాలకు వదలివేస్తే. దేశం అరాచకానికి, లోనవుతుంది. రాజ్యాంగంలోని 7 వ షెడ్యూలులో, యూనియన్ లిస్టుకు చెందినవి 97 అంశాలని, లెక్కింపబడ్డాయి. వాటి నన్నింటిని ఈ క్రింది ఆరు ముఖ్యశీర్షికల క్రిందికి తేవచ్చును. 1. భారతదేశరక్షణ; 2. విదేశాంగవిధానం; 3. జాతీయ, అంతర్జాతీయ వర్తకసంబంధాలు; 4. రైల్వేలు, రహదారులు, విమాన మార్గాలు; 5. తంతి తపాలాలు; 6 దేశమందలి, వివిధప్రాంతాలలో జీవించునట్టి ప్రజల సంక్షేమానికి దోహదంచేయు శాసనాలను పాస్ చేయడం.

2. స్టేట్‌లిస్టు లేక రాష్ట్రప్రభుత్వం జాబితా :—రాజ్యాంగంలోని 7 వ షెడ్యూలులో యీ జాబితాకు చెందిన 66 పరిపాలనాంశాలు చెప్పబడ్డాయి. ఆ మొత్తాన్ని ఈ క్రింది ఆరు ప్రధానశీర్షికల క్రిందికి తేవచ్చు. 1. విద్య; 2 ఆరోగ్యం; 3. వ్యవసాయం; 4. పరిశ్రమలు; 5. అడవులు, రోడ్లు; 6. సాంఘిక సంక్షేమం. ప్రతి రాష్ట్రప్రభుత్వం, దానియందలి ప్రజల ప్రత్యేకపు అవసరాలను, పరిస్థితులను దృష్టిలో వుంచుకొని, పై అంశాలకు సంబంధించిన చట్టాలను చేయడం సవ్యమని తలచి, రాజ్యాంగం వీటిని రాష్ట్ర ప్రభుత్వానికి అధీనం చేసింది.

3. కంకరెంటు లిస్టు లేక కేంద్రరాష్ట్ర ప్రభుత్వజాబితాలు :—పై రెండు జాబితాలకు తోడు, అదనంగా కంకరెంటు లిస్టు అను పేరిట మూడవజాబితా వుంది. దీనిలో మొత్తం, 47 అంశాలు చెప్పబడ్డాయి. క్రిమినల్ చట్టాలు; క్రిమినల్ దర్యాప్తు; సివిల్ చర్య; వివాహ; విడాకులు; కార్మిక సంక్షేమం; కార్మికుల, సాంకేతిక శిక్షణ; పార్లమెంటు, జాతీయప్రాముఖ్యాన్ని, ప్రయోజనాన్ని కలిగి వున్నవని ప్రకటించిన పరిశ్రమలు (ఉదా॥ ఉక్కు, విద్యుచ్ఛక్తి, అణుశక్తి), కోర్టుల అధికారాలు, వార్తాపత్రికలు, పత్రికలు, గ్రంథాలు ధరా దాయాలు, ధర్మసంస్థలు ఇత్యాదివన్ని ఈ జాబితాలో చేర్చబడ్డాయి. వివిధ రాష్ట్రప్రభుత్వానికి ఈ అంశాలపై చట్టాలను పాస్ చేయగల అధికారం ఇవ్వబడినప్పటికీ, వీటిపై అవసరం వచ్చినపుడు తగుచర్య తీసుకొనటకూ, శాసనాలను పాస్ చేసేందుకూ, రాజ్యాంగమందలి 254-వ ఆర్టికల్ పార్లమెంటుకూ కేంద్ర ప్రభుత్వానికి అధికారం ఇచ్చింది. ఈ పరిపాలనాంశాలలో ఏదైనా ఒకదాన్ని గూర్చి పార్లమెంటు చేసిన శాసనానికి, రాష్ట్ర శాసనమండలి ఆమోదించిన శాసనానికిమధ్య వైరుధ్యం, అసంబద్ధత ఏర్పడినపుడు పార్లమెంటు ఆమోదించిన శాసనమే అమలుచేసి తీరవలెనని 254-వ ఆర్టికల్ స్పష్టంగా చెబుతోంది.

4. రెసిడ్యుయరీ అధికారాలు : రాజ్యాంగంలోని 248-వ ఆర్టికల్ ప్రకారం, పార్లమెంటు అధికారాలు ఇంకా విస్తరించబడ్డాయి. రాష్ట్రలిస్టులోగాని, కంకరెంటు లిస్టులోగాని ఉల్లేఖించబడని ఏ అంశంలోనైనా, అవసరమగు శాసనాన్ని పాస్ చేసేందుకు పార్లమెంటుకు అసాధారణాధికారం ఇవ్వబడింది. రాజ్యాంగ పరిభాషలో చెప్పాలంటే, శేషించిన శాసన నిర్మాణాధికారాన్ని (Res duary Powers.) కేంద్రప్రభుత్వానికి ఇవ్వబడ్డాయి. కాబట్టి మన రాజ్యాంగం ప్రవేశపెట్టిన పద్ధతి అమెరికా, స్విట్జర్‌లాండ్, కెనడా, ఆస్ట్రేలియావంటి దేశాల్లో ఉన్న ఫెడరల్ విధానం కాదు. మనది, ఫెడరల్ రాజ్యాంగపు మూసలోపోయబడిన యూనిటరీ రాజ్యాంగ విధానం. మనదేశంలో రాష్ట్రప్రభుత్వాం

కంటె కేంద్రప్రభుత్వానికే అసాధారణాధికారాలు ఇవ్వబడ్డాయి. అంచేతనే 245, 246 248 249, 254, 256. 352, 355, 356 ఆర్టికల్సు కేంద్రప్రభుత్వం యొక్క తారస్థాయి నందుకొన్న అపారమగు అధికారకేంద్రీకరణను స్పష్టంగా చాటిచెప్పుతున్నాయి. కేంద్రప్రభుత్వ అధికార కేంద్రీకరణముందు రాష్ట్రీయ, స్వపరిపాలనా స్వాతంత్ర్యం రాహువు మింగిన సూర్యబింబంలా వెలవెల పోతుంది. పేరుకు రాష్ట్రాలున్నా, అన్ని ఫెడరల్ స్టేట్సులలో, రాష్ట్రాలకు ఎలాంటి స్వపరిపాలనా హక్కు ఉంటుందో, అలాంటిది మన రాజ్యాంగంలో విదశలోనూ, రంగంలోనూ, అంశంలోనూ, అధికారంలోనూ కన్పించదు. అందుకనే మనది, కేంద్రీకృత ప్రజాస్వామ్యమని రాజ్యాంగనిపుణులు వ్యవహరించారు. భారతదేశ ఐక్యత; విభిన్నమతాల, తెగల, జాతుల, వర్ణాల, వునికివల్ల, అంత పటిష్టంగా లేదని, చారిత్రకానుభవమే చాటి చెప్పుతోంది. విచ్ఛిన్నకర పోకడలవల్లా, భారతజాతీయైక్యము అంత బలవత్తరంగా లేనందువల్లా వుత్పన్నమయ్యే అనర్థాఫలితంగా ఎలాంటి వుపద్రవం లేకుండా వుండేందుకు, కేంద్రప్రభుత్వ హస్తాల్లో యింతటి అపారమగు అధికారం వుంచడం జరిగింది.

రాష్ట్రాలలో క్లిష్ట పరిస్థితులుగానీ, అసాధారణ పరిస్థితులుగానీ వుత్పన్నమైనప్పుడు, రాజ్యాంగం కేంద్రప్రభుత్వానికి విపరీతమగు అధికారాలను యిచ్చింది. 352 వ ఆర్టికల్ ప్రకారం, యుద్ధం వల్లగానీ, బహిర్గత దురాక్రమణ, అంతర్గత కల్లోలాలవల్లగానీ, ఇండియన్ యూనియన్, లేదా దానియందలి ఏ భాగంలోనైనా శాంతిభద్రతలకు ప్రమాదంకలిగే విపరీత విపత్కర పరిస్థితులు ఏర్పడ్డాయని రాష్ట్రపతి నమ్మినయెడల, అలాగని ప్రకటన చేయవచ్చు. ఈ అసాధారణ పరిస్థితియొక్క కాలపరిమితి రెండు మాసాల పర్యంతం వుండవచ్చు; లేదా కేంద్రప్రభుత్వం యీ వ్యవధిని యింకా పొడిగించవచ్చు. ఈ సమయమందు, రాష్ట్ర ఆర్థిక వనరులతో సహా, ప్రభుత్వాన్నికూడా సస్పెండు చేయవచ్చు రాష్ట్రపతి. ప్రభుత్వాధికారాన్ని స్వాధీనం చేసికొని, కేంద్రప్రభుత్వ మంత్రులద్వారా పరిపాలన సాగించును. ఈ విధంగానే, పార్లమెంటు రాష్ట్ర శాసనసభాధికారాలను స్వాధీనం చేసుకొంటుంది. 355 వ ఆర్టికల్ ప్రకారం రాష్ట్రానికి బహిర్గత, అంతర్గత ప్రమాదం ఏర్పడినప్పుడు రాష్ట్రాన్ని కాపాడవలసిన బాధ్యతా, దానికి కావలసిన అవసర సహాయం అందజేయవలసిన కర్తవ్యమూ, కేంద్రానికుంది. రాజ్యాంగం ప్రకారం రాష్ట్రప్రభుత్వం వ్యవహరించేటట్లుగా, చూడవలసిన బాధ్యతకూడా కేంద్రానికుంది 356 వ ఆర్టికల్ ప్రకారం, రాష్ట్రంలో రాజ్యాంగయంత్రం భగ్నమైనప్పుడు, రాజ్యాంగం ప్రకారం, ప్రభుత్వపరిపాలన కొనసాగించలేని పరిస్థితులు ఏర్పడ్డప్పుడు, రాష్ట్రపతి, శాసనమండలినీ, రాష్ట్రమంత్రివర్గాన్ని రద్దుచేయవచ్చు. ఇంతటి అసాధారణాధికారాలు, రాష్ట్రపతికి యివ్వబడినప్పటికీ. ఆయన కేంద్రమంత్రివర్గాన్ని ఎప్పటికప్పుడు సంప్రదించి, అది తృప్తిచెందినప్పుడే, యీ అధికారాలను వినియోగిస్తాడు. ఎందుకంటే ఆయన బ్రిటిష్ రాజ్యాధినేత మాత్రమే కాబట్టి ఐతే, వ్యక్తిగతహోదాలో, మంత్రివర్గ యిష్టాయిష్టాలతో సంబంధంలేకుండా యీ అధికారాలు చెలాయిస్తే, పదవినుండి బయటకు రావలసి వుంటుంది.

## రాజ్యాంగ సవరణలు

సవరణలు లేని, సవరణలకు వకాశం యివ్వని రాజ్యాంగం అసలు రాజ్యాంగమే అనిపించుకోదు. అలాంటిది ప్రపంచ రాజ్యాంగాల చరిత్రలోనే యింతవరకు లేదు. సవరణలకు వీలివ్వని, అవకాశం కల్పించబడని, రాజ్యాంగం ప్రవహించని మురికికాలవలాంటిది. పారక నిలచిపోయినయెడల దుర్గంధపూరితమైనట్లే, మారుతున్న పరిస్థితుల కనుగుణ్యంగా ప్రజాశ్రేయస్సుదృష్ట్యా మారని, మారలేని రాజ్యాంగం కాలగర్భంలో కలసిపోవడం తథ్యం. దానికి ఎదుగూ బొదుగూ వుండదు. మారలేని రాజ్యాంగం ప్రకారం పరిపాలింపబడే ప్రజల పురోగతి అడ్డంగా కితవడక నడుస్తుంది. ఎంత దూరదృష్టితో రాజ్యాంగచట్టం రచన చేయబడినప్పటికీ, అవ్యక్త భవిష్యత్తులో సంభవించు మార్పుల కన్నిటికి అనుగుణ్యంగా దానిలో ఏర్పాటులుండజాలవు అంచేతనే, అవసరపరిస్థితులేర్పడినప్పుడు సర్దుబాటులు చేసికొనడానికి సిద్ధపడాలి. అలాకాక ప్రజాభ్యుదయంతో పాటు, అడుగులో అడుగు వేయలేని రాజ్యాంగ చట్టానికి వ్యతిరేకంగా జనత తిరుగుబాటు చేస్తుంది. అది వారి పొరపాటు కాదు; అంతకన్నా గ్రహపాటూ కాదు. మారిన పరిస్థితులనూ, ప్రజల ప్రగతిని దృష్టిలో వుంచుకొని, కాలానుగుణ్యంగా చేసుకొనే సర్దుబాటులనే రాజ్యాంగ సవరణలని అంటాము అలా అని చీటికి మాటికి రాజ్యాంగ సూత్రాలను సవరించేందుకు యత్నించడం, వివేకలక్షణం కాదు.

ఈ చట్టం దేశంయొక్క అత్యంత ప్రధానమగు శాసనం (Fundamental Law of the Land). అది దేశంలోని ప్రజల స్వాతంత్ర్య హక్కుల్ని, ప్రజాతంత్ర సంస్థల కర్తవ్యాలనూ, నిర్వచించి వాటి వునికికి, అసలుకు భద్రత చేకూర్చుతుంది. కాబట్టి, పాలకుల చిత్తం వచ్చినట్లుగానీ, లేదా దేశంలోని అత్యంత శక్తివంతమగు ఒక వ్యక్తి లేక రాజకీయ పార్టీయొక్క తాత్కాలిక ఆవేశకావేశాలకీ, చిత్తవికారాలకీ, సంకుచిత స్వార్థప్రయోజనాల సాధనకీ, లోనై రాజ్యాంగచట్టాన్ని సవరింప యత్నించడం, ఆ చట్టం మూలసూత్రోల్లంఘనమే గాక, ప్రజాతంత్ర జీవితవిధాన పరిసమాప్తికీ, దారుణ నియంతృత్వ స్థాపనకీ మార్గం సుగమం చేయబడుతుంది అంచేతనే, రాజ్యాంగ చట్టం సవరణ వీలైనంత కష్టసాధ్యంగానూ, ఆలస్యమయ్యేటట్లూ ఏర్పరచబడుతుంది.

అమెరికన్ రాజ్యాంగంలోని ఏ భాగాన్నైనా సవరించుటకు బహుదీర్ఘమై అత్యధిక శ్రమప్రయాసతో కూడిన ప్రొసీజర్ అవసరం. కాని స్విట్జర్లాండులోగానీ, బ్రిటనులో గాని రాజ్యాంగ సవరణ యింతటి వ్యయప్రయాసలతో కూడినది కాదు సాధారణ శాసనాన్ని ఎలా పాస్ చేయవచ్చో, అలాగే రాజ్యాంగాన్ని సవరించవచ్చు

అదేవిధంగానే మనదేశంలో కూడా రాజ్యాంగాన్ని సవరించడం సులభసాధ్యమే. 368 వ ఆర్టికల్ ప్రకారం, పార్లమెంటు ఉభయ సభలలోని, ఏ సభ నుండైనా, రాజ్యాంగాన్ని సవరించేందుకు ఒక బిల్లును ప్రవేశపెట్టాలి ఈ బిల్లు ప్రతి సభలోనూ దానియందలి మొత్తం సభ్యులలో అధికసంఖ్యచేతనూ, హాజరై ఓటు చేసే సభ్యుల్లో, మూడింట రెండువంతులకు తక్కువగాని సభ్యుల అధిక సంఖ్యచేతనూ, ఆమోదింపబడినప్పుడు బిల్లు రాష్ట్రపతి ఆమోదం కోసం పంపబడుతుంది; పిదప బిల్లులో నిబంధనల ప్రకారం రాజ్యాంగం సవరింపబడుతుంది.

రాజ్యాంగ సవరణ యింత సులభసాధ్యంగా చేయబడింది గాబట్టే చట్టం అమల్లోకి వచ్చి నాలుగు సంవత్సరాల అనంతరం, నాలుగు సవరణలు ప్రతిపాదింపబడ్డాయి ఐతే, రాష్ట్రపతి ఎన్నిక, కేంద్రరాష్ట్రప్రభుత్వ కార్యనిర్వాహక అధికారాలు; హైకోర్టు సుప్రీంకోర్టులు; కేంద్రం రాష్ట్రాలమధ్యనుండే సంబంధ బాంధ

వ్యాలు; పరిపాలనాంశాలకు సంబంధించిన జాబితాలలోని అర్టికల్సు; పార్లమెంటులో రాష్ట్రాల ప్రాతినిధ్యం; రాజ్యాంగ సవరణలు, లాంటి అత్యంత ప్రధానమగు రాజ్యాంగ మూలసూత్రాలను సంబంధించిన - 54 55, 75, 162, 241, యిత్యాది ఆర్టికల్సును సవరణ తేయదలచుకొన్న యెడల, మొదటి షెడ్యూలులో పేర్కొనబడ్డ పెద్ద రాష్ట్రాలలో సగానికి తక్కువగాకుండా, ఆయా రాష్ట్ర లెజిస్లేచరులు ఆ సవరణను పాస్ చేయవలసివుంటుంది. అప్పుడే ఆ బిల్లు రాష్ట్రపతి, ఆమోదంకోసం పంపబడుతుంది.

రాజ్యాంగం అమల్లోకి వచ్చిన ఒక్క సంవత్సరం అనంతరమే, 15వ ఆర్టికల్ కు సవరణ పాస్ చేయబడింది. మద్రాసు రాష్ట్రప్రభుత్వానికీ, చంపకం దొరై రాజన్ కీ మధ్య జరిగిన దావాలో, ప్రభుత్వానికి వ్యతిరేకంగా సుప్రీంకోర్టు తీర్పునిచ్చినందువల్ల. 15వ ఆర్టికల్ కు సవరణ ఆమోదించడం జరిగింది ఈ సవరణ, 15వ ఆర్టికల్ ను సవరించి, అస్పృశ్యులు, ఆదిమజాతులు, షెడ్యూలుడు కులాలు, జాతులు, మున్నగు వెనకబడిన వర్గాల నుద్ధరించేందుకై ఒక ప్రత్యేక సదుపాయాన్ని చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వాలకి అధికారమిచ్చింది ఇదే సంవత్సరంలో చేయబడ్డ మరో సవరణ, 31వ ఆర్టికల్ కు అదనంగా 31-ఎ; 31-బి; అని మరో రెండు ఆర్టికల్సును కలిపింది. 1952 లో పాస్ చేయబడ్డ రెండవ రాజ్యాంగ సవరణ జనాభాలోని ప్రతి ఒక 5,00,000 మందికి ఒక సభ్యునికంటె అధికం వుండరాదని, శాసించింది 1954 లో చేయబడ్డ మూడో సవరణ, జాతీయ శక్తి ప్రయోజనార్థం, ఎంతకాలం కోరితే, అంతకాలంపాటు కొన్ని సరుకులను కంట్రోల్ చేసే అధికారం, కేంద్ర ప్రభుత్వానికి యివ్వబడింది. 1955 సంవత్సరంలో, 32వ ఆర్టికల్ కి సవరణ ఆమోదించబడింది. ప్రజాక్షేమం దృష్ట్యా ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తుల ఆస్తిని స్వాధీనపరచుకొంటే అట్టి ఆస్తి హక్కుదారులకు యివ్వవలసిన నష్టపరిహారం గూర్చి యుక్తాయుక్త విచారణ చేసేందుకు, ఈ సవరణద్వారా ప్రభుత్వాని అధికారం యివ్వబడింది. ఇదే సంవత్సరంలో పాస్ కాబడిన మరో సవరణద్వారా, పదాల మార్పుతో రాయబడిన 31 ఆర్టికల్, పాత ఆర్టికల్ కు బదులుగా ఏర్పాటుచేయబడింది. రాష్ట్రప్రభుత్వాలు స్వయంగా చేయదలచుకొన్న ఏ రకమైన వ్యాపార రంగాలలో గుత్తాధిపత్యాన్ని (State trading) కలిగి వుండేందుకు, ఈ సవరణ వీలు కలుగజేసింది. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వానికీ సాఘీర్ అహమ్మదుకీ జరిగిన దావాలో ప్రభుత్వం ఓడిపోయింది. అందుచేత పార్లమెంటు యీ సవరణను ఆమోదించవలసి వచ్చింది. ఇది సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పుయొక్క ప్రభావాన్ని అంతమొందించుటకై వుద్దేశింపబడింది పాత ఆర్టికల్ ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం ఏ వ్యాపారంలోనైనా, గుత్తాధిపత్యాన్ని కలిగివుండేందుకు వీల్లేదు. ఎందుచేతంటే, రాజ్యాంగమందలి పాత ఆర్టికల్, స్వేచ్ఛా వ్యాపారానికి హామీ నిచ్చింది కాని. ఈ సవరణద్వారా వ్యాపారరంగంలోని స్వేచ్ఛ అంతమొందింపబడింది.

సంపద. వాణిజ్యం, ఉద్యోగం, వృత్తి యిత్యాది విషయాలలో, రాజ్యాంగంలో పేర్కొనబడ్డ మూలసూత్రాలు యథాతథంగా అమలుజరపబడాలని; మొట్టమొదటిసారిగా భారత రాజ్యాంగం ప్రసాదించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పునరుద్ధరింపబడాలనీ అందుకు. తమ పార్టీ వొత్తిడి చేస్తుందనీ. స్వాతంత్రపార్టీ నాయకులైన రాజాజీ, రంగాలు అంటున్నారు. రాజ్యాంగంలోని 31వ ఆర్టికల్ ప్రకారం ఆస్తి సంపాదన విషయంలో చట్టంద్వారా నిర్ణయింపబడిన నష్టపరిహారం సమగ్రమైనదిగా వుందనీ. దాని తరువాత చేయబడిన సవరణాలు తిరాశయాన్ని భిగ్నం చేశాయనీ, వీరు ప్రచారం చేస్తున్నారు. నవభారత రాజ్యాంగం ఆమోదించిన ప్రగతిశీలమగు కనీస సవరణను సైతం, వీరు అంగీకరించక స్వేచ్ఛావ్యాపారాన్ని పునరుద్ధరించాలని ప్రయత్నిస్తున్నారు అయితే ప్రధాని శ్రీ నెహ్రూ మాత్రం స్వేచ్ఛావ్యాపారం పేరిట స్వైర విహారాన్ని తాను సహించనని చెప్పారు

భారత ప్రజల భవిష్యత్తూ సౌభాగ్యం, నవభారత రాజ్యాంగ చట్ట భద్రతపైనా. దాని క్రమాభివృద్ధిపైనా, ఆధారపడి వుంది. రాజ్యాంగం, పౌరులకు హక్కులూ అధికారాలు యివ్వడంతో పాటు విధులనూ బాధ్యతలనూ గూడా వొప్పగించింది కొట్టి పౌరుల్ని విజ్ఞానవంతులుగానూ, చైతన్యవంతులుగానూ చేయవలసిన బాధ్యత ప్రభుత్వంపైనా, పబ్లిక్ సంస్థలపైనా ప్రధానంగా ఆధారపడివుంది భారతదేశంలోని సగం జనాభకి—17 కోట్లమందికి, వయోజన వోటింగు హక్కు యివ్వబడింది. ఇంత భారీయెత్తున, స్వాతంత్ర్యం వొచ్చినసమయంలోనే. ఏ దేశమూ తన ప్రజలకి యీ హక్కునా యివ్వలేదు. అయితే, యీ హక్కును సద్వినియోగం చేయడానికవసరమైన విజ్ఞాన వివేకాలు, దేశంలోని అత్యధిక సామాన్య జనానీకానికి యింకా అమరలేదు. లేమితో, నిరక్షరాస్యతతో వారు యింకా సతమతమవుతూనే వున్నారు. మనకి స్వరాజ్యం వచ్చినా, సురాజ్యం రాలేదు. ఈ మహోత్కృష్ట లక్ష్యసాధనకు, భారతప్రజలూ, ప్రభుత్వమూ యింకా తీవ్రతరమగు కృషిని సాధించవలసి వుంది.

వయోజన వోటింగుపద్ధతి, ఆ పద్ధతిమీద ఎన్నుకొనబడు శాసన సభ్యులు, కేంద్రరాష్ట్రాలలో, బాధ్యతాయుత ప్రభుత్వాలూ, సహేతుకమగు వ్యక్తి స్వేచ్ఛ, ప్రాథమిక హక్కులు.— యివి మన రాజ్యాంగానికి ప్రధాన పునాదులు. ఇట్టి పునాదులపై నిర్మింపబడిన ప్రజాస్వామిక భారతరాజ్యాంగాన్ని, భద్రపరచి, పరిరక్షించవలసిన బరువు బాధ్యతలు భారతపౌరుని భుజస్కంధాలపై వున్నాయి ఎందుచేతంటే, ప్రజల పౌరహక్కుల రక్షణకి, రాజ్యాంగ చట్టమే, మూలకందం. దేశమంతటి. న్యాయస్థానాలు, శాసనసభలు. రాజ్యాంగ మూలసూత్రాలు సక్రమంగా అనుసరింపబడి, అమలుపరుపబడుతున్నవో. లేదో పరిశీలిస్తూనే వుంటాయి. అయితే, ఎవరైనా వ్యక్తిగానీ, సంస్థగానీ, తన, లేక తమవల్ల రాజ్యాంగ మూలసూత్రోల్లంఘనం జరగడంద్వారా, నష్టపడి కోర్టుకు వెళ్ళినప్పుడే, కోర్టులు కలుగజేసుకొంటాయి. అంతదాకా, నిష్క్రియ నిరత్తినటు కోర్టులు కిమ్మనకుండా వుంటాయి కాబట్టి, రాజ్యాంగచట్టానికి నిరంతర రక్షణ పౌరుని అప్రమత్తతయే. కోర్టులు, శాసనసభలు, యిచ్చే రక్షణతోపాటు, పౌరుడుకూడా నిరంతర జాగరూకతతో వ్యవహరించాలి. "నిరంతర జాగరూకతయే స్వాతంత్ర్యానికి చెల్లించవలసిన మూల్యం" అని సుప్రసిద్ధ గ్రీక్ రాజనీతివేత్త, పెరిక్లస్ చెప్పిందాన్ని పౌరుడు రేయింబగలూ తనదృష్టిపథంలో వుంచుకోవాలి. రాజ్యాంగచట్ట మూలసూత్రోల్లంఘనం జరిగినప్పుడు, పత్రికలు, సభలు, సమావేశాలు, బహిరంగప్రదర్శనలవంటి చట్టబద్ధమగు ఆందోళనద్వారా అట్టి ఉల్లంఘనాన్ని శాసనసభల, ప్రభుత్వపు దృష్టికి తీసికొనిరావాలి. అప్పటికీ ఫలితం లేకపోతే, కోర్టుకు వెళ్ళడానికైనా సంసిద్ధమవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రభుత్వం చట్టబద్ధంగా ప్రవర్తించేటట్లూ, రాజ్యాంగం సక్రమంగా అమలుజేయబడేటట్లూ చూడడం పౌరునిమీదనే ప్రధానంగా ఆధారపడివుంది. చట్టవిరుద్ధమైన అరాచకానికీ, రాజ్యాంగ విరుద్ధమైన ప్రభుత్వ నిరంకుశ ప్రవర్తనకీ వ్యతిరేకంగా జాగ్రత్తపడడమే ప్రతిపౌరుని పవిత్ర విధ్యుక్త ధర్మం.

# నీరు పల్లమెరుగు.....!

శ్రీ అర్. ఎస్. సుదర్శనం

"భవాని ఉత్తరం వ్రాసింది." అంటూ ఇన్‌లాండ్ కవరు పట్టుకు వచ్చింది అనసూయ. అప్పుడే కోర్టునుంచి వచ్చిన (శివరామ)కృష్ణ కోటూ, టై విప్పుతూ, "ఏమని?" అన్నాడు. "చదవండి" అని ఉత్తరం టేబిలుమీద పెట్టి వెళ్ళబోతున్న భార్యను "ఉత్తరం నీకా నాకా?" అని ప్రశ్నించాడు. "ఇద్దరికీ అనుకోండి!...ఏమైతేనేం, అయినవాళ్లు కాకుండా పోతారా? మీరెన్నైనా చెప్పండి, భవాని నాకు నచ్చింది...ఉత్తరం చదవండి తెలుస్తుంది ఆ అమ్మాయి మంచితనం!...మీరనే చదువుకున్న గర్వం ఎక్కడా లేదు! ఊరికే ఏవేవో అంటారు!" అని లోనికి వెళ్ళింది అనసూయ.

ఆమె కాఫీ తెచ్చేలోగా ఉత్తరం సావధానంగా చదివాడు కృష్ణ. ఎం. ఎస్‌సి. చదువుకుని హైదరాబాదులో లెక్చరరు ఉద్యోగం చేస్తున్న భవాని తెలుగులో, ముద్దులొలికే ముత్యాల వ్రాతలో, అనసూయమీద ఆప్యాయతని ఒలకబోయటమా!... పోతే, ఉత్తరంలో ఎక్కడా, చిట్టచివరకూడా తన మాటేలేదు! 'బావకు నమస్కారాలు...బావను అడిగినట్లు చెప్పవలెను' అలాంటి వాక్యం ఒకటి లాంఛనప్రాయంగాకూడా ఎక్కడా వ్రాయలేదు! ఈ ఉత్తరం యిద్దరికీ వ్రాసినట్లెలా అవుతుంది? భవాని తనకు మేనమామ కూతురు; అనసూయకు ఏమీకాదు! నాలుగేళ్ళనాడు తను భవానిని వివాహం చేసుకోకపోవటంతో రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరాలు నిలిచిపోయాయి. ఇన్నాళ్ళకు, పదిహేను రోజుల క్రితం హైదరాబాదు వెళ్తూ భవాని, అత్తయ్య అనుకోకుండా తన యింటికి రావటం ఆశ్చర్యమే కలిగించింది... 'నువ్వు చేసుకోకపోతేనేం? చదువుకుని హాయిగా ఉద్యోగం చేస్తున్న నాకేం లోటులేదని' తెలియబరచటానికే భవాని అలా వచ్చిందో, లేక చేసుకున్న అనసూయలో వంకలు వెదికి వెక్కిరించటానికే వచ్చిందో అనుకున్నాడు! ... తల్లీ కూతుళ్ళు చెప్పిన కారణమాత్రం — హైదరాబాదుకు రాత్రిళ్లు ప్రయాణంచేసి రైళ్ళు వద్దాకోం అని రద్దుచేశారట; ముందు రోజు సాయంత్రం కర్నూలు చేరుకుని, ప్రొద్దుట మొదటిబండికే హైదరాబాదువెళ్తే సౌకర్యంగా వుంటుందని వాళ్ళు వచ్చారట. ఆ విధంగా, కర్నూలులో ప్రాక్టీసు పెట్టిన కృష్ణను ఎన్నాళ్ళకో చూచి వెళ్ళటానికి సందర్భం కలిగిందట!...

బాగుంది! వాళ్ళకు లేకపోతే తనకేం అభ్యంతరం? అనుకున్నాడు కృష్ణ. ఏమైనా చిన్ననాటి భవాని, ఎమ్ ఎస్ సి. భవానిగా మారిన తర్వాత ఎలావుందో చూడాలన్న కుతూహలమూ తీరింది...చమత్కారం, చొరవ, కలుపుగోలుతనం పూర్వంలేని గుణాలు భవానిలో యిప్పుడు జిగేల్ మనిపించటమేకాదు, ఆమె మాటల్లో చూపుల్లో ధ్వని, ద్వ్యర్థికూడా వున్నాయని అనుమానమూ కలిగింది!...పూర్వం, అంటే భవాని హైస్కూల్లో, తను కాలేజిలో, చదివేరోజుల్లో ఒకసారి వాళ్ల ఊరువెళ్లాడు—అప్పుడు భవానికి అసలు మాటలు రావేమో అనిపించేటంత వల్లమాలిన సిగ్గు; తప్పించుకుని పారిపోయేది. ఉన్న వారం రోజులూ ఆ అమ్మాయితో చనవుగా మాట్లాడాలని ఎన్ని ప్రయత్నాలో చేసి చివరకు ఒక్కసారి కృతార్థుడయ్యాడు — "ఏమిటీ, మాట్లాడనే మాట్లాడవ్?... పారిపోతావ!...పెళ్ళిచేసుకుంటానవా?...వుండు, నిన్ను పెళ్ళి చేసుకుని అప్పుడు చెబుతాను నీపని!..." ఇవి కృష్ణమాటలు. "పో బావా!...సిగ్గులేకపోతేసరి!...ఊఁ...అప్పుడు చూద్దాంలే!" అని భవాని జవాబు. "ఏమిటె చూసేది!...అలా అంటె యిప్పుడే పడుతుంది శిక్ష!" అంటూ తను చప్పున ముద్దుపెట్టుకోవటం, వెంటనే "అమ్మా" అని ఆ కొంటెపిల్ల కేక వేసి పారిపోవటం జరిగింది. నిజంగా అత్తయ్యతో చెబుతుందేమోనని గుండె దడదడలాడింది; కాని అలాంటి దేమీ జరగలేదు...ఆ భవాని ఆనర్స్, ఎమ్ ఎస్ సి., చదువుకోవాలని పట్టుపట్టడం, మేనమామ కట్నం ఇవ్వననటం కారణాలుగా ఆ వివాహం జరగలేదు..."నేను చదివింది బి. ఏ; భవాని ఆనర్సు పూర్తిచెయ్యాలనీ ఎమ్. ఎస్ సి. కి వెళ్ళాలని పట్టుపట్టుతూంటే, నాకు భార్య కావాలనుకోవటం లేదన్నమాట!" అని భవాన్ని తన కక్కర లేదన్నాడు. అదీగాక కృష్ణ తండ్రి అప్పటికే కట్నం కావాలని, అయినవాళ్ళూ కానివాళ్ళూ, అన్న భేదం లేకుండా సంబంధాలన్నింటినీ 'సమదృష్టి'తో పరిశీలిస్తున్నాడు. పర్యవసానం అనసూయ పదిహేనువేలతో ఆ యింటికి కోడలైంది.

అందువల్ల చదువుకున్న భవాని మారిపోయి వుంటుందనే అనుకున్నాడు కృష్ణ. కాని భవాని స్వయంగా తన యింటికి రావట మేమిటి, వచ్చిన తర్వాత వుండమంటే తీరిగ్గా రెండురోజులు వుండి వెళ్ళట మేమిటి, అనసూయను 'అక్కా' అని పిలవట మేమిటి, అన్నీ ఆశ్చర్యం కలిగించాయి. భవాని సంభాషణలో కొన్ని ధ్వనోక్తులు ఒకరకం అనుమానానికి కారణాలయ్యాయి...భవాని చిన్ననాటి సంఘటనను మరచిపోయినట్లు లేదు. బహుశా ఆమెలో కొంత విచారం వుందేమో పెళ్ళి తప్పిపోయినందుకు, అనిపించింది...ఆ ఊహ రావటమే తడవు అది క్రమంగా బలపడిపోయింది కూడా. దానికి ఆధారాలు—భవాని, పిలవకుండానే యిన్నాళ్లకు తనయింటికి రావటం, వచ్చిన తర్వాత చూపిన కలుపుగోలుతనం...భవానికి ఎంత అభిమానం, ప్రేమ లేకపోతే, స్త్రీ సహజమైన స్వాభిమానం అహంకారం అన్న అవధుల్ని దాటి అలా రాగలుగుతుంది! అహంకారం, అందులో చదువుకున్న యువతికి, ఎంతమేర వుంటుందో సులభంగానే ఊహించుకోవచ్చు. దాన్ని జయించి భవాని బావకోసం వచ్చిందంటే, ఆమె జరిగినదానికి ఎంతో పశ్చాత్తాప

వస్తూ వుండాలి!...ఈ కాలేజి ఆడపిల్లలందరూ యింతే. డిగ్రీ వస్తే ఏదో అందలమెక్కి, ఆదర్శపురుషుణ్ణి అందుకుంటామనుకుంటారు. తీరా అది వచ్చిన తర్వాత తెలుస్తుంది. ఎలా అవకాశాలు అందకే తమ మూర్ఖత్వంవల్ల చేజారిపోయాయో!...అప్పుడు కాని గ్రహించరు చదువూ, ఉద్యోగమే పరమావధులు కావని!.. భవానిలో యిటువంటి పరివర్తనే వచ్చివుండకపోతే, మళ్ళీ తనని జ్ఞాపకం తెచ్చుకుంటుందా? తన యింటికి వస్తుందా? పెద్దగా చదువుకోని అనసూయ నెందుకు పట్టుకొని 'అక్కా' అంటూ తిరుగుతుందా?...మళ్ళీ ఇద్దరూ ఇంచుమించు సమవయస్కులే!...

అయితే భవాని అనసూయపట్ల ఈర్ష్య, అసూయ కొంచమైన వ్యక్తం చేయటం లేదేమిటి? పైగా పూసుకు తిరగట వల్ల లాభమేమిటి? అన్న సందేహం కలిగింది. కృష్ణకు దానికి సమాధానం- పరిస్థితులు అలావున్నాయి బావ పరాయివాడైపోయాడు; యిప్పుడు బావతో సరాగాలాడటం ప్రారంభిస్తే ఏమనుకుంటాడో? ఆ అనుమానం వస్తే అనసూయ మళ్ళీ గుమ్మం తొక్కనిస్తుందా? అందువల్ల, తన ప్రేమ నిర్భయంగా ఏదో సూక్ష్మమార్గంలో ధ్వనిపూర్వకంగా చమత్కారంగా వ్యక్తం చెయ్యగలిగింది భవాని! అందుకే [illegible]క్తులు! ఆడవాళ్ళు యిటువంటి విషయాల్లో చతురలు ఇక చదువుకున్న భవానిలో ప్రజ్ఞకు లోటులేదు! తనకు భవాని యిప్పుడు పూర్తిగా అర్థమౌతోంది అనుకున్నాడు కృష్ణ.

కుర్చీలో నిటారుగా కూర్చుని, టేబిలుమీదవున్న ఉత్తరం మళ్ళీ తీసి పరీక్షించాడు.

ఉత్తరాన్ని జాగ్రత్తగా అనసూయ పేర వ్రాస్తూ, అనసూయకు ఆసక్తివుండే విషయాలతో లేఖ నింపింది భవాని! అందులో ఎక్కడా బావనుద్దేశించిన వాక్యం లేదు కాని చివర చిట్టిబాబును గూర్చి వ్రాసిన వాక్యాల్లో ఒక విశేషం వుంది.

"...బాబు మాటలు ఎప్పుడూ జ్ఞాపకం తెచ్చుకుంటూ వుంటాను....నీతో బాగా ఆడుకుంటున్నాడా? నిన్ను అల్లరి పెడుతున్నాడా? బాబకు నా ముద్దులు..."

చివరి వాక్యంలో 'బాబు'కు బదులు 'బాబ' అని వ్రాయటం అప్రయత్నపూర్వకమైన పొరపాటా? లేక మనసులోనుంచి తెలీకుండానే ఊడిపడిందా? 'బాబ' అంటే 'బావ' అనేగా ఉద్దేశ్యం? లేకపోతే యీ 'పొరపాటు' జాగ్రత్తగా వ్రాసిన ఉత్తరంలో ఎందుకు వస్తుంది? ఈ ఉత్తరం ఎలాగూ అనసూయ తనకు చూపిస్తుందని భవానికి తెలుసు; అందులో వ్రాసిన ఉలెన్‌వాక్కో మైనా చూపించి తీరుతుంది! అంతమాత్రం 'గ్యారంటీ' కూడానే వుంది ఆ ఉత్తరంలో!.

కృష్ణ ఉత్తరం చూస్తూవుండగానే అనసూయ టిఫిన్ కాఫీ తెచ్చి "ఆ అదేమిటి యింతసేపూ చదువుతూనే వున్నారా ఉత్తరం! ఏమిటో అంత ఆశ్చర్యం అందులో?" అన్నది.

"ఆశ్చర్యం ఏమీ లేదు!" అంటూ ఉత్తరం మడిచి, టేబిలు మీదకి గిరవాటువేసి లేచాడు కృష్ణ.

"ఆశ్చర్యం కాకపోతే, కాబోలు ముఖం కడుక్కోకుండా అలా కూర్చుండిపోయారేమిటి యింతసేపూ?" అన్నదామె.

కృష్ణ బాత్‌రూమువైపు వెళ్ళిపోయాడు.

భర్త టిఫిన్ తీసుకుంటూ వుండగా అనసూయ అన్నది.

"ఉత్తరం చదివారు కదా, మరి ఊలు ఎప్పుడు తెచ్చి పెడతారు?"

"ఎందుకూ దండగ? ఎంతసేపూ బాబును చూచుకోవటంతో నావైపు చూట్టానికే తీరటంలేదు నీకు! మళ్ళీ యిదొకటి!"

"నమూనాలు పంపిస్తుందిట; బాబుకు ఒక స్వెటర్, మఫ్లర్ అల్లుకోవాలి."

"ఏం చేసుకోను? మనమేం ఇంగ్లండులోగాని, ఊటీలోగాని లేముగా! ఇదొక పెద్ద క్రేజ్ గా తయారైంది...ఇంగ్లీషు, అమెరికన్ ఆడవాళ్లు చేస్తారంటే అది ఆ దేశాల్లో అవసరం; వాళ్ళకు పొదుపూ జరుగుతుంది మనకు అనవసరం. అలవాటు లేనివి తయారుచేస్తూ కూచోవటం దుబ్బుదండగ! ఎప్పుడైనా కావలిస్తే శుభ్రంగా కొనుక్కోవచ్చు! ఈ కర్నూలులో స్వెట్టర్ వాడుకునే దెప్పుడు?"

"మీ ఉలెన్‌సూట్లు మాటేమిటి?"

"అవి దర్జాకోసం! నీ అల్లికంతా అర్థంలేని క్రేజ్."

"పోనీలెండి; యింటిలో నూరూ వేలూ ఖర్చైపోవటంలేదు గాని, ఆ ఊలుమాత్రం తెచ్చి పెట్టండి."

"చుట్టపుచూపుగా వచ్చి మంచిగొడవే తెచ్చిపెట్టిందే యీ భవాని!"

"భవానిమీద మీకంత కోపం దేనికండీ?...మిమ్మల్ని చేసుకోలేదనేనా?" అన్నది నవ్వుతూ అనసూయ.

"పాపం, చాల పొరపాటు పడుతున్నావ్! ఎం. ఎస్‌సి. చదవగానే ఏదో పెద్ద దేవతలా కనిపిస్తోంది నీకంటికి. మేమంతా కేవలం మానవమాత్రులం అందుకే ఆ దేవతకు యింకా సరియైన దేవుడు దొరక్క దేవుళ్ళాడుతూ వుంది."

"అవును, తొందరేం? వచ్చినవాణ్నే చేసుకుంటుంది!"

"తొందరేం! ఒక జీవితకాలం అంతా నిరీక్షిస్తూ వుండవచ్చు"

"పోనీ మీ రెక్కడైనా చూడండి సంబంధం."

"ఇది మరీ బావుంది! నువ్విప్పుడు కోరుకున్న దానికంటె యిందాకటి కోరికే నయంగావుంది. ఆ ఊలు ఏదో తెచ్చిపెట్టనేను తప్పించుకుంటా; తర్వాత నువ్వూ భవానీ ఏమైనా అవండి నాకెందుకు?"

బజారువైపు బయలుదేరి వెళ్ళాడు కృష్ణ.

వెళ్ళాడే గాని ఊలు కొనాలనిపించలేదు. ఒంటరిగా షికారు వెళ్ళాడు

బావకు ముద్దులు—అన్న మాట మనస్సులో మెరుస్తూ తియ్యని ఉద్వేగానికి కారణమౌతోంది...నిజమే, ఆరోజుల్లో భవాన్ని తను ప్రేమించాడు, భవాని కూడా తన్ను ప్రేమించింది. ఇష్టం లేకపోతే "అమ్మో" అంటూ పారిపోయి తల్లితో చెప్పకుండా ఎందుకు ఊరుకుంటుంది? ఇద్దరికీ అది అనుభవం చాలని రోజులు; భవాని చదువు ముఖ్యమని, లేక తనమీద పంతం నెగ్గాలనీ అప్పుడా ధోరణి అవలంబించింది, భవాని పట్టుపట్టివుంటే మామయ్య కట్నం యిచ్చి

వుంటేవాడు; ఆయనకు నవలోపం ఏమీలేదు! అవకాశం దాటి పోయినతర్వాత గాని అనుబంధ మెటువంటిదో తెలిసిరాలేదు. ఇప్పుడు తెలిసిమాత్రం భవాని ఏం చేస్తుంది? భవాని దురదృష్టవంతురాలు, తనూ దురదృష్టవంతుడే! తన మనస్సేమిటో తనూ తెలుసుకోలేదు! అంత పట్టుదలమీద వివాహం చేసిన తండ్రీ బావుకున్న దమీ లేదు; ఏడాదైనా పూర్తిగా గడవకముందే యీ లోకంనుంచి దాటుకున్నాడు...

అసలు వివాహానుబంధం మనస్సులన్నీ, ఆత్మలన్నీ ముడివేసే బంధం; దానికి భౌతికమైన, శారీరకమైన ఆకర్షణలు, ప్రేరేపణలు కేవలం దోహదాలుమాత్రమే. అనసూయమీద పెళ్ళయిన కొత్తలో తనకెంత మమకారం! అదంతా ఇప్పు డేమైపోయినట్టు? ఇద్దరు పిల్లలు కలగటంతో కల కరిగిపోయింది! పెద్దపిల్ల అమ్మమ్మదగ్గర ఉంచబట్టి కాని లేకపోతే ఇల్లు సాక్షాత్తు నరకమే!...

"ఎప్పుడైనా హైదరాబాదు వస్తే రా నాయనా!" అన్నది అత్తయ్య బండెక్కుతూ. భవాని తననోటితో అనవలసినమాట నే తల్లి ద్వారా అనిపించింది! అవును ఎలా అంటుంది?

తనొకసారి హైదరాబాదు వెళ్ళవస్తే! వెళ్ళితే భవానితో తీరిగ్గా మాట్లాడటానికి, భవాని మనస్సు తెలుసుకోవటానికి అవకాశం వుంటుంది...

తెలుసుకొని ఏం జెయ్యాలి?...ఏం జెయ్యాలి? తెలుసుకోవటం దానికదె సార్థకం...సౌందర్యాన్ని ఆరాధించటం, ప్రేమ అన్న అనుభూతి—ఇవి ఎరుగని జీవితం ఒక ఎడారి; కేవలం శూన్యం! ఏమైనాసరె ఈ సందిగ్ధం తీర్చుకోవాలి; యదార్థమేమిటో తెలుసుకోవాలి! వీలైతే భవానితో హృదయం విప్పి నిష్కల్మషంగా చెబుతాడు—తన ప్రేమ ఎంత ఉదాత్తమైనదో! ప్రేమించుకున్నవాళ్ళందరూ పెళ్ళి చేసుకోలేరు; మానవలోక చరిత్రలో ఎక్కడా కనిపించే విషాదమే అది; క్రొత్తేమీ కాదు! దాని కెవరేం చెయ్యగలరు? కాని సందిగ్ధావస్థలో పతిమతి మనటం కన్న ప్రేమికులు ఒకరిహృదయా న్నొకరు తెలుసుకోవటంమంచిది అందులో తప్పులేదు; ఒక సంతృప్తివుంది!...తీరని కోరికల బరువుమోసే భవాని హృదయానికి కొంత తేలిక చేకూర్చినట్లవుతుంది. అంతమాత్రం చేయటం తనధర్మం! భవాని స్వాభిమానమున్నది దిగమ్రింగి తనకోసం ప్రయాణమై వచ్చినపుడు తను వాళ్ళ యింటికి వెళ్ళటం, అది తనకు విధాయకమే!...

కృష్ణ ఇల్లుచేరుకోగానే అనసూయ "టోలు తెచ్చారా?" అని ప్రశ్నించింది.

'లేదు, మంచిది దొరకలేదు...అయినా తలుచుకోగానే తతెస్తే? నాలుగురోజులు ఆలస్యం అయితే ఏం పోతుంది? నేను ఇల్లండి కోర్టుపనిమీద హైదరాబాదు వెళ్ళవలసి ఉంటుందని వెంకట్రామయ్యగారు క్లబ్బులో కనిపించి అన్నారు. అలా వెళ్లేట ట్లయితే అక్కడినుంచే తెచ్చుకోవచ్చు."

"అయితే భవానికూడా సమాచారాలు ఇస్తుంది లెండి; భలే కుదిరింది మీ ప్రయాణం!"

ఏం! చాలా సంతోషిస్తున్నావే? హైదరాబాదుకు వెళ్తున్నాను గాని, భవానిని చూడటానికి కాదుగా!"

"ఇహ చాలెండి!...సరాసరి వాళ్ళింటికే వెళ్ళండి!...ఒక వేళ మీ పనులవల్ల అలా వీలుపడకపోతే తప్పకుండా తీరిక చేసుకొని వాళ్ళనొకసారి పలకరించి రావాలండి! వాళ్లు మనింటికి వచ్చినప్పుడు మనమూ వెళ్ళటం బావుంటుంది...మీ రిలా మెచ్చులుపోవట మేం బాగులేదు!" అన్నది మందలింపుగా అనసూయ.

"అబ్బ! అన్ని బాగోగులూ నీకే తెలిసినట్టు మాట్లాడుతావే!" అన్నాడు కృష్ణ.

*    *    *

కృష్ణ మనస్సు ఉక్కిరిబిక్కిరవుతోంది. ఎన్నోరకాలైన సంభావణలు—తనకూ భవానికీ—హృదయాలు విప్పి చెప్పుకునే మాటలు...అందులో విషాదం లిప్తమై, గంభీరమూ ఉదాత్తమూ అయిన పరస్పర సాన్నిహిత్యభావం...సంఘం యిద్దరిమధ్యా తెచ్చిపెట్టిన కృత్రిమమైన ఎడబాటు......ఆ అనుభూతిని ఎన్నో విధాల ఊహించుకొని హృదయంలో యిముడ్చుకోలేక, పిచ్చిగా యిటు అటూ తిరుగుతున్నాడు, ఆలస్యంచేస్తున్న రైలుకోసం ఎదురుచూస్తూ కృష్ణ.. అరగంట ఆలస్యం అనేకయుగాలుగా వుంది...

"బావా!" అంటుంది భవాని దీనంగా, ఆర్ద్రంగా, తనకుండె చీలుస్తున్నట్టు...'ఏంచెయ్యను, భవానీ! ఇది విధి'"...బహుశా తను ఆమె హస్తాన్ని ప్రేమతో స్పృశిస్తాడు; గాజుల్ని కదిలిస్తాడు; అందులో అసభ్యమైన ఉద్దేశ్యం ఏమీలేదు! . అలాకాదు—భవాని కన్నీళ్ళు చూడలేక ఆమె చెంపల్ని మృదువుగా తాకుతాడు; ముత్యాలవంటి అశ్రువుల్ని తనగోటితో సంగ్రహిస్తాడు!...

"ఈ సంఘాన్ని, యీ లోకాన్ని వదలి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోదాం బావా!.." అంటుంది భవాని. "పిచ్చి భవానీ! ఎక్కడికి వెళ్తాం చెప్పు? లోకం మనల్ని అంత సులభంగా వదలిపెడుతుందా? భ్రమ! గుమ్మెత్తిపోస్తుంది...వెంటాడుతుంది..."—సంప్రదాయం గవర్నమెంటు నేసిన చట్టం వుండనేవుంది; ఎక్కడికి తప్పించుకొనిపోవటం?...

"ఆంధ్ర వారపత్రిక, సార్" అన్నాడు పత్రికలమ్మే కుర్రవాడు. కృష్ణ వాడివైపు కోపంగా చూచి "వద్దు" అన్నాడు. . వాడు వెళ్ళగానే పశ్చాత్తాపంతో 'నిజమే. ఏదైనా పుస్తకం వుంటే బావుంటేది!' అనిపించి బుక్ స్టాలువైపు వెళ్ళాడు. కాని నచ్చిన పుస్తకమేదీ దొరకలేదు ..

"ప్రయాణంమీదే వచ్చినట్టున్నారు? ఎందాక? హైదరాబాదేనా?" అప్పుడే ప్లాట్ ఫారంమీద ప్రవేశించిన—సుబ్బారావు పలకరించాడు

"అవును."

" ఏమిటి విశేషం? కోర్టుపనిమీదేనా?"

"కాదు! పర్సనల్ ...అంటే ఏమీలేదు, మా అత్తయ్యకు జబ్బుచేసిందట; వెళ్ళొకసారి చూచి వద్దామని..."

"అంటే మేనత్తేనా?"

ఒ అరక్షణం సందేహించి "అవును" అన్నాడు కృష్ణ. మరి మేనమామ భార్య మేనత్త కాకేమౌతుంది?

సుబ్బారావు ప్రారంభించిన బాతాఖానీ, రాత్రి ఎనిమిదింటికి కాఫీకూడా సెపర్ వచ్చేదాకా ఎక్కడా ఆగలేదు.

"ఇంకా నయం, కోర్టుపని అని అడగ్గానే చెప్పలేదు; తన వెంట రమ్మని పీడించేవాడు" అనుకుంటూ రిక్షాచేసుకుని బయలు దేరాడు కృష్ణ, భవాని అడ్రెసు వెతుక్కుంటూ...

భోజనంచేసి గదిలో కూర్చున్నతర్వాత భవాని అడిగింది: "ఏం బావా! ఒక్కడివే వచ్చావు; అనసూయను కూడా తీసుకు రాలేకపోయావా?" ...అక్కయ్య అనకుండా, అనసూయ అంటోంది భవాని!

"రెండు రోజుల పనిమీద వచ్చాను, ఎలా వీలౌతుంది చెప్పు?...నువ్వు వ్రాసిన ఉత్తరం మొన్నటి రోజు చేరింది, చూశాను..." అర్థాంతంగా అందించాడు.

"బాబు ఏంచేస్తున్నాడు? బాగా అల్లరిచేస్తున్నాడా?" అన్నది సుముఖంగా చిరునవ్వుతో భవాని

"మొత్తానికి నీకు చాలా ఫేవరిట్ అయినట్లున్నాడు...అదృష్ట వంతుడే!"

"అవును ఫేవరిట్టే మరి!...ఏం కాకూడదా?.. పోనీ వాణ్ణైనా వెంట తీసుకురాకూడదూ! ఎంతో ముద్దుగా వుంటాడు నాదగ్గర...మళ్ళీ నువ్వెళ్ళేప్పుడు అప్పజెప్పేదాన్ని."

"వాడు అలా వస్తాడా? మళ్ళీ నువ్వే ఎప్పుడో ఒకసారి వాణ్ణి చూడటానికి రావాల్సిందే!"

"అంటే వాళ్ళ నాన్నబుద్ధే వచ్చిందేమిటి వాడికి!...ఇంకా తల్లిపోలిక కాబోలు అనుకుంటున్నా!"

"బహుశా అందులో కొన్ని నీ పోలికలూ.."

"ఏం? నా మంచితనం ఎవరికైనా రావలసిన గుణమే! నేను మంచిదాన్ని కాబట్టే మళ్ళీ మీ యింటికి రావటం జరిగింది..."

"నేను కాదనటంలేదు భవానీ!...అందుకనే నేనూ యిలా రావటం..."

'పోనీ బావా! గతాన్ని మరచిపోదాం...All's well that ends well అంటారు."

* * *

ప్రొద్దున తొమ్మిదిన్నరకు భవాని కాలేజికి వెళ్ళిపోయింది సాయంత్రం అయిదింటికిగాని తిరిగిరాదు. అత్తయ్యతో కాస్సేపు మాట్లాడి, పన్నెండుకు భోజనంచేసి బయలుదేరాడు కృష్ణ. 'కోర్టు పనిమీద వచ్చాననీ" పగలంతా ఇంట్లోనే కూర్చుంటే ఏం బావుంటుంది?

బుక్ షాపుకువెళ్ళి ఒక ఇంగ్లీషు నవలకొని, పబ్లిక్ గార్డెన్సులో ఒకమూల చెట్ల నడుమ చల్లగావున్న ఏకాంతప్రదేశాన్ని చేరుకొన్నాడు.

పుస్తకం చదివే నిలకడ మనస్సుకు లేకపోవటంతో, వెల్లకిలా పడుకుని ఊహాల్లో తేలిపోయాడు...రాత్రి భవాని అన్నట్లు భవానిలో మంచితనం వుంది. ఆ మంచితనం భవాని చదువుకూ, అందానికీ పదహారవ వన్నె. భవానినే వివాహమాడి వుంటే జీవితం ఎంత స్వర్గధామంగా వుండేది!...తను హైకోర్టులో ప్రాక్టీసు, భవాని కాలేజిలో ఉద్యోగంచేస్తూ, దర్జాగా కారు, బంగళా, స్నేహితులు అంతా హైదరాబాదు వాతావరణానికి తగినట్లు అమరివుండేది!... సెలవురోజుల్లో, తీరిక సమయాల్లో ఇలా ఉద్యానవనాల్లో, ఉస్మాన్‌సాగర తోటల్లో, పచ్చికమీద, చెట్లనీడ, భవానితో ...చీకూచింతా లేకుండా.. జీవితం సౌందర్యారాధనకు, సౌఖ్యసాధనకు అంకితమై మధుర మంజుల కావ్యంలా సాగిపోయేది!.. ఒక్క పొరపాటు... తనలోని మూర్ఖత్వానికి, తండ్రి సంకుచితత్వానికి తను అప్పట్లో లొంగిపోవటం...అంతటితో దగ్గరగా వచ్చి పెదవుల్ని స్పృశించబోతున్న అమృతపాత్ర దూరంగా ఎక్కడికో గిరవాటు! ఇప్పుడిక తను చెయ్యగలిగిందేమిటి?

భవానితో సంబంధం, అది శాశ్వతమైనది ఎన్ని పొరపాటు జరిగినా! అది ధర్మవిరుద్ధం కాని పవిత్ర ప్రణయబంధం; అలా వుండిపోతుంది. అది అంతరాంతరంలో వికసించిన ఒక పువ్వు; దానికి వడలిపోవటమంటూ వుండదు; ఫలించటమూ వుండదు! భవానికి తన కొడుకుమీద మమకారం... కాస్త పెద్దవాడైన తర్వాత వాణ్ణి భవానికే అప్పజెప్పటానికి తనకేం అభ్యంతరంలేదు! ఇన్నాళ్ళూ ప్రేమ అనేది ఊహామాత్రమే; కథల్లో కావ్యాల్లో; ఇవాళ జీవితంలో ప్రవేశించి ప్రేమ తన యథార్థతని రుజువు చేసుకుంటున్నది!

సాయంత్రం నాలుగ్గంటలకే ఇంటివైపు బయలుదేరాడు కృష్ణ. వచ్చేటప్పటికి తను సిద్ధంగా వుండాలి. తర్వాత 'బజారుకు వెళ్దాం'అంటూ చెప్పి భవానిని ఏదైనా సినిమాకు తీసుకొనిపోయి, నెమ్మదిగా ఆమె హృదయంలో దాచుకున్న రహస్యాన్ని చెప్పించాలి...

వెళ్ళగానే అత్తయ్య టిఫిన్ కాఫీ యిచ్చింది..."భవాని ఏ వేళకు వస్తుందో, కాలేజిలో మీటింగో ఏదో వుంటే ఆలస్యం అవుతుంది, నువ్వు తీసుకో నాయనా" అన్నదామె...అయిదు దాటినా భవాని జాడలేదు...'బజారుకు వెళ్ళి రావాలన్నావు, వెళ్ళరాదా?" అంటోంది అత్తయ్య లోగదిలోకివచ్చి...ఏమీ తోచనట్లు, భవానికోసమే నంటూ అలా కూర్చోవటం బాగులేదని కృష్ణ యింటినుంచి బయలుదేరి, సుల్తాన్‌బజారువైపు నడిచాడు...

కొన్ని షాపులు తిరిగి, చౌరస్తాలో మనుష్యుల్ని చూస్తూ కొంతసేపు నిలబడి, మళ్ళీ ఎనిమిది గంటలకు యిల్లు చేరుకున్నాడు. ఇంటిముందు ఫియట్ కారొకటి నిలబడివుంది క్రింది భాగంలో వున్నవాళ్ళకోసం ఎవరో వచ్చారు కాబోలు ననుకుంటూ మెట్ల గదిని సమీపించేటప్పటికి ఒక యువకుడూ అతనివెనుక భవానీ, ఏదో మాట్లాడుతూ నవ్వుతూ మెట్లుదిగి వస్తున్నారు. కృష్ణ అప్రయత్నంగా తటాలున ఒక ప్రక్కకు తప్పుకున్నాడు వాళ్ళకు కనిపించకుండా.

భవాని చక్కగా అలంకరించుకొని రతీదేవిలా వుంది. కృష్ణ ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ వుండగానే, ఆమె కారులో ముందు సీటులో కూర్చోవటం, యువకుడు ఆమె ప్రక్కన కూర్చుని డ్రైవ్ చేసుకుని వెళ్ళిపోవటమూ జరిగింది.

కృష్ణకు పాదాలక్రింద భూమి జారిపోయినట్లయింది. కోపం వచ్చింది; అవమానం కలిగింది...'ఏమిటీ ప్రవర్తన? ఈ ఆటలు?'

అనుకుంటూ మెట్లెక్కి పైకి వెళ్ళాడు. వెళ్ళి వరండాలో కుర్చీలో కూలబడ్డాడు.

తర్వాత పావుగంటకు కాని అత్తయ్య, కృష్ణ వచ్చి వరండాలో కూర్చున్నాడని గమనించలేదు.

"ఎప్పుడొచ్చావ్ రామం! లే నాయనా, వడ్డిస్తాను!" అన్నదామె. కృష్ణను చిన్నతనంనుంచీ వాళ్లు 'రామం' అని పిలిచేవాళ్ళు!

"భవాని రానేలేదా?" అన్నాడు తనకేమీ తెలియనట్లు; ఆమె కెంత తెలుసో పరీక్షించాలన్న కుతూహలంతో.

"సువ్వటువెళ్లిన కాస్సేపటికి వచ్చింది...ఇవ్వాళ వాళ్ల కాలేజి లెక్చరరుగారి యింట్లో వాళ్ల అబ్బాయి పుట్టినరోజు పండుగ, విందుకురమ్మని యిందాక కారు పంపితే వెళ్ళింది...చాల మంచి కుటుంబం, మనవాళ్లే..."

"అలాగా! వాళ్ల ఆడవాళ్లువచ్చి తీసుకువెళ్లారు కాబోలు."

"బావుంది, ఆడవాళ్లవసే అక్కడ ఎవ్వరైనా చూస్తారు! వాళ్లు నిన్నవచ్చి పిలిచిపోయారు. నేనూ వెళ్దామనే అనుకున్నాను. నువ్వు ఊరినుంచి వచ్చావుగా, అందుకని అమ్మాయిని వెళ్ళి రమ్మన్నాను. లెక్చరరుగారి తమ్ముడు వచ్చి తీసుకువెళ్ళాడు. నువ్వు లేచి భోంచెయ్యి."

కృష్ణ ఎంగిలిపడి చెయ్యి కడుక్కునివచ్చి మళ్లీ వరండాలో కూర్చున్నాడు...

ఆ యువకుడి నవ్వులో కలిసిపోయిన భవాని నవ్వు అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తూనేవుంది! తను ఊహించిన పరిస్థితి వేరు, ఇక్కడ యథార్థ స్థితి వేరు! ఎంత తెలివితక్కువతనంతో బయలుదేరి వచ్చాడు!...కాని తన ఊహలో అసంబద్ధం ఏమీ లేదు. తనకు తెలిసినమేర ఊహ సరిగానే వుంది; పోతే తనకు తెలీని విషయంకూడా ఇందులో వుంది. అంటే విషయం సంపూర్ణంగా తెలీలేదు, అంతే!

కాలేజీలో ఆరేళ్ళు చదువుకుని, లోకంలో ఒరపిడి కలిగాక కూడా భవాని భవానిగానే ఎక్కడైనా వుంటుందా...తనకోసం తపస్సు చేస్తున్న ముగ్ధ, చదువువల్ల బుద్ధీ తెలివీ వికసించినా హృదయ సౌరభ్యం కోల్పోకుండా తనకోసమే దాన్ని రహస్యంగా దాచి వుంచుకొన్న మనోజ్ఞపుష్పం, భవాని తన ప్రణయ దేవత అనుకున్నాడు కాని అదెలా సాధ్యం!...పరిసరాలు, సంఘం, బలీయమైనశక్తులు...భవానిలోవి నిస్పృహా, నిర్వేదం, బావ భగ్నం చేసిన కోరికలూ, అవన్నీ యీ విధంగా పరిణామం చెందాయి అనుకోవాలి గాని!

అంతేకాదు! హేతువాదం ఒకటి వుందిగా! 'బావ యింకోకర్తను పెళ్లి చేసుకొని సుఖపడటంలేదూ! నేనుమాత్రం మరొక వ్యక్తితో స్నేహం చేస్తే తప్పేమిటి?'—స్నేహం!...అది మొదట్లో స్నేహమే; తర్వాత చనువు; ఆ చనువు తీరా పతనానికి సర్వనాశానికి దారితీస్తే కాని తెలియదు...యీ వితండవాదం వల్ల కలిగే దుష్ఫలితం! లేకపోతే నవ్వుతూ, కారులో వాడి ప్రక్కన కూర్చుని వెళ్లటమేమిటి? వెనుకసీటులో కూర్చోవచ్చుకదా! ఇంతకూ ఉద్యోగరీత్యా పరిచయమైన వ్యక్తి ఆ లెక్చరరు; అతనితమ్ముడితో యింత చనువు దేనికి?

కృష్ణ వెళ్లి పడుకున్నాడు. నిద్రరాలేదు...భవాని రాలేదు, యింకా ఏం చేస్తూవుందో! పెద్దావిడ యింట్లోవుండి లాభం ఏమిటి?...బావ వచ్చాడే, ఏమనుకుంటాడో అన్న జంకు లేకుండా భవాని యిలా ప్రవర్తిస్తోందే, యిక మామూలుగా భవానికి యీ ఊళ్లో హద్దులేమిటి? తన వెనక చూడటం లేదన్న ధీమా, తల్లికేవో కారణాలు కల్పించి చెప్పి సులువుగా మోసం చెయ్యగలిగిన ప్రజ్ఞ వున్న భవానికి అడ్డేమిటి?

తొమ్మిదిన్నరకు భవాని తిరిగివచ్చింది కారులో...

"బావ భోంచేశాడా అమ్మా?" అని అడుగుతోంది...ఒకవైపు తను ఏమనుకుంటాడో అన్న సందేహం వుండనేవుంది, నయమే!

"ఆఁ."

"అప్పుడే పడుకున్నాడేమిటి?"

"పగలు తిరిగి తిరిగి వచ్చాడేమో, నిద్ర వచ్చినట్లుంది!"

కృష్ణ యీ సంభాషణ వింటూ వెన్నక్కి మాట్లాడదలచుకోలేదు.

*　　　*　　　*

తెల్లవారింది. శనివారం. 'వంటనే కర్నూలు వెళిపోదామా' అనిపించింది కృష్ణకు. కాని యింతదూరం వచ్చినతర్వాత యీ సంగతేమిటో పూర్తిగా తేల్చుకుని వెళ్లటమే మంచి దనుకున్నాడు. రాత్రిసంఘటన జ్ఞాపకంరావటంతో భవానిని తను పెళ్ళి చేసుకోకపోవటం మంచి అయిందని తోచింది. చదువుకున్న యువతి తప్పకుండా ఉద్యోగం చేస్తానంటుంది; ఉద్యోగంచేసే యువతి త్వరలో యిలానే తయారవుతుంది. 'ఫలానావాడిభార్య' అని అందరూ వ్రేలెత్తి చూపుతూవుంటే భర్త తలదించుకోవలసి వస్తుంది...అందులో భవాన్ని కాపురం చేశేర్పు తన కెక్కడిది?... అసలు భవాని మన స్తత్వంలోనే చపలత్వం వుంది! లేకపోతే తనను ప్రేమించి, తీరా పెళ్ళిప్రసక్తి వచ్చేసరికి చదువుకుంటానని మొండిపట్టు పట్టటమేమిటి? అలా అని వదలిపెట్టుకున్న తర్వాత, మళ్లీ తనమీద ఆసక్తి, అర్థాలు వచ్చేటట్టు మాటలూ, ఉత్తరాలూ!...ఏమిటిదంతా, కేవలం చపలత్వం కాకపోతే! భవాని అంటే ఒక తేలిక అభిప్రాయం ఏర్పరచుకున్నాడు కృష్ణ.

"ఏం భవానీ! నిన్నటిరోజు దర్శనమే లేదే!" అన్నాడు కాఫీ తీసుకుంటూ.

"కాలేజినుంచి వచ్చేప్పటికి ఆలస్యమైంది. తర్వాత మా కెమిస్ట్రి ప్రొఫెసరుగారింట్లో అబ్బాయి పుట్టినరోజు విందుకు వెళ్లాను..."

"అనసూయ ఏదో ఊళ్లో అదీ కావాలన్నది; నువ్వువస్తే సాయంత్రం బజారు వెళ్దామనుకున్నాను."

"అలాగే, సాయంత్రం నేను కాలేజినుంచి రాగానే వెళ్దాం. ఇవ్వాళ తొందరగానే వచ్చేస్తాను" అన్నది భవాని.

సాయంత్రం ప్రోగ్రాం ఏమిటో తీరికగా ఆలోచించుకున్నాడు కృష్ణ. ఆ రోజు మ్యాటినీలో మధ్యాహ్నమంతా గడపి ఎలాగైనా భవాన్ని సినిమాకు తీసుకువెళ్లాలి...ఆ మాట ముందుగా

చెబితే ఆ తయ్యకూడా ప్రయాణమౌతుంది; అదో చిక్కు! అందువల్ల బజారుకు వెళ్ళిన తర్వాతనే ఆ విషయం కదపాలి......

అంతా కృష్ణ అనుకున్నట్లే జరిగింది...ఊరు అవీ కొన్న తర్వాత ఆరుగంటలవుతూండగా యిద్దరూ ఒక రెష్టారెంటులో ప్రవేశించారు. ఐస్‌క్రీం తింటూ కృష్ణ, "భవానీ, సినిమాకు వెళ్దామా? ప్రక్కనున్న థియేటర్లో క్రొత్త తెలుగు సినిమా వచ్చినట్లుందే!" అన్నాడు.

"భూకైలాస్., వెళ్దామా...సరే!" అన్నది భవాని.

అంత సులువుగా భవాని అంగీకరిస్తుందనుకోలేదు కృష్ణ. 'ఎలాగ? అమ్మతో చెప్పలేదే!' అని అంటుందేమో! లేకపోతే, 'ఏం సినిమా? తలనొప్పి, వద్దులే!' అని అభ్యంతరం చెబుతుందనీ, బలవంతపెట్టాలని వస్తుందని ఊహించాడు. కాని భవానికి అలాంటి జంకుగొంకులు ఏమీ ఉన్నట్లు లేవు! నిన్న రాత్రి వచ్చిన ఆ యువకుతోనూ, స్నేహితుల్తోనూ యిలానే సినిమాకు తల్లితో చెప్పకుండా వెళ్ళటం బాగా అలవాటున్నట్టుంది భవానికి!......

థియేటర్లో చాలసార్లు భవాన్ని మాటల్లోకి దింపాలని ప్రయత్నం చేశాడు కృష్ణ. కాని భవాని 'సినిమా చూద్దాం!' అని వారించటంతో లాభం లేకపోయింది.

అసలు యీ మన సత్వపు స్త్రీలకు మాటల్తో ఏం పని? కౌశల పనిని అనుభవాలే! అనుకున్నాడు కృష్ణ. మెల్లగా తనచేయి భవాని చేతిని స్పృశించేలా చేశాడు; కాని భవానిలో ఏవిధమైన చలనమూ లేదు. తర్వాత నెమ్మదిగా తనభుజం ఆమెభుజాన్ని తాకేటంత మేర ఆమెవైపు ఒరిగాడు. భవాని క్షణం అలానేవుండి అటువైపుకు ఒరిగి తప్పుకుంది...మళ్ళీ ఆమె యిటువైపు కదుల్తుందేమోనని నిరీక్షించాడు కృష్ణ. కాని లాభం లేకపోయింది.

సినిమా వదలి పెట్టిన తర్వాత భవాని, "టాక్సీలో వెళ్ళిపోదాం, తొందరగా వెళ్ళవచ్చు" అన్నది...'దారికి వస్తోంది; నేను పట్టి వెత్తి మొహాన్ని కాకపోతే ఏదో మాట్లాడాలి, ఒకళ్ళభావా లొకళ్ళతో చెప్పకోవాలి అనుకున్నానుగాని, యిందులో మాటలు నిజంగా అనవసరమే! శరీరాలే మాట్లాడుకోవాలి!" అనుకొని ఒక నిశ్చయానికి వచ్చాడు కృష్ణ...టాక్సీలో భవాన్ని స్పృశిస్తూ ప్రక్కనకూర్చున్నాడు గాని ఏం చెయ్యటానికీ ధైర్యం చాల్లేదు; పదినిముషాల్లో టాక్సీ యిలు చేరుకోవటంతో టైమూ చాల్లేదు.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు

"ఎలావుంది బావా సినిమా? కథ చాల బాగుంది!" అన్నది భవాని

"రావణున్ని అమాయకుణ్ణిచేసి మోసం చేశారు దేవతలు; పాపం రెండుసార్లూ దగాపడ్డాడు"

"అది అమాయకత్వ మెలా అవుతుంది? రాక్షసత్వం. లేకపోతే శివుడు 'ఏం వరము కావాలి' అంటే 'నీ భార్య కావాలి' అంటాడూ! వాడిమనస్సుకు తగినట్టే పార్వతి కాళీమూర్తిగా కనిపించింది. భయపడి, అంతటితో వెళ్ళి మండోదరినే పార్వతి అనుకుని తృప్తి పడ్డాడు..."

"రెండోసారి అలాంటిదేమీ లేదుకదా, అప్పుడు జరిగింది మోసమే నా!"

"దానికి రావణుని గుణమే కారణం ఆత్మలింగం, అదేదో వస్తువులాగా దాన్ని కనిపెంచిన పిల్లవాడి చేతి కివ్వటమేమిటి? అంటే వాడికి దాని విలువ తెలీదు! మనకొక రత్నం దొరుకుతుందనుకో, దాని విలువ తెలీకపోతే పోగొట్టుకుంటాము, అంతే! అందులో మోసమేం లేదు. ఒక గేమ్ వుంది, దాని రూల్సు ప్రకారం ఆడాలి...ఆత్మలింగం క్రింద పెట్టకూడదన్న నిబంధన వుంది, అజాగ్రత్తవల్ల దాన్ని పాటించలేక ఓడిపోయాడు.. విచారించి లాభమేమిటి?"

భవాన్ని మాటల్లో అంతరార్థంకోసం వెతుకుతున్నాడు కృష్ణ...విలువ తెలీక భవాన్ని తను అలా పోగొట్టుకున్నాడు అంటోందా?

"అయితే రూల్సు తెలిసినంతమాత్రాన జాగ్రత్తగా వుండి కూడా గెలవకపోవచ్చుగా! అదృష్టం కలిసిరావాలి!"

"నిజమే దానికి అదృష్టం కాదు, చొరవా సామర్థ్యమూ వుండాలి. రావణుడికి అవి వున్నాయి, రూల్సే తెలీవు. కాని చాల మందిలో చొరవా, సామర్థ్యమే వుండవు, రూల్సు బాగా తెల్సినా!"

"మంచి సిద్ధాంతమే తయారుచేశావ్!" అన్నాడు కృష్ణ నవ్వుతూ, తనకు విషయం పూర్తిగా అర్థమైందన్నట్లు.

రూల్సు తెలియటమే కాదు, చొరవవుండాలి ఆడదాన్ని అనుభవించటానికి! అనుకున్నాడు కృష్ణ.

భోజనం ముగించి ముందుగదిలోకి వచ్చారు.

"నేను రేపు ప్రొద్దున వెళ్ళిపోతాను; నీదగ్గరేవో నమూనాలు వున్నాయి తెమ్మని చెప్పిందే!" అన్నాడు కృష్ణ, భవాని అభిప్రాయం కనుక్కుందామని.

"ఆ నమూనాలు నా ఫ్రెండు ఒకావిడ దగ్గరున్నాయి. నిన్న, యివాళ, ఆవిడ యింటికి వెళ్ళలేక పోయాను. ప్రొద్దునే వెళ్తాను. రేపు ఎలాగూ ఆదివారం; వుండి, ఎల్లుండి వెళ్తావా?"

"అయితే వాటికోసం ఒక రోజంతా ఆగాల్సిందే!"

"ఏం? అర్జంటు పనులేమైనా వున్నాయా?"

"వుంటే ఏంలే! సర్దుకోవచ్చు...కాని ఏం తోచకుండా..."

"ఎందుకు తోచదు? నేనింట్లోనే వుంటాను...మ్యూజియం చూట్టానికి వెళ్దామా?"

"నే నిదివరకే చూశాను."

"పోనీ మేటనీకి."

"సరే రేపు ఆలోచించుకోవచ్చు...అయితే వుండక తప్పదంటావ్!"

కృష్ణ పడుకున్నతర్వాత చాలసేపు నిద్రపోలేదు...ఏదైనా అలికిడైతే భవాని ఏదో నెపంతో తనగదివైపు వస్తోంది కాబోలు అనుకుంటూ చాలసేపు నిరీక్షించి, తను రేపు వుంటానని చెప్పటం పొరపాటనీ, అలా చెప్పకుండా వుంటే ఫలితం వెంటనే దక్కేదనీ ఆలోచించుకుని, చివరకు నిద్రపోయాడు.

* * *

ఆదివారం ప్రొద్దున భవాని స్నేహితురాలి యింటికి వెళ్ళి పదకొండు గంటలకు నమూనాలతో తిరిగివచ్చింది.

# తమిళ సాహిత్యంపై తెలుగు వెలుగు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

దక్షిణ భారతమునందు వ్యవహృతము లగుచున్న భాషలలో తెలుగు తమిళము కన్నడము మున్నగునవి ముఖ్యములు. ఈ మూడును బహుప్రాచీనములు. కాని క్రీ. శ. 11 వ శతాబ్దమున సంతరింపబడిన కలింగత్తుప్పరణి అను నొక చారిత్రక కావ్యమున తత్కర్త యగు జయంగొండార్ కన్నడభాషను గురించి యిట్లు పేర్కొనెను.

"ఒశై కెழ్క్కలు మొళిత్ సిలవగుగుం పలతమిళుం
కుళిత్తి త్తిరు కరునాడియర్ కుఱుగిక్కుడై..."

కొన్ని తెలుగుమాటలయు, పలు తమిళ శబ్దములయు కలయిక వలన కన్నడభాష యేర్పడెనని యీ పంక్తులలో వ్యక్తము చేయబడినది. అంతేకాక కన్నడశబ్దములు తొక్కుపలుకు లనియు చెప్పబడినది. ఈ సందర్భమున సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులగు శ్రీ ము. రాఘవయ్యంగారు 1 తమ ఆరాయ్చ్చి తొకుదిలో తెలుగు కన్నడములను గురించి వ్రాసిన వాక్యముల నిట నుదాహరించుచున్నాను "అది (కన్నడము) తమిళము అను భాషకు కలయిక వలన నేర్పడిన భాష అనియే ప్రాచీన తమిళ పండితుల విశ్వాసము ......... ఈ ప్రమాణములను పురస్కరించుకొని చూడగా తెలుగునకు తమిళమున కున్నంత ప్రాచీనత కలదని గ్రహింపదగును." కాని యీ విషయాదికము నంగీకరింపని వారును కొందరు కలరు. ఏమయినను, తెలుగు తమిళములు మాత్రము బహు ప్రాచీనములని చెప్పవచ్చును

తమిళ వాఙ్మయమున ప్రాచీనము, ప్రశస్తమునగు గ్రంథము తొల్కాప్పియము. ఈ లక్షణశాస్త్రమును రచియించిన తొల్కాప్పియనారు కావ్యమునందు ప్రయోగింపదగిన తమిళ శబ్దములను ఇయల్ శొల్ (మార్పుచెందని తమిళ శబ్దములు) తిరిశొల్ (మార్పు చెందిన తమిళశబ్దములు), దిశైచ్చొల్ (అన్యదేశ్యములు), వడసొల్ (సంస్కృత శబ్దములు) అని నాలుగు విధములుగా విభజించెను. ఇట్లనుటచే తొల్కాప్పియనారు కాలమునకే తమిళములో అన్యదేశ్యములను, సంస్కృత శబ్దములను చోటు చేసికొనెననుట నిస్సంశయము.

అన్యదేశ్యములను గురించి తరువాతి వ్యాఖ్యాత లిట్లు పేర్కొనిరి.

"సెంతమిళ్ శేర్న్ద పన్నిరు నిలత్తుం
తంకురిప్పినవే దిశైచ్చొల్ కిళవి."

తమిళ దేశమునకు చెందిన పన్నెండు భాగములకు వెలుపల నున్న దేశములనుండి గ్రహింపబడిన శబ్దములకు దిశైచ్చొల్ కళ్ అని పేరు కలిగెను.

ప్రాచీన కాలమున తమిళము మాటాడు దేశమును పన్నెండు భాగములుగా చేసిరి. తమిళ దేశమునకు ఉత్తర సరిహద్దుగా తెలుగు మాటాడు దేశమే యుండెనని తమిళ విద్వాంసు లెల్లరు నంగీకరించిన విషయము. తొల్కాప్పియనారు కాలపువాడగు పనంబారనారు "వడ వేంగడం తెన్ కుమరి యాయిడై త్తమిళ్ కూఱు నల్లుల గత్తు—" అని చెప్పెను. ఉత్తరమున వేంకటశైలము, దక్షిణమున కన్యాకుమారి—ఈ రెంటి నడుమనున్న ప్రదేశమున తమిళము వ్యవహారమున నుండెనని పై మాటలవలన తెలియుచున్నది.

కాక్కైప్పాడినియార్ అను ప్రాచీన పండితుడును "వడదిశై మరుంగిన్ వడుగు వరంబాగ" అని తెలుగు దేశమునే ఉత్తర సరిహద్దుగా నిర్ణయించెను

తెలుగువారు తమిళమును అరవ 2 మనియు, తమిళులను అరవ లనియు వ్యవహరించుచున్నటుగానే తమిళులు తెలుగును తొలుత వడుగు అనియు, తెలుగులను వడుగర్ అనియు వ్యవహరించిరి. వడుగు శబ్దమిప్పటిది కాదు. తమిళ వాఙ్మయమున తొలియుగముగా గణింపబడు సంగకాలముననే వడుగు శబ్దము వాడుకలోనికి వచ్చెను. తరువాతి కాలముననే తెలుగువారిని తెలుంగర్ అని వ్యవహరించిరి. నేటికిని బలిజ కులస్థులను తమిళులు వడుగర్ అనియే వ్యవహరించుచున్నట్లు తెలియుచున్నది.

సంగకాలపు గ్రంథములగు అగనానూఱు, పుఱనానూఱు, కుఱుందొగై మొదలగు వానిలో 'వడుగు' తొమ్మిదిచోట్ల వాడబడినది. వడుగులు తమిళమునకు భిన్నమగు భాష మాటాడు వారనియు పరాక్రమోపేతు లనియు, తమిళ సేనానాయకులకు శత్రువు లనియు చెప్పబడినది. సంగవాఙ్మయములో తెలుగు నాయకుల పేరు కొన్ని కానవచ్చుట గమనింపదగు విషయము.

సంస్కృత శబ్దములతో పాటు 3 తెలుగు మాటలు కూడ వ్యావహారిక తమిళమునందే కాక గ్రాంథిక తమిళమునందును ప్రవే

---

1 ఈ నడుమనే వీరు దివంగతులైనారని తెలుపుట చింతించుచున్నాను.

2. అరువర్ అనుట సమంజసము తమిళ కావ్యములలో అరువ శబ్దమే వాడబడినది

3 సంస్కృత శబ్దము లనేకములు తత్సమ తద్భవ రూపములతో సంగకాలమున సంతరింపబడిన గ్రంథములందే కానవచ్చుచున్నవని శ్రీ టి. ఎన్. కుమారస్వామిగారు నాకు తెలిపిరి. వీరు బహుభాషాభిజ్ఞులు ప్రసిద్ధ తమిళ రచయితలును. వీరికి కృతజ్ఞుడను. సంగవాఙ్మయమున ప్రవేశించిన కొన్ని సంస్కృత శబ్దముల నొసగుచున్నాను.

అంకుశం, అమరర్, అంజనం తిలకం పలాశం. పున్నాగం, తమాలం యూపం మొదలగు తత్సమములు.

అరశ (రాజ), అమిర్తం (అమృత) తవం (తపస్), ఆరం (హార), నేయం (స్నేహ), అరమియం (హార్మ్య) మొదలగు తద్భవములు...

శించినవి. మదరాసు విశ్వవిద్యాలయము వారు ప్రకటించిన తమిళ నిఘంటువు (Tamil Lexicon) నందు తెలుగునుండి 488 మాటలు తమిళమున ప్రవేశించినట్లు తెలుపబడినది. కాని శ్రీ యస్. వి. సుబ్రహ్మణ్యన్ గారు 450 తెలుగు మాటలే తమిళమున ప్రవేశించెనని తలచుచున్నారు.[4] మరియే యితర ద్రావిడభాష నుండియు ఇన్ని మాటలు తమిళమున ప్రవేశింపక పోవుట గమనార్హము.

నేటికిని తమిళులు తమదైనందిన వ్యవహారములో వాడుకొను కొన్ని తెలుగు మాటలను పరికింతము.

కోమటి (కోమటి)
కొంచెం (కొంజెం)
కొంచెమా నంచమా (కొంజెమా నంజమా)
హొయలు (ఒయిల్)
ముత్తం (ముద్దు)
కోసరం
దొడ్డగాత్రి (పెద్ద అను అర్థములో)
చిన్న (సిన్న)
లంచము (లంజం)
తల్లి
రవిక (ఇరవిక్కై)
రవ (ఇరవై)
లాహిరి (ఇలాహిరి)
కవ్వం
ఉబ్బసము (ఉప్పసం)
(ప్రా) పాలమాలు (పాల్మాగు)—వ్యావహారికాంధ్రములో కూడ ఈ ప్రయోగ మున్నది)
వేరము (వేరం)
ఉగ్గము (ఉక్కం)

ఇక తమిళ కావ్యములలో తెలుగు మాటలను వాడసగిన వారిలో తొలుతటివాడు కంబమహాకవి అనవచ్చును. కంబడు తన రామాయణములో యుద్ధకాండమున తమ్మి, అక్కటా అను మాటలు వాడెను. తిరుప్పుగళ్, విరలివిడు తూగు మున్నగు రచనములందును కొన్ని తెలుగు మాటలు కానవచ్చుచున్నవి. కొన్ని చాటువులందును తెలుగుమాటలు చోటుచేసుకొనెను. కాని చాల (శాల), చెప్పు (సెప్పు, మాట చెప్పాలు) వంటి కొన్ని మాటలు నేడు వ్యవహారభ్రష్టము లయినవి; గ్రాంథిక తమిళమునందును వాడబడుట లేదు. కాని సింహళమునందలి తమిళులు మనవలె చాల, చెప్పు, చాల్ (సాల్, మా ) అని వ్యవహరించుచున్నారు.[5] అనగా తమిళులు చకార లేక శకార యుక్తముగ పలుకు మాటలను సింహళము నందలి తమిళులు తెలుగువారివలె చకారయుక్తముగా నుచ్చరింతురని నుడువ వగును.

---

4. చూడుడు "Telugu Loans in Tamil" అను వ్యాసము. S. K. Chatterji Jubilee Volume 1955.

5. ఈ విషయమును సుప్రసిద్ధ విద్వాంసులు, పరిశోధకులునగు శ్రీ కి. వా. జగన్నాథన్ గారి వలన తెలిసికొంటిని.

వ్యావహారిక తమిళమునందు — ముఖ్యముగా మదరాసు, ఉత్తర దక్షిణార్కాడు జిల్లాల తమిళమునందు — తెలుగు ప్రభావము మరింత స్పష్టముగ గోచరించును. మదరాసు ప్రాంతమున తమిళులు కొందరు తెన్నంచెడి (కొబ్బరి చెట్టు), వాళైచ్చెడి (అరటి చెట్టు) అని వ్యవహరింతురు. చెడి అనగా మొక్క. చెట్టును మరం అని అందురు. చెట్టు, చెడి సరూపములుగా నుండుటచే తెలుగువారివలె మదరాసు ప్రాంతపు తమిళులు కొబ్బరిచెట్టు, అరటిచెట్టు అని వ్యవహరింప సాగిరని భావింపవచ్చును. కాని మధుర, తిరునల్వేలి మున్నగు ప్రాంతములందు తెన్నమరం, వాళైమరం అనియే వ్యవహరింతురు. చెట్టూ చేమ అనినట్లుగా చెంగల్పట్టుజిల్లాలో కొన్నిచోట్ల చెడి చెట్టు అనునది వ్యవహారమున నున్నట్లు శ్రీ తె. పొ. కుమారస్వామిగారు నాకు తెలియజేసిరి.

మరియొక ప్రయోగము : తమిళవైష్ణవులు సెయ్‌గుక్కొండు (చేసికొని) అనుటకుమరుగా సెంజిట్టు అని వాడుదురు. సెంజిట్టు అనునది కేవలము వ్యావహారికరూపము. చేసికి ప్రతిరూపమే సెంజి అని పేర్కొనదగును. కొన్ని తమిళ సమాసములలోను తెలుగు మాటలు ప్రవేశించినవి. అట్టుదొడ్డి, ఎరంగాడు మొదలగు మిశ్రసమాసములు తెలుగుకు చెందినవే. వీనిలో దొడ్డి, ఎఱ్ఱ అనునవి తెలుగుమాటలని వేరుగ చెప్పనవసరము లేదు. ఇట్టి మిశ్రసమాసములు తమిళనిఘంటువునందు 39 ఉదాహరింపబడినవి.

భాషావిషయకముగా మాత్రమే కాక రాజకీయముగాను, సాంస్కృతికముగాను తెలుగువారికిని తమిళులకును సంబంధబాంధవ్యములు కలవు. ఈ సంబంధము నేటిది కాదు. సంగకాలము నుండియు అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న సంబంధమిది. సంగవాఙ్మయమునందు కొందరు తెలుగునాయకుల పేర్లు కానవచ్చుచున్నవని తొలుతనే తెలియజేసితిని. ప్రప్రథమమున తెలుగులును తమిళులును శత్రువులుగానున్నను, కాలక్రమమున వారుభయులును స్నేహితులై సంచరించిరని విజ్ఞులు తలచుచున్నారు. యశశ్శరీరులు శ్రీ ము. రాఘవఅయ్యంగారు నుడివినట్లు, చారిత్రకదృష్టితో చూచినచో తెలుగువారికిని తమిళులకును నడుమగల రాజకీయ సంబంధమును మూడుతెరగులుగ విభజింపవచ్చును.

తమిళులును తెలుగువారును స్నేహితులుగా సంచరించిన కాలము మొదటివిభాగము. సంగకాలమునకు పిమ్మట పల్లవమహీపతి మామల్లుని సేనాధిపతియగు పరంజ్యోతి వాతాపిని ముట్టడించి వశము చేసికొనుటతో తెలుగువారికిని తమిళులకును మధ్య రాకపోకలు ప్రారంభమయినవి. పల్లవుల కాలమున భక్త్యుద్యమమునకు ప్రభుత్వాదరము లభించినది. ఈ యుద్యమనాయకులు దక్షిణాపథమునంతటను వ్యాపన సాగించి అంతకుపూర్వము దేశమున వెలసిన్న జైన బౌద్ధమతములను పారద్రోలిరి. భక్త్యుద్యమముకూడ తమిళులను తెలుగులను సన్నిహితులనుగా చేసియుండవచ్చునని కొందరి యభిప్రాయము.

రెండవవిభాగము చోళమహీపతులు తెలుగునాడును హస్తగతము చేసుకొని పరిపాలించినకాలము. ఈకాలమున చోళరాజులు తెలుగునృపులతో వైవాహిక సంబంధముకూడ నేర్పరచుకొనిరి. విమలాదిత్యుడు రాజరాజచోళుని కుమార్తెయగు కుందవిని వివాహమాడుటయు, విమలాదిత్యుని తనూజుండగు రాజరాజనరేంద్రుడు మొదటి రాజేంద్రచోళుని కుమార్తెయగు అమ్మంగదేవిని పరిణయమాడుటయు, కులోత్తుంగుడు [illegible] విశాల చోళ సామ్రాజ్యమునకు రాజగుటయు విజ్ఞులెరిగిన విషయములే. తత్ఫలితముగ తమిళులు పలువురు తెలుగుదేశమున స్థిరనివాసము లేర్పరుచుకొనుటయు జరిగినది.

చోళులు బలహీనులయినపిమ్మట విజృంభించినవారిలో ఓరుగల్లు నేలు కాకతీయనృపులు ముఖ్యులనదగినవారు. కాకతీయుల కాలమునకూడ తమిళులు తెలుగదేశమునకు రాకపోకలు సాగించుచుండిరని పేర్కొనుటకు కంబకవి మొదటి ప్రతాపరుద్రుని (1162-1197) యాస్థానమును సందర్శించుటయే సాక్ష్యము.

మొదటి ప్రతాపరుద్రుడు ఓరుగల్లు నేలుచున్నకాలమున మూడవకులోత్తుంగ చోళుడు చోళరాజ్యాధినేతయై యుండెను. [illegible] వలననో తెలియదుకాని కంబకవికిని చోళనృపులకును మధ్య వైమనస్య మేర్పడెను. అందువలన కంబమహాకవి మొదటి ప్రతాపరుద్రుని యాస్థానమునకు పోయెననియు, కంబని కమనీయ కవితాశక్తిని చూచి ప్రతాపరుద్రుడు ముగ్ధుడయ్యెననియు తెలియుచున్నది. ఆ సందర్భమున కంబకవి ప్రతాపరుద్రునిమీద ఈ క్రింది పద్యమును చెప్పెనట!

> “అవని ముళుదుండు మయిరావతిత్తున్
> బవని లోళువార్ పశిత్తుం బువని
> ఉరుదరా నిన్నడైయ ఒరంగనాట్టిల్
> కుర్రుత్తిరా వాళైక్కుళామ్”

[అవనిగల జనులెల్లరు నీ కత్తికి వెరచుటవలనను, ఐరావతమును తలపించు పట్టపుటేనుగు నెక్కి యూరేగుచుండగా నిన్ను చూచి ముదితలు మోహము చెంది మదనతాపోపశమనమునకై క్రిందవేసికొని వానిపై శయనించుట వలనను రుద్రా! నీ ఒరంగల్లునాడున అరటియాకులు కరవయ్యెను.]

కంబడు తన కావ్యమున తెలుగుమాటలను వాడుటయే కాక తెలుగు నేలను సుసంపన్నము నొనర్చుచున్న గోదావరిని బహుముఖముల ప్రశంసించినాడు. ఉత్తమ కవిత గోదావరీ ప్రవాహమువలె నుండవలెనని పేర్కొనెను. గోదావరినడకలో కవితాలక్షణమును కనుగొనిన కంబని యీ పద్యమును పరికింపుడు.

> “బువియును క్కణితూయాన్ద్రి......
> ......... ......... .........
> కవి యెన క్కిడన్ద గోదావిరియినై వీరర్ కణ్డార్.”
>
> (అరణ్యకాండము)

ఈ పద్యమున అణి, పొరుళ్, తుఱై, తెళి, ఒళుక్కం అను ఐదుమాటలు కలవు. ఈ యైదును నదీపరముగాను, కవితాపరముగాను ప్రయుక్తములు.

నదీపరము :

అణి=సౌందర్యము

పొరుళ్=సారవంతమగు జలము, ప్రవాహవేగమున కొట్టుకొని వచ్చు [illegible] మొదలగునవి

తుఱై=వివిధ ఘట్టములు (రేవులు)

తిణై = నది ప్రవహించు మార్గము
ఒళుక్కం = సంకేత లక్షణ విధిక.
కవిత్వ పరము :
అణి = అలంకారము.
పొరుళ్ = విశాలభావము, ధ్వని
తుఱై = భావ వ్యక్తీకరణ విధానము
తిణై = (శృంగార వీరరస ప్రధానమైన) ఇతివృత్తము
ఒళుక్కం = శైలీ మాధుర్యము.

తెలుగు రాజుల ప్రతాపరుద్రుడే కాక తెలుగు మాగాణమును పంటకళ్ళముగా చేయుచున్న గోదావరియు కంబకవిని మిక్కిలిగా ఆకర్షించినదట నిస్సంశయము.

విజయనగర సార్వభౌములును, నాయక రాజులును తమిళ నాడును వశపరచుకొని పరిపాలించిన కాలము మూడవవిభాగము. ఆ కాలమున తమిళులు తెలుగు దేశమునకు రాకపోకలు సాగించినట్లే విజయనగరాధీశ్వరుల కాలమున తెలుగువారు తమిళ దేశమునకు పోయి అట స్థిరనివాసము ఏర్పరచుకొనిరి. ప్రభువులు తెలుగు వారగుటచే ఆ నాళ్ళలో తమిళులు కూడా తెలుగు నేర్చుకొనిరి. అంతటితో నిలువక కొందరు తెలుగున చక్కని రచనలుకూడ వెలయించి తెలుగు సాహిత్యమున స్థానము సంపాదించుకొనిరి. అట్టి వారిలో మురుగేశంపిళ్ళె, త్యాగరాజ మొదలి, అప్పావు మొదలి మున్నగువారు చిరస్మరణీయులు.

నాయకరాజుల కాలమున మధుర తంజావూరు ప్రాంతము లందు తెనుగుకవులకు పెండ్లి పందిళ్లు వెలసినవి. మధుర రాజ్యమున తెలుగే రాజభాషగా నుండెనని పేర్కొనదగును. కొరమేసు నగా మధుర నాయకరాజులకు సంబంధించిన 25 శాసనములు తెలుగులో కానవచ్చియే. ఈ దృష్టితో చూచినప్పుడు వీరికాలమున మనుచరిత్ర, వసుచరిత్రవంటి రసవత్కావ్యములకు తమిళములో అనువాదములు వెలయుట సహజముగా తోచును. తంజావూరు నేలిన మహారాష్ట్రులుకూడ తెలుగు నేర్చుటయే కాక తెలుగున రచనలుకూడ చేయదొడగుట హర్షింపదగు విషయము. పుదుక్కోట సంస్థానధ్వజమునందు 'శ్రీ బృహదంబా సహాయం' అని తెలుగున వ్రాయబడుట గమనింపదగు సంగతి. ఎట్టయాపుర సంస్థానమునందును తెలుగు పండితులు విలసిల్లిరి 6 ఈ విషయాదికమును చూడగా అలనాటి తెలుగువారు సాధించిన సాంస్కృతిక విజయము చాల మహత్తరమయినదని విదితమగుచున్నది.

ఈ రాజకీయ సాంస్కృతిక సంబంధముల వలననే తెలుగు మాటలతో పాటు కొన్ని తెలుగు రచనములును తమిళ సాహిత్యమున ప్రవేశించెను.

తమిళమునందు యాప్పరుంగలక్కారికై అను ప్రశస్తమగు ఛందోగ్రంథము గలదు. ఇది క్రీ. శ పదునొకండవశతాబ్దమున సంతరింపబడెను. దీనిని అమృతసాగరుడను నొక జైనుడు రచియించెను. గుణసాగరుడను జైనుడు దీనికి యాప్పరుంగలవృత్తి అను వ్యాఖ్యానమును వెలయించెను.

యాప్పరుంగలము వెలుగులోనికి రాకపూర్వమే తెలుగు కన్నడములందు వడుకచ్ఛందం, గుణగాంకియం అను ఛందోగ్రంథములు వెలువడెనని గుణసాగరుడు తన వ్యాఖ్యానమున పేర్కొనెను. వడుకచ్ఛందమనగా ఆంధ్రచ్ఛందమని అర్థము. దీనిని వాంచియార్ 7 (రేచన?) అను జైనుడు వ్రాసెనట. గుణసాగరుడీ తెలుగు కన్నడ ఛందోగ్రంథములను పేర్కొనటచే అమృతసాగరుడు యాప్పరుంగలమును రచించుటకు మునుపు ఈ రెండు గ్రంథములను సంప్రదించి యుండెనోపునని చెప్పవచ్చు. ఈ విషయమును తొలుదొలుత గుర్తించి విద్వల్లోకమునకు తెలియజేసిన మహనీయులు శ్రీ ము. రాఘవ అయ్యంగారు.

ఈ సందర్భమున యశశ్శరీరులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు 'నన్నయకు పూర్వము ఛందస్సు' అను వ్యాసమున వ్రాసిన వాక్యము నిట నుదాహరించుచున్నాను. 8 "వాంచియా యను నాంధ్రచ్ఛందః ప్రణేత మనకు తెలియరాకున్నాడు. ప్రాచీన లిపి రీతిని పరిశీలించినవారు వాంచియార్ అనుపదము రేచియార్ గా సంస్కరింపవచ్చునిరి. రేచియార్ అని యున్నచో నీ యాగ్రంథము రేచన (రేచన) రచియించిన కవిజనాశ్రయ మగును." ఈ విషయమై పర్యాప్తమగు పరిశీలన జరుగవలసి యున్నది. గుణసాగరుడు పేర్కొనిన వడుకచ్ఛందము రేచన రచనమగు కవిజనాశ్రయమగుచో, తమిళములో ఛందోగ్రంథ రచనమునకు తెలుగు రచన మొదటే మార్గదర్శకమయ్యెనని నిస్సంశయముగా నుడువవచ్చును.

తమిళ శైవసాహిత్యమును పరిపుష్టము కావించిన గ్రంథములలో బసవపురాణ మొకటి. తమిళ బసవపురాణమునకు మాతృక పాల్కురికి సోమనాథుని బసవపురాణమని విజ్ఞులంగీకరించిన విషయము. కన్నడ బసవపురాణమునకును మాతృక తెలుగు బసవ పురాణమే

తమిళ బసవపురాణము క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దిలో వెలుగులోనికి వచ్చెను. ఇది పద్యకృతి. కవిని గూర్చిన వివరములు సరిగా తెలియవచ్చుటలేదు. కథాకథన దృష్టితో చూచినప్పుడు తెలుగు తమిళ బసవపురాణములందు కొంత భేదమున్నట్లు కానవచ్చును. తమిళ బసవపురాణకర్త కన్నడ బసవపురాణమునుకూడ ననుసరించుటచేత కథాకథనమున భేదమేర్పడినది. తెలుగునలేని కొన్ని కథలు కన్నడ బసవపురాణమున నున్నట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పేర్కొనుచున్నారు 9 ఎటులయినను వీరశైవ సాహిత్యమున పాల్కురికి సోమనాథునిది ఆచార్యపీఠమనవచ్చును.

రామరాజభూషణుని రమణీయకృతియగు వసుచరిత్రమునకు తమిళమున చక్కని యనువాద మొకటి వెలయుటయే కాక ఆ యనువాదమునకు తమిళసాహిత్యమున స్థానములభించుట హర్షింపదగు విషయము. తమిళ వసుచరిత్రము క్రీ. శ 16 వ శతాబ్దము ఉత్తరభాగమున గాని 17 వ శతాబ్దము మొదటి భాగమునగాని వెలసినట్లు తెలియుచున్నది. ఆరవీటివారికి చెందిన విజయనగరాధీశ్వరుల సామంతుడును, తిరుచిరాపల్లి జిల్లాలోని ముసువై పరిపాలకుడు నగు తిమ్మభూపతి ప్రేరణచే కొండైయూరు అంబలత్తాడుం అయ్యాన్ అను కవి వసుచరిత్రను తమిళమున చేసెను. తిమ్మభూపతి ఆదిపరుపతాదిబగుణ అను నొక తమిళకృతినికూడా పొందెను. తిమ్మభూపతి తండ్రి

---

6. చూడుడు: శ్రీ నిడదవోలు వేంకటరావుగారి దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము.

7 వ్రాతప్రతులలో అవరంజియార్ అని కలదు.—'[illegible]

8. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పుట 80.

9. చూడుడు ఆంధ్ర గ్రంథమాలవారి బసవపురాణ పీఠిక (పుట 38)

శోధన సంచిక 1 సంపుటి 2 నుకూడా చూడుడు (పుటలు (12-19)

అంత సర్దారు కనుసన్న నవనిపాలు మోల, లోని బంగరు మొహరీల తళుకు
వెలిని గప్పిన పన్నీరు విరులనుండి యొలుకఁ దెచ్చి పెట్టెను బల్లె నొక ఘటంబు.

అపుడు దివాను లేచి ప్రియ మారఁగ నిట్లు వచించు "ఱేఁడు మీ
యుపకృతికిన్ బహూకృతియు నుల్లన మంది, యొసంగె వేయి నూ
ఱు, పదియు, నాఱు మొహరుల్ జలజారికిఁ బోఁగు వోలె; నీ
యుపదను స్వీకరింపుఁ డిది యుష్మదనుజ్ఞకు సూచకంబుగన్."

అని యా విప్ర కుమారునిం గని దివా నందీయఁబోఁగా, నతం
డను: "నో దేవ! క్షమింపుఁ డిట్టి యులుపాలం దేమియున్ లేదు నా
మన, మిప్పింపుఁడు మన్మనోహరము క్రొంబన్నీరు పూ వొక్కఁ డ
న్ననయే నాకుఁ బ్రియంబు, నమ్మత; మదే నా పట్లఁ గట్నంబగున్."

"అగును, గులాబి క్రొవ్విరి ప్రియంబగు మీ కని తొల్లి వింటి, మా
సొగసును, దీపులే వలపు జూచి రహింతురు గాని కాన్కగాఁ
దగునని పూవుఁ గోరుదురె? త్వాదృశు లెంత రసజ్ఞులైన; నీఁ
దగు బహుమానముం గొనుచు ధన్యుని జేయుఁడు నన్ను; వేఁడెదన్."

అని జనవరుఁ డత్యనునయమున వచియించి మఱి వేయి మొహరీలం దె
మ్మని యానతి యిడి, తేరఁగఁ గొనుఁడని యా యువ చికిత్సకుని నర్థించెన్.

ఒకరి మొగంబు నింకొక రయోచనులై తెలఁబోయి పశ్న సూ
చకముగఁ జూచుకొంచపుడు సర్వ సభాసదు లబ్రమంది యొ
క్కొక్క రొక రీతిగాఁ దలఁచి, "రొల్లక కాదిది చాల కంచుఁ, జా
లకయును గాదు నేరక ని లాఁతిగ" నాతని గూర్చి యీ గతిన్.

కను నమాయికుని బలెఁ గన్పడుచునుండె! న గ్రహారమొ! జాగీరో! యడుగకుండ
నలరఁ గోరుట యేమిటి? యడుగ నేర్వకున్న నిచ్చినదే కొంట యుత్తమంబు.

ధీనిధి యతండు, వానికిఁ దెలియకున్న? యెట్టి తలఁపున నిట్టు లర్థించె నొక్కొ!
యుర్వరాంతరమున సాగరోదరమున నేమి యుండునో! యెవ్వార లెఱుఁగఁగలరు.

"ధనముతోఁ బనిలేదు, మీదయయెయున్న నొక గులాబి ప్రసూనంబె యొసఁగు దేవ!
యదియె పదివేలు, నాకుఁ బ్రియంబు సుమ్మ యన్న మేల"ని యతండంత విన్నవించె.

అనుడు దివాను పల్కె: "ముద మంది నవాబిడ నీ బహూకృతిన్
గొనుటయొ! చాలదంచు మఱి కోరుటయో! యది కా దటంచు న
చ్చినయది తెల్పుటో! కరము శ్రేయము గాని ప్రసూన మొండె మా
కొనరు నటంచుఁ గైకొనమి యొప్పదు ధిక్కృతి కూడ దేరికిన్."

అంతటయుఁ బాదుషా మనువు "నారసి కోరఁగ నిందు వాని, నీ
దినమున నేఁకో యతఁడు తెల్పుటకుం గను సంశయించె, రే
పనునను మారఁగా నడుగ నాశయమున్ వచియించు, నేఁటికే
జనసభయున్ ముగింత" మన సమ్మిళితం బయిపోయె గోష్ఠియున్.

ఇంత ధైర్యంబు తోడ నా యెదుట మెలఁగు నతఁడమాయికుండైన, సత్యాశ్రయైన,
యోగ్యుఁడైనఁ గావలె, వానినొంటిఁ బిలిచి కట్నమీయఁ బోఁ దెలియునుగాదె యంచు.

అమ్మఱునాఁడు తేదు తన యంతిపురానకు నా కుమారి నా
ప్రేమ్మునఁ బిల్చి తన్నుఁగడు ధన్యుని జేయు నుపాయనంబు గై
కొమ్మని విన్నవించె నటఁ గ్రొత్త గులాబి ప్రసూన మొండు పూ
ర్వమ్మునఁ గంటె హెచ్చుగల బంగరుపున్ మొహారీల నుండఁగన్.

అన్యులెవ్వరు లేర్గాని యచటి యువని కాంతరమునుండి రవ కశీయముల గవళి,
విడియముల తావి పరతెంచి వెల్లడించె నువిద లందుండి తిలకించుచున్న జాడ.

వినయము దోఁపఁగా నిలిచి వేడుకమీఱఁగ నంజలించి, తా
జనకుని రాయిడించి పెలుచం దనపట్టిన పట్టె కోరు నం
దనుబలె—సాహసం బనుఁడు, తప్పిటు కూడ దను డు—తొల్లి కో
రినయది కోరె నాతఁడు వారిన్ ధృతిమైఁ బతి కద్భుతంబుగన్.

"ఇట శుద్ధాంతజనంబు దక్క నొగులిం కెవ్వారలున్ లేరు, మీ
రిటు సందేహము నొందనేల? ధృతిమై నర్థింపుఁ డీఁదైన నే
మిటి కాంక్షించితిరో! మతేమి వలెనో! మీ యిష్ట మేదని యెం
తటిదేఁ గాదన కిత్తుఁ గోరుఁ"డని యంతన్ జేఁడు వ్రాక్రువ్వఁగన్.

అనుచు ధరాసుకుం డపుడు: "ప్రాణపదంబగు నాకు నాగులాల్
గొనబు గులాబి కెందళుకుఁ గ్రొవ్విరి యయ్యది మన్మనోరథం
బనుపమ సౌహృదదాస్పదము, నవ్యయ నవ్యరసప్రదంబునై
యనుపదమున్ ముదం బొనఁగు నన్యము లేటికి నాకు భూవరా!

హృదయాధీశ్వరిగా విదేశయయినన్ ప్రేమింతు నా క్రొవ్విరిన్
మది, నా వల్పుల కొల్కి యున్ నలచి యాత్మస్నిగ్ధముగ్ధాధృతిన్
బొదలించునే నను, మా పరస్పర పురాపుణ్యాగతంబైన సౌ
హృద మాదర్శకమై, పవిత్రతరమై యేపారు విస్ఫారమై.

అలరు రాకుమారి యా గులాబి తమకుఁ బ్రియతరంబు, నాకుఁ బ్రియతమంబు,
విరిసి వలపుఁగొన్న విరి రాణి నీయఁగా నింత యరయనేల? యిందు దేవ!"

తనకు మారు నీ గతి మఱేమి తలంచెనో! కాని రాజ్యమున్
పోసిన కీలికా శిఖయుఁ గాలెను భగ్గన లేచి తేఁకు నం
బ్రాపదమూర్తియై మెలుఁగు రాపడుఁగా నరదార్లఁ బిల్చి "యీ
ఘాసుకు వైదునంతా ననుపుం డిదె పొందు"ని యాన తియ్యఁగన్.

కోకిలా కాకలీ ధ్వని యొకో! యనఁ గర్వనఁ గేక వాని బం
ధీకృతుఁ జేయుఁడంచు ధరణీపతి యానతి యిచ్చునంతఁ బే
రాకులపాటుగన్ యవనికాంతమునుండి వినంబడెన్ సతీ
లోకము సంచలింపఁ బతిలోనికి న్యాతము మీఱి కేఁగఁగన్.

అడలి సుల్తాను లోనికి వెడలినంతఁ దల్లి యొడిని కుమారి మూర్ఛిల్లి యుండఁ
జెలులు శైత్యోపచారముల్ సేయుచుండఁ దల్లడిలి తల్లి పతి బిట్టులిల్లి చూచె.

చూచిన యంతనే నృపతి శోకము పట్టఁగలేక యేడ్చె కొం
చేఁపు తత్తఱంబున "నిదే మిటు లయ్యెను రాకుమారి, నన్
బ్రోచెడువారు లేరె? రుజఁ బోల్చి ప్రతిక్రియఁ జేయరారె? ప్ర
త్యాచరణీయమేమి?" యని యచ్చటఁ గూలఁబడెన్ మహాధిపై.

బీగము సాహిబా యపుడు భీతిలి వాకొన మాట రాక మూ
ర్ఛాగతపోలె నుండ నొక యాళి వచించు: "నదేమొ! మీరు కై
దీగ నొనర్చినాడి ధరణీదేవ కుమారకు నన్నతోడ మూ
మోహ మదెట్టులన్నయదియో! సుత మూర్ఛిలె నేమి సెప్పఁగన్.
అతనిని తోడ్కొనివచ్చిన సుతప్రాణము మఱియు నిటుల మూర్ఛనఁ బడిలే
దతడే కుదుర్పఁగఁగలఁడ"ని యతివ నుడువ తేఁకు నటులె యాజ్ఞాపించెన్.

అంతయుఁ బాదుషా కొక మహాద్భుతమై పొడకట్టె వారి యే
కాంత పరస్పర ప్రణయగాథ వినియున్నదె నాఁ డనర్చి దు
ర్దాంత నిజాభిజాత్యమున తా మలినీకృతమైన యా ప్రభు
స్వాంతమునందుఁ బాటి యట వాని ప్రసన్నుని జేసె నంతటన్.

పొంకల శైత్యోపచారాలవలనఁ దెలివిఁ గనియె రాసుత; ప్రభు నాజ్ఞ ననుసరించి
వైద్యుఁ గొనివచ్చి తెరయావల నిలిపి దోడయని యనుజ్ఞకై వేచియుండ నపుడు.

నృపతి కుమారిఁ జేరి యను "నేల వచింపవు తల్లి! నీ మనం
బెపుడును నాకు; నీకుఁ బ్రియ మెయ్యదియో యది నాకుఁ గాదె? నీ
వపుడటు లొప్ప మాకు నపుడు లాతెను, నీకు మఱేమి బాధలే
దిపుడు గదమ్మ! నీ మనసు నిప్పుడ తీర్చెదనమ్మ తల్లిరో!

మీ దాంపత్యము దైవకల్పితము మీ మేలైన మేల్ దివ్యమై
కాదా? మాన్యము, మీ పరస్పర మనఃకాంక్షల్ పవిత్రంబు, ల
క్ష్యాదర్శార్హము, మీ వివాహమున కేలా? యింక సందేహ సం
పాదంబుల్ మతభేదముల్ తనయ! నీ స్వాంతం బిదేయౌఁ గదా."

అనుటయు రాణియు నారాట్తనయయుఁ దమ సమ్మతులను దమ చారువిలో
కనములనే తెలుపుటయుఁ జనపతి పలుకున్ వెలుపలి సర్దారు వినన్.

"మనసు గలసిన తఱి మఱి మఱుఁ గదేల? యతని విడువుఁడు లోనికి నరుగుదెంచు"
ననుడు రాణియు రాసుత చనిరి దవ్వు తెరలలోనికి శ్రీనాథుఁ డరుగుదెంచె.

పలికెను నవాబు: "మీరు ప్రతిభామహనీయు లటంచు ధర్మ ని
ష్ఠులమతులంచు నే నెఱుఁగుదున్ దొలి, యిప్డును మీ యచంచలా
చలనమధైర్యవర్తనము సత్యమయవ్రతమైక దీక్షయున్
దెలిసికొనంగ నేఁ గలిగితిన్ గడు ధన్యుఁడనైతి భూసురా!

కృతఘ్నుఁడనై యరయక మీ యుపకృతి కపకృతిని జేయ నూహించితి, నా
యపరాధమ్ము దలంపక కృప మీ తలఁపొక పరి నెఱిఁగింపుడు మరలన్."

అనవుడు విప్రకుమారుం డను: "నా సాహసమునకు సమాధానము నో
జనవర! నావల యీవలసినయది మఱియే నవాబు చెంగట లేదిన్.

తమకు నింతవట్టు దయయున్న నామీఁద నొక గులాబి విరియె తెమ్ము నాకుఁ డదియ
నా కుపాయనంబు నా కిష్టమూ; నదే నా మనోరథంబు నా ప్రియంబు."

నావుడు పాదుషా నుడువు: "నా కది జీవము, జీవనంబు, సం
జీవని, జీవికా పరమశేవధి; యీవిరి జీవిత ప్రధా
నావధి నే విధిన్ విడుతు? నైనను దత్సుమ వల్లికం బున
ర్జీవితఁ జేసి యిచ్చితిరి చెట్టిడుచోఁ బువు నీయఁ గష్టమే?"

అనుచుఁ దెరలోనికని చని తనకుమారి విరి గులాబియా గుల్మాగ్ర దరిని కోసి
యొడలు వడఁకాడఁ గన్నీరు వోడమ నతఁడు మాటరాక గద్గదిక రాఁ గ్రోటుకొనుచు.
"రమ్మిటు తల్లి! నా తనయ! రమ్మ మఱింకేల నీకు నీ
సమ్మిన కాంతు పొంతను? ఋణం బిటు నేఁటికిఁ జెల్లె నీకు మా
కమ్మరో! నీ మనఃప్రియమున కర్పణ చేసెద రమ్మ"టంచుఁ గం
పమ్మునఁ గూఁతుఁ దోడ్కొనుచు వచ్చి పొరిన్ వచియించు విప్రుతో.

"ఇదిగో! మీ విరికాన్క, యియ్య దనమం బిద్దాని శయ్యా రహా
స్సదనాలంకృతి కాదు కాక ప్రభు పూజావేదికం గూడ నో

ప్పిద మాగితి నలంకరి తు గనుచున్ విశ్వాసినై దీని నీ
కిదె' యర్పించుచు నుంటినం" చతని కందిచ్చెన్ సుతాహాస్నమున్.

శరమును క్షీరమును గరణి వరభాగీరథియు గలశవారియు విధిన్
గరములు రెంటిన్ గలసెను బరమ పరస్పరముగాఁగ వారల వలపుల్.

వ్రీడవనతాననయై చేడియ మేల్ముసుఁగిడి వడిఁ జిక్కిన కలుకున్
జేసినలన భ్రమఁ ద్రొట్టిలు పోడిమి చూడ్కులు చలించిపో నిలఁబడియెన్.

ఒడలు పులకింపఁ, గొంకెను రుగ్మపింత, స్వాప్నిక మొ! సత్యమో! యీ యవస్థ నే కు
తెలియ నేరక ద్విజుఁడును విలిచియుండె వెలమి శోకంబుఁ బొనుఁగొన బలుకుతేఁడు.

"లలితమంజుల వత్కళా జన్మభూమియగు పారసీకోద్యాన వనమునందు,
బ్రభు నిరాకారతోపాసనా నిలయంబులైన మసీదుల ప్రాంగణమున,
శక్తిసామర్థ్య ప్రశస్తసారంబైన శ్రీ తురుష్కమత సుక్షేత్రమునను,
నధ్యాత్మ విద్యా రహస్యమగు సూఫీ ప్రసిద్ధాగమామృత సేచనమున,
బూచిన గులాబి విరి యిది పూత వేదభూమి యందంటు కట్టఁగాఁ బోలునంచు
భవ్యమై క్రొఁ గాన్కగా నీయఁబడుచు నున్న దట్లు ప్రోచెదో! సుమ్ము నీ యిష్ట"మనుఁడు.

అంగీకారము మూపెను భంగిన్ ధరణీసురుండు వంగి నమస్సుల్
పొంగి ధరాపతి కిడుటయు నంగనయును జేసె నృపతి యాశీస్సు లిడన్.

## తు ది ప లు కు

కంను కూర్త్రిమను గమలూరు గ్రామంబు గల దంగఁ ఒరినర స్థలనూలందు
"శ్రీనాథ" మను పేరఁ జెలువారు వింటిపేర్గల బ్రాహ్మణ కుటుంబములు దస గ్వో
శేతేవి కరుణనో యిప్పటికిన్ వార లధికభూస్వాములై యలరుచుండ్రు,
రిందుండు వారల యిష్టదైవము, వారు చంద్రవతంబొందు నలుపుచుండ్రు,

పోదరులఁబోలె యవకుల జూచుచుండ్రు,
చక్కని గులాబి విరివంటి సౌరు గలిగి
లలితకళలందు వైద్య విద్యలను జేగు
గాంచుచున్నారు నేఁటికిం గలరు వారు.

పైతమీ ఫ్రెంచి ప్రభావమునకు లొంగిపోయిరి. ఇటి యుదాహరణములు ఫ్రెంచి యువకులకు నవ్యోత్సాహము, నూతన పరూశ్వాసమును గల్గించినవి. వీరా భావచ్ఛాయలలో నేతో క్రొత్తదనము జూపింప నట్లూత లాగిరి. వీరి కాంగ్ల భావయందలిపరిచయముచే నవజ్ఞ కలిగినది అందుచే నా భావ వారికి సమర్థమైన వ్యక్తీకరణ సాధనముగా దోచలేదు.

అటు సాంకేతిక ప్రతిపత్తిం జూపగల 'ఎర్నెస్ట్ హెమింగ్వే' మొదలుకొని, యిటు పూర్వాచారపరాయణతకుం జెందిన 'లూయీ బ్రూమ్‌ఫీల్డ్' వరకు నీ ప్రభావమునకుం బ్రబోధితులగుటలో నాశ్చర్యము లేదు. ఏలన, వారు చాల కాలము పారిస్ నగరమందుండిరి. కాని, చిరకాలము అమెరికా సంయుక్తరాష్ట్రముల యందే తమ జీవితమును గడిపిన విలియం ఫాక్నర్, 'జేమ్స్ ఫారెల్' వంటి వారికిం గూడ నీ ఫ్రెంచి ప్రభావము సంక్రమించుటలో నాశ్చర్యమున్నది. ఫ్రాన్స్ స్వీకరించు విధముతో జాయిస్, స్టైయినుల విధానమును సంధానించి, పరిశీలింపగలవారికి యా ఫ్రెంచి ప్రభావ మతకతిమునకు, మన యనుభూతికి సన్నిహితములుగాని, యాంత్రిక వాచకాభినయములు గల పాత్రలను భౌతికముగ సన్నిహితముగ జేయగల భూతగ్రహణ యంత్రముతో వలె నా విధానమునందుం బాత్రల పరిశీలన యుండును. ఆ పాత్రల యాథార్థ్యమునకును, మన యాథార్థ్యమునకును నడుమనున్న వ్యత్యాసమును సూచించు తెరవలెంగూడ నీ పరిశీలనా కటకము తోడ్పడగలదు. కాని యీ ఛాయగల రచనము లోకాదరముం బడయజాలకపోయెను. అందు చిత్రీకరింపబడిన పాత్రలు, దృశ్యములు, నింతకుం బూర్వము పరిచితములైనపుడు నత్యంత దుర్గ్రాహ్యములై నిరాదృతములైనవి. ఈ కాలమున నమెరికాలోం బ్రముఖుండైన నవలాకర్త విలియం ఫాక్నర్ స్వస్థానమున స్వభావమయందు సర్వప్రియత సంపాదింపలేకపోవుటకుం గారణమీ ఫ్రెంచి ప్రభావ మతనిలో స్ఫురించుటయే యనదగును.

ఫాక్నర్ రచించిన వైదు నవలలు. ఈ యైంటియందును సంయుక్తరాష్ట్రములలో దక్షిణభాగమే రంగభూమి. అచటి ప్రాగ్నీగ్రోయులును, మధ్య ప్రతీచ్యాంశమునవలె నీరంగవిశ్వాస మూర్గెపు పారకులకంత సుపరిచితముకాదు. భాషా వివిధత్వమునకు తోడీ నవలలు తీవ్రబలాత్కారమును, ప్రబల దౌర్జన్యమును, సంకుచిత సాంఘిక శాఖాభిమానమును సూచించుటయే ప్రధానముగ గోచరించును. సురాపానము, పాశవిక కామము, మన్మానము, మున్నగు నీచమానవ దోషములీ నవలలలో క్రియావేగమునకుం దోడ్పడుచున్నవి. వీనికన్నిటికిని గార్యరంగము 'మిసిసిపి'నది క్రింది పరీవాహప్రదేశములలో నొక మూఢ్మ భూభాగమన్న సంగతి నతడు మఱపు రానీయడు.

అప్పటికప్పుడు నమ్మరానివై, ఛీలివిగొల్పు రకరకములైన దౌర్జన్యముల నతడు చూపును. ఆ పాత్రలు 'డోస్టవెస్కీ' పాత్రల వలె వికృతములు హాస్యజనకములునై యుండును. ఫాక్నర్ యాపాందించిన కృతులు సాంప్రదాయికముగ కొంత వ్యస్తశోభితములో జాతీయతచే నంత యమెరికా సంయుక్తరాష్ట్రములు, ప్రజాంతర్యుద్ధ ఫలితముగం బ్రబలిన ద్వేషవివాళముల నవుమం బ్రభావ్లిలవె. కామ్ప్సన్స్ (Compsons) కుటుంబము. ఛిన్న దిశోన్ముఖముపనట్టి శ్వేతజాతి కుటుంబమునకుం జెందిన యువివృత్తిము నందాంచిక క్రౌర్యము, మూర్ఖత, దురాశ యాత్మహత్య, రక్తసంబంధుల కాముకవ్యాపారాదికము నుండుట యంతి యసహజము గాదనవచ్చును. అపరిపక్వము, నపరిష్కృతమునగు భావ కొంత కొంతకుం బరిపక్వము బరిష్కృతము గాగా, కృతకము నద్భుత విషయ విశిష్టమునకు గూపక ఖేదములవలె నుండు ఘట్టములు పోనుపోను పరిశుద్ధములై సాగిన యాతని నవలలును గలవు.

కేవల ప్రతిభయందును, సంఘ ధర్మాభిజ్ఞతయందును 'లూయీ బ్రూమ్‌ఫీల్డ్' కంటెం గించిన్యూనుడయ్యు, ఫాక్నర్ జాతీయమైన నవలా నిర్మాణకళయం దధిపుడు. అతని సాంఘిక శాఖాభిమాన మనగామనుకుటకంటె గుణమైనది. ఇంగ్లాండు నందలి యుగారు పందులగు, మూల మూలలలో నివసించి వానియందు బుట్టు పాతము, నభిమానమును జూపినంతమాత్రముచే డికెన్స్, హార్డీ ప్రముఖ లాంగ్ల నవలాకర్తలు కొకపోయిరా?

ఇతని కళ్యయంమక విక్రుత ప్రభావముల సాంకర్య ప్రవర్తనము. చాలవఱకు మాంసలీము నీగ్రో జాతిది; పరూపము జర్మనులది.

ఈదృశమైన సంకుచిత జాతీయత నిరసింపం దగినదనియు, నవలలలోం గాల్పనిక జగత్తులు సృష్టింపం బడవలెననియు వాదించు వేతోకాఖవారమెరికాయందు బయలుదేరిరి. మిస్ 'విల్లాకేథర' వీరిలో లబ్ధప్రతిష్ఠురాలు. 'జేమ్స్ బ్రాంచి కేబెల్' కట్టుకథలలోను, 'జోసెఫ్ హెర్గ్‌షైమర్' ఐతిహాసిక కథలలోను, కాల్పనిక శాఖయందును ప్రఖ్యాతులు. తన జీవితకాలమునందే యనన్యమగు ప్రజాదరమును జూఱగొని నిస్తంద్ర కీర్తి సాంద్రయైన మిస్ విల్లా కేథర్ తొలుదొల్త రచించిన రెండు నవలల యందును బాశ్చాత్యము దుస్త్యజ మగుటచే మధ్య ప్రతీచ్య వాతావరణ మున్నది. కాని, ఫాక్నర్ ప్రభృతుల సాంఘికాచార పరిశీలన నైశిత్యమును, సంకుచిత జాతీయతా పాక్షికతయు లేవు. భావసారళ్యమునకు శియ్యాసౌభాగ్యమునకు కేథర ప్రసిద్ధిగన్నది. కాని, యామె సమకాలిక జీవితమును జిత్రింపలేదు. భూతకాలిక చిత్రణమునకే తన ప్రతిభ సమర్థమని స్వశక్తిని గుర్తించుకొన్నదామె?(5) నుతో కావ్యము లనదగిన యిట్టి నవలికలయందామె క్రమక్రమముగ సిద్ధహస్తురాలయ్యెను. ఈ తరములో నింగ్లాండునందు విల్లాకేథర కంటె సర్వతంగలిగి యశస్వియైన వారి నమెరికాలో జూడబోము.

దివ్య వస్తువు, శిల్ప సౌందర్యము, వీరపూజ, విస్మృతకరపభావ భావనా పరమశేము, నన్నియు నెప్పటియట్లే యున్నను నీమె కుది రచనలలో సంజవెలుగుల వెండి వెలవెలలు విలవిలలాడినట్లు దోచును. ఇది యొక కేథర నవలలయందే స్ఫురించినదో నది సహజముగ శిల్పులందఱకు వార్ధక్యమునం గలుగు శిమనదతియేమో యనుకొందుము. కాని యానాడు 'థార్టన్ విల్డర్', 'ఆలివర్ లాఫార్జ్', 'రాబర్ట్ నేథన్' ప్రముఖులగు యువకుల రచనలలోని శక్తిగూడ క్రమముగ క్షీణించుచునే వచ్చినది. దీనిం బరిశీలింపగా సమకాలిక చిత్రణమెంత విక్రుతము, నవిశీకరము, దౌర్జన్యపూరితము నైనను, దాని కొంతశక్తియున్నదనితోం బరుగులిడి ప్రత్యక్ష జీవిత జలాశ్రమున మునుగులు తిరిగి మునిగి పరిసరముల నన్నివెంటల వేటాడుట యంతే నవలాకారుల జవసత్త్వములున్న వా యనిపించును. ఏనను, దేశకాల వ్యవస్థా పరిచ్ఛిన్నములుగాని రచనలు సాగించు సముచిత భావనా పరులకు, భాషా సంప్రదాయాభిజ్ఞులకు, సుదాత్త ప్రతిభా శాలురకు, స్వచ్ఛ శిల్పులకు, నే నాగరిక దేశమందైనను గౌరవస్థానము నుండుట యుచితము. అట్టిది, యమెరికనుల నవలా సాహిత్యమున నిటీవలి వీనిలలో లేవట్లు దోచును. తాత్కాలిక నిత్య నైమిత్తిక పరామర్శకులకే యెక్కువ భావి యున్నట్లు స్ఫురించును. కాని, యనుభవాతిశయ పరిపూర్ణమైన భూతకాల మాహాత్మ్యముగ భావికాలమున కమూల్యమగు శాసనరూప సందేశము నొసగగల మానవు

కిరణ్: ఎలాగూ చూడనూ — సరేగాని. ఒక స్త్రీ ఏకాంతంగా నిన్ను కలుసుకుంటుం దనుకో — నీలో ఏం భావాలు జనిం చవా? ఏ కోర్కెలు రేకెత్తవా?

రాం : అంతవరకూ రానిచ్చేదెవరు? నే నే స్త్రీని ఏకాంతంగా కలుసుకోను. అందుకు యిష్టపడను కూడా.........

("అది పిరికితనం" అంటూ కొంత్ ప్రవేశిస్తాడు. పూలపూల బుష్ షర్టు. చేతిలో పూవు. మంచి షోకిలాలా వుంటాడు. మధ్య మధ్య పూవునాఘ్రాణిస్తూ షికార్లు చేస్తుంటాడు.)

కొంత్ : రాం. నేనన్నది వినపడిందా? పిరికితనాన్ని అసహ్యించు కుంటాడు ఈ కొంత్.

రాం : అది పిరికితన మెందుకవుతుంది?

కిరణ్: ఎలా అవుతుందో నే చెప్పనా.

కొంత్ : నివ్వేం చెప్పగలవోయ్. పాలబుగ్గల పాపవి. నే చెపుతా విను రాం. ఈ కొంత్ ఎంత అనుభవశాలో నీకు తెలుసుగా?

రాం : ఆ. ఏకాంతంగా కొంతా కాలక్షేపం, తనకు దినచర్యలో ప్రధానఘట్టం. ఆ నే మహాత్మ్యం ఎలా మరిచిపోగలను

కొంత్ : ఇంకేం. అందుకనే నిన్ను "పిరికివాడివి" అంటున్నాను. ఒంటరిగా స్త్రీని కలుసుకోడాని కెందుకంత భయం?

రాం : భయం కాదు. పిరికితనం అంతకంటే కాదు. ఎందుకు ఒకర్ని ఒంటరిగా కలుసుకోవాలి? ఏమిటి అవసరం?

కిరణ్: అవసరమో, అనవసరమో ప్రశ్న అడుగుదాం కాని, సపోజ్ నీకు తటస్థపడిందని అనుకో — అప్పుడు —

రాం : అప్పుడు. ఆమె అనుభావాన్ని, అనుభూతుల్ని వివరించ మంటాను. అర్థమయ్యేదాకా ప్రశ్నల్తో ప్రాణం తోడి తెల్సు కుంటాను. ఆమె అనుభవాలకీ, ఆశలికీ, ఆశయాలకీ — నా జీవి తానికీ, ఆచరణకీ మధ్య అంతరం, ఎడం ఎంతవుందో తెలుసు కుంటాను. ఆమెతో హృదయం విప్పి మాట్లాడుతాను.

కొంత్: Wonderful. పుటక్కిన కబుర్లు కబుర్లు కలుపుతావు. హాస్యాలు జోడిస్తావు. 'ఓ నా ప్రణయదేవతా" అని అష్టోత్తర నామాలు జపిస్తావు. ఆమె కులుకులలో, తళుకులలో, బెళు కులలో, హొయల్లో, చూపుల్లో మునకలేస్తావు. ముగ్ధుడవై మురిసిపోతావు. ఆమె పలిపమై, కంచుకమై జడలోపువ్వువై, కంటిలో పాపవై, కనుకొలకులలో వలువై, చెరగులో అంచువై, కుచ్చెళ్ళలో మడతవై, ముంగురుల్లో వెంట్రుకవై, నిట్టూర్పులో వేడివై, 'ఐస్"లో శాశ్వతైక్యమేనా ఊహం, తాదాత్మ్యం అని పులకరిస్తావు.

రాం : టక టకా! నీ అనుభవం అంతా కుమ్మరించేశావేం మాస్టారిన, అంతా మీలాంటి యంత్రబ్రహ్మలే అనుకున్నావా ఏమిటి ఖర్మ?

కిరణ్ : అనుకోడమేం. చూస్తాంగా రాం. నీ గొప్పదనం.

కొంత్ : రాం బుద్ధుడు, వివేకానందస్వామి! ఇంకా — ఇంకా —

రాం : ఇంకా అను నీ యిష్టం వచ్చినన్ని.

కిరణ్ : ఏమైనా "వనిత తివంత తా వలచివచ్చిన" అంత సులభం కాదు నన్నుముట్టమూకు అనడానికి.

రాం : అబద్ధం. మీ వృథాప్రచారం.

కొంత్ : కిరణ్. 'తెలిసీ తెలియని నరుడెల్ల బ్రహ్మదేవుని వశమే" అన్నారు పెద్దలు.

కిరణ్ : అదీ చాలను. "అనుభవంలోంచి వివేకం వస్తుంది. మరి అను భవమో? అవివేకంలోంచి" అన్నారు సైమన్ బోలివర్ బక్నర్.

రాం : అందరూ అన్నీ అంటూనే వుంటారు. అసలు మీకు ప్రపంచ జ్ఞానం తక్కువ. "ప్రపంచజ్ఞానం అంటే ఏమీ లేదు, మానవుల లోటుపాట్ల సమూహం" అన్నారు డికెన్సు.

కొంత్ : ఆఖరికి మాకే ఎసరుపెట్టావూ నీవు ఎక్స్పెరిమెంట్ చేసి చూడు. నీకే తెలుస్తుంది.

కిరణ్ : వీడికి తెలీటం కష్టం. మానవులు, భోగమనం — ఆకలి మంటలు, ఆకలి చావులు — ఇవితప్ప ప్రపంచంలో కులా సాగా హాయిగా ఎంజాయ్ చేయటానికి ఏమీ లేవంటాడు ఈ అభ్యుదయవాది. వీడికి ఆ పాడురొచ్చులో ఏం ఆనంద ముందో?

రాం : ఆ సత్యం కూడా రొచ్చే ముద్దులో ఏముందోయ్ తీపి. పెదవులు కలుస్తాయి. ఒకరి పెదవి సిగరెట్ కంపు అయితే, ఇంకొకరిది "లిప్స్టిక్' (Lip-stick) వాసన. పైగా లాలా జలప్రవాహం. అంతకంటె 'మాయా' రుచిచూడొచ్చు.

కొంత్ · Hopelessly Dirty fellow "The last puff of a cigarette is equal to the fist kiss of a lass" అన్నారు పెద్దలు. ఎంతమాధుర్యం చవిచూసినిదే అంతమాట అన్నారూ అని నా బాధ. నాసొద ఒకడూ ఆలకించడేం?

రాం : చెవుల తుప్పవదిలేట్టు వింటున్నా కొంత్.

కొంత్ : నివ్వేమన్నా అనుకో రాం. ఇంతకీ నే చెప్పదలచుకొన్నది ఏమిటి అంటే స్త్రీలని ఉద్ధరించాలి అని ఆ ఆశయం నా చిర సంచిత ధనసంచయం లాంటిది. నన్ను వేధిస్తున్న తపన పెడు తున్న మహత్తరమైన, మధురాతి మధురమైన వాంఛ. —

రాం : ఉద్ధరించు. ఎవరు వద్దన్నారు?

కొంత్ : కొబట్టే, నా వాంఛకు బూజుదులిపి పాలిష్ పెట్టాలంటే — వాళ్ళను బుర్రగలవాళ్ళుగా సబలలుగా, స్వతంత్రాభి ప్రాయాలు గలవారుగా తయారుచేయాలి. ఆర్థిక స్వాతంత్ర్యం వాళ్ళకు వచ్చేందుకు తగినస్తోమత కల్పించాలి. కమ్మరిలా సాగగొట్టి వాళ్ళబుర్రల్ని మరామత్తు చేయాలి.

రాం : అంటే. పాతిలాంతర్ని అలమరవించి ఉద్ధరించి, ఎలక్ట్రిసిటీ లేనిరోజున వాడుచేసుకున్నట్లా?

కొంత్ : ఎగతాళి చేయవాకోయ్. యుగయుగాలుగా స్త్రీ దుర్దశ అనుభవిస్తోంది.

రాం : నీకు కనువిప్పు ఇప్పుడు కలిగిందా?

కిరణ్ : నీ ఇష్టం వచ్చినట్లు ఉద్ధరించవోయ్. ఎవరు వద్దన్నారు?

కొంత్ : అదికాదు. రాం ఎగతాళిగా మాట్లాడుతుంటేను. కవి ఏమ న్నాడో తెలుసా?

నా కవిత్వం—

వేయి పులాగీలశాఖ
మజ్జిన్లు పరిచిన
వేయి బూరగదూది పరుపుల దొంతర్లు
నిజం నిజం.

నా కవిత్వం—

మాత్ర వధూ నేత్రాల్లో
ఉజ్వలంగా వెలిగే
లేత చిరనిజేర
జీవనలో దాగిన
ఇంద్ర ధనువు.

నా కవిత్వం—

ప్రేమ కాసీ ప్రియుల హృదోపహూహానమ్ముల మెలకు
ఉన్నతి గజ్ఞాజ ఘర్షణమ్ముల,
అంతిమే కాగు—
ఘర్షణమ్మున జారిన ఘర్మకణము.

రాం: శాంతించు మహాత్మా. ఇంతకంటే కవిచాపల్య కోకంబట్టి పెటు.

కిరణ్ ఆనందించలేనివాడికెందుకు సౌందర్య ప్రదర్శన శుద్ధదండుగ.

రాం చిత్రం. ఈవ సూక్తులు వినలేక చస్తున్నాను.

కాంత్: మత్తి పిరికివాడివోయ్. నిన్ను చూస్తే జాలేస్తుంది. నా ధోరణికే తట్టుకోలేనివాడివి—ఆడదాని ప్రేమ కొంచెం తాకిడికి ఏం తట్టుకోగలవు?.

రాం: ఫరవాలేదు నాయనా. నా ధోరణిలో నన్ను బతకనీయండి.

కాంత్: నీ కోరిక ఫలించుగాక. అరె చాలా టైం అయిందే. నాకు పనివుంది వస్తా Cheer you both (కాంత్ నిష్క్రమిస్తాడు)

రాం: అమ్మయ్యా! సుడిగాలిలా వసాడు; ఏదో గుమారం లేపి పోతాడు.

కిరణ్: కానీ లైఫ్‌ని పరిపూర్ణంగా ఎన్‌జాయ్ చేయాలనే తత్వం కాంత్‌ది.

రాం: ఇంతకన్నా చీకూ చింతా లేనివాడు ప్రపంచంలో వుండడేమో కిరణ్, జీవితాన్ని ఒక ఆటవస్తువులా చూస్తాడు. దొరికినంతమట్టుకు అనుభవిస్తాడు,

కిరణ్: అదోరకం పాలిసీ.

రాం: సరేగాని కిరణ్ నీవు ఏదో బాధపడుతున్నట్లున్నావ్.

కిరణ్ ఏం లేదే!

రాం ముఖాన్ని అద్దంలో చూసుకో. నా దగ్గర కూడా దాచగలవా ఏమిటి?

కిరణ్: ఏం లేదు రాం. కాంత్ చెప్పినదానిమీద ఆలోచిస్తున్నాను. నేను ప్రేమించాను "ఎవరిని" అని అడక్కు.

రాం: అడగనే అడగను, భయపడకు. ఇవ్వాళ్టి నీ మాటల ధోరణినిబట్టి నేనుంగా గానే వూహించాను ఆమెను సంపూర్తిగా అనుభవించాలనీ—ఆమె నీకోసమే సృష్టింపబడిందనీ—అనుకునే దాకా వచ్చిందా—నీ ప్రేమ ఘట్టం?

కిరణ్: లేదు. ఇంకా అంత అధికత్వాన్ని పొందగలిగేటంత స్వార్థపరుణ్ణి కాలేదు, కానీ—ఆమె సౌందర్యమధువును—ఆ అనాఘ్రాత వికసిత పుష్పసౌరభాన్ని ఆస్వాదించాలని ఉద్రేకంతో ఆశతో విలపిస్తున్నాను వియోగాన్ని ఎలాగో భరిస్తున్నాను.

రాం ఏమైనా—నివ్వెవర్ని ప్రేమించినా—ఆమె ఎలాంటిదైనా—నా అభిప్రాయం చెప్పమంటే—ఆమెమీద కల్గిన, కల్గుతున్న, నీ తుచ్ఛవాంఛను సాధ్యమయినంత తక్కువ మోతాదులో తగ్గించుకో. ఒకవేళ నీ ప్రేమ ఫలించకపోవచ్చు—దిగులు పడకు—అప్పటి పరిణామం నీ వ్యక్తిత్వంమీద ఎక్కువ దెబ్బతీయలేదు. ఏమీ జరగనివాడిలా మామూలుగా మనగల్గుతావు. నిజంగా నీయత్నం లాభిస్తుందే అనుకో ఆ నాడు—ఆ మధుర క్షణంలో—నీవు వూహించే, ఊహిస్తున్న, ఎన్నడు ఊహించలేని సౌఖ్యాన్ని రుచిచూస్తావ్.

కిరణ్: ఏమో! ఏమవుతుందో! నేను అసమర్థుణ్ణి. ఈ విషయంలో మొండివాంఛను ఫలితమెలా వుంటుందో నిర్ణయించలేని వాంఛను జయించలేక పోతున్నాను. క్షణికమైన యీ భౌతిక సుఖంకోసం నా శక్తిని, మేధను నిర్వీర్యంగా, బానిసగా, పతనం చేసుకుంటున్నాను.

రాం: తెలిసి బాధపడతావేం కిరణ్. మనోబలంతో మానవుడు జయించనిదంటూ ప్రపంచంలో లేదు. కాంత్ అన్నాడే "పిరికి" అని ఆ పిరికితనం నీలో చోరనీయకు. ఇన్ని కబుర్లు చెప్పి ఇంతలో డీలాపడతావేం.

కిరణ్ మళ్ళీ కలుస్తా రాం. నీ కాలం చాలా వృథా చేశాను.

రాం: ఫరవాలేదు మళ్ళీ కలుస్తావు కదూ? (కిరణ్ నిష్క్రమిస్తాడు)

రాం: పిడ్ని మాస్తే జాలేస్తుంది. కళకోసం వీడు బాధపడుతున్నాడు. ఆవిడ నా కోసం బాధపడుతుంది. ఇవ్వాళ కళతో మాట్లాడాలి ఆవిడ వస్తే బావుణ్ణు. (కాసేపు నిశ్శబ్దం. కళ్లు మూసుకుని పడుకుంటాడు.)

("Mr రాం" తెరలోంచి పిలుపు వినిపిస్తుంది.)

రాం: (దిగ్గున లేచి కూర్చుని) ఎవరు?

(తెరలోంచి) నేను కళని.

రాం: కళవా? చంద్రుడివా?

(తెరలోంచి) కాదు వెన్నెల్ని.

రాం: నా జీవితాన్ని వెలిగించడానికి వచ్చావా?

(తెరలోంచి) అవును. నిన్ను వెన్నెల్లో, తేలిపోయే మబ్బుల్లో తెల్లని ఇసుకతిన్నెల్లో, నీలిసంద్రతరంగాలమీద ప్రేమ డోలికల్లో ఊగించడానికి వచ్చా.

రాం: అంతే అయివుంటుంది. కాంత్ పంపించివుంటాడు నిన్ను. (తెరలోంచి కలకలనవ్వు వినిపిస్తుంది.) అవును. కాంత్ పంపాడు. నీ కాంట్లోకి. నీకు రసమార్గం ఎరిగించాలని—రమ్మంటావా! నీ జీవితనాటకంలోకి—నీ వెలుగుల బాటల్లోకి—నీ ఆశల కూటంలోకి—నీ భావాల అలల్లోకి—రమ్మంటావా?

రాం : రా సుస్వాగతం. ఇది సామాన్య ఆహ్వానం కాదు, ఒకడి చరిత్ర నిజాయితీ ప్రస్ఫుటమవటంకోసం—రా. నా కళ్ళ వెలుగుల్లోకి, నా ఆశాజ్యోతి నలంకరించడానికోసం—రా—నా మనోగవ్వారం విశాలంచేసి అలంకరించా—నా హృదయ కవాటాలు పూర్తిగా తెరిచా—రా. ఆహ్వానిస్తున్నా. నీరాజనం పడుతున్నా—నా జీవితకావ్య అధిరోహించడానికి—నాతో జీవితాన్ని పంచుకోడానికి—స్వాగతం సుస్వాగతం.

(తెరలోంచి) వస్తున్నా. వచ్చేశా—నేను శశిని. వెన్నెల్ని, (శశి ప్రవేశిస్తుంది. నిరాడంబరమైన వేషంలో అందంగా అగుపడుతున్న నాగరకత; ఆమె కళ్ళల్లో తొలిటూరి సహజసిద్ధమైన అమాయకత్వం తొంగిచూస్తుంటుంది.)

శశి : ఏం రాం. కవిత్వం మాట్లాడుతున్నావు?

రాం : నువ్వు మాట్లాడిందేమిటి?

శశి : నువ్వు ఏదోభావంలో ప్రశ్నిస్తే—సమాధానం... (ఇద్దరూ గలగలా నవ్వుకుంటారు)

శశి . (కుర్చీ లాక్కొని అతడికి దగ్గరగా కూర్చుంటూ) ఇవ్వాళేదో క్రొత్తగా మాట్లాడుతున్నావు?

రాం : ఏంలేదు. కొంత చెపుతూంటానే అరవానుభవం రుచి చూద్దామని—

శశి : నిజంగానా?

రాం : ఏం. నీదగ్గరకూడా అబద్ధమాడతా ననుకున్నావా?

శశి : (చిలిపిగా నవ్వుతూ) అప్పుడే ప్రేమసౌధం ప్రథమసోపానాన్నధిరోహించావు.

రాం : నిజంగానే (చేతితో ఆమె చిబుకాన్ని స్పృశించి) నేనెక్కడున్నానో. ఏంచేస్తున్నానో, ఏంచెప్తానో తెలీనిస్థితిలో వుంది నా అవస్థ.

శశి : (నవ్వుతూ) రెండో మెట్టెక్కావ్.

రాం : ఏమో: నాకేం తెలీటంలేదు—అర్థంకావటం లేదు. ఏదో ఆనందం. ఏదో బలీయమైన వాంఛ నన్ను లొంగదీసుకుంటున్నది. ఇదిగో శశీ. ఇలా చూడు. నాకళ్ళల్లోకి చూడు. ఏమిటో నా నరాలు పట్టుతప్పుతున్నాయ్. నా చైతన్యం లుప్తమవుతోంది.

శశి : ఎందుకు రాం, అలా ఆవేశపడతావు?

రాం : ఆవేశం! ఆవేశం కాదు ఏదో మహత్తరశక్తి—నీలో—నీలోంచి వుద్భవిస్తోంది. నన్ను సమ్మోహితుణ్ణి చేస్తోంది. నా హృదయవీణ అనంతానంద మూర్ఛనలు పలుకుతోంది. ఏదో అనివార్యమైన ఆవేశం—నన్నావరిస్తోంది. నీవు—నీవు నా స్వంతం—నాకోసం. నిజం. నవ్వకు. నాకోసం సృజింపబడ్డవు నాదానివి—నా ఆత్మవి—నా ప్రాణానివి. ఏమిటి ఆ పెదాలమీద. ఎందుకాహాసం—నన్ను వశంచేసుకుంది చాలదా? నీ నేత్రాల్లో ఎందుకంత మాదకత్వం? ఎందుకంత ప్రభ [illegible]? నీ పెదాల్లో అమృతం—కొస్త నాకు భాగమియ్యవూ? (శశికేసి మరిదగ్గరగా జరుగుతాడు.)

శశి : (లాలనగా) ఎందుకంత తన్మయం? ప్రేమలో—ఊహల్లో... పంకంలో దిగబడతావెందుకు? నేచేయూతనిస్తా నిన్ను ఒడ్డుకి—

రాం : అవును. నీవే దరిచేర్చాలి ఈ దీనుణ్ణి.

శశి : నేను నీదాన్నే రాం. ఎన్ని జన్మాలెత్తినా నీదాన్ని. ఎందుకింకా భయం?

రాం : ఇలా నిన్ను చూస్తూ, నీ అందం త్రాగుతూ, నిన్ను స్మరిస్తూ శిలనై పోకూడదూ!

శశి : అబ్బ ఎంత ప్రేమ ఇంకా పరిపక్వం కావాలి.

రాం ఇంకానా. అవుతుంది నీ ప్రేమకోసం నా ప్రాణం బలిచేసే రోజు కూడా వస్తుంది అవసరమైతే.

శశి : తప్పు. ఎందుకంతమాటలు? మన ప్రేమాకాశానికి చంద్రుడువి నువ్వు; చంద్రికను నేను. కిరణ్, కాంత్ తారకలు. ఇంకా ఏంకావాలి చెప్పు? జీవితంలో హాయిగా ఆనందంగా నాలుగుస్తంభాలాట ఆడుకుంటున్నాం మనం. ఏదో తమాషా ఎవరో ఒకరం "అవుటు" అవుతాం. ఇంకోడొంగ మిగిలిపోతాడు ఇంతకంటె రసవత్తరం, ఆనందదాయకం ఏముంటుంది? ఇంకన్నా అధికం మనం కోరేదేముంది? నీకంటి పాపలో నానీడ చూసుకుని మురిసిపోతుంటాను జీవిత మాధుర్యం చవిచూస్తుంటాను.

రాం : నువ్వేమైనా అను శశీ నీపాదలచెంత ప్రాణమైన విడవాలని వుంది నాక. చివరికి నీ పాదాలగూడా శిల్పశాస్త్రప్రకారం చెక్కినట్లున్నాయి. ఎంత సౌందర్యం నిక్షిప్తమైంది నీలో!

శశి : ఎందుకలా పొగుడుతావు? ప్రేమికులకళ్ళు మనసులు కమ్ముతయ్ ప్రేమాంధకారంలో దారీ, తెన్నూ మరచిన నిన్ను మళ్ళీ యథాప్రకారంగా మార్చాలి ఎంత కష్టమోమరి! నన్ను బాధపెడతావా? నామదు చెల్లించవా? రాం నాకోసం—నీ మహాశక్తి నీ సృజనాత్మకశక్తి నాశం చేసుకుంటావా? ప్రపంచం ఓ గొప్ప శిల్పిని—చిత్రకారుణ్ణి కోల్పోవలసిందేనా? నీ ఆశలు—ఆశయాలు అన్నీ బూజుపట్టి శిథిలమవాల్సిందేనా?

రాం : ఏమో నాకు తెలీదు. నా ఆశలు ఆశయాలు అన్నీ నీవే. నా సర్వస్వం నీవే. ఏ ఊహాప్రేయసికోసం దేవులపల్లి తా పెద్ది మనల్నేడిపించాడో, ఏ ఊహాప్రేయసికోసం వేగుల వేదనాభరితుడై శోధించాడో, ఏ ఊహాప్రేయసి కోసం బాపిరాజు శిల్పం కవిత్వం అంతా ఖర్చయిందో—అలాంటి భావనారూపం—ప్రత్యక్షంగా నా కళ్ళముందు నాట్యమాడుతోంది. ఎన్నాళ్ళనుంచో ఇలాంటి అపురూపమైనరూపంకోసం నా మనస్సు తపిస్తోంది ఆరూపం నువ్వే నువ్వేశశీ—ఆ నీకోసంఎన్నికన్నీళ్ళుకార్చానో తెలుసా? ఎంత బాధపడ్డానో ఆ వియోగాగ్నులకు విషాదాశ్రులకు ఖరీదుగట్టే షరాబెవడైనా వున్నాడా?

శశి: ఎందుకంతబాధ? నీబాధకు నేనిలా ఉపశమనంగా అక్కరకు వస్తే అలాగే ఉపయోగించుకో నన్నెవరూ అడ్డంలేరుగా. అరచేతిలో వైకుంఠం చూసుకొని మురుస్తావేం? ఈ రసానుభూతిలో నీకానందంలేదా?

రాం : ప్రాణ్దిన శాల్తో మాట్లాడి వెళ్ళాలే. అప్పుడైనా ఏదో అవ లేదు, అతన్ని గురించి శశితో మాట్లాడుదాం అనుకుంటు న్నాను ఇంతలో ఇలా జరిగిందేమిటి!

కాంత్ : కిరణ్ అంతిమ సందేశం వినే ధైర్యం వుందా మీకు? వినగలరా?

రాం : తొందరగా చెప్పు నా మనస్సు బాగాలేదు

కాం : నీ కోసం, నీ క్షేమంకోసం, నీ భవిష్యత్తుకోసం కిరణ్ మర ణించాడు రాం. మువ్వు లేందె శశికళ లేదు శశికళ లేనిగనీ భవిష్యతు శూన్యం నీ కళాహృదయం మోడు వారుతుంది. నీ సృజనాత్మకశక్తి నశిస్తుంది. నీ జీవితం, నీ గొప్పదనం వృథా అవుతుంది. తాను బ్రతికివుంటే ఏ క్షణానైనా శశి తన ఆరాధనను లోంగక తప్పదనే సత్యం గ్రహించాడు కిరణ్ నీ కోసం—నీ కోసం ప్రాణాలు వదిలాడు.

రాం : ఆఖరికి నా కళ ఒకరి ప్రాణాలను కూడా—ఒకరి ప్రాణాల్ని బలి తీసుకుందా! ఇంత స్వార్థపరుణ్ణా నేను. కాంత్— విధన కళ, విధవ గొప్ప కిరణ్ లేనివాడు ఎందుకిదంతా— (కాన్వాస్ చిత్రం చింపబోతాడు)

శశి : కాంత్ : ఆ! ఆ! (దడాలున చిత్రం లాక్కుంటారు. శశి బొమ్మను తన వొళ్లో పెట్టుకుంటుంది.)

కాంత్ : ఏం పిచ్చెక్కిందా రాం? ఎంతో తపఃఫలితాన్ని వమ్ము చేస్తావా?

రాం : (గద్గదికంగా) తపఃఫలితం. ఏ మిత్రుని ఆనందంకోసం ఇంత తపస్సు చేశానో—ఆ మిత్రుడే లేనప్పుడు—ఏం లాభం. ఎందుకీ తపస్సు? ఒట్టి స్వార్థపరుడిగా మిగిలి పోయాను

శశి : క్షమించు రాం. కిరణ్ ఇలా అవుతాడని తెలీదు నా ఆశల్ని వివరించి చెప్పానతడికి. నిజానికి నా తప్పేమీ లేదు. ఇలా చేస్తాడనుకోలేదు.

కాంత్ పోనీ రాం. కిరణ్ ఆత్మశాంతిక ప్రతిమా తం కల్గదు. నీ బొమ్మ పోటీకి పంపించు ప్రైజ్ రాగానే కిరణ్ స్మారక చిహ్నం ఏర్పరద్దాం.

రాం : స్మారకచిహ్నం — స్మారకచిహ్నం — (అంటూ రాం విచక్రిమిస్తాడు.)

శశి : కాంత్! ఏమిటి అసలు గొడవ!

కాంత్ : (పెద్దగా నవ్వుతాడు.)

శశి : (కంగారుగా) పిచ్చి పట్టిందా ఏం?

కాంత్ : నీకు తెలీదు శశి. రాం తత్వం నీ కింకా బాగా తెలీదు. అతడి చేత పోటీకి మ బొమ్మ గీయించాలి కిరణ్, నేను ప్లాన్ వేశాం. ఏదో ఒక షాక్ తినిపించాలి. లేక పోతే అతడు మనలాంటి మనిషే. షాక్ తిన్నాడా అద్భుత మైన శక్తి. అద్భుతాలు సాధిస్తాడు.

శశి · అమ్మయ్య. బ్రతికించావు. హడలిపోయాను, రాం బాధ చూచి.

కాంత్ · నిన్నెందుకు ఇక్కడికి పంపించాననుకున్నావ్. ఆ కాన్వాసు చిత్రం సగం గీసి వదిలేశాడు. ఆ పని పూర్తి చేయించాలి. అందుకోసం. అప్పటిదాకా అతడ్ని ప్రేమ లోకంలో ముంచి ఎత్తేను. కిరణ్ కూడా సమయానికి తండావ అన్నాడు నీ సహాయం కావలసివచ్చింది. నిన్ను ఉపయోగించుకున్నాం.

శశి : అందుకేనా రాం అంత తీవ్రంగా, ప్రేమకై భయాలు చూశాడు. ఎప్పుడూ లేనిది నా పిచ్చి రాం, ఇలా అయి పోయేడే అని భయపడ్డాను. నేను దగ్గరికి పోయేకొద్దీ— ఆత్మార్పణ చేసేకొద్దీ—మనిషి మారిపోయాడు. ఎంత ఊరిం చినా, ఎంత ఒరుసుకున్నా ఎంత నిగ్రహం ప్రకటించాడు! నేను దూరంగావుంటే దగ్గరకు వస్తాడు. దగ్గరకుపోతే దూరంగా పోతాడు. వింత ప్రకృతి

కిరణ్ —అదే విచిత్రం (అంటూ ప్రవేశిస్తాడు)

కాంత్ :—రాంని అర్థంచేసుకో వటం చాలా కష్టం కిరణ్.

శశి:—కిరణ్ ఎంత గాభరా చేసేవు, పోనీలే. రాం మంచిబొమ్మ గీసాడు. గొప్ప పేరు వస్తుంది.

కిరణ్ :—అంతేనా. పోటిలో ఫస్ట్ ప్రైజ్ రావాలి.

శశి:—అంతా కోరిది అదేగా.

కాంత్ —అమాయకప్పిల్లా! నా కోసం ఏం బాధపడ్డావు...

శశి:.. నిను తెలీదు కాంత్ ఇలాంటి విచిత్ర ప్రకృతి అంటే నాకు చిన్నప్పట్నించ చాలా ఇష్టం మొదట్ రాం ప్రేమ పిచ్చి చూసి బాధపడేదాన్ని. ఇప్పుడు గర్వపడుతున్నా. నా వల్లేగా ఇంత చిత్రకారుడు అయింది.

కిరణ్, కాంత్ :—ఆహా!

కిరణ్ ·—మా ప్లాను అంతా వ్యర్థం అంటావు.

కాంత్ :—వేగుతే పీకేస్తున్నావే.

శశి:—మీ లేమైనా అనండి రాం నావాడు. నావాడు.

కాంత్ —నివాదేం చేయటంలేదు. మేమెక్కడికీ ఎత్తుకెళ్లం.

కిరణ్ .—Innocent girl (ఇంతలో రాం తూలుతూ ప్రవేశిస్తాడు)

రాం :—(కిరణ్ని చూసి) కిరణ్ (బిగరగా అరుస్తూ కౌగిలించు కుంటాడు. అతడి చేతి బొమ్మ వేసిన డ్రాయింగ్ పేపరు క్రిందపడతుంది)

కాంత్ :—(గభాల్న కాగితం తీసుకుని) Wonderfull! ఎంత బావుంది. రాం. శశి. ఇలాచూడు. Beautifull Art! (శశి కిస్తాడు.)

శశి:—అబ్బ! ఎంతబావుంది. రాం. నా పిచ్చిరాం. (రాం జుట్టు నిమురుతుంది.)

రాం : ఏమి టిదంతా. కిరణ్. నాకిరణ్ బ్రతికేవున్నావా?

కాంత్ : అదంతా తరవాత చెప్తాం ఈ చిత్రానికి పేరు సూచించు.

రాం ఏం చెప్పను నాకంతా అయోమయంగా వుంది. కిరణ్ నా ప్రక్కనే వున్నాడు శశి నీవు అంతా వున్నాం. పోనీ. దానవబొమ్మ, పోనీ ఏమైతేనేం?

కిరణ్ : నా కోసం వేసినబొమ్మకు నేనే నామకరణం చేస్తా. "మిత్ర వియోగం" ఏమంటావు శశి?

శశి : నా ప్రాముఖ్యం పోయింది. ఇంక నే నేమంటాను.

కాంత్ : ఎక్కడికీ పోలేదు రాం నీవాడు.

రాం : Much audo about Nothing.

కిరణ్ : All is well that ends well.

శశి : నాలుగు సంభాలాట.

కాంత్ : ట్రాజీ కామెడీ.

రాం : ఏదన్నా కాని — అంతా హాయిగా జరిగిపోయింది. మా తొందరికి శశి అన్నట్టు—నువ్వు "నాలుగు స్తంభాలాట". ఆట అయిపోయింది. అంతా సుఖంగా వున్నాం.

(తెర వాలుతుంది.)

# కేరళమునకు వికారి చేసిన మేలు

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

గత వికారి సంవత్సరము కేరళదేశపు చరిత్రలో మరువరానిది. రాజకీయ రంగమునందేమి ప్రజాపాలన తంత్రమందేమి, జన సామాన్యశాంతి భద్రతా వ్యవస్థయందేమి, నానా వికారములు పుట్టించి వికటతాండవమాడినా ఆడినదికాని, వికారి సంవత్సరము కడకు కేరళభూమికి మేలే చేసిపోయినది. రెండు సంవత్సరములకు పైగా, భారత కేంద్రప్రభుత్వవర్గములకు భిన్నమయిన పద్ధతిలో దేశపరిపాలనమును సాగించుచుండిన కమ్యూనిస్టు మంత్రివర్గపు రాజనీతి క్రమక్రమముగా విజృంభించి అపశ్రుతితో ఆనందభైరవిని ఆలాపించుచుండగా. పడుబాటుకు లోనై ప్రజాసముదాయము శోకభరాతితో విలపింపసాగినది పరిస్థితులు సహించుటకు అసాధ్యము కాగా భిన్నభిన్నములగు ఆదర్శములు కలవారైనా, దేశమందలి రాజకీయపక్షములన్నియు అవసరమునుబట్టి గుమికూడి, చేతులు కలుపుకొని, ఆ కమ్యూనిస్టు మంత్రివర్గమును స్థానభ్రష్టము చేయు దీక్షతో ప్రతినపట్టి నానా విధములుగా ప్రతిష్టంభనము చేయుచుండగా. కేరళదేశములో అశాంతిపుట్టి చెలరేగెనను సుప్రసిద్ధ విషయము. శాసనసభలో సంఖ్యాబలమును, పలుకుబడిని, సంపాదించుకొని. కటిపుణాతో పాగుకొనియున్న పాలకవర్గమును కూలద్రోయుటకు సామాన్యమగు సక్రమ పద్ధతులు చాలమిచేత, విప్లవరూపమయిన విమతనీతిని ప్రతికూలపక్షములవారాశ్రయించగా, దేశము నాలుగు మూలలా, అణపరాని అంతర్వ్యాప్తి రూపమయిన అరాజకస్థితి ఆరంభమయ్యెను. తత్ఫలముగా, సభలు, సమావేశములు, సమ్మెలు, క్రాంతి ఘోషణములు, వితండ వాదములు, గృహదహనములు. తుపాకికాల్పులు, కారాగార శిక్షలు, రక్తపాతములు. అపమృత్యువులు—మితిమీరుటచేత కొన్ని నెలలపట్టు దేశము క్షోభించినది సాధ్యమయినంత చెప్పి, చూచి, ఓర్చి, చాలించుకొని, ప్రజాసముదాయపు శాంతి భద్రతలను రక్షించు శక్తిలేని నంబూద్రిపాదు మంత్రివర్గమునకు విధిలేక కేంద్రప్రభుత్వము స్వస్తి చెప్పవలసి వచ్చెను 31-7-1959 వ తేదీన సాయం సంధ్యాకాలమున (6-0 p m I S T) రాష్ట్రపతి శాసనముతో కేరళదేశమందు కమ్యూనిస్టు పరిపాలనము అంతరించినది. మంత్రులు లేక, శాసనసభ లేక రాష్ట్రపతి తన ప్రతినిధిద్వారా పరిపాలనమును సాగించుచు వచ్చినాడు.

ఆరు నెలల కడచులోగా, ఎన్నికల సంకులసమర మారంభమైనది. ఏమైనాసరే, కమ్యూనిస్టులకు శాసనసభలో స్థానబలము నివ్వరాదని కాంగ్రెసు పక్షము దీక్షపట్టినది. అగ్రనాయకులు నలుదిక్కులనుండి కేరళమునకు వచ్చి, మూలమూలలు తిరిగి, ఉపన్యాసములిచ్చి, ప్రజలలో ఉద్రేకము కలిగించినారు కమ్యూనిస్టులతో పోటచేయుటకై ఇతర రాజకీయ పక్షములవారు సహా వశములు బిగించి కత్తులు నూరుచుండిరి. కాని, అప్పటి పరిస్థితులలో, కమ్యూనిస్టు వ్యతిరేకులు వేరువేరుగా పోరాడుటకంటె అందరూ చేరి ఐకమత్యముతో శత్రుజయమునకై ప్రయత్నించుట హెచ్చుగా ఉపయోగకరమని యుద్ధనీతి విశారదులగు నాయకులకు తోచినది. కాంగ్రెస్సు, ప్రజాసోషలిస్టు, ముస్లిములీగు పక్షముల నాయకులు మంతనములాడి అన్యోన్య సహాయసంపాదకముగ తాత్కాలిక సంధిని కుదుర్చుకొని రణభేరి వాయించినారు. కేరళదేశమునకు అంటియున్న కమ్యూనిస్టు పరిపాలన పంకమును కడిగివేయుటకు ఈ 'త్రివేణీ' సంగమము వారికి ఎంతో పనికి వచ్చినది. నానావిధోపకరణములతో, ఎన్నికలలో యుద్ధము చేసి, ఈ మిత్రమండలి 1-2-1960 వ తేదీనాడు కమ్యూనిస్టుల బలము వణచి శాసనసభలో సంఖ్యాబలమును సంపాదించుకోగలిగెను. చేతనైనంత పోరాడచూచి, పరాజయము నంగీకరించి, "మీరే ఏలుకోండి' అని చెప్పి, కమ్యూనిస్టులు ప్రక్కకు నిలిచారు.

కాని, ఇంతటితో కథముగియలేదు క్రొత్తగా మంత్రివర్గము నేర్పరచు సందర్భమున మిత్రమండలిలో అభిప్రాయభేదములు వచ్చుట తప్పలేదు. అధికార వ్యామోహము చెడ్డది కదా! ఆసనములనుగురించి, సంధి షరతులనుగురించి, వాదోపవాదములు, సంప్రతింపులు చర్చలు, మంతనములు యథేచ్ఛగా జరిగినవి. డిల్లీ నగరమునకు వాయువిమాన ప్రయాణములతో రాకపోకలకు విరామము లేదు. మిత్రమండలిలో స్వయాన కలహములు బయలుదేరు సూచనలు పుట్టినవి. ఇన్ని దినములు, ఇన్ని విధములుగా, ఇందరు పడిన కష్టమునకు రావలసిన ఫలము రాక "ములుతీసి, కొరడము కొన్నట్లు" అగునేమో, అని దేశము మరల ఆందోళనము పాలయినది. నాయకులు తల్లడిల్లిరి.

కాని, అఖిలభారత జాతీయ సంస్థానాయకుల నిరుపమాన రాజనీతిజ్ఞతకు ఫలముగా, ఏదో ఒక విధముగా మిత్రమండలివారికి ఐకమత్యము కుదిరి, శాంతియుత వాతావరణ మేర్పడినది. కాంగ్రెస్సు పక్షమునుండి ఎనమండ్రు, ప్రజాసోషలిస్టు పక్షమునుండి ముగ్గురు మొత్తము పదునొకండుగురు మంత్రులతో పాలకవర్గము ఏర్పరచబడెను. 22-2-1960వ తేదినాడు పగలు 11-0 A M.(I S T.)గంటల సమయములో స్థానిక రాజప్రతినిధి శ్రీ బూరుగుల రామకృష్ణరావు మంత్రులతో ప్రమాణములు చేయించినాడు. వయోవృద్ధుడును, అనుభవశాలియునగు ప్రజాసోషలిస్టుపక్ష 'భీష్మాచార్యుడు' శ్రీయుత పట్టంతాను పిళ్ళె ముఖ్యమంత్రి పదము నలంకరించి సేనాపతి అయినాడు కేరళములో శాంతి ఏర్పడి ప్రజలు ఆనందించినారు. దేశపరిపాలనమును మరల కమ్యూనిస్టులపాలు చేయకుండ, వికారి సంవత్సరము కడకు కేరళదేశమునకు మేలే చేసిపోయినది.

వికారి సంవత్సర మాఘ బహుళ దశమీ సోమవారమున, మూలానక్షత్రపు మూడవపాదములో చంద్రుడుండగా, (22-2-60వ తేదీన) 11-0 A. M. (I. S. T.) వేళలో, ఈ నూతనమంత్రివర్గ పరిపాలన మారంభమగుట!

అప్పటి గ్రహావస్థితిని ఈ క్రింది కుండలి చూపగలదు.

| | | | |
|---|---|---|---|
| కే 25-51<br>బు 20-30<br>పుష్య 15-28<br>ర 2-37 | | I 15.47<br>శుక్ర 29.58 | రాజ్య 8-44 |
| X 8-8<br>కు 1-54 | [సాయనము]<br>శ్రీ తానుపిళ్లై<br>మంత్రివర్గ<br>జాతకము | | యం లేశ్వర 2-10 |
| కు 29-17<br>శ 15-11<br>చ 2-18 | | | వరుణ 12-28 (వ) |
| గు 28-48 | ఇంద్ర 9-6 (వ) | | యమ 5-0 (వ)<br>రా 25 51 |

ఏమి దైవానుగ్రహమో కాని సాధారణముగా, ప్రభుత్వాధికార స్వీకారమునకు మన రాజ్యాంగమువారు నిర్ణయించి ఇచ్చు ముహూర్తములతో పోల్చిచూచితిమేని ఈ ముహూర్తము ఎంతో మేలనిపించుచున్నది. కేరళభూమి అదృష్టఫలము కాబోలు!

లగ్నము స్థిరరాశి అగు వృషభము. అంశలో, వృషభ నవాంశ (వర్గోత్తమాంశ). అధికార స్వీకారమునకు ఎంతో యోగ్యమయిన లగ్నమిది. స్థైర్యము దీనిఫలము. చరరాశిలో, ద్విస్వభావ నవాంశలో, ఆరంభమయిన సంబూద్రిపాదు మంత్రివర్గపు లగ్నమునకంటె ఇది ఎన్నియోరెట్లు మెరుగైనది గలది.

లగ్నాధిపతి శుక్రుడు స్వనవాంశలో దశమ కేంద్రమందు ఉచ్చస్థితిలో ప్రకాశించుచుండుట గొప్ప సుగుణము. సప్తమ వ్యయాధిపతి అగు కుజుని సంయోగమునుండి ఉద్ధరించి తెలివిగా రాజ్యభావమును చేరుకొన్నాడీ శుక్రుడు. ప్రబల ప్రతిపక్షాలతో యుద్ధములో గెలుపునొంది, ఈ లగ్నాధిపతి ఆదర్శ స్థానమును సాధించినాడని ఈ గ్రహస్థితి ఎంతో హృదయంగమముగా చాటుచున్నది కదా! మరి, ఆ కుజుడేమి, సామాన్యుడా? కాడు. పరమోచ్చాన్నభాగములో నున్న ప్రబల ప్రచండమూర్తి! ఎంత వ్యయము నకైనా (వ్యయాధిపతి), ఎంతటి పోరాటమునకైనా (సప్తమాధిపతి), వెనదీయని శూరుడా కుజుడు! అతనితో పోరాడి గెలుపొందుట సామాన్యశక్తి, సహనము, ధైర్యశీలురు, శాంతిప్రియులు నగు శుక్రునికి చాలదని చెప్పవలసిన పనియేముంది. ఆ కుజుడు రాయబారములలో, సంధి సంధానములలో, నీతిసూత్రముల శుక్రుని సామ్యము అహింసావాది అగు శాంతిప్రియుడు.

"పగ యడగించు టెంతయు శుభంబగు లెస్స; యడంగునే పగన్, పగ; యడగొన్న మార్గ్యమదియే, పగయుండగ నెమ్మదేది? కనుక, దగ మొదలెత్తిపోవ పగ దీర్చగ వచ్చిన కార్యమొందగు; ని మ్మగతి దలంచినన్ పగకు మేలిమి లేదు; ధ్రువంబు కేశవా."

[భారతము, ఉద్యోగపర్వము]

అను ధర్మరాజునీతి ఈ శుక్రునిది. అయినా, యుద్ధము తప్పని కారణమున సాహాయ్యమును సంపాదించుకోవలసి వచ్చేది. భాగ్యభావమందలి చంద్రుడు, లాభభావమందలి సూర్యుడు ఈ ఇరువురు పరస్పరము అర్ధకోణ మిత్రదృష్టితో నుండగా, వారి మధ్యబిందువును ఆశ్రయించి పుష్కలముగా చేయుచు శుక్రుడు మంచిమాటలతో, నేర్పుతో, తన కార్యమును సాధించినాడు. భాగ్యస్థానములో నుండి వరుణుని సాధ్యకేంద్ర కేంద్రమున శుద్ధిక్ష స్వభావముకల చంద్రుడు మతావేశ 'కుకర్యోదయము'లకు ముస్లింలీగు నాయకులను (చంద్రద్వజులను) తెలుపగలడు. అదే ధర్మస్థానములో, వర్గోత్తమాంశలో నున్న గురువునుండి అర్ధకోణ మిత్రదృష్టి సాహాయ్యమును సంపాదించుకున్న చతుర్థాధిపతియగు మిత్ర రవి స్థానబలమున, మతేతరాల్ల సానుభూతిని సాధించిన ప్రజా సోషలిస్టు పక్షమును సూచించును. ఈ మిత్రుల సాహాయ్యముతో శుక్రుడు శత్రువులను జయించి అధికార నిర్వహణము చేయబూనుట. సమాజ సహకారవాది యగు కాంగ్రెస్సు పక్షమును ఈ శుక్రుడు రమ్యముగా తెలుపుచున్నాడు. శాసనసభలో చాలినంత సంఖ్యాబలము సంపాదించి యుండినా స్వతంత్రముగా రాజ్యమును పరిపాలించు శక్తి సామర్థ్యములు కలిగియుండినా, 'శాంతమే మేలు, తగ పంచి కుడుచుట మేలు' అను నీతిని పురస్కరించుకొని, ముఖ్యమంత్రిత్వమును ప్రజాసోషలిస్టుపక్షమునకు ఒప్పగించి, తాను సహాయపాటుకు తోడుపడి చేయుటకు పూనుకొను నీతిచాతుర్యము ఆ శుక్రునికే తగినది.

ఈ ముహూర్తచక్రములో యంత్రలేశ్వర గ్రహముస్థానమును చదువరులు చిత్తగింతురు గాక. ఈ గ్రహమును లాభభావమందలి రవితో ఇష్టకాల యోగము చేయుచు. ముఖ్యమంత్రిపదము ప్రజాసోషలిస్టు పక్షమునకు పోయినదని చూపుచున్నది కదా! అదే గ్రహమునకు సమసప్తక వేధాస్థానమున చంద్రుడు నిలుచుట కారణముగా, మంత్రివర్గములో ముస్లింలీగు పక్షమునకు, ఎంత ప్రయత్నించినా, స్థానము లభించినది కాదు. సందర్భము కు ముహూర్త లగ్న మెంత తయున్నదో, పాఠకమహాశయులు సహృదయత్వముతో గ్రహింప గల్గుదురు.

ధర్మ కర్మాధిపతి యగుటచే ప్రబల రాజయోగకారకుడై, భాగ్యభావమందు లగ్న నవాంశ నాశ్రయించియున్న బలవంతుడగు శని మకరమునుండి ఈ లగ్నమునకు సహృదయముగా శుభకోణదృష్టి సారించు చున్నది మంత్రివర్గమునకు చక్కని స్థైర్యమును, రాష్ట్రమునకు అభ్యుదయమును సహా, తెలుపు యోగమిది యనుటకు సందేహము లేదు

ధన పంచమాధిపతియై లాభభావములోనున్న బుధుని మిత్ర దృష్టి ఈ లగ్నమునకు కలుగు దేశములోని ధనవంతులయొక్క సాహాయ్యము, విద్యాసంస్థలయొక్క ఆశ్రయము విద్యార్థుల సానుభూతి సహా, ఈ మంత్రివర్గమునకు అండగా నుండగలదని సూచన.

చతుర్థభావపు అధిపతియైన చంద్రునితో పూర్ణకేంద్ర వీక్షణ దృష్టిగల వరుణుడు భూసంస్కరణముల విషయమై మునుపటి మంత్రివర్గపు ఆదర్శములను త్రోసి రాజనని, నూతనాశయముతో ఈ మంత్రివర్గము పరిపాలనము సాగించునని చాటుచున్నాడు. తృతీయ, చతుర్థాధిపతులగు చంద్ర రవులహస్తు లగ్నాధిపతియగు శుక్రునికి లభించియుండుటచే, వార్తాపత్రికలయొక్క, భూస్వాముల యొక్క సాహాయ్యసంపత్తి ఈ మంత్రివర్గమునకు సమృద్ధిగా నుండగలదు. దశమ కేంద్రగతుండగు షష్ఠాధిపతి శుక్రుడు సామాజిక జీవితాభివృద్ధికి, సహకారోద్యమునకు, దోహదము నిచ్చుటే కాక స్త్రీలకు ప్రాముఖ్యము హెచ్చుననియు, పాటకపు జనుల భాగ్యము పెరుగుననియు సూచించగలదు.

పుణ్యసహము లాభభావములోనికి వచ్చుట ఈ మంత్రివర్గపు పుణ్యపరిపాకము. "లాభగే పుణ్యసహమే, లాభః కీర్తిర్ధనాగమః" (తాజక సుధానిధి) కళకు లాభకరముగా కీర్తిప్రదముగా. పరిపాలనము కొనసాగగలదు. శాసనసభ పాలకవర్గమునకు చేయూతగా నుండును.

ఈ యోగములన్నియు చాలా రమ్యముగా నున్నవి కాని వీనిలో కొన్ని లోపములు లేకపోలేదు. సప్తమాధిపతి (ప్రబల ప్రతిపక్షి) కుజుడు అనుకొనని మెప్పును లభించువాడని కొనుకొని లగ్నాధిపతి శుక్రుని వీపుమీద నున్నాడుకదా! శత్రుసహములో ఆ కుజునికి నిండుగా త్రికోణ మిత్రదృష్టి! మంత్రివర్గముపై అననుకూలముగా ఆ కుజునికి సాహసమగును. ఆ సప్తమ భావమందు కొంత దూరముగా నిలిచియున్నవాడు మహామాయావి, ఇంద్రుడు! ఇతడు వక్రియై రాజ్యస్థానముపైపు మెండుగా కేంద్రదృష్టిని బాపును జరుపుచున్నాడు. సమయమునకై కాచియుండి, అవకాశము దొరకినపుడు ఏవో మాయవేషములు వేసి, మంత్రములు పఠించి, కుట్రలు పన్ని, కుతంత్రములతో మిత్ర భేదము చేయుటకు సిద్ధముగ వారు శత్రుపక్షములో నున్నారని యీ యోగము హెచ్చరించుచున్నది. చతుర్థభావమందు క్రూరగ్రహము ఉండెనేని, ప్రతిబంధము చేయుశక్తి దానికి కలదందురు 'పాపాద్యుతిః సప్తచతుర్గశాతైః' అని ఆచార్యవాక్యము ఇట్టి భావమందున్న వ్యాధికరణశాలి వరుణుడు మంత్రివర్గమునకు చిక్కులు తెచ్చిపెట్టవచ్చును.

దేవమానవదశలో దశమకేంద్రము చలించి, 1961 వ సంవత్సర ఆరంభములో ఇంద్రునితో కేంద్రవేధకు రాకతప్పదుకదా! అప్పుడేవైనా కొంత కుట్రలు జరుగగలవు. కాని, అది అంత ప్రమాదకారి కాదు. 1958 వ సంవత్సరము చలిత కుజుడు శుక్రుని నాక్రమించుట చలిత రవికి యముని సమసప్తక వేధ దాపరించుట. చలిత చంద్రుడు వరుణుని ప్రత్యక్షదృష్టికి వచ్చుట, అను విషమవిశా యోగములు సిద్ధము కాగలవు. ఆ కాలమందే, చలితలగ్నము చతుర్థ వరుణుని కేంద్రవేధను పొందగలుగు విషాదకరము భూస్వాముల అసంతృప్తి మంత్రివర్గపాలనమునకు తొందరకలిగించవచ్చును. ముస్లింలీగువారు కనికరించినా మొరకుపట్టు పట్టవచ్చును; అధికార వ్యామోహముతో స్వయూథకలహములు పుట్టు అలజడి కలిగించవచ్చును. ఏ కారణమైననేమి అది కొంత క్లిష్టకాలమునకతీతము కాదు. అయినా, తగిన జాగరూకతతో, గొప్పగా ప్రమాదపరిస్థితులు రాకుండునట్లుగా నిర్వహించుట మంత్రివర్గమునకు అసాధ్యము కాదు.

ఈ అంశము సాంకేతికము మాత్రమే కాక, ప్రబలమయిన మహదాశ్రయసంపత్తి సమయితము కలదు. స్థానిక గవర్నరు శ్రీయుత బూర్గుల రామకృష్ణారావుగారి జాతకమున చతుర్థ భాగ్యాధిపతి యగుటచే రాజయోగప్రదుడై, లగ్నభాగమందే యున్న శుభగ్రహము శుక్రుడు! కావున ఆ మహనీయుని ప్రశాంత మనస్తత్వము, సహనశీలత, మంత్రశక్తి, విశాలదృష్టి, భావౌదార్యము, సామంజస్య సంపాదన ప్రతిభ, మున్నగు గుణములు సుప్రసిద్ధములు. అట్టి శుక్రుని స్థానమందే నికరముగా, ఈ మంత్రివర్గపు రాజ్య (దశమ) స్థానముండుటయని కనుగొనిరేని, ఈ మంత్రివర్గమునకు అతని సంజనిత స్ఫురణము ఎంత చేయూతగ నున్నదో, పాఠకమహాశయులు గుర్తింపగలరు. ఇంతే కాదు. ఆ మహనీయుని చలిత రాజ్యస్థానమందే, స్పష్టముగా, ఈ మంత్రివర్గ జాతకమందలి భాగ్యరాజ్యాధిపతి శని నిలయుండుట! ఈ సంస్థ యొక్క భాగ్యము అతని పుణ్యకాలపు ఫలమని ఈ యోగము చాటుచున్నది. అతని ఉపదేశము మంత్రివర్గమునకు అమూల్యము క్లిష్టపరిస్థితులు ఎప్పుడైనా వచ్చినచో, దాని ఆసరావున సులభముగా వాని నెదుర్కొని ఈ మంత్రివర్గము కేరళమునకు అభ్యుదయము చేకూర్చి ప్రజాభిమానమును పడయగలదనుటకు సందేహము లేదు.

మరియొక్క అంశమును మనము ఎమరరాదు. ఏమందురా? ఇప్పటి రాజ్యాంగ పరిస్థితులలో మన దేశములోని ఏ రాష్ట్రమందలి పాలకవర్గమైనా భారత కేంద్ర ప్రభుత్వపు దయ, ఆశ్రయము, లేక రాజ్యభారమును నిర్వహించుట కష్టము. కడచిన నంబూద్రిపాదు మంత్రివర్గమే దీనికి ప్రబల నిదర్శనము. ఆ మంత్రివర్గ జాతకమందలి[1] లగ్నమునకు (కర్కాటకము 18°) నికరముగా కేంద్ర వేధాస్థానములో—(తుల 18°) ఇంద్రుడు, సమసప్తక వీధిలో (మకరము 18°) బుధుడును, కేది భారత కేంద్ర ప్రభుత్వ[2] జాతకమని జ్ఞప్తియందుంచుకొంటమేని, చిల్లపేకల మేడవలె, ఆ మంత్రివర్గము టప్పున కూలిపోవుటకు మూలకారణము ఎందున్నదో,

---

(1) హేమలంబ సంవత్సరమున చైత్ర శుక్ల పంచమీ శుక్రవారమునాడు (5–4–1957) పగలు 12-32 గంటలలో పుట్టినది నంబూద్రిపాదు మంత్రి వర్గము.

(2) గత విరోధి సంవత్సర మాఘశుద్ధ నవమి గురువారమునాడు, అనగా, 26-1-1950 నాడు 10-30 A M (I S T) కాలములో ఏర్పడినది భారత కేంద్ర ప్రభుత్వము.

స్పష్టము కాగలదు. అమంత్రివర్గమునకు స్వస్తిచెప్పుటకై 31-7-1959 న వేసిన, రాష్ట్రపతి ఆజ్ఞాపత్రముపై చేవ్రాలు చేసిన క్షణమునందు (సాయంకాలము 6-0 గంటలు P. M I S T.) భారతకేంద్ర ప్రభుత్వ జాతకపు బుధస్థానమే - (మకరము 18°) లగ్నముగా నుండినన్నచో, ఇది కాకతాళీయ మనజాలముకదా!

ప్రకృతాంశమునకు వత్తము. ప్రశంసలోనున్న మంత్రివర్గ జాతకమందలి రాజ్యభావము సాక్షాత్తుగా రాష్ట్రపతి శ్రీయుత రాజేంద్రప్రసాద్ బాబుగారి జాతకములో రాజయోగకారకుడగు శుక్రుని చలిత స్థానమందే (కుంభములో 8°) నిలుచుట కేరళదేశపు భాగ్యము. అట్లే, భారత కేంద్రప్రభుత్వ జాతకమందలి లగ్నాధిపతి కుజుడు (తుల 9°) ఈ మంత్రివర్గ జాతకపు రాజ్య (దశమ) స్థానమునకు త్రికోణ (ప్రత్యక్ష మిత్ర) దృష్టితో నుండుట నయితము అమూల్యమగు సౌకర్యము. కేంద్రప్రభుత్వ జాతకపు వరుణ మహాశయుడు (కర్కాటకము 2°) ఈ మంత్రివర్గ జాతకపు రవితో కోణదృష్టిలో, చంద్రునికి షష్ఠ వేధాస్థానములో, మండలేశ్వర సహాయముపై నుండుట! శాసనసభలో సంఖ్యాబలము అల్పమయినా, ప్రజా సోషలిస్టు పక్ష నాయకుడు శ్రీపట్టం తాను పిళ్ళె ముఖ్యమంత్రిపద మధిష్ఠించుటకును, అతడెంత పోరాడినా ముస్లింలీగునకు పాలకవర్గములో స్థానము లభించక పోవుటకును, మూలకారణ మెందున్నదో, ఇప్పుడు నూటిగ క్రేలితో చూపినట్లు అగుపడుచున్నదికదా! భారత మహాప్రధాని శ్రీ నెహ్రూపండితుని జాతకమందలి కుజుడు (యోగకారకుడు) తులారాశిలో 2°లో నుండి, మంత్రివర్గజాతకపు చంద్రుని కేంద్రశత్రు దృష్టితో లగ్నాధిపతి శుక్రుని ప్రత్యక్షమిత్రదృష్టితో, కటాక్షించుచుండుటకు ఎంత విలువయున్నదో, చదువరు లూహించుకోగలరు.

మరియొక్క విశేషము అఖిల భారత జాతీయ మహాసంస్థ నాయకుడగు శ్రీయుత నీలం సంజీవరెడ్డి జాతకములో బృహస్పతితో కూడియున్న లగ్నమెంతున్నదో, నిరతముగా ఆ భాగమందే ఈ మంత్రివర్గపు రవి, అనగా, రాజ్యభాగ్యాధిపతి! అన్యోన్య కోణ దృష్టి అనుకూల్యముగల అతని శని వక్రగతులు ఈ మంత్రివర్గపు రాజ్యభావమునకు ప్రాపు అతని చంద్రునితో మంత్రివర్గపు బుధునికి నిండుగా ప్రత్యక్షమైత్రి. మంత్రివర్గ నిర్మాణములో అతని రాజనీతిక గొప్పదనము యెంతవరకు తీసుకొనాకి అతని నీతిచాతుర్యము 'విదురనీతి' యందలి ఈ క్రిందిసూక్తి నిత్యమును తెలియజేయుచున్నది:

"అరిది విలుకాని ఉజ్వల
శర మొక్కని నొంచు; దప్పిదనినన్ జచ్చు; నే
ర్పరి యైన వాని నీతి
స్ఫురణము పగరాజు, నతని భూమిన్, చెరచున్."

(భారతము-ఉద్యోగపర్వము)

ఈ మంత్రివర్గమున కితని సాహాయ్యము ఎంతో ప్రయోజనకారి. కావుననే, 1961, 1958 సంవత్సరములలో ఏవో బాలారిష్ట యోగములు వచ్చినా, మహద్భాగ్యముగల యీమంత్రివర్గము గండము నధిగమించి గట్టెక్కుట అంతకష్టము కాదు.

కాని, మహారాష్ట్రమెట్టిదైనా, ముఖ్యమంత్రి జాతకము నడుపు రించిచేయు తన ప్రభావమును చూపగలుగు. కనుక, అతని జాతక దశాక్రమమును గమనించవలెను, ఈ మంత్రివర్గపు ఆయుర్దాయమును దర్శించుట అసంగతము. ఆ జాతకసామగ్రి లేదు కనుక, ప్రకృత మింత చాలును.

శ్రీ తాను పిళ్ళై మంత్రివర్గము ప్రజారంజకముగా పరిపాలనము సాగించి కీర్తి వహించుగాక!

"స్వస్తి ప్రజాభ్యః; పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః."

# శివ యాత్ర

శ్రీ కోట సుందరరామశర్మ

కాళీదాస నవోక్తిభూషిత మహాకాళేశ్వరా, మత్పురా
కారోపార్జిత పుణ్యలేశమున, దేవా, తావక జ్యోతిరా
కార ప్రాకటలింగ ముజ్జయినిలో గన్గొంటి, తత్సత్ఫలా
కారం బౌనిది వ్రాయగంటి మనసార్గన్, పర్వతేశప్రభూ!

శ్రీ తంజాపురిలోన నాకు లభియించెన్ ప్రాణికిం గల్పనా
తీతంబౌ బృహదీశ్వరాఖ్య భవదద్దివ్యాత్మ హాదర్శనం
బేతాదృగ్జయనాప్తపుణ్యఫలితం బే శక్తి కల్పించి నా
కేతత్ పద్యశతంబు వ్రాయ ననువయ్యెన్, పర్వతేశప్రభూ!

గుహతాపత్రయహారి కామిత భవత్క్రోధాద్యనంతేంధనం
బిగుకా చిత్తములోన మేటిహాగ చూరింపంగ తూళించెనే
యరుదారన్ ద్రిశిరఃపురస్థ భవదీయాకార మబ్లింగమున్
దరిసింపంగనె చిల్క నత్కరుణ, నన్నా, పర్వతేశప్రభూ!

వరదల్ గట్టి యఖండగౌతమి యనన్ వర్ధిల్లు గోదానదీ
వరకుం బుట్టినయింటి మేటిదారవై వాసించు నీ త్ర్యంబకే
శ్వర రూపంబున నున్న దివ్యభవదైశ్వర్యమ్ము సేవింపగా
నరుదై పొంగెను గాదె నా హృదయము, మయ్యా, పర్వతేశప్రభూ!

కృష్ణావాహిని వాస్తరంగములలో క్రీడింపగా గైతలో
నిష్ణాతత్వము కొంత కల్గినది; తన్నీరంబు మూలంబు రో
చిష్ణు గ్రావమహాబలేశ్వరమునన్ సేవింప నీ మూర్తినిన్
తృష్ణాహారిగ భక్తిమై కవిత యెత్తెన్, పర్వతేశప్రభూ!

దక్షారామము సర్వదేండ్లపుడు నే దర్శించితిం గాదె, నీ
యక్షయ్యంబగు రూపు జూచితిని భీమాఖ్యంబు; వెన్వెంట నా
యక్షుణ్ణంబుగ రెండు పద్యముల నీశా, నాడె వర్ణించుచో
దక్షత్వం బిడినావు నిన్ గొలువ గైతన్ బర్వతేశప్రభూ!

దంశం బొక్కటికాని నిర్ధనుని యొద్దం గల్గునే బంగరుం
జంబీరంబులు? రామ్మహేంద్రపురిలో నేంచేసి యున్నట్టి మా
ర్కండేయేశ! త్వదీయ దర్శన ఫలాకారంబులౌ నీ స్తుతుల్
మెండై పొంగుచు నీక యర్పితము సుమ్మీ, పర్వతేశప్రభూ!

నా పుణ్యంబులరాశి గాశిపురిలోనన్ విశ్వనాథాఖ్యమౌ
నీ పారమ్యము జాటు లింగమును గంటిన్, గంగలో ముంచితిన్

నా పాపిష్ఠఘటంబు పంకమెడలంగా, నంత వెలసెడ్డ నా
యే పుణ్యంబుల గీతో యీ శతక మయ్యెన్, పర్వతేశప్రభూ!

ఏతన్మత్కవితాసుమంబులు నివాళింపంగ నానాటి నీ
పాతాళేశ్వర రూపదర్శన విధా ప్రాబల్యమే గాక, యే
హేతూహాం బచరింపలేను; నిను సేవింతున్ భవత్కారుణా
ప్రాతర్మందసుగంధవాహముల గ్రోలన్, పర్వతేశప్రభూ!

నటరాజేశ్వర, నీ చిదంబరములోనం గల్గె నీ దర్శనం,
బటు పెక్కొచెను 'చిత్రమిద్ది, యిదిగో' యంచెల్ల భక్తాళి ప్రా
కట భక్తిం గనుగొంగ, నెమ్మదిని 'నాకా'శాంగమం గుంచే యు
త్కట గంగోపమ మత్కవిత్వ మురుకంగా, పర్వతేశప్రభూ!

అమరెన్ నా కొకనాడు హాంపిని విరూపాక్షేశ సందర్శనం
బు, మహాస్కారకమైన నీ నెనరు శంభూ, నాకు సాక్షాత్కృతిన్
విమలానందము గూర్చె, నేను వెడలున్ నెన్నాళ్ళ గైవారముల్
స్వామినగ్రీతిగ, నన్ను గూర్చి, పరమేశా, పర్వతేశప్రభూ!

'చండిగఢ్' శిఖారాగ్రదర్శన సువైశాల్యాత్మమత్పుణ్యముల్
పండెం బో, భవదీయ మైశ్వరము భావంబెల్ల భావంబులో
మెండై నీయిదుభిక్షు సిక యిడగా మేకొన్న నాకైత పూ
చెండై నీపదసీమ నద్దుకొనగే, శ్రీ పర్వతేశప్రభూ!

వినదించున్ హిమవన్మహానగహిమానీ సంభవంబైన య
వ్యాహధారావళిలోన యున్మదనుసంపావ్యంజకోంకారముల్;
కని యా పంచనదప్రదేశమున వికన్ యున్మదీయాదిమూ
ర్తిని జోహారిడుదున్ 'నమోస్తు జలమూర్తే' పర్వతేశప్రభూ!

హిమవత్పర్వతసానుభాగముల దర్శింపంగ జేకూరి నా
సమయంబందు మనోమహాంబరమునన్ జానైన నీ యుంటి వ
ట్టు మెరుంగుల్ తొలకించి హత్తుకొనె గట్టుల్ రేపి యుల్లంబు నీ
వె, చూరింకన్, మదిలోన నిల్వవలెగా, హే పర్వతేశప్రభూ!

బిరలామందిరమందు ఢిల్లిపురిలో బేర్మిన్ ప్రతిష్ఠించిరో
స్థిర యోగీశ్వర ముద్రకంబగు భవద్దివ్య ప్రభాయుక్తశాం
తరసోదంచితమూర్తి, నీ కరుణ నాథా, నావయిన్ వచ్చెనో
వరుస న్నిన్నిటు వందనద్యముల గొల్వన్, పర్వతేశప్రభూ!

అరయం జూడగలేదె యింతనుక, దేవా, దర్శనప్రాప్తియున్
సిరి నాకందక; క్షేత్రరాజముల నా శ్రీశైల రామేశ్వరా
మరనాథాదుల; గావునన్ మదిని సంభావించి సేవింపగా
వర మీవీవలె నాకు నిప్పటికి, దేవా, పర్వతేశప్రభూ!

# నూఱేండ్ల తెలుగు వ్యాసము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

'వ్యాస' శబ్దమునకు సంస్కృతమున, విస్తారము, విగ్రహము అను పర్యాయపదములు గలవు. 1 విస్తృతి విస్తారః న్యాస ఆఖ్యానే. విశేషముగా చెప్పుకొనుట. 2 విశేషేణ గ్రహణం విగ్రహః గ్రహ ఉపాదానే విశేషముగా గ్రహించుట. 3 విన్యసనం వ్యాసః అస ఉపవేశనే అనేక ప్రకారములుగా నుండుట అని వీని వ్యుత్పత్తులు ఈ మూడును విరివిగా చెప్పబడియున్నవి. నేను పై మూడింటిలో 'వ్యాసము' అనునది ఆధునిక సాహిత్యశాఖలో నొక ప్రత్యేక రచనకు రూఢియైనది.

సారస్వత ప్రజ్ఞాదిక సకల వ్యవస్థా నిరూపణమునకు నీనాడు వ్యాసము ప్రధాన సాధనమైనది. వ్యాసమునకు, పత్రికా వాఙ్మయమునకు అవినాభావసంబంధము. వ్యాసరచయిత తెలుపదలచిన విషయమును గూర్చి వ్రాయుటకు ప్రారంభించిన నది యొకేసూత్రమున నడపించు నిర్బంధము లేదు, పత్రికా ప్రత్యేక శీర్షికలలో దానిని ప్రపంచించుటకు తగిన అవకాశము, వ్యాసరచనలో గలదు. అట్టివి పత్రికలలో ప్రకటితములగుట చేత, వాని యందలి భాగోగములను లోకము గమనించును రచయితలును వానిని సంస్కరించుటకు వీలగుచున్నది. ఆ వెనుక, వ్యాసము లన్నియు గ్రంథరూపమును దాల్చుచున్నవి. కావున నవీన కాలమున గ్రంథరచనలో ముఖ్యాతిముఖ్యము వ్యాసములే యనుట యతిశయోక్తి కాదు. "అంతా రామమయం ఈ జగమంతా రామమయం" అన్నట్లుగా నీనాడు 'అంతా వ్యాసమయం ఈ పత్రికలంతా వ్యాసమయం" అని చెప్పవచ్చును.

సంపాదకీయము లనుడు, ఉపసంపాదకీయము లనుడు, సారస్వతానుబంధములనుడు మరేమి యనుడు వ్యాసములే, పత్రికకు నియతానిత్యాహార రూపకములుగా పరిగణించినవి వార్తలు వ్యాసములు రెండును పత్రికకు ముఖ్యాంగములైనను, వ్యాసములు, వార్తలకంటె సాహిత్యమున స్థాయిత్వము గడించినవి.

ఆంధ్రవాఙ్మయ చరిత్రను పరిశీలించిన వ్యాసము అను రచనా ప్రక్రియ, నవీనయుగమునందే–ముఖ్యముగా ఆంగ్లేయుల పరిపాలనమున దేశమున నెలకొనిన వెనుక క్రైస్తవశకము పందొమ్మిదవ శతాబ్దిలో ఉత్తరార్ధ ప్రారంభమునుండియు కానగుచున్నది. రాజకీయ చరిత్ర ననుసరించి యీ యుగమునందలి సాహితీ పరిణామమును విభజించిన నది యీ క్రిందవిధముగ నేర్పడును.

క్రీ. శ. 1800–1857– కుంఫిణిపాలన – ప్రాచీనయుగము – వ్యావహారిక భాష 1857–1947–విక్టోరియారాణి విదేశీయ యుగము–గ్రాంథిక భాష 1947–[illegible]యుగము వ్యావహారిక భాష.

బ్రౌను దొరవారు తమ నిఘంటువున (ఇంగ్లీషు–తెలుగు) Essay అనుమాట వ్యాసము అనునర్థము నిచ్చిరి ([illegible] 1880 Supplement) Essay n. s. (add) is commonl ycalled in Madras వ్యాసము. Essayist n. s. he who makes an attempt who writes an Essay, an author ప్రయత్నము చేసేవాడు (In Madras Commonly Called వ్యాసము వ్రాసేవాడు గ్రంథకర్త)

అనగా క్రీ. శ 1852 ప్రాంతమునకే నవ సారస్వతమున వ్యాసరచనా ప్రక్రియ మొదలిడినట్లు తెలియుచున్నది. కాని యానాటి 'వ్యాసరచనలు' మనకు లభించలేదు.

నేను ముందు చెప్పినట్లుగా పత్రికలకు, వ్యాసములకు, అవినాభావసంబంధమున్నది గదా. బ్రౌనుదొరవారి కాలమున భాష వ్యావహారికమే. కాబట్టి యా కాలమున పత్రికలు వ్యావహారిక భాషలో వెలువడుచుండెడివి 'వర్తమాన తరంగిణి' (1842-1860) వివిధ విషయ వివరణమున్నది గాని నేటి వ్యాసరూపమున నది లేదు. ఇక ఆ కాలము నాటిదే "వృత్తాంతి" అను పత్రిక మనకు లభ్యము కాకపోవుటచే నందులో నే వ్యాసము లున్నవో తెలియుటలేదు.

ఆ వెనుక క్రీ. శ. 1860 నాటికే పూర్తి సామినేని ముద్దు నరసింహము నాయుడుగారి "హితసూచని" క్రీ. శ. 1862లో ముద్రితమైనది. అదియే తెలుగు వాఙ్మయ చరిత్రలో వ్యాస రచనా ప్రక్రియకు నాంది. కాబట్టి, వ్యాసరచన చరిత్ర నేటికి నూరేండ్ల నాటిది.

నవ్యాంధ్రసాహితీ జగత్తులో, నింత ప్రాముఖ్యము బడసిన "వ్యాసరచనను" గూర్చి ప్రత్యేక పరిశీలన జరుగలేదు. దీనికి కారణము మనకు వాఙ్మయ సారస్వత చరిత్ర లేకపోవు సాహితీ వికాస క్రమపరిణామమును దెలుపు చరిత్ర లేకపోవుటయే యని ప్రాజ్ఞులకు విదితము. ఈ వ్యాసమున తొలిసారిగా నూరేండ్ల వ్యాసరచనా చరిత్రను నివేదించుటకు ప్రయత్నించుచున్నాను

ఆద్యతనాంధ్ర వచనవాఙ్మయ చరిత్రమున, వ్యాసరచన ప్రధానస్థానము నాక్రమించినది. వ్యాసమునకు సాధారణముగ ని క్రింద వివరించిన లక్షణము లుండునని గ్రహింపవచ్చును

1 అతి దీర్ఘమును లేక అతి విపులముగను నుండకుండుట.

2 సంగ్రహముగాగాని, క్లుప్తముగాగాని యుండుట.

3 వక్తవ్యాంశమును విషయ విభాగము చేయుట.

4 ప్రత్యేక ప్రత్యేక శీర్షికలుండుట.

5 వస్తువు మదిమము గాని, నిర్దిష్టముగాగాని యుండుట.

6 నియతిమైన పుటలలో నిముడుట.

పై లక్షణములు వ్యాసముయొక్క వస్తువునకు సంబంధించినవి ఇక వస్తుసమీకరణమైన వచన భాషకు సంబంధించిన విధి.

1 భాష, నిర్దుష్టమై, సులభగ్రాహ్యమై యుండుట.

2 వాక్యాన్వయములు, కాంకములు - వీనిచే నర్థస్ఫురణ కల్గించుట.

3. ఉపక్రమణిక, ఉపపాదనము, ఉపసంహారము—అను మూడంగములు కలిగియుండుట.

పై లక్షణముల ననుసరించి తెలుఁగున వ్యాసరచనా చరిత్రను పరిశీలించినచో నందు నాలుగు విధములైన పరిణామములు కానవచ్చుచున్నవి.

వ్యాసము : 1 ప్రమేయము, 2 సంగ్రహము, 3 ఉపన్యాసము, 4 పత్రికా వ్యాసము, 5 ప్రత్యేక సంచిక — గ్రంథరూపము.

సలక్షణములు గల యీ యభినవసాహితీశాఖ యందలి రచనలు, నవల రచనలోఁ గొన్నింటివలె క్షణికములుగాక, నిత్యనవనూత్నస్ఫూర్తితో నిలువరించుకొన్నవి. ఈ సకలక్షణములను సంగ్రహించిన. 1. విషయ సంగ్రహణము, 2. రచనా సౌలభ్యము, 3. విన్యాసపరిమితి అను మూడును వ్యాసరచనకు మూలము లని చెప్పవచ్చును.

వ్యాసరచయిత, తన యాలోచనలనుగాని, భావములనుగాని స్పష్టముగా తెలుపుటలో కొంత కొంత చదువరుల యూహకు వదలివేయుట తప్పనిసరి యగును. అట్లు వదలకుండ, అంతయు తానే చెప్పుచో ఆ రచన పేలవమై, విసువు పుట్టించి, విలువను నింకించును. చదువరుల యూహ కుపయోగించునవి ధ్వని, కాకువు వాక్యవిరామ చిహ్నములు, కారకము ముఖ్యములు. వాక్యమునందలి మాటలను యథేచ్ఛగా వాడుకొనగల వ్యాసరచయిత ఆ మాటలనే, ఒక బొందికతో, ఒక గమనికతో వ్రాసిన, వది ఉక్తవ్యాంశమును నవీనముగా ధ్వనింపఁజేసి మనసునకు హత్తుకొనునట్లు చేయును.

## ప్రమేయము

ఈ విభాగమున ప్రథమముగను కడపటిదిగను పేర్కొనఁదగినది, శ్రీ సామినేని ముద్దునరసింహులునాయుడుగారి హితసూచని. ఇందు [1]వ్యాసరూపమున నెనిమిది ప్రమేయములు గలవు—1. విద్యాప్రమేయము, 2. వైద్యప్రమేయము, 3. సువర్ణప్రమేయము, 4. మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయమును, 5. గతిక్షీప్రభృతి ప్రమేయము, 6. మంత్రప్రమేయము, 7. పరోక్షాది జ్ఞానప్రమేయము, 8. వివాహప్రమేయము. ఇందలి రచన శిష్టవ్యావహారికము ఉదాహరణము :

"స్త్రీలకు విద్యలు సాధకము లౌచున్నవి. విద్యలు నేర్పుటకు హిందూదేశములో గ్రంథములు మిక్కిలి సదుపాయముగా నేర్పడియున్నట్లు కొంద రెంచుకొంచున్నారు కాని, యిదివరకు నేర్పడియున్న గ్రంథములు ఏమి, వాటిని బాలురకు చెప్పించు పద్ధతులేమి, యోగ్యులైనవారిచేత జరిగించబడుచున్న కృషికి తగినఫలములు ఇవ్వడము లేనందువలనున్ను, శరీరారోగ్యమునకు జరూరైన వైద్యాంశము లనుగ్రహించడము సర్వ ముఖ్యకార్యమైనప్పటికిన్ని, హిందూ జనులందరు, అందును స్త్రీలు ఉపేక్ష చేయబడుచున్నందున వారికి వ్యర్థప్రయత్నమున్ను, వ్యర్థకాలక్షేపమున్ను అసౌఖ్యమున్ను హానియున్ను కలుగుచున్నవి."

గ్రంథకర్త తాను వాడిన భాషనుగూర్చి యిట్లు చెప్పియున్నారు :

"గ్రామ్యోక్తి ఆంధ్రభాష తాలూకు అంశములలో నొకటిగా లక్షణగ్రంథములయందు చెప్పబడియున్నది. ఈ పదములు ఛందోబద్ధములైన గ్రంథములయందు నేర్పడము అరుదైయున్నదిగాని, వాక్యగ్రంథములయందునూ, భాషయందును వీటి వాడిక తరుచై యున్నది. ఇందువల్ల భాషారచన మిక్కిలి ధారాళముగా నుంటున్నది. గనుక సాధారణమైన భాషయందు వాడుకలోనున్న గ్రామ్యపదములు చాలామట్టుకు సరసమైన వాక్యరచనలో అంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను." (హితసూచని 1862.)

## సంగ్రహము

వ్యాసములను సంగ్రహము లను పేర తెలుఁగున వెలయించినది భారతవర్ష ప్రథమ మహామహోపాధ్యాయ వరవస్తు వేంకటరంగాచార్యులుగారు. వారిక్రింది సంగ్రహవ్యాసములను రచియించి ప్రకటించిరి. ప్రాచీన భారతీయమత సాహితీసంస్కృతి విశేషములను సర్వజన సులభగ్రాహ్యమైన శైలిలో సప్రామాణికముగ తెలుఁగులో వ్యాసరూపమునఁ బ్రకటించినవారిలో రంగాచార్యులవారు ప్రథములు. ఆయా విశేషములుగల వ్యాసముల నిక్రింద పేర్కొనుచున్నాను.

1 అలంకార సంగ్రహము; 2. వర్ణనిర్ణయము; 3 ఆర్షమతి సంగ్రహము; 4. ఆత్మసంగ్రహము; 5. శాఖాసంగ్రహము; 6 శ్రుతి సంగ్రహము; 7. స్మృతిసంగ్రహము; 8 వర్ణసంగ్రహము; 9 వేద సంగ్రహము; 10. వివాహసంగ్రహము; 11. దేవతాసంగ్రహము; 12. ధర్మజన్మసంగ్రహము; 13 గుణసంగ్రహము; 14 అవతార సంగ్రహము; 15. కళాసంగ్రహము; 16. కర్మసంగ్రహము; 17. ముక్తసంగ్రహము; 18 ముక్తిమార్గసంగ్రహము; 19 ప్రమాణ సంగ్రహము; 20. ప్రాయశ్చిత్త సంగ్రహము; 21. పునర్వివాహ సంగ్రహము; 22. రహస్యసంగ్రహము; 23 హిందూశాస్త్ర సంగ్రహము.

## ఉపన్యాసము

నవ్యసాహితీరంగమున 'ఉపన్యాసము' అను రచనకు నొక ప్రత్యేకస్థానమున్నది. నేటి వ్యవహారములో, సాధారణముగ ప్రత్యేక సమావేశములయందు, సభలయందు, లిఖితరూపముగా గాక వాగ్రూపముగా చెప్పినవానికే, ఉపన్యాసములు అను వాడుక యున్నను, నొకప్పు డిది 'వ్యాసము' అనుపదమునకు పర్యాయపదముగా నుండెడిది. ఈపరిస్థితి క్రీ. శ. 1870 ప్రాంతమునుండి వాఙ్మయమున నేర్పడినది. దానికి కారణ మానాటి దేశకాలపరిస్థితులే. వ్యాసములైనను, ఉపన్యాసములైనను మనకు పాశ్చాత్య నాగరికత, సంస్కృతి, సంస్కారములవలన వచ్చినవియే యని వాఙ్మయచరిత్రకారులకు, విమర్శకులకు నిదియు విదితమైయున్నది. ఈ సంస్కారమూలమునసే మన తెలుఁగుదేశమున వ్యాసరూపమునకు[2] యుపన్యాస

1. గద్యచింతామణి. గిడుగుపండితులు గారిచే సమకూర్పఁబడింది. ఇందీ గ్రంథము 'వ్యాసము' గా నే పరిగణితమైనది. మూడవ విషయసూచిక పు. 25: వ్యాసము హితసూచని—సామినేని ముద్దునరసింహనాయుడు.

2 ఈ యుపన్యాస శాఖాచరిత్రవివరము లెఱుఁగఁగోరువారు నేను రచించిన ఆంధ్రవచన వాఙ్మయము 146, 147, 148 పుటలు చూడవలెను.

పద్ధతి ప్రారంభమై వ్యాప్తిలోనికి వచ్చినది. దీనిని ప్రారంభించిన వారు, ఆధునికాంధ్ర వాఙ్మయమున యుగపురుషుడు వీరేశలింగము పంతులు. వారు మొదట యుపన్యసింపఁబోవు విషయమును వ్యాసములవలె సుప్రక్రమోప సంహారాదిలక్షణముల ననుసరించి దిద్ది తీర్చి వానిని. సభాసమావేశములయం దుపన్యసించి, ఆపై వానిని గ్రంథరూపమునఁ బ్రకటించువారు. వారా యుపన్యాసములు చేసిన స్థలములు రాజమహేంద్రవరమున ప్రార్థనసమాజము, విజయనగరమహారాజావారి బాలికాపాఠశాల. ఇవి ప్రథమమున ముద్రితములై ప్రకటితములైనప్పుడు, వాని ముఖపత్రమున నిట్లుండెను : "ఐకమత్యము-తే 15-8 1875 దిని రాజమహేంద్రవరమున, విజయనగరము మహారాజావారి బాలికాపాఠశాలయందు కందుకూరి వీరేశలింగముచే నియ్యఁబడిన యుపన్యాసము."

వీరేశలింగకవివ్యాసములను నాలుగువిధములుగా విభాగింపవచ్చును (1) మతము (2) స్త్రీ పునర్వివాహవిషయము (3) సాంఘిక ప్రవృత్తి (4) రాజకీయములు.

1. మతము : హిందూమతములు – వర్ణములు, జన్మాంతరము, విగ్రహారాధనము–ప్రార్థన, వైరాగ్యము, దానములు, ఈశ్వరదత్తపుస్తకములు, ఈశ్వరోపాసనము.

(2) స్త్రీ పునర్వివాహవిషయము : అతిబాల్య వివాహములు, స్త్రీ పునర్వివాహవిషయకోపన్యాసము, ప్రథమ విజ్ఞాపనము, ప్రవర్తక సమాజవిజ్ఞాపనము. (ప్రథమ ద్వితీయములు), స్త్రీ పునర్వివాహ విషయశాస్త్ర సంగ్రహము.

(3) సాంఘికప్రవృత్తి : ఐకమత్యము, విద్యావంతుల యర్హ కృత్యములు విద్యార్థుల ధర్మములు, సహాయకమకర్మలు, స్వయంకృషి, జీవిత పరమార్థము—దానిని పొందు లాభములు.

(4) రాజకీయములు : దేశీయ మహాజనసభ దాని యుద్దేశములు, సంఘ సంస్కరణ, మహాసభాధ్యక్షోపన్యాసము, గోదావరీమండల సాంఘిక సభాప్రసంగము.

4వీరేశలింగకవి వ్యాసములయందు (1) సులభగ్రాహ్యశైలి (2) వైశద్యము (3) సమత (4) జీవము ముఖ్యలక్షణములు. మఱియు నీ వ్యాసారంభమున నేను వివరించిన లక్షణము లన్నియు వీరేశలింగకవి రచనలయందు పొందుపడియుండుటచే, నీతని "వ్యాసరచనాద్యుఁడు" అని యీశాఖాచరిత్రమున పేర్కొనవచ్చును.

కందుకూరి వారికాలముననే వెలువడిన యుపన్యాసములను, వ్యాసములను రెండుపేళ్లతోను వ్యవహరింప బడుచున్నట్లుగా నీ ప్రచురణములనుబట్టి గ్రహింపవచ్చును. కర్మోపన్యాసము – దుర్భాక వెంకటాచలశాస్త్రి – 1892 ఇది కర్మను గూర్చిన వ్యాసము. బేకనుపన్యాసములు – ఆంగ్లేయ భాషలో ప్రసిద్ధవచన రచయిత తాత్త్వికుఁడును నగు బేకను మహాశయుడు వ్రాసిన వ్యాసముల కా భాషలో Bacon's Essays అని పేరు. కాని తెలుగులో తొలుత దీనిని భాషాంతరీకరించిన శ్రీ కిడాంబి రాఘవానుజాచార్యులుగారు దీనికి 'బేకనుపన్యాసములు' అని పేరు పెట్టియున్నారు. రెండవ భాషాంతరీకర్తయగు నుసర్ల అనంతరావు గారు "బేకనువ్యాసములు" అని వ్యాసమునకు పర్యాయపదముగా వాడియున్నారు.

ఉపన్యాస పయోనిధి—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు : 'కావ్య విమర్శనమునందు యమునికవాఙ్నిర్ఘృణుడని' గిడుగువారిచే కీర్తితుడైన కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు ప్రసిద్ధ వ్యాసరచయితలు. వారు వీరేశలింగముగారికి ప్రతిస్పర్ధులై, ఆర్యమతబోధిని పత్రిక ద్వారమున మత సాంఘిక విషయములపై పెక్కువ్యాసములు వ్రాసిరి. సాహిత్యమునందును పరిశ్రమములుగా వ్యాసవ్యాసంగము చేసిరి. అయినను క్రీ శ. 1910 లో వారి వ్యాసములొక సంపుటముగా ప్రకటింప బడినప్పుడా గ్రంథమునకు "ఉపన్యాస పయోనిధి" అను పేరే యుండుట గమనింపదగినది.

ఇట్లే, వల్లూరి జగన్నాథరావుగారి ఉదకమును గూర్చిన ఉపన్యాసము (క్రీ. శ. 1881), మన్నవ బుచ్చయ పంతులుగారి కామినీ గర్హణ దూషణము అను నుపన్యాసము (1891) వ్యాసములే. పైవానిలో ఉదకమునుగూర్చిన వ్యాసము శాస్త్రీయ పద్ధతిని, శ్రుతి స్మృతి ప్రమాణ పూర్వకముగ రచితమైనది. తిరిగి ముద్రణము కాదగిన ప్రశస్తరచన.

## పత్రికా వ్యాసము

వార్తా పత్రికల స్వరూపమును మార్చి, ప్రత్యేక సంచికా రూపమున వెలువరించిన ప్రథమ పత్రిక తత్త్వబోధిని. ఇది క్రీ శ. 1865 లో ప్రారంభమై మాసమున కొకతూరి సంచికారూపమున వెలువడుచుండెడిది. నేడు మనము "వ్యాసము" అని పరిగణించుశాఖను పత్రికయందు ప్రవేశ పెట్టిన దీపత్రికయే. క్రీ. శ. 1868 సంవత్సరమున ప్రకటింపబడిన యీ క్రింది వ్యాసము లెంత సమగ్రముగా నుండెనో ఈ క్రింది సమాచారములో వివరించుచున్నాను.

శారస్వతము :—శతావధాన వివరణము 5 ఇందు శతావధానమున చేయునట్టి పద్ధతులు సంపూర్ణముగ వివరింపబడినవి. అవి

| | | |
|---|---|---|
| 1. | కవిత్వభేదములు | 65 |
| 2. | ఖండ పత్రికా భేదములు. | 12 |
| 3. | చతురంగ భేదములు. | 13 |
| 4. | గణిత భేదములు. | 4 |
| 5. | ప్రకీర్ణక భేదములు. | 4 |
| 6. | నిర్బంధ భేదములు. | 6=104 భేదములు |

3 ఇట్లు ప్రథమముద్రణమునందలి విషయములన్నింటిని సంగ్రహించి పై గ్రంథమున వివరించితిని. వీరేశలింగముగారే తాము సంపుటములుగా ప్రకటించునప్పుడు వీనిని విడిచివేయుటచేత, తరువాతి ముద్రణములలో నివి చేరలేదు.

4. వీరేశలింగముగారి వ్యాసములను క్రీ. శ. 1879 మొదలు క్రీ. శ. 1897 వఱకును రచించియున్నారు. వారి చివరవ్యాసము. వారు చనిపోవుటకుముందు క్రీ. శ. 1918 లో వ్రాసినది, "బమ్మెర పోతనామాత్యుడు" అను ది. ఇది యా సంవత్సరముననే, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికయందు ప్రకటితమైనది.

5. శ్రీ వేలూరి శివరామశాస్త్రి మహోదయులు ఆంధ్ర వారపత్రిక స్వర్ణోత్సవ సంచికయందు వ్యాసమును గూర్చి సూచించిరి.

నేటి 'శతావధానమున కొన్ని పద్ధతులను మాత్రమే వినమెఱుంగుదుము - కాని తక్కిన యున్నయవి విస్మృతములు. ఈ వ్యాసమున నా వివరణములన్నియు గలవు. ఈ విషయమును గూర్చి ప్రత్యేకముగఁ దెలుపు వ్యాసము నేటివఱకు వెలువడలేదు.

సాంఘికము :—1. స్త్రీ పునర్వివాహ విషయము 2. బాలికా విద్యావశ్యకము.

మతము :—ఈ పత్రిక బ్రాహ్మమత సంబంధమైనది యగుటచే నా మతమునకు సంబంధించిన వ్యాసములు వెలువడినవి. 1. పరిశుద్ధాత్మిక మతస్వరూపము, 2 పరమాత్మ స్వరూపము 3. జీవాత్మ స్వరూపము. పరిశుద్ధాత్మిక తత్త్వము.

వైజ్ఞానికములు :— 1. సూర్యగ్రహణము, 2. స్థైర్యముఁ 3. ఐకమత్యము.

ఈ పత్రికలో ప్రకటితమైన "స్త్రీ పునర్వివాహ విషయము" అను వ్యాసమే వితంతువివాహముల నుద్ధరించిన వీరేశలింగము పంతులు గారికి నాయకత్వమున చేయూత నిచ్చినది. ఇది వారి స్వీయ చరిత్ర చదివినవారికి తెలియగలదు. మఱియు వారు బ్రహ్మసమాజికులగుటకును నీ పత్రికయే కారణము. పైని పేర్కొన్న వ్యాసములలోని సులభశైలియే వీరేశలింగముగారి సౌలభ్య వచనరచనకు మూలమైనది.

"తత్త్వబోధిని" తరువాత నే, బందరున 'పురుషార్థ ప్రదాయిని", రాజమహేంద్రవరమున "వివేకవర్ధని" (వీరేశలింగము పంతులు గారిది) సంచికారూపమున వెలువడుచుండెడివి. ఆ పత్రికలలో వివేకవర్ధనిలో మాత్రము వీరేశలింగము పంతులుగారి వ్యాసములు కొన్ని ప్రకటితములైనవి. కాని యా నాటి పత్రికలలో భాషాసాహిత్య వివాదములు కొన్ని చిన్ని కృతులుగాఁ బ్రచురము లగుచుండెడివి. అవి నాటికిని నేటికిని విస్మృతప్రాయములు. ఉదాహరణకు—వివేకవర్ధనిలో వీరేశలింగము పంతులుగారు, శ్రీ పన్నాల సీతారామ బ్రహ్మశాస్త్రి (వీరు వీరేశలింగముగారి ఆంధ్రభాషా గురువులు) రచితమైన 'ప్రాచిపుస్తక' శతకమును బ్రచురించిరి. ఈ శాస్త్రిగారు గాని, శతకము గాని నేటివఱకు కవుల చరిత్ర కెక్కలేదు.

క్రీ. శ. 1870 ప్రాంతమునుండి, సంచికారూపమున గిట్టి మాసపత్రికలను, కల వార్తలను, విశేషములను ప్రకటించు పత్రికలను వేఱు వేఱుగా వర్ధిల్లినవి.

---

ప్రతి వారమును, కేవలము పత్రికారూపమున వెలువడు వానికంటె, ప్రతి మాసమును నొక గ్రంథరూపమున వెలువడు సంచికలయందు "వ్యాసములు" ప్రకటించుటకు నవకాశములున్నను, అప్పటి దేశకాల భాషాపరిస్థితుల ననుసరించి, వానియందు అముద్రిత ప్రాచీనాంధ్ర కావ్యప్రచురణము ప్రధానస్థాన మాక్రమించినది. అముద్రిత గ్రంథ చింతామణి, సరస్వతి, మంజువాణి మొదలగు పత్రికలు ఆంధ్ర ప్రబంధముల నెన్నింటినో వెలుఁగులోనికి దెచ్చినవి. వానిలో సరస్వతి మంజువాణి పత్రికలు కేవలము గ్రంథప్రకాశమునకే వినియోగమైనవి. అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక మాత్రము, ప్రాచీన ప్రబంధములతోపాటు "వ్యాసము"లను 6 ప్రకటించినది. అవి కేవలము ఛందోవ్యాకరణమునకు సంబంధించినవి. ఆ వ్యాసములు నేటి వ్యాసలక్షణముల ననుసరించినవియే.

శాబ్దికములు : 1. పరిఘా పరిఖాశబ్దద్వయ విచారము 2 రేఫద్వయవిచారము 3. ఙ. ఞ కారవిచారము 4. ఉకారాంతర విచారము 5. బిందుపూర్వక టతవర్గయతి 6. గసడదవాదేశవిచారము ఏనవిసప మొదలగువాని చర్చ శ్రీ వేదమువారి 7. శ్యమంతక, స్యమంతకశబ్ద విచారణ 8. పయశ్శబ్ద విచారణ 9 యతిః కీర్తి ఖేదాంత వ్యాసము.

ఛందస్సు : నన్నయభట్టారకుని కవిత్వమునందలి ఛందోవిశేషములు.

ఆ కాలమునందలి పత్రికలలో సాహిత్యవిషయమే ప్రధానము. అప్పటి కింకను సాహిత్యేతర వైజ్ఞానిక విషయములు తెలుఁగులోనికి వచ్చియుండక పోవుటచేతను, విషయములు తెలిసియు తెలుఁగు భాషలో వానిని తెలుపువా రత్యల్పసంఖ్యాకు లగుటచేతను సారస్వత విషయములే ప్రధానములైనవి.

వైజ్ఞానిక, శాస్త్రీయ విషయములను వ్యాసరూపమునఁ దెలిపిన తొలిపత్రిక ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారి 'కల్పలత.' ఇది సారస్వత పత్రికయే యైనను, ప్రప్రథమున శాస్త్రీయ విషయములను బ్రసంగించినది.

1. భూమితత్త్వము, 2. ఖనిజములు, 3. ఆర్యగృహము 4. వాయువిమానములు, 5. విద్యుచ్ఛక్తి మున్నగు వ్యాసములందు ప్రకటితములైనవి.

'కల్పలత' పత్రికాప్రకటనకుపూర్వమే అనఁగా క్రీ. శ. 1894 లో సాంఖ్యాయనులు 'రహస్యదర్పణము" అను పేర, తొలుత వైజ్ఞానిక శాస్త్రీయగ్రంథమును వ్యాసరూపమున బ్రకటించిరి. అందు 1. దృశ్యప్రపంచ రహస్యములు, 2 క్రిమికీటక రహస్యములు, 3. పక్షిరహస్యములు, 4 జంతుయాత్రా రహస్యములు అను వ్యాసశీర్షికలు గలవు.

శాస్త్రీయమైన సాంకేతికపదములను వాడకుండ, సర్వజన గ్రాహ్యముగ తేటతెలుఁగు మాటలలో వైజ్ఞానిక విషయముల వివరించు పద్ధతికి సాంఖ్యాయన శర్మగారే ప్రథములని చెప్పవచ్చును.

'భారతి కళానిధి' యనునొక పత్రిక క్రీ. శ. 1916 లో బెంగుళూరినుండి వెలువడుచుండెడిది. ఆ పత్రిక ప్రథమ సంచికయందు "ఆంధ్రభాష"నుగూర్చి యపూర్వాద్భుత విషయములను దెలుపు నొక వ్యాసముగలదు. అందు "ప్రపంచలహరి" యను గ్రంథము భాషాధికారము 18వ ప్రకరణమున కృతయుగమునుండి కలియుగమునకు నేర్పడిన యీ క్రింది యాంధ్ర భాషాభేదము లీయఁబడినవి. 1 అంధ్రము, 2 ఆంధ్రదేశము, 3 కోసలాంధ్రము, 4.

---

6 ఈనాడు, భాషాతత్త్వమునుగూర్చి తెలుఁగు వ్యాకరణమునుగూర్చి, ఛందస్సునుగూర్చి వ్రాయబడు, వ్రాయఁబడుచున్న వ్యాసములలోని యంశము లప్పటికే నిరూపితములై యుండ క్రిందటి పై వ్యాసములలో సుప్రసిద్ధములైనవని నేటి భాషాసాహితీ పరిశోధకు లెఱుంగుదురుగాక.

పోరంబకొాంధ్రము, 5. కళింగాంధ్రము, 6. మల్లకాంధ్రము, 7. ద్రవిడాంధ్రము 8 గుహ్యకాంధ్రము 9 శ్వాదకాంధ్రము, 10 గుహాకాంధ్రము, 11 గ్రామ్యకాంధ్రము, 12 పితకాంధ్రము. ఇవి యొవరివరిచేత నేయే యుగముల ప్రవర్తితమైనవి యందు మూల శ్లోక తాత్పర్యములలో వివరింపబడినవి. నేటి భాషా చారిత్రక తిహాసిక సంస్కృతి పరిశోధకు లిట్టివానిని విధిగా పరిశీలింపదగిన విషయము. ఈ పత్రిక సంపాదకుడు పండితి టి సుబ్బరాయశాస్త్రి

పూర్వపు పత్రికలయందెట్టి విషయములు ప్రకటితమగుచుండెడివో తెలుపుటకు పై విషయము లుదాహరించితిని.

ఒకప్పుడు తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురమునుండి 'ముద్దుల మూట' అను పత్రిక వెలువడుచుండెడిది ఆ పత్రికలో, తెలుగు కవిశ్రేష్ఠుల కుచ సౌభాగ్యమునుగూర్చి వాఙ్మయమునందలి కవి వర్ణనల నాధారము చేసికొని, కీర్తిశేషులు కొత్తపల్లి బ్రహ్మయ్య శాస్త్రిగారొక ప్రశస్తమైన వ్యాసమును వ్రాసిరి. నేడిది విస్మృతి ప్రాయమైనది. మన ప్రాత పత్రికలు పరిశోధించిన నిట్టి యమూల్య వ్యాసరత్నము లెన్నియో లభింపగలవు

## పానుగంటి - సాక్షి వ్యాసములు

సాక్షి వ్యాసముల మూలమున సారస్వత జగత్తును చైతన్యవంతముగ నొనరించి వచన రచనయందు ప్రత్యేక ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శించినవాడు పానుగంటి. వస్తు సంగ్రహణమున, వాక్య నిర్మాణమున, శబ్ద ప్రయోగమున, సన్నివేశ సంవిధానమున, పానుగంటి వలన తెలుగు వచనమున కొక క్రొత్త సొగసు, తెనుగు రచనమున కొక క్రొత్త పుష్టి లభించినవి. పానుగంటి వ్యాసరచన పాఠకుల హృదయము దోచుకొనుచు, బహుభంగులను ప్రదర్శించుచు పాఠకుల తన్మయత్వమును జెందించును. యతిప్రాస విన్యాసములతో, యమక గమకములతో, అసాధారణ ధారావాహికతో, అఖండ లౌకిక సుజ్ఞాన సంపత్తితో, అనుపమాన హాస్య ధోరణితో, అచ్చమగు నాంధ్రతాముద్రతో, పానుగంటి రచన లాంధ్రవాఙ్మయ వీథి నలంకరించినవి. ఉపజ్ఞా సహితమగు నిట్టి యుత్తమశైలి యాతని వ్యక్తిత్వమునకు వ్యాఖ్యానము. అతని రచనములో నేపటున కొన్ని వాక్యములు మచ్చునకు దీసి చదివినను "ఇది పానుగంటివారిది" అని పట్టియిచ్చునంతటి ప్రత్యేక వ్యక్తిత్వము గలది నేటి తెలుగు రచయితలలో నిట్టి వ్యక్తిత్వము గలవారు వ్రేళ్లపై లెక్కింపదగినవారే కలరు—ఈతని రచన ననుకరించుట కలవి గానిది.

సాక్షి యుపన్యాసముల మూలమున వారికి విమర్శింపని విషయము లేదు; గర్హింపని యనర్థాచారము లేదు; వెక్కిరింపని కుటిలవృత్తి లేదు; త్రొక్కిపెట్టని నూతన పోకడ లేదు; పరామర్శింపని మతప్రవృత్తి లేదు; తెలుపని జీవితము లేదు; హాస్యమునకు దొరకని సాంఘిక వ్యవస్థ లేదు; చూపని వాక్యరచనా వైచిత్రి లేదు; వెదజల్లని ప్రజ్ఞాలిత భావము లేదు. పత్రికలను ముద్రించుచు బల్లి శ్యామసుందరులను చేసికొనుటలో "అతని కతడే సాటి" అతని పాత్రలన్నియు జీవత్పాత్రములు. కవి, సుబ్బన్నదీక్షితులు, గిరీశము వంటి పాత్రల వలె సాక్షి సంఘమున జంఘాలశాస్త్రి పాత్ర సార్వజనీనత్వము సంపాదించినది.

పానుగంటి వ్యాసరచన యందలి లక్షణములు: 1. పద్యము సంగువలె గద్యమున భావరసస్ఫూర్తి గల్గించుట, 2 యతిప్రాసలను నియతముగా వాడి యత్యంతకౌశలముతో ముద్రింపబడినవి...ఉదా: (పిఠాపుర వర్ణనమున) 'మాధవత్వ్రమమునటచే భక్తికి, మహాకవి నిలయమగుటచే రక్తికి, మహారాజాస్థానమగుటచే ముక్తికి నిపురము శ్రీపురము. 3. సామెతల యందును సహజముగు యతిప్రాస లప్రయత్నముగ రచనయందు భాసింపజేయుట. 4. సంస్కృత సమాసముల నుచిత స్థలములలో నుపయోగించి, శైలికొక యుదాత్తత కల్పించుట. సమాసము లెంతదీర్ఘముగనున్నను సులభముగా నర్థస్ఫూర్తి కల్పించుట 5. సమాసబంధుర శైలియైనను చదువరులకు విసువు కల్గింపకుండుట 6 విశేషణముల నొకదండవలె గూర్చి వర్ణ్యవస్తు విశేషమును ప్రస్ఫుటము చేయుట. ఉదా: నిద్దేవుచున్న, తెలివి తక్కువ, నిర్భాగ్యపు టల్లరి చిల్లరి యవకతవక అసమ్మయోనసమ్మ యారిక చొప్పమాలు ఉద్ధకవిత్వమునకు జెప్పలేక మానివేయలేదు. 7. ఉపమలను మాలికవలె నుపయోగించి యర్థము హత్తుకొనునట్లు చేయుట. ఉదా: వాణిదాసుడు, జంఘాల శాస్త్రియును, కోడి పుంజులవలె కాలు దువ్వుచు, గొర్రె పొట్టేళ్ళవలె తలలువంచి, బుసలుకొట్టుచు ఆబోతులవలె రంకెలు వేయుచు మల్లులవలె తొడలు చరచుచు పంజాబీ మైదాగా సవినాక్యసపు గమనికలలో జేయి చేయి కలుపుకొనసిద్ధమైరి. 8 అతి స్వల్ప వస్తువులను అత్యంత దీర్ఘ సమాసములతో వర్ణించి, విలక్షణత్వమునేని హాస్యము సృష్టించుచేయుట. ఉదా: శ్రీమాన్ మహామండలేశ్వర రాజాధిరాజ గండర గండాది బిరుదాంకితులైన శ్రీ కృష్ణదేవరాయల యాస్థాన మందలి నిర తీర పటీరహార చంద్రికా సారధిక్కార జగద్విఖ్యాత యశస్సాంద్రయులైన కిష్కింధ దోమలు—ఇది ఎకలాంధ్రదేశ మశక, మత్కుణ, మూషిక మహాసభ లోనిది. 9 రేఖామాత్రములైన శాబ్దిక వర్ణనలచేత సంపూర్ణ రూపచిత్రమును మనోవీధిని మెలగునట్లు చేయుట. ఉదా: సరస్వతీ సంపుటములను చేతబట్టుకొని కంటి జోడితో ముందునకు బోవుచున్న ఆ భాషాపోషక తేజమే బ్రాహ్మణప్రభునిగా పరిశీలించితిరా!—ఇది సరస్వతీ పత్రికాధిపతి యగు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారి వర్ణన.

## సాహిత్య వ్యాసములు: మానవల్లివారు

సాహిత్యవ్యాసములను గూర్చి చెప్పునప్పుడు మతిలోకోత్తరులై, మహావిద్వాంసులైన మానవల్లి రామకృష్ణ కవిగారిని గూర్చియే తొలుత చెప్పతీరవలెను ఆంధ్ర పత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక మొదలుగ, పదిసదు నెదేండ్లును, భారతి పత్రిక ప్రారంభమునను, నా వెనుక వచ్చుమనసునను, తమ యముల్యా ద్భుతమేయసాహితీ విజ్ఞానమును ప్రదర్శించు వ్యాసరాజముల వాని నలంకరించిరి భ్రాంతికి పుట్టుటకు పూర్వమే ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధమున వారు మహాకవి దండి, కాళిదాసు మున్నగు వ్యాసములు ప్రకటించిరి అవి యీనాటి ప్రాచ్యవిద్యా పరిశోధకులకు తిన్నగా కన్నులు దెఱువని కాలమున రచితములైనవి 'శ్రీకృష్ణకర్ణామృతము లీలాశుక కవి', అను వ్యాసము సాహిత్య వ్యాసములలో కెల్ల మకుటాయమానమైనది.

కవిగారి శైలి, సంస్కృతాంధ్ర పదబంధ పటుత్వము గలిగి, ప్రసన్న గంభీరమై వెలయును. అట్టి శైలి యితరులకు నసాధ్యమై, పట్టుపడనిది. వారి వ్యాసము లన్నియు నింతవఱకు నొక సంపుటముగ వెలువడకపోవుట సాహిత్యోపాసకుల దురదృష్టము.

వారి రచన కొక యుదాహృతి: "మయూరకవి వాగ్గుంభనము మిక్కిలి ప్రౌఢమై, అర్థము గంభీరమై పాండిత్య వైదగ్ధ్యములకుం దావలమై, శబ్దరచన యాశుకవిబంధమై, యక్షిప్తమై, ప్రతిపదరసగ్రాహి అయి యుండును. ఈతని కవితయందు రచనాపాటవముతోపాటు సందర్భశుద్ధియు నర్థగాంభీర్యముతోపాటు శ్లేషకళానైపుణ్యమును గలవు. పదగుంభనము లలిత మధురమై, యర్థము ప్రసన్న గంభీరమై యనవాదమే మూలగ్రంథమని జనింపఁజేయుట ప్రథమ క్లేశము. రెండవది మరానుసారము మూలపద్య చ్ఛందస్సునకు సాజాత్యముగా లేక సమాన పరిమితముగా తెనుగు పద్యముల నేర్చికొనుట. మూడవ క్లేశము. మూలపద్యములలోఁ గల ధ్వని విశేషములకు శాస్త్రాంతర రహస్యములును, చరిత్రాంశసంఘటనలును, శ్లేషభంగుల నేకదేశస్తుతినిందాగర్భక విధానములును ననువాదమునకు దుర్భటము. ఈ మూడును ననుకరణములలో సాధారణలక్షణములు."

విమర్శాదర్శక నడకుదుటి వీరరాజుగారి సాహిత్యవ్యాసములు తేటమతి గలవి. ఇవి విమర్శతరంగిణి యను పేర ముద్రితములై యున్నవి. నిగ్గుపడు రచన, భావవైశద్యము వీరి వ్యాసములలో ప్రామాణికములై యుండును.

శ్రీ వేలూరి శివరామశాస్త్రి. విశ్వతోముఖప్రజ్ఞలో, మహావిద్వాంసులుగా, విఖ్యాత శతావధానులుగా, మీనుమిగిలిన కవికథకులుగా, విరాజిల్లి, తను పేరులోనే, హరిహరాద్వైతసిద్ధిని పెంపొందించిన భాషాసాహితీ నియంతలు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. వీరి వ్యాసరచన లాంధ్రభారతికి వెలలేని భూషణములు.

అతినిగూఢమును గంభీరమును నగు నద్వైత వేదాంతమును నాంధ్రభాషలో నతిసులభముగ నరటి పండొలిచి చేతికిచ్చిన రీతిని వివరింపగల సిద్ధహస్తులు శ్రీ శాస్త్రిగారొక్కరే. మాయావాదము, అరవిందదర్శనము మున్నగు వ్యాసములు వారి రచనకు దర్పణప్రాయములు. ప్రాచీన ఖగోళము మున్నగునవి వారి వైజ్ఞానిక ప్రతిభకు తార్కాణములు. ఉదాహృతి:

"కార్యము భవిష్యత్తు కారణము భూతము, తిరిగి కార్యము వర్తమానము. కారణము భూతము. కావున కార్యకారణములే మనకు భూత భవిష్య ద్వర్తమానములు. కుమ్మరి ఒక కుండ చేయబోవుచున్నాడనుకొందము. అతడు మొదట నేమి చేయును? మన్ను, నీరు, బూడిద సారెకోల మొదలగువానిని చేరికింప నుంచుకొనును. కుండ కివి యన్నియు కారణములే. ఆరంభవాదు లీ కారణములలో పుట్టిని మాత్రము సమవాయి కారణమని యందురు.

"ఈ సృష్టికి పూర్వము ప్రత్యక్షముగా కానుపించు వస్తువేదియు లేదు. నిత్యములగు గాలి నిప్పు నీరు మన్నుల పరమాణువులును దిక్కాలాకాశములును ఈశ్వరుడును లెక్కలేని జీవాత్మలును ఈ సృష్టికి పూర్వమున్నవి."

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ: శర్మగారి వ్యాసశైలి సజీవమైనది. మనసుమీఁద ముద్ర పడినట్లు చెప్పఁగల శక్తి దానికి గలదు. వాక్యములు చిన్నవియై పటుత్వము గలవి. భావబంధురమైనవి. సరసమగు హాస్యముతో జాతీయతను ప్రకటించునవి. సారస్వతాలోకమున ప్రకాశితమైన వీరి వ్యాసములలో ననుకరణమునకు నలవియని "రచనాశిల్పము" కలదు. కావుననే శ్రీ శర్మగారు వ్యాసరచయితలలో ప్రత్యేక వ్యక్తిత్వము గల మనీషి.

## చారిత్రక వ్యాసము

చారిత్రక వ్యాసరచనమున కొంద ఱగ్రగాములు కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు. పరిశోధకులు. సంస్కృతాంధ్ర మహారాష్ట్ర భాషలయందు విద్వాంసులు. వీరి వ్యాసశైలియందు సమత, సౌలభ్యములు సమానముగ నుండుటయే గాక ఎట్టి నిగూఢ, క్లిష్ట గహన విషయము నైన నిష్పక్షపాతముగ, తేలముగ విప్పజెప్పుదురు. వీరి శైలియందు నూతనత్వము నాపాదించు వైశద్యము గలదు.

చరిత్ర, శాసనములు, భాషాశాస్త్రము, కళ మొదలుకొని విజ్ఞానసర్వస్వము వఱకును వీరి వ్యాసరచన విస్తరిలినది. వివిధ విషయగుంఫితములగు వీరి వ్యాసములు సంపుటములుగా ప్రకటితములు.

చరిత్ర చతురాననులు వీరభద్రరావుగారి వ్యాసరచన వాద ప్రతివాదములయందు నూతనత్వమున వెలుగొందుచుండును. పటుత్వము గలిగి పఠనీయమగు రచన.

మల్లంపల్లి వారు: ఆంధ్రదేశ చారిత్రక పరిశోధనాచార్యులగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చారిత్రక వ్యాసరచనయందు సిద్ధహస్తులు. శర్మగారు తొలుత చక్కని గ్రాంథికభాషలో వ్యాసరచన సాగించిరి. వీరి రచన భావోద్రేకము గల్గించి, పాఠకులకు మన చరిత్రయెడల పరమాభిమానము గల్గించును. అజంతా శిల్పములు, చారిత్రక వ్యాసములు, బౌద్ధయుగము చాల ప్రసిద్ధి వహించినవి.

కుందూరి ఈశ్వరదత్తు: సరసమును, వైశద్యమునుగల శైలిలో చారిత్రక వ్యాసములు వ్రాయుటయందు కుందూరి ఈశ్వరదత్తుగారు ప్రత్యేక ప్రతిష్ఠ బడసినవారు. వీరి వ్యాసములన్నియు సంపుటముగా ప్రకటితము కాలేదు.

నేలటూరివారు. "కవిష్వి కాధిష్ఠిత కాళిదాసః" అన్నట్లు చారిత్రక వ్యాసరచనలలో డాక్టర్ నేలటూరి వేంకట రమణయ్యగారు నిర్విగ్రులు. నిర్దుష్టమగు గ్రాంథిక రచనతో, నిండైన విషయసంపదతో నిశితమైన పరిశోధన దృష్టితో వీరి వ్యాసములు విరాజిల్లుచుండును.

సాహిత్యరంగము నందువలె గాక, ఒకే యుగమునకు సంబంధించిన చారిత్రక వ్యాసము లొకే సంపుటమున వెలువడు నవకాశము ఆంధ్రదేశచరిత్రకు, రాజమహేంద్రవరము ఆంధ్రేతిహాసమండలి వారివలన సమకూడినది. వారి క్రిందిసంచికా సంపుటమును వెలయించిరి. ఆ సంచికల సంపాదకులు చారిత్రక వ్యాసరచనయం దందెవేసిన చేతులే గాని, సామాన్యులు గారు. ప్రతిభాశాలురు—సుప్రసిద్ధ చారిత్రకులు.

1. రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక: సంపాదకులు కీర్తిశేషులు శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు. ఇదియే యీ విషయక

“అగ్రగణ్య పోటుకులేని చెల్లుబడి కా-నా-చీటికి కలిగినది.

“లౌకికమున నలౌకికుఁడు; కార్యసాధనలో కాముకుఁడు; రక్తిఁ సుభోగించిన విరక్తుఁడు; లాలసత్వమున వస్తుస్థాయిఁ నందిన విప్రుఁడు.

“భోగియై, త్యాగియై, యోగియైనాడు.

“నేఁడు అమృతాంజనము తెలియఁగని యాంధ్రరాష్ట్రముఁ లేదు.”

## సంపాదకీయములు

పత్రికా సంపాదకత్వము ప్రత్యేక ప్రతిభను ప్రదర్శించిన వారిలో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు, శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు ప్రత్యేకముగ గణనీయులు. 7 నాగేశ్వరరావు పంతులుగారి యుదాత్త గంభీరశైలి, ఆంధ్రపత్రిక సంపాదకీయములు, సంవత్సరాది సంచికల ప్రస్తావనల యందును ప్రస్ఫుటమైనది వారు సంపాదకీయవ్యాస పరమేశ్వరులు

నేఁ డాంధ్ర సచిత్ర వారపత్రికలో లలితముగ, భావస్ఫోరకముగ, తెలుఁగుదన ముటిపడునట్టుగా రేఖామాత్రమున, సంపూర్ణ రాకృతి ప్రదర్శింపఁజేయుచు, తెలుఁగువెలుఁగులను దిద్ది తీర్చగల ‘తెలుగు వెలుగులు’ శీర్షిక ప్రత్యేకముగా పేర్కొనదగినది. మచ్చునకు ముచ్చటగూర్చు నొక తునక:

“రాజాజీ రవీంద్రులను చూచి ముగ్ధుడై వారి ననుసరించటం సాగించారు. ఆ యిద్దరిని మెప్పించి ఫలించా రనుకున్నారు. అది ప్రమాదించింది. ఆయన కవి గాని కవి సాహిత్యసుందరి చరణ చారణ చక్రవర్తి నాయకుఁడు గాని నాయకుడు. రాజకీయాల్లో ఒక మాదిరి ఉపగ ఖర్మ్యం బుర్రెడ్డ రెసుల గమ్మి పోయిందాన్ని గూర్చి విచారించక ఉన్నదాంతో సుఖించి ఆనందించే వ్యక్తి వేదాంతి.”

శ్రీ ముట్నూరి కృష్ణారావు: శ్రీ కృష్ణారావు-కృష్ణా పత్రిక అవినాభావసంబంధముగలవి. సంపాదకీయ వ్యాసములలో ముట్నూరి వారి దొక ప్రత్యేక స్థానము. వంగదేశపు సంస్కృతి ప్రభావము, వారి రచనలలో గోచరించినను శైలి సదా నిత్యమై భావబంధురమై నూటి దనము గలిగి నూతనత్వము ప్రదర్శించును. వీరినిగూర్చి పత్రిక లిట్లు వ్రాసినవి.

“సర్వ విషయాలలోను సర్వ శాస్త్రాలలోను సామాన్య జ్ఞానంతో కాక, కూలంకష పరిజ్ఞానంతో విమర్శించేవారు. రసాస్వాదనకు రెక్కలు విప్పి వెలార్చే విహంగము కృష్ణారావుగారు. రససిద్ధి పనియదానికి విసుపు లేకుండా అంచనాలు వేసిన ఏక మూర్తి.”

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు: ఇటు కందుకూరివారి సులభ గ్రాంథిక శైలికీ, అటు గిడుగువారి వ్యావహారిక భాషా శైలికీ సంధికట్టి నవనవ నైర్మల్యమైనదీ, నవ్య విజ్ఞాన ప్రచార సాధనమైనది అయిన శైలి నార్లగారిది అది వారి సంపాదకీయములలో, వారి వ్యాసములలో ప్రస్ఫుటమగుచుండును. కొంది మాటలలోనే గొప్పయర్థము కూర్పగలరు. కూర్పు నేర్పులో కోవిదుల మనము అలరింపగలరు.

## వ్యాసములు - వ్యావహారిక భాషోద్యమము

వాడుక భాషలో వ్యాసములు రచించి, వ్యాసరచన నొక కళగా దిద్ది తీర్చిన మనీషి గురజాడ అప్పారావు. వ్యావహారిక భాషలో సాహిత్య విమర్శనాత్మకరూపములైన వ్యాసములను రచించుటలో గురజాడ గురజాడయే!

గురజాడ రచన కొక యుదాహరణ: “చిన్నతనంలో బొమ్మలాట నేర్పుతుండడము చేత లోకము నే రంగం చిన్నకోటి రీతులను ఆటాడే మనుష్యుల నే ప్రాతముల సొగసు నే కనిపెట్టడము నాకు అలవాటైనది—సొగసులేని మనిషే ఉండడు స్నేహము, ప్రేమా, అనాది అయిన యెప్పటికి సరిక్రొత్తగా వుంటే రెండు వెలుగులను నగనిమీదికి తిప్పి కొంచితే వింతసొగసులు బయలుదేరతవి—అసూయ అనే అంధకారంలో అంతా ఏకనలుపే.”

గిడుగువారు: వ్యావహారిక భాషను స్థిరస్థాయిని గా నొనర్చి, యభినవ వాగనుశాసనులైన రామమూర్తిపంతులుగారు వ్యావహారిక రచనలో నే వ్యాసములు వ్రాసి యాంధ్రులకు మార్గదర్శకులైనారు. వారి “తెలుగు” పత్రికలో మొదట వ్యాసరూపములుగా వెలువడిన—ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము—అను శీర్షికతో వారి గ్రంథరూపమును దాల్చినది వారు సూర్యరాయాంధ్ర నిఘంటు ప్రథమ సంపుటముపై వ్రాసిన సమీక్షా వ్యాసము చాలా గొప్పది. అందలి రచన మనోహరముగా చమత్కారముగా నుండును. చూడుడు: “వర్తమాన వ్యావహారిక భాషానిఘంటువులు, జనాభా పట్టీలవలెను రైలుట్రైను రాకపోకల ప్రకటనలవలెను, దేశపటములవలెను పువ్వులు కాయలు పండ్లూ వంటకములు వానివలే తాజాగా ఉండవలెను. పంతులవారు విశ్వామిత్ర గోత్రులైనా సంకల్పమాత్రాన మరొక ఇంగ్లీషు నిఘంటువువంటి ఆంధ్ర నిఘంటువు పుట్టించగలరా?”

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి: అద్వైత కవితలగురువులగు చెళ్లపిళ్ల వారు—‘గిడుగా పిడుగా’ అను వ్యాసముతో మొదలుపెట్టి, కీర్తిశేషులయ్యే గడియల పర్యంతము, వర్తమాన వ్యావహారిక భాషలో పరిశ్రమముగా వ్యాసములు వ్రాసియున్నారు. ఆ శైలి సజీవమైన వ్యావహార సరళిలో ఉదాత్తముగా నుండును. వేంకటశాస్త్రిగారి మూలముననే, వ్యావహారికభాష వ్యాప్తి చెందినదనుట సత్యేతరము కాదు. 9

కవి సరస్వతియగు చెళ్లపిళ్ల వారి పద్యకవితాధార యెంత యఖండముగ నాంధ్రావనిని ప్రవహించినదో అదేరీతిని వారి గద్య

---

7 క్రీ. శ. 1929 వ సంవత్సరమున, ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రికలకు సన్మానము చేసిన సందర్భమున శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, ఆము సంపాదకీయ వర్గమున సహాయభూతులైన, శ్రీ అవపల్లి నారాయణరావు గారిని వారివ్యాప్తి మర్రావు, చల్లా శేషగిరిరావుగార్లను ప్రత్యేకముగా ప్రశంసించినారు.

8 గురజాడ వ్యాసరచనను విశాలాంధ్ర వారు ప్రకటించిరి.

9. వేంకటశాస్త్రిగారు వ్రాసిన వ్యాసములు అచ్చులో పదునైదు వేల పుటలగునని యుటవల ‘గిపన్ని’ తులోకదు దెల్పినారు. (చూ. భారతి - ఫిబ్రవరి సంచిక)

ధ్యాన ప్రవాహము, భారతి పత్రికాముఖమున, యనర్గళముగ సాగి వాఙ్మయ ప్రపంచమును పావనము చేసినది. వారి కంఠ మాధుర్యము, సభా సంభాషణా చాతుర్యము, లోకోత్తర విజ్ఞానము, సంచిత గుణశీలత, శౌర్యము వారి కలమునకు విధేయములై, వారి వ్యాసములయందు, వారి మూర్తిని సజీవముగా మనకు ప్రదర్శింపజేయుచున్నవి. గ్రంథ విస్తరభీతి నుదాహరణముల నీయజాలకుంటిని. వారి తుదిరచన 'భారతి' యే ప్రకటించినది.

శ్రీ ప్రభాకరశాస్త్రి: తొలుత వ్యాసములు గ్రాంథిక భాషలోనే వ్రాసినను, సహజ తేటతెనుగున జిగిబిగి గలిగి తేనె నుడికారముతో నొప్పుచుండెడివి. కాని తరువాతను పాండిత్య ప్రకర్ష చేత, నిశిత ప్రజ్ఞ చేత గిడుగువారి వాదము నామోదించి వ్యావహారిక రచన సాగించినారు. వారి వ్యాసములలో కొన్ని మాత్రము ముద్రితములైనవి. అవి మూడు సంపుటములైనవి: (1) తెనుగు మెఱుగులు (2) మీగడ తరకలు (3) సింహావలోకనము

శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి: వ్యావహారిక భాషలో వ్యాసములు వ్రాసినవారిలో పంచాగ్నులవారు ప్రథమ గణ్యులు. వారే నవ్యసాహితీ సమితి ప్రథమవార్షికోత్సవమునకు అధ్యక్షత వహించి, అధ్యక్షోపన్యాసము వ్యావహారిక భాషలోనే చదివినారు. వారు గిడుగుపంతులు గారి యభినందన సంపుటమున వ్రాసిన "ప్రాకృత గ్రంథకర్తలూ-ప్రజాసేవానూ" అనే వ్యాసము వారి వైదుష్యానికి భాషాశైలికి ప్రశస్తమైన యుదాహరణము.

మల్లంపల్లి సోమశేఖర శర్మ: సుప్రసిద్ధ చారిత్రకాన్వేషకులు మల్లంపల్లివారు తొలుత గ్రాంథికభాషలో వ్యాసములు వ్రాసినను, వారావెనుక వ్యావహారిక భాషావాదమునే చేపట్టి, ఆ భాషలోనే వ్రాయుచున్నారు. వీరినిగూర్చి శ్రీ నేలటూరివారి యభిప్రాయము నిట పొందుపఱచుచున్నాను: "శర్మగారి రచన రచన మనోహరమైనది............ కాని వ్యావహారిక భాషావాదిగ నంటుకొను పాలలోని పాంసులేశమునుబోలి, వీరి రచనల నీ వ్యావహారిక భాష కళంకాంకితము చేయుచున్నది."—(భారతి రజతోత్సవ సంచిక 16 పుట.)

పత్రికా ప్రాంగణముననే, జీవితపత్రములను దిద్దుచున్న ఇరువురి వ్యావహారిక వ్యాసరచనను నీ సందర్భమున ప్రశంసించుట భావ్యము. వీరిరువురిలో నొకరు, 'సాహితీ సుగతుని స్వగతము'తోను, రెండవవారు, 'అవీ ఇవీ'తో అను దినము పాఠకులకు దర్శన మిచ్చుచున్నారు. చక్కని చిక్కని వ్యావహారిక భాషలో సమత జీవము, తెలుగుదనము ఉట్టిపడునట్లుగా, భావస్ఫోరకముగ నూతనరీతిని వీరి రచన భాసిల్లును. వీరిరువురి రచనలు రెండుదశాబ్దులుగా పత్రికా ప్రపంచమున ప్రశస్తికెక్కినవి. "సాహితీ సుగతుని స్వగతము"నుండి ఒక ఉదాహరణ: "మౌలికతను మదింపు చేయడం కష్టం. మదింపు చేయడానికి సూక్ష్మతర పరిశీలన, శ్రద్ధగా ఔదార్యం ముఖ్యమైన అర్హతలు. అప్పుడే మౌలికత ఏ రూపంలో, ఎంత మోతాదులో ఉందో గుర్తించి గౌరవించడం సాధ్యమౌతుంది.

"ఈ అనుశీలనను సాహిత్యరంగానికి-అందులోను ఈ శతాబ్దికి మాత్రమే అన్వయించి కొన్ని నేటిపాత్రలను పరికిస్తే వాటిలో ప్రాచీనపాత్రల పోలికలు - వాలకాలు కనిపిస్తాయి. అంతమాత్రాన అవి మౌలికాలు కాకపోవు. గిరీశంలో శకారుడు గిరికీలు కొడుతూ వుంటాడు. మధురవాణిలో వసంతసేనవాణి వినిపిస్తుంది. ప్రతాపరుద్రీయ యుగంధరునిలో భాసుని యౌగంధరాయణుడు భాసిస్తాడు. అంతమాత్రాన, అవి వాటికి నకళ్ళనగలమా?"

"అవీ ఇవీ" శీర్షికలో దర్శనమిచ్చే విద్వాన్ విశ్వం గారి రచనకు ఒక్క ఉదాహృతి:

'ఆయనలోని మానవత్వం అన్నిటికన్నా నన్ను ఆకర్షించి వేసింది. రాజర్షిలాంటి ఆయన ఆధ్యాత్మిక జీవితం నాకు తెలుసు. కులపతిలాంటి ఆయన పాండిత్య ప్రశస్తి నే నెఱుగుదును. ధీరునిలాంటి ఆయన రసప్రవృత్తి నాకు తెలిసినదే. శాసనాలు మొదలు చాటువులదాకా శోధించి వ్యాకరించి వ్యక్తీకరించిన ఆయన చరిత్రాది పరిశోధనల లోతులు నాకు పరిచితమైనవే. కానీ ఈ అన్నింటికన్న ఆయన ఆర్ద్రహృదయం నన్ను విస్మయుని చేసింది."

## సాహిత్యవ్యాసములు—పత్రికలు

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ప్రత్యేకము సాహిత్య వ్యాసంగమునకే జన్మించినది. అది యొక యేడాది తక్కువగ నేబదేండ్ల వయస్సుగలది. అందు ప్రథమముగ ప్రకటితములైన వ్యాసములన్నియు నమూల్యములు. ఈ నాటివారికి పరిచితములు-చూడుడు

1 కేవల విత్వము — కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారిది. ఇది సంస్కృతాంధ్ర భాషలలోనే కాక, ఇంగ్లీషు ఉర్దూ భాషలలో కేవలయున్నవని నిరూపించిన ప్రశస్తవ్యాసము.

2. భారతకవులు - నన్నెచోడుడు - తంజనగరము దేవరాజసుధి తెలుగువ్యాసరచయితలలో దేవరాజసుధీమణికొక ప్రత్యేకశైలి యలవడినది. తెలుగు పలుకుల పొంకము, నుడికారము సొంపు, సంగతి యింగితము కొనవచ్చును. కతిపయ సంస్కృతపదముల సమ్మేళనమున జిగిబిగితో నుండును.

"ఇతని రచనలయందు, శృంగారరసము పొంగారినను వీరరసము పారమందినను. రౌద్ర ముద్రేకించి దీర్ఘములైన సంస్కృతసమాసధారలు గంగాఝరులవలె మించి ముంచుకొని పారవు. తిక్కనవలె నచ్చ తెలుగు వాణించుట యుండె, యచ్చ తెలుగు పదరించుట యుండె యితనికిఁ గన్నే. రసము చింకమునందు గన్నని సెగ్గు. నుడికారంపు చిక్కమున ఎటువలను"

3 తెలుగునందలి దేశ్యాన్యదేశ్యపదజాలము: తి. సు. ముఱుగేశంపిళ్ళె. జన్మముచే తమిళుఁడయ్యు సంస్కారముచేత తెలుగు సాహితీ వేత్తయైనవారు శ్రీ పిళ్ళె ద్రావిడభాషా తత్త్వము నలుబదేండ్ల క్రిందటనే యిందు చక్కగా నిరూపితమైనది.

4. ఆంధ్రచ్ఛందస్సు, వఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు.

5. ఆంధ్ర - తద్భవపత - 6. తెలుగు వాఙ్మయ 7 పాశ్చాత్య విజ్ఞాన ... విమర్శనపథము. ఇవి యన్నియు, నాంధ్రభాషా విమర్శక తత్త్వమును వివరించు ఉత్తమ విమర్శక వ్యాసములు. మహాకవి శ్రీ కాశీభట్ల కృష్ణరాయశాస్త్రి రచితములు.

8. పరిషత్తువారు 193[illegible]లో రజతోత్సవ సంచిక ప్రకటించిరి. అందు—పాముకంటి పార్థసారధి రాయణింగారి ఆంధ్రాంకములు అనునది ఉత్తమ వ్యాసము.

9. కంబమహాకవి జీవితము—ప్రసిద్ధ తమిళ రామాయణకర్త కంబమహాకవి చరిత్ర. తి. సు. ముఱుగేశంపిళ్ళె రచితము. కంబని చరిత్ర తెనుగునకు వచ్చుట కిదియే ప్రథమము.

ఇక సాహిత్య వ్యాసము లీక్రింది విధముగ ప్రచురించిన సన్మాన సంపుటములలో చాల గలవు.

1. వ్యాస సంగ్రహము—శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి షష్టిపూర్తి సమయమున సమర్పింపబడినది. ఇదొక భాగము తెలుగు.

2. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సన్మాన సంపుటము.

3. అయ్యంకి వేంకటరమణయ్యగారి సన్మాన సంపుటము.

4. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారి సన్మానసంపుటి.

5. త్రిలింగ రజతోత్సవ సంపుటము.

6. భారతి రజతోత్సవ సంపుటము.

7. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సంచిక.

8. శ్రీ మాడపాటి హనుమంతరావు సన్మానసంచిక.

9. శ్రీ కల్లూరి సుబ్బరాయ సన్మాన సంచిక.

వ్యాసరచన కల్పకమున కఖండముగా దోహదము గల్పించినది ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు. 'భారతి' అనుటకు రెండవ దనుట సత్యోక్తియే. వీనియందు ప్రకటితములైన వ్యాసములు కొన్ని గ్రంథరూపము ముద్రితమైన వాటిలోను యింకను మిగులుచుండినను ఇట్టి వానిలో నెన్నికయైనవి :

శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వ్యాసములు. సంవత్సరాది సంచికలలో — ఆపస్తంబుడు — భరతిలో వేదకాలపు స్మృతికాలపు పురాణకాలపు వ్యవసాయచరిత్ర — మన ప్రాచీన వైదిక సంస్కృతిని విశదము చేయునవి.

శ్రీ ఒంగోలు వెంకట రంగయ్యగారి వ్యాసములు మన ప్రాచీన సంప్రదాయములు, సంస్కృతికి సంబంధించిన వివిధ వైజ్ఞానిక విషయము లెన్నియో యీ వ్యాసమున గానవగును.

శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి వ్యాసములు: నక్షత్రమండలము అనుపేర నేకొక హైందవశాస్త్ర గ్రంథములు మున్నగు వైజ్ఞానిక వ్యాసముల నెన్నియో, రాఘవరావుగారు భారతి నలంకరించిరి. వీరి వ్యాసముల యందలి విశేష మేమనగా ఖగోళ శాస్త్ర, జ్యోతిష సంప్రదాయములను, మన యాంధ్రసాహిత్యముతో సమన్వయించి చెప్పుట. సాధారణముగ మన ప్రబంధము నుండియే యుదాహరణ లీయబడుచుండును. భారతి రజతోత్సవ సంస్మరణమున, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రాఘవరావుగారినిగూర్చి ప్రశంసించుటయే వీరి వ్యాసవిశిష్టతకు తార్కాణము.

విశ్వనాథవారనగనే మనకు, 'నన్నయ ప్రసన్నకథాకలితార్థ యుక్తి' జ్ఞప్తికి రాకమానదు. మహోత్తమ సాహితీ విమర్శ శైలిలో గణ్యత వహించిన యీ వ్యాసమాలిక, భారతిలో దొలుత ప్రకటితమై యా వెనుక గ్రంథరూపమున వెలువడినది.

పూర్వపు సంవత్సరాది సంచికలలో కొన్ని కొన్ని వ్యాసము లాయా కవుల నిశితను ప్రప్రథమమున లోకమున కెఱుకపఱచుటకు బాగుగా దోడ్పడినవి. దుందుభి సంవత్సరాది సంచికయందు ప్రకటితమైన శ్రీ బండారు తమ్మయ్యగారి "పాల్కురికి సోమనాథ మహాకవి" యను వ్యాసము, ఆంధ్రగ్రంథమాల యందు బసవపురాణ పండితారాధ్య చరిత్ర ప్రకటనలకు హేతువై సోమనాథుని ప్రతిభావిశేషముల నాంధ్రదేశీయులకు వ్యక్తపఱచినది.

మఱియు నా యా సంవత్సరాదిసంచికలలో ప్రకటితములైన దువ్వూరి రామిరెడ్డి సాహిత్య వ్యాసములు కవికోకిల సారస్వత వ్యాససంపుటముగను, బసవరాజు అప్పారావు వ్యాసములు ఆంధ్ర నిత్య చరిత్రముగను రూపొందినవి. ప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ కరుణశ్రీ అచ్యుతరావుగారి వ్యాసములు భారతిలో తొలుత ప్రకటితమై ఆ వెనుక విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయగ్రంథముగా రూపొందినవి.

చిరకాలము నిలువక, కొలదిసంవత్సరములమాత్రమే వెలసిన పత్రికలలోని కొన్ని వ్యాసములు నేడు విస్మృతప్రాయమైనవి.

సారస్వత సర్వస్వము : తణుకు ఏలూరుపాటి రామభద్రరాయ మలుగారు దీని సంపాదకులు. అమిత వ్యయముతో నీపత్రిక రెండేండ్లు నడచినది. ఇందు శ్రీ ఆదంట సాంఖ్యాయనశర్మగారి ఆంధ్ర సాహిత్యపరిషద్వ్యాఖ్యానోపన్యాసము (ఇది పరిషత్పత్రికలో ప్రకటితము కాలేదు. (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి రాజశేఖర మహాకవి కావ్యమీమాంస, కాళిదాసుని నిరంకుశత్వము, జంధ్యాల శివన్నశాస్త్రిగారిని.) ఇట్టి యపూర్వవ్యాసములు గలవు. మఱియు భారతము లక్ష్మీపతిగారి సభాపర్వవ్యాఖ్యయు నిందు ప్రకటితము.

విభూతి : ఇట్లే శివశ్రీ ఓరుగంటి వీరభద్రశర్మగారు ప్రకటించిన విభూతి పత్రికలో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి రామాయణ వ్యాసము మున్నగు సమాలోచనా వ్యాసరచనలు వెలువడినవి.

కీర్తిశేషులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి త్రిలింగ పత్రికలో (37 సంపుటములు) సాహిత్య వ్యాసములు చాల గలవు.

'ప్రతిభ' 'కిన్నెర' 'పరిశోధన' పత్రికలయందు ప్రాచీన, నవీన సాహితికి సంబంధించిన వ్యాసములు పెక్కు గలవు. ఇట్లు పత్రికలేగాక కట్టమంచి వారి వ్యాసమంజరి, విస్సావారి వ్యాసావళి, శ్రీ నందూరి బంగారయ్యగారి శాకుంతల విమర్శన వ్యాసావళి, బూర్గులవారి వ్యాసముక్తావళి మన కందుబాటులో నుండుట ముదావహము.

ఇట్లే మానవల్లి, పంచాగ్నుల, పెండ్యాల మొదలగు మహనీయుల వ్యాసరచనలను నా వ్యాసములకు వారసులైన, ఆంధ్ర పత్రిక సంస్థవారు త్వరలో నే ప్రకటింతురు గాక!

ఇంకను నా దృష్టిపథమున బడనివానిని దెలిపిన కృతజ్ఞతతో నిందు చేర్చెదను.

ఇం ప్రధానముగా సాహిత్య వ్యాసముల గూర్చిన చరిత్రయే గలదు. కాలక్రమమున స్థలాంతరమున భాషా శాస్త్ర చిత్రలేఖన, శిల్ప సంప్రదాయములను గూర్చిన వ్యాసములను, ప్రాచ్య పాశ్చాత్య వైజ్ఞానిక, వేదాంత, దర్శనాది విషయిక వ్యాసములను గూర్చి తెలిపెదను.

ఇట్లు వ్యాసములనుగూర్చి చెప్పబూనిన అది వ్యాస భారతమంత గ్రంథ మగును. మొదట నే నాంధ్రపత్రిక భారతి మఱికొన్ని యితర పత్రికలలోని వ్యాసములు వర్గీకరణము చేసి వ్రాయుటకు నుద్యమించితిని. కాని యిప్పటికే వ్యాసము పెద్దదియైనందున దానిని విరమించుకొనవలసిన యావశ్యకత యేర్పడినది.[10] 'శతమానం భవతి' అనునట్లు నూరేండ్ల వయస్సుగల వ్యాసరచన సమగ్ర చరిత్రమును నాంధ్రలోకమున కందింపగలను.

ఇట్టి మహాకార్యమునకు బూనుకొనుటకు నాకీ వ్యాసరచన మూలమున నవకాశము గల్పించిన శ్రీ ఆంధ్రపత్రికా సంపాదకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాను.

---

10. పై కారణము చేత యీనాటి సుప్రసిద్ధ వ్యాసరచయితలను పేర్కొనలేకపోయితిని. విజ్ఞులు మన్నింతురుగాక.

'నా జరిగినవన్నీ ఇలా ఒక్కొక్కటే జ్ఞాపకం వస్తాయి. కొన్నాళ్ళ వాళ్ళకోసం దగ్గరవాళ్ళకోసం మనస్సుపోతుంది. నావలో ఒక్కళ్లం ఉండలేం పిల్లా ఉండలేం—నాకు తెలుసు. అయితే అటువంటి ఆలోచనలవల్ల లాభం వుండదు పిల్లా. నాకంటే భయం నాకు. వెధవ్యావ వెధవ్యావ...' అంటూ ముసలిది ఆగింది. ఆమె కళ్ళల్లో కోపం మసి లోగ్గాగా మండబోయి మాడిపోయింది. 'ఎందుకే యీ విచారం చచ్చినవాడికోసం. అసలు నీకు పిల తెందుకే తెలివితక్కువదానివి కానీ. అనుమానం కల్గావే ఏం చెప్పాను నీకు. ఎక్కలదానిదగ్గర ఐదేమంగులున్నాయి తీసుకోవ్వానంటే విన్నావా? నువ్వెందుకు వింటావులే నా నవాకే? అలాగ పుట్టాడు అర్ధాయుష్షువెధవ—ఇలాగ మూడు నెలలకే చచ్చాడు'

యువతి కళ్ళల్లో బాధ ఆకాశంమీద నల్లని మబ్బులాగా క్రమ్మింది. ముసల్ది వూరుకోలేదు.

'నీ వయస్సులో పిల్లలుపుడితే నీకేమి ఎవరు చూస్తారే యీ కొంపలో. వొంటికి ఓగువుపోయాక నీ వెంతో నవ్వావ అంతే.' అసహ్యంగా నవ్వింది ముసలిది.

'నోర్ముయ్యి' అంది యువతి కోపంగా.

'మూస్తాను మూస్తానులే. నోరు మూసుకుంటే నవ్వే నేనూ అడుక్కుతినాలిసిందేగా. ముసలిముండనైనా బ్రతుకు నాకు బుర్రలో తెలివివచ్చాదే పిల్లా'

ఓ నిముషం ఆగి ముసలిది, 'ఇదిగో పిల్లా నీకొడుకు పుట్టగానే పోదె కెళ్ళి అడిగాను. ఆ యింటి పాపపిల్లలు బతకరని తెగేసి చెప్పిందా పోదె. ఒక తండ్రీ ఒక తంతిమా లేని ముదనష్టపు పిల్లలకి దేవుడి శాపం వుంది. శాపం. నీ కొడుకే కాదు. ఈ యింట్లో ఎప్పుడూ ఏ పిల్లాడూ పుట్టి బతికినపాపాన పోలేదు' అంది

యువతి భయంతో విహ్వలంగా చూసింది 'నిజంగానా? జంగానా అవ్వా?' అని అడిగింది

'ఆ భయమే వద్దన్నాను. నీవనుకున్నీ అందరూ వుంటే భయపడిన ఆపదాన్ని నేనొంగను. ఇప్పుడు నాలుగురాళ్ళు చేసుకోతే యింకెప్పుడే పిల్లా. నచ్చిన ప్రతివాణ్ని వెళ్ళగొడతవు. ఎంతోమంది జనమూగుల కాని నీకు నచ్చనే నచ్చరు. ఆసరాగా వుంటాడని నిన్ను నమ్ముకొని నెట్టుకుతున్నాను. నా మాటా, నేనూ కూడా నీకు చేదయ్యింది.' ముసలిదానికి తీవ్రం హెచ్చిస్తోంది. చేతులు వూపుతూ యింకా యిలాగ అంది. 'వచ్చిన వాళ్ళకోసం బాధకేం పిల్లా. నన్ను ముసలికోసు నా మాలకేకీ అని కూచ్చుంటే ఆకలితో మాడి చస్తా. నీకేం నోరవానిలాగ నెబురు చెప్తావే. అప్పుడు నేనాగకోపానే నిక్కా వినుమ్మే వెధవలు వాణ్ణి తలచకుంటే మాటనక్కరు. మూడు నెలల ముంగిపెనవ. చచ్చాడు పీడా వదలింది.'

యువతి కోపంతో బాధతో జేవురించిన మొహంతో కిటికీలో ఉన్న కప్పుతీసి ముసలిదానిమీద విసిరింది 'పో ముసలి ముండా! పో దిక్కుమాలిముండా! నా ఎదుట నిలబడకు.' అంటూ గట్టిగా అరిచింది. గట్టిగా ఒక పూట దెబ్బతగలకుండా తప్పుకొని, 'పోతను పోతాన్లే. నే బ్రతికినన్నాళ్లే నీ కష్టం సుఖం చూసేది. తర్వాత నీ బ్రతుకు ఎలా నడుస్తుందో చూస్తాను!' అంటూ కేకలుగా ఏడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

యువతి మొహం బాధతో మలినమైంది. కంటెచివరల రెండు నీటిచుక్కలు నిలిచాయి. గుండె బరువెక్కింది. ఇనుప తెరమధ్య ఎవరో తన్ని పెట్టి నొక్కుతున్నట్లు బాధతో 'అమ్మా!' అంది.

చీకటి పడుతోంది. పొలాలన్నీ అస్పష్టంగా నల్లరంగులో కలిసిపోతున్నాయి. చుట్టుపక్కల ప్రకృతియంతా నిర్మానుష్యంగా భయంకరంగా వుంది. యువతి అక్కడే అలాగే కూర్చుని కిటికీలోనుంచి చూస్తోంది.

ముసలిది ముందువాలోకి వచ్చింది. 'అన్నంలోకి ఏం వండమన్నావే పిల్లా?' అంది.

'ఏదో ఒకటి.'

'ఇప్పుడే చెప్పినమాట విను. చలిగాలి ఎక్కువయింది. వొంటికి మంచిదికాదు. వెళ్ళు లోపలికి వెళ్ళు.'

'వస్తా'

'చీకటికి వంటచేసి పిలుస్తాను. వేడివేడిగా కూడు తింటే బలం వస్తుంది లోపలికిపోయి గొంగళి కప్పుకో.' అంటూ ముసలిది వెళ్ళిపోయింది.

యువతి బరువుగా నిట్టూర్చింది. కాని అక్కడినుంచి కదలలేదు అలాగ కిటికీలోంచి చూస్తూనేవుంది కొండచిలువలాగ మెలికలు తిరిగి తిరిగి చీకట్లో కలిసిపోయిన రోడ్డు వైపు కొంతసేపటికి దూరంగా రోడ్డుమీద ఏదో ఆకారం అస్పష్టంగా కనిపించింది దగ్గరౌతున్న కొద్దీ చేతిలో సూట్‌కేసూ, మరో చేతిలో గొడుగుతో గడ్డు బురదలో కాళ్ళీడ్చుకుంటూ వస్తున్న వ్యక్తి కనిపించాడు. గాలికి గొడుగు తిరగబడి పోతూంది అతి ప్రయత్నం మీద గొడుగుని ఆ వ్యక్తి సవ్యంగా ఉంచగలుగుతున్నాడు. ఇంత వర్షంలో యీ ప్రయాణం సాగించే బుద్ధిహీనుడెవరా అనుకుంది యువతి. అదేకాదు రోడ్డంతా గోతులు పడివుంది. చీకటి పడాక యీ దారిని వెళ్ళడం ప్రమాదకరం. ఆ వ్యక్తి తన యిల్లుకూడా దాటిపోగూడదు యువతి చప్పున లేచి ముందుగాలో నుంచి వీధి అరుగు మీదికి వచ్చింది చప్పట్లు కొట్టింది. 'ఎవరయ్యోయ్. ఏమయ్యోయ్ ఇలా రండి.' అని పిలిచింది గట్టిగా.

ప్రయాణికుడు కొంచెంసేపు తటపటాయించాడు. మెల్లగా యింటివైపు తిరిగి వస్తున్నాడు. ఇంటిముందు పల్లంలో మోకాలి బంటి నీరు ఉంది. ప్రయాణికుడు బూట్లు విడిచి చంకన పెట్టుకుని మోకాళ్ళదాకా పంచె లాక్కుని భయం భయంగా అడుగుమీద అడుగు వేసుకుంటూ కాలువ దాటాడు. అరుగుమీదకి వచ్చి చేతిలోని గొడుగుని కింద దింపి 'హమ్మయ్య' అన్నాడు. ఆ వ్యక్తి ఆజానుబాహువు. తెల్లని అతని బట్టలమీద బురద చింది అసహ్యముగా హాస్యాస్పదంగా ఉంది. అతని మొహం సరిగా కనుపించలేదు యువతికి.

'వచ్చానేలాగా?' అన్నాడతను [illegible] కంఠస్వరంతో.

'అవును ఎక్కడికి వెళుతున్నారు మీరు?' అంది యువతి.

'రైలు స్టేషన్‌కి.'

'అబ్బో—స్టేషన్ యింకా చాలాదూరం వుంది.' అంది యువతి

'అయినా వెళ్ళక తప్పదుగా.' తడిసిన బట్టల్ని పిండుకుంటున్నాడతను.

'ఈ చీకట్లో యీ రోడ్డుమీద వెళ్ళడం ప్రమాదకరం. రోడ్డంతా గోతులు. పైగా పైన ఎక్కడో గండి కూడా పడిందిట. ఈ మాట చెబుదామనే పిలిచాను.'

'కృతజ్ఞుణ్ణి. కాని నేను వెళ్ళక చేయగలిగిం దేముంది చెప్పండి. ఈ రోజు బయలుదేరడమే బుద్ధి పొరపాటు. మధ్యాహ్నం కొంచెం తెరిపియిస్తే పరవాలేదుకదా అని బయల్దేరాను. ఎవరినడిగినా నాలుగడుగులువేస్తే స్టేషన్ వచ్చేస్తుందని చెప్పారు! ఏం మనుషులండీ వీళ్లు! అబ్బ! చేతులు నొప్పి పెడుతున్నాయి.' అంటూ వేళ్లు సాచి ముడుచుకున్నాడు కిళ్ళు పడిలేందుకు.

'మీకు దూరమని తెలియదా?'

'తెలియదు. నేను యీ దారిని రాలేదుగా వచ్చేటప్పుడు. అసలు నేనీ ప్రాంతాలకి కొత్తవాణ్ణి. అందులో ఈ వర్షాకాలంలో పల్లెటూళ్లకి వెళ్ళడం తెలివితక్కువ.'

యువతి చిన్నగా నవ్వింది. 'అయితే యిప్పుడేం చేస్తారు మీరు?' అంది.

'ఏం చెయ్యను! ఎలాగో అలాగ తంటాలుపడి స్టేషన్ చేరుకుంటాను.'

'మీ గొంతు విన్నట్టుగా ఉంది ఎప్పుడో ఎక్కడో!' అంది విస్మయాన్ని సూచిస్తూ.

'కంఠ ధ్వనిలో పోలిక లుంటాయిలెండి. కాని మీరు నన్ను కాని, నేను మిమ్మల్ని కాని కలుసుకోలేదని నిక్కచ్చిగా చెప్ప గలను.' అన్నాడా వ్యక్తి.

'ఎలాగ చెప్పగలరు?' అంది యువతి కుతూహలంతో.

'ఈ ప్రాంతానికి నే నెప్పుడూ రాలేదని చెప్పాను కదా. అదీగాక చాలాకాలం యీ దేశంలో కూడా లేను.' అంటూ ఆవ్యక్తి తిరిగి పెట్టినీ గొడుగుని చేత పట్టుకున్నాడు. 'నమస్కారం. నేను వెళ్తాను. రోడ్డు విషయమై మీరు చేసిన హెచ్చరికను మరచిపోను' అన్నాడు.

'మీరు నా మాట వర్థం చేసుకోలేదు మీరింక ప్రయాణం సాగించడం శ్రేయస్కరం కాదు. ఈ రాత్రికి యిక్కడ పడుండి పొద్దుటే వెడితే మంచిది, మీ కభ్యంతరం ఏమీ లేకపోతే' అంది యువతి.

నూతనవ్యక్తి ఆలోచించాడు. 'అంతే నంటారా?' అన్నాడు.

'అవును. ఉదయం ఆరుగంటలకి రైలు వుంది. అప్పటికి వర్షం కూడా చాలామటుకు తగ్గొచ్చును'

వర్షం మళ్లీ హెచ్చింది. వానజల్లు వరండాలోకి వచ్చి పడుతోంది. నూతనవ్యక్తి హతాశుడై 'సరే. మీరు సూచించిన

మార్గమే ఉత్తమంగా కనపడుతోంది. రైల్వేవారో మ్యునిసిపాలిటీ వాళ్లో, ఏ గోతిలోంచో బురదలో కూరుకుపోయిన నా శవాన్ని పైకి తీయటం అంతగా ఆశించదగినదిగా లేదు. మీ దయకు కృతజ్ఞుణ్ణి' అంటూ సంకోచంగ నవ్వుతూ అన్నాడు.

ఇంతలో ముసలిది దీపం పట్టుకుని వచ్చింది. దీపపు వెలుగులో అతని ఆకారం మరింత స్పష్టంగా కనపడింది. మనిషి ఒడ్డూపొడుగూ వున్నాడు. బుగ్గలు కొంచెం చిక్కినట్టున్నా మొహం అందంగానే వుంది. చామనఛాయ మొత్తంమీద విగ్రహంలో గాంభీర్యం స్ఫురిస్తోంది. పాంటు అంతా బురదతో నిండివుంది. ముసలిది దీపం పైకెత్తి దగ్గరగా పట్టుకుని పరీక్షగా చూస్తూ 'ఎవరు బాబూ మీరు?' అంది. దీపకాంతిలో మెరిసిన అతని వదనాన్ని చూసి యువతి ఉలిక్కిపడింది తెల్లబోయి రెండుకళ్ళూ అప్పగించి అలాగచూస్తూ నిలబడింది. ముసలిది మోచెయ్యితో యువతిని పొడిచి 'దెయ్యం పట్టినట్టు ఏవిటే ఆ చూపు పిల్లా?' అంది.

యువతి ఇంకా తేరిచూస్తూ 'మీ పేరు?' అంది.

'జగన్నాథం' అన్నాడతను.

యువతి కళ్ళల్లో ఆశాభంగం అద్దంలా కనపడింది అది గమనించిన అతనికి సంకోచం ఎక్కువయింది. 'మీరు నన్నాహ్వానించడంలో ఏదో పొరపాటు జరిగిందనుకుంటాను, మీ ధోరణిచూస్తే. ఈ వర్షపు తీవ్రత తగ్గగానే వెళ్లిపోతాను. నే నేమీ అనుకునేవాణ్ణి కాను' అన్నాడు.

యువతి తనలో కలిగిన ఉద్రేకాన్ని అణచుకుని సహజ స్వరంతో 'కాదు కాదు. మీరు నే నెరిగిన ఒక వ్యక్తిలాగ వున్నారు. అంతే. మీరు అపార్థం చేసుకుని వెళ్ళిపోతే నేను చాలా బాధపడతాను.' అంది. యువకుడు నిట్టూర్చి పెట్టెని కిందపెట్టాడు. ముసలిది తేలికగా పెట్టెని ఎత్తి లోపలికి తీసుకువెళ్ళింది.

యువతి జగన్నాథాన్ని ఒక గదిదగ్గరకు తీసుకువెళ్ళి 'అవ్వ ఈ గదిలోనే మీ పెట్టెని పెట్టింది మీరు బట్టలు మార్చుకుని విశ్రాంతి తీసుకోండి మీకు భోజనం ఏర్పాటుచేసి వస్తాను' అని వెళ్ళిపోయింది. జగన్నాథం గదిని నలువైపులా పరీక్షగా చూశాడు. పాతకాలపు పందిరిమంచం ఒకటుంది. దానిమీద తెల్లని పక్క వేసి వుంది. మంచానికి పక్కగా ఒక ఎత్తయిన ముక్కాలిపీట వుంది. పేముతో అల్లిన కుర్చీ కూడా వుంది. ఓ మూలగా హరికేన్ లాంతరు వెలిగించివుంది. అతను తొందర తొందరగా దుస్తులు మార్చుకున్నాడు. అతని ఆకలి ఎక్కువగా వుంది వొళ్ళంతా చలితో తేమతో ముద్దకట్టుకుపోయినట్టుంది.

ముసలిది వచ్చి భోజనానికి రమ్మని పిలిచింది. అరిటాకులో అన్నమూ పదార్థాలూ వడ్డించివున్నాయి ముసలిది విశ్వాసంగా వడ్డిస్తూ వుంది. ఏదో చెప్పాలని నోరు తెరుస్తుంది. కాని తలుపు చాటుకిచూసి మానివేస్తుంది ఆకలితో వున్న అతనికి భోజనం రుచిగా వుంది. ముసలిది మాట్లాడబోయి మానివేయటం గమనించి తలుపు చాటుకు చూశాడు తలుపుచాటుగా యువతి కూర్చునివుంది. అతని కేదో విచిత్రమైన అనుభూతి కలిగింది. తనలో తాను నవ్వుకున్నాడు.

భోంచేసి గదిలోకి వెళ్లగానే ముక్కాలిపీటమీద తమలపాకులూ, వక్కా అమర్చబడిన వెండిపళ్ళెం కనపడింది. అగరు వత్తులు వెలిగించబడి గోడకున్న ఒకచిన్న చిలుకలో గుచ్చబడి వున్నాయి తలవనితలంపుగా లభించిన యీ ఆతిథ్యానికి ఆదరానికి అతనికి విస్మయానందాలు రెండూ కలిగాయి. కాసేపట్లో గుమ్మందగ్గర గాజుల చప్పుడు విన్నాడు తలపైకెత్తి 'రండి. జన్మలో మీరు చూపిన ఆదరాన్ని మరచిపోలేను. రైల్లోనో, రైలుపట్టాలలోనో తిండీ తిప్పలులేక పడివుండవలసిన విధినుండి తప్పించారు మీరు. అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూ వచ్చి కుర్చీలో కూర్చుంది. జరీఅంచు తెలనీలంచీర ధరించింది. జుట్టుని వదులువదులుగా జడవేసి చివరలు వదిలివేసింది. నొసట సన్నని ఎర్రని తిలకం ఆమెవదనానికి ఆకర్షణతోపాటు ఉదాత్తత సంపాదిస్తోంది. ఆమెకళ్లు పెద్దవిగా, జాలిగా, మంచులో తడిసిన పద్మాల్లా వున్నాయి.

'మీరు నామాట మన్నించి ఆగినందుకు నాకు చాలా ఆనందంగా వుంది.' అందామె తలవంచుకుని.

'భలేవారే. ఆనందించవలసింది నేను కాని మీరుకాదు. శ్రమంతా మీది చివరికి మీరు పడుకునే మంచంకూడా నాకిచ్చివేసినట్లు కనపడుతోంది. నిజానికి ఓ చాప దిండూ యిస్తే వసారాలో పడుకుని నిద్రపోతాను. అనవసరంగా నన్ను చాలా గౌరవిస్తున్నారు.' అని అతను నిర్మలంగా నవ్వాడు.

'కాదు. కాదు నేనూ అవ్వా యింకోగదిలో పడుకుంటాం. మీరు చాల దూరంనుంచి వచ్చినట్టున్నారు.' అందామె.

'అవును అయిదారు మైళ్లుపైన నడిచాను. ఉదయం అంతా నడిచి '—' పల్లెటూరికి వెళ్ళాను. రోడ్డయినా ఏమీ బాగాలేదు. ఈ పెట్టెని గొడుగునీ మోసుకుంటూ యింతవర్షంలో—నిజంగా చాలా అలసిపోయాను. మీకు నిజం చెప్పమన్నారా?' అని ఆగాడు జగన్నాథం.

'చెప్పండి.' అందామె ఓరగా చూస్తూ.

'ఈ రోజంతా నాకు భోజనం లేదు. నేను పల్లెకివెళ్లిన పనీ జరగలేదు.' అన్నాడతను విచారంగా.

'ఏం జరిగింది?'

'నా మిత్రుడొకడు కష్టంలో వున్నాడు. నా అన్న వాళ్ళెవరూ లేరతనికి జబ్బుతో తీసుకుంటున్నాడనీ ఒకవెయ్యి రూపాయలు సహాయం చెయ్యమని ప్రార్థిస్తూ ఉత్తరం రాశాడు. ఆ జాబు నాకు చాలా ఆలస్యంగా అందింది. నేను ఒక్కొక్క ఊరు తిరుగుతూంటే ఆ ఉత్తరం నావెనకాలే వచ్చింది చివరికి మొన్ననే ఉత్తరం చేరింది. నేను సొమ్ముతీసుకుని [illegible] బయలుదేరి ఈ రోజునే పల్లెకి వెళ్లాను. కాని...'

'కాని...?'

'నా మిత్రుడు నాలుగ్గురోజులక్రితమే పోయాడట. ఈ పూటకి వస్తానన్నారు వూళ్ళోవాళ్లు. కాని నాకు మనస్కరించలేదు. బయలుదేరి వచ్చేశాను.'

ఇద్దరూ కొంచెంసేపు మౌనంగా ఉన్నారు. ఈ విషాద కథ వారికి దీపకాంతి కూడా కొంచెం తగ్గినట్లనిపించింది వారికి. ఆమె కంగారుగా పైట సర్దుకుని లేచిపోయి కూర్చుంది.

'ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పలేం చూడండి. ఆ పెట్టెలో వెయ్యిరూపాయలూ వున్నాయి. కాని అతనుమాత్రం యిక్కడెక్కడా లేడు.' అన్నాడతను నిట్టూరుస్తూ.

గది అవతల చప్పుడయింది 'ఎవరూ?' అంటూ యువతి గుమ్మం వద్దకు వెళ్ళింది. పక్కగా ముసలిది వుంది. 'ఏం?' అంది కోపంగా యువతి.

'పాలు కాచమన్నావా పిల్లా?' అడిగింది ముసలిది.

'ఇందాక నే చెప్పాను కదూ కాచమని.' అంటూ యువతి వచ్చి కుర్చీలో కూర్చుంది.

అతను దిండుకు చేరగిలబడి కూర్చున్నాడు. ఒకసారి యింటి కప్పునీ గోడల్నీ చూసి 'ఊరికింత దూరంగా ఈ యిల్లు వుండడం తమాషాగా వుంది' అన్నాడు. అతను వచ్చే అవులింత ఆపుచేసుకుని 'మీకు వివాహమయిందా?' అని అడిగాడు.

హఠాత్తుగా వేసిన యీ ప్రశ్నకి ఆమె ఉలిక్కిపడి 'ఏమిటీ?' అంది.

'మీకు వివాహ మయిందా?'

ఆమె జవాబు చెప్పలేక తలవంచుకుంది.

'తెలిసింది. తెలిసిందిలెండి వివాహమైతే యింటికి యజమాని ఉండేవాడుగా! మీకు పెళ్ళికాలేదు. అంతేదూ?'

ఆమె కాలి బొటనవేలితో నేలని గీస్తోంది.

'మీరు చాలా సిగ్గుపడిపోతున్నారే' అంటూ అతను ఆవలింత ఆపుచేసుకోలేకపోయాడు. కాని అవులింత అతని ప్రశాంతత్వాన్ని జయించి శబ్దం చేసుకుంటూ వచ్చింది. అతను చిటికవేస్తూ 'ఇంకా మీరు పెళ్ళి చేసుకోలేదేం?' అని అడిగాడు.

యువతి కుర్చీలోంచి ససంభ్రమంగా లేచి 'మీకు నిద్ర వస్తోన్నట్టుంది. గప్పున పాలు కాచి తీసుకువస్తాను' అంటూ తొందరగా గదిలోంచి వెళ్ళిపోయింది. సుష్ఠయిన భోజనమూ, మెత్తని పక్కా అలసిన అతని నరాలనీ దేహాన్నీ లాలిస్తూంటే, నిద్ర ముంచుకు వచ్చింది. హోరున వర్షమూ. ఒంటరిగా ఉన్న యీ యిల్లూ, యీ రాత్రీ, యీ ఆతిథ్యమూ గురించి వింతగా తలచుకుంటూనే నిద్రలోకి జారిపోయాడు. చలిగాలి మూగని జంఝ్యాని శబ్దం చేస్తూ కొట్టుకుంటోంది. ఇంటిముందు మడుగులో కప్పలు బెకబెకమని చప్పుడు చేస్తున్నాయి. వర్షం చూరుమీద తుప్పలమీద పడి టపటప ధ్వనిచేస్తోంది. అయినా వీటన్నింటిని మించిన నిశ్శబ్దం ఆ ప్రదేశాన్ని ఆవరించుకుంది.

సుమారు ఓగంటకి అతనికి మెలకువ వచ్చింది. గది తలుపులు తెరచిన చప్పుడయి ఒక కన్ను కొంచెం తెరచిచూశాడు. యువతి అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు కాకుండా వచ్చింది. ఆమె చేతిలో పాలగ్లాసు వుంది. మెల్లగా 'ఏఁవండీ?' అంది. జగన్నాథం నిద్ర నటించాడు. ఆమె మళ్ళీ 'ఏఁవండీ పాలుతీసుకుంటారా?' అంది. అతనికి మెలకువ రాకపోవడం చూసి పాలగ్లాసు ముక్కాలిపీటమీద పెట్టి అంచూరులో ఉన్న ప్లేటు తీసి మూత పెట్టింది. అడుగులో అడుగు వేస్తూ గుమ్మం వరకూ వెళ్ళింది. ఆమె ఏదో వూహ తోచి ఆగిపోయింది. సంకోచంతో మంచంవైపు చూసింది. అతనంతా కనిపెడుతూనే ఉన్నాడు. ఆమె మూలనున్న దీపం తీసుకుని వత్తి పెద్దదిచేసి మంచం దగ్గరకు వచ్చి దీపాన్ని అతని ముఖానికి దాపుగా ఎత్తిపట్టుకుని పరీక్షగా చూస్తూ నిలుచుంది. అతని కుతూహలం ఎక్కువయింది. కాని అనుకోకుండా చటుక్కున కదిలాడు. ఆమె కంగారుగా దీపం కిందపెట్టి వెళ్ళిపోబోయింది. అతను కళ్ళుతెరచి ఏమీ ఎరగనట్టు 'ఎవరది?' అన్నాడు. ఆమె ఆగింది. అతను లేచి కూర్చుని కళ్ళు నులుముకుని 'ఓహో-మీరా?' అన్నాడు. తన చేష్టల్ని గ్రహించాడేమో అన్న శంకతో తడబడుతూ 'మీకు పాలుతీసుకు వచ్చాను.' అంది ఆమె.

పాలు తాగుతూ 'మీ రెందుకింత దయచూపిస్తున్నారో అర్థం కావటం లేదు' అన్నాడు.

ఆమె నవ్వి 'మీరు గోరంతలు కొండంతలు చేస్తున్నారు. మేం చేసిం దేముంది చెప్పండి. ఇంత భోజనం పెట్టి పడుకోవడానికింత జాగా చూపించడం కూడా ఘనకార్యమంటారా?' అంది.

అతను నిట్టూర్చి 'నిజంగా ఘనకార్యమే నా జీవితంలో ఎన్నో రాత్రులు భోజనమూ వసతి లేక గడిపినవి ఉన్నాయి' అన్నాడు.

నిద్రవల్ల చిక్కిన స్వస్థతతో బాటు అతనిలో ఉత్సాహం ప్రబలింది. ఈ అపరిచిత యువతిపట్ల తాను నిముష నిముషానికి ఆకర్షింపబడుతున్నట్టు తెలుసుకున్నాడు. ఆమెను పరీక్షగా చూశాడు.

నొసట ముంగురులు చెదరిపడి వున్నాయి. ఇందాక వదులుగా ఉన్న పైట బిగిసగా చుట్టింది. ఆమె దేహంలో సౌకుమార్యము, యౌవన సౌభాగ్యమూ రెండూ గోచరిస్తున్నాయి. లేత నీలంచీరలో ఆమె వొంటివొంపులు పొందికగా అమరివున్నాయి. అన్నిటికన్నా ఆమె కళ్ళు ఎక్కువగా అతన్ని ఆకర్షించాయి. ఆ కళ్ళలో అపారమైన జాలి కనికరా స్ఫురిస్తున్నాయి. ఏ స్వర్గలోకంలోనో, స్వప్నలోకంలోనో విరిసిన ఆ కన్నులు భూమిమీద ప్రవాస జీవితం అనుభవిస్తూ ఏదో పోగొట్టుకున్నట్టుగా ఉదాసీనంగా వెతుకుతోన్నట్టు అనిపిస్తోంది. జాలిగా మెత్తగా మనసుగుండెల్ని తాకుతూ పువ్వులాంటి గొంతుతో పిలుస్తోన్నట్టు ఉంటాయి. తనవైపు జగన్నాథం పరీక్షగా చూస్తోన్నట్టు గ్రహించిన ఆమె బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. తాంబూల సేవనంతో ఎర్రబడిన పెదవుల మధ్య చిన్ని నవ్వు తెల్లని ముత్యంలా చిట్లింది.

'అన్నట్టు మీ పేరు ఇంతవరకూ తెలియనే తెలియదు.' అన్నాడు జగన్నాథం.

'రమ.'

'మీరు చదువుకున్న దానిలా కనిపిస్తున్నారే'

'ఏం చదువులెండి. హైస్కూల్లో ఆరోఫారం వరకూ చదివాను. అదికూడా పెద్దచదువే నంటారా?' అని ఆమె అతన్ని

చూసి 'సరే. కబుర్లు పెట్టి మీకు నిద్రాభంగం కలిగించాను. వెళ్లి పోతాను' అని లేవబోయింది.

'నిద్ర లేకపోయింది లెండి. అదీగాక కబుర్లు మొదలు పెట్టిన వాణ్ణి నేను. నాదోషాన్ని మీరు నెత్తిమీద వేసుకుంటున్నారు.' అన్నాడతను.

ఆమె నవ్వి 'బలేవారే!' అంది.

'మీ గొంతు హాయిగా వుంది. మీరు పాడగలరా?'

'అనాథాశ్రమంలో సభలలో వార్షికోత్సవాలలో నన్నే పాడమనేవారు. చెట్టులేనిచోట ఆముదం చెట్టని మరి.'

'అనాథాశ్రమమా?' ఆశ్చర్యంగా అడిగాడతను.

'అవును.'

'తల్లీ తండ్రీ చిన్నతనంనుండీ మీకు లేరా?'

'లేరు' ఆమె తలవంచుకుంది.

అనుచిత ప్రసక్తి తీసుకువచ్చానేమో అన్న భయంతో మాట మార్చాలని ఏమీతోచక 'చాలా చలిగా వుంది' అన్నాడు.

'అవును.' అందామె.

అతను ఫక్కున నవ్వాడు.

'ఎందుకలా నవ్వుతారు?' అందామె తెలియక.

'మరేమీ లేదు. ప్రశ్న అడిగినా దేనికీ అడుగుతున్నాను. మీరు అవును, కాదు అని ముక్తసరిగా సమాధానం ఇచ్చి ఊరుకుంటున్నారు. నా వివరాలేవీ తెలుసుకోవాలనే స్త్రీ సహజమైన కుతూహలంకూడా లేదా మీకు?'

ఆమె అతనికేసి వింతగా చూసి వూరుకుంది.

'నిజం చెప్పండి. ఇందాక నా పేరడిగి తెలుసుకున్నప్పుడు మీలో కలిగిన ఆశాభంగం స్పష్టంగా కనిపించింది. ఎందుకు?' జగన్నాథం అడిగాడు.

'మీరు విజయుడిలాగా వున్నారు.'—ఆమె పైటచెరగు వేలికి చుట్టుతోంది.

'విజయుడెవరు?'—ఆమె సమాధానం చెప్పేలోగానే మళ్ళీ ఇలా అన్నాడు: 'మీలో నాకొక విచిత్రమైన అందం కనబడుతోంది. మీరంటే నాకు...నాకు...' మాటకోసం జగన్నాథం తడుముకున్నాడు.

ఆమె జాలిగా అందంగా చిన్నగా నవ్వింది. అతను మళ్ళీ అడిగాడు 'మీకు పెళ్ళికాలేదు కదూ!'

లేదని ఆమె తల వూపింది

'మరి ఎందుకు చేసుకోలేదు మీరు రమా?'

ఆమె మౌనంగానే వుండిపోయింది.

'ఇలాగ వ్యక్తిగతమైన ప్రశ్నలు వేయడం సభ్యత కాదను కొంటున్నారు కదూ! అవును చూడండి రమా. ఈ రాత్రీ యీ వర్షమూ, యీ విచిత్ర వాతావరణమూ—యివన్నీ మామూలు మర్యాదల్ని వెనక్కి నెట్టి స్వేచ్ఛగా స్వేచ్ఛగా హృదయాలు విప్పి మాట్లాడుకోవాలనే వాంఛను ప్రేరేపించడం లేదూ?' అన్నాడతను.

'మీతో మాట్లాడుతూ కూర్చుంటే నాకేంతో హాయిగా వుంది.' అందామె

అతను దూరంగా చూస్తూ అంతకన్న దూరంగా ఆలోచిస్తూ 'నిజానికి నేను లౌక్యుణ్ణికాను. ఎప్పుడెలా ప్రవర్తించాలో నాకు తెలియదు. అందుకే జీవితంలో ఏమీ కూడబెట్టలేకపోయా నను కుంటాను.' అన్నాడు.

'అంటే?' ఆసక్తిగా అడిగిందామె.

'జీవితంలో నేను పరాజయంమీద పరాజయం పొందాను. డబ్బుగాని, వసతిగాని భార్యా పిల్లల్నిగాని ఏమీ సంపాదించుకో లేదు. అందుకే విసుగెత్తి సైన్యంలో చేరాను.'

'సైన్యంలోకి విజయుడుకూడా సైన్యంలోనే చేరాడు.' అందామె సంభ్రమంగా కుర్చీనుండి లేచి.

అతను వినలేదు. తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు. 'బర్మా, సింగపూర్, ఇంఫాల్ రంగాలలో పనిచేశాను. కాని అక్కడా నాకు సుఖంలేదు తుపాకిమందు వాసనా, నావులూ యూనిఫారమూ, అంతే. అసహ్యం కలిగింది. ఎలాగో అలాగ బయట పడి ఇదివరకు ఆపుచేసిన చదువుని మళ్ళీ మొదలుపెట్టాను. యం. యస్. సి. చివరికంటా చదివి చదివి పరీక్షలకి కూర్చోలేదు.'

'అరె! అలా చేశారెందుకు?'

'ఆరోజున పరీక్షలనగా నేనద్దెకున్న గది తాలూకు యింటావిడ అటకమీదనుంచి పడింది. తలమీద బలమైన గాయంతగిలి స్పృహతప్పి పడిపోయింది. ఆమెకు అయిదేళ్ళపిల్ల ఒకర్తె వుంది. ఆ సమయానా గదిలోకి వచ్చికూర్చుని ఆడుకునేది. పాపం ఆ పిల్ల ఒకటే ఏడుపు. ఇంటావిడని ఆస్పత్రిలో చేర్పించాను. డాక్టరు బతుకుతుందో లేదో చెప్పలేమన్నారు. ఆ పిల్ల సంరక్షణ నామీద పడింది. రెండుపూటలా ఆస్పత్రికివెళ్ళి ఆమె బాగోగులు విచారించడమూ, అమ్మ అమ్మ అంటూ ఏడ్చే యీ పిల్లని సముదాయించడమూతో నా చదువూ, పరీక్షలూ కొండెక్కాయి.'

'ఆవిడ బతికిందా?'

'బతికింది నేనంటే ఆమెకి చాలా గురి కలిగింది. ఆమె విధవరాలు, పెద్ద వయస్సుదికూడా. నన్ను అక్కడ ఉండిపోయి మళ్ళీ చదవమనీ, తన తమ్ముడిలా చూసుకుంటాననీ ఎన్నోవిధాల చెప్పింది. కాని నేను వినలేదు.'

'ఇప్పుడు మీరేం చేస్తున్నారు?'

'నన్నుగురించి మీరడిగిన మొదటి ప్రశ్నయిది.' అంటూ అతను నవ్వాడు. ఆమెకూడా నవ్వి 'సరే చెప్పండి.' అంది.

'ఒక మందులు తయారుచేసే కంపెనీలో వుంటున్నాను. కాని ఆ ఉద్యోగమూ చెయ్యాలని లేదు. ఒక చోటుకే వ్యక్తికి అంటిపెట్టుకుని ఉండడం నా స్వభావంలో లేదనుకుంటాను. జిప్సీలని ఉన్నారు చూడండి వాళ్ళు ఊరూరా తిరుగుతూంటారు. అటువంటి ప్రవృత్తి ఏదో నాలో ఉందనుకుంటాను. ఎవరితో చెప్పలేని ఈ దేశాన్ని విడిచి వెళ్ళిపోవాలని ఉంది—బర్మాకో, సింగపూరికో.'

'తన తెలిసి' అని ఆవేశంలో అంటూ ఆమె చటుక్కున సిగ్గుపడి పోయింది. అతను తెల్లబోయి చూశాడు. ఆమె అర్థంలేకుండా గబ గబా వెళ్ళి కిటికీ తలుపులు తెరిచింది. చలిగాలి కొరడా ఝుళిపించి నట్టుగా లోపలికి వచ్చి తగిలింది.

'అబ్బ! చలి! తలుపులు వేసెయ్యండి.' అన్నాడు జగన్నాథం.

'వాన చాలామటుకు తగ్గింది' అంటూ తలుపులు వేసి ఆమె వచ్చి కుర్చీలో కూర్చుంది.

అతను నవ్వుతూ యిలా అన్నాడు. 'ఇందాకట్నుంచీ మీరు నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా దాటవేస్తున్నారు. చెప్పండి, మీరు పెళ్ళి చేసుకోరా?'

'నన్నెవరు చేసుకుంటారు?' ఆమె నీరసంగా అంది.

'ఏం మీకేం తక్కువ?' అన్నాడతను.

ఆమె పెదవులు వణుకుతున్నాయి. అతను గమనించలేదు. అతను మళ్ళీ రెట్టిస్తూ 'ఇంతకాలం మీరు అవివాహితలుగా ఉండడానికి ఏదైనా ప్రత్యేక కారణం ఉందంటారా! లేక మీరు అవివాహితగానే ఉండదలచారా?' అన్నాడు.

ఆమె తన ముఖాన్ని రెండుచేతులతో కప్పుకుని 'మీకు తెలియదు, మీకు తెలియదు. మీకు తెలియకూడదు.' అంటూ గబగబా గదిలోంచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపే నిశ్చేష్టుడై చూస్తూ వుండిపోయాడు జగన్నాథం. వాన తగ్గితే వెళ్ళొస్తానని అడిగితే బావుంటుందను కున్నాడు. కాని ఆమె ఏమనుకుంటుందో అని సంకోచించాడు. ఏమీ తోచక కిటికీ తలుపులు తెరిచాడు. సన్నగా వానపడుతోంది. దట్టంగా భయంకరంగా ఉంది అంతా చీకటి. ఆకాశాన ఒక నక్షత్రంకూడా లేదు. కప్పల అరుపులుమాత్రం ఘోరంగా అసహ్యంగా వినిపిస్తున్నాయి.

తలుపులు వేసి మంచంమీద మేను వాల్చాడు. ఊరికి దూరంగా ఉన్న యీ కొంప దెయ్యాలకొంప కాదుకదా అన్న ఆలోచన అతన్ని ఒక నిమేషమాత్రం భయావహుణ్ణి చేసింది. అతనికి చనిపోయిన మిత్రుడు జ్ఞాపకం వచ్చాడు. ఎందుకంత తొందరపడి, యీ పిన్నవాళ్ళని అనుభవాల్ని వదులుకొని చచ్చిపోయాడు? అతని ఆత్మలాంటిది యింకా ఏదైనా భూమిమీద వుండి అతృప్తంగా తిరుగుతూంటుందా? ఇంత మిథ్యగా మాయంగా ఉన్న బతుకులో నిజానికి ఎవరి కెవరు! ఈ బాంధవ్యాల అనుబంధాల అర్థం ఏమిటి? ఎందుకు తను అలాగ భయకంపితురాలై పరుగెత్తుకుపోయింది? ఎందుకు తాను కష్టపడి ఆర్జించిన వెయ్యి రూపాయలూ చనిపోయే ఒక మిత్రునికి దానం చేయాలని స్వప్నంలో గాలిలో బయలుదేరి వచ్చాడు? విజయుడెవరు? అతని పోలికలు తనలో ఎందుకుండాలి? ప్రతి బతుకునీ ఏదో రహస్యంలో చుట్టబెట్టి అగోచరమూ బలీయమూ అయిన విధి నిరంకుశంగా ఎక్కడికో తెలియని చోటికి నడిపిస్తోన్నట్టు అనిపించింది అతనికి.

అతనికి గుండెలో ఏదో వెలితిగా తోచింది. తనలోని యీ అస్థిరత్వానికి అశాంతికి కారణం ఏమిటి? ఇలా వూళ్ళూ దేశాలూ తిరుగుతూ జీవితాంతం దాకా గడపవలసిందేనా? తనకో యిల్లు, తనకోసమై ఎదురుచూసే జీవించే ప్రాణీ—అతడు తనలో తను నవ్వుకున్నాడు. ఎప్పటికీ తానొకచోట స్థిరంగా ఉండలేదు. ఎప్పుడో ఎక్కడో గాలిపటానికి తాడు తెగిపోయింది. ఇలాగ శూన్యంలో ఏ బాధ్యతా లేకుండా గాలికి కొట్టుకుపోతూంటేనే బావుంటుందేమో!

ఆలోచిస్తూన్న అతనికి కునుకుపట్టింది. అప్పుడుకూడా అతని మనస్సు అస్పష్టంగా ఆమెకోసమే నిరీక్షిస్తోంది. ఒక గంటలో అతనికి మెలకువ వచ్చింది. గుమ్మం తలుపులు బార్లా తీసివున్నాయి. నలువైపులా చూశాడు. ఆమె మళ్ళీ వచ్చిన జాడలేదు. గోడమీద గడియారంలో పన్నెండు దాటింది. అతని కేమీ తోచలేదు. ఆ గదిలో ఒక్కడూ అలాగ వుండడం దుస్సహమనిపించింది. మంచం దిగి మెల్లగా అడుగులు వేసుకుంటూ ముందుహాలోకి వచ్చాడు. ఒక మూలగా కొవ్వొత్తుదీపం మినుకు మినుకుమంటూ వుంది. ఆ తక్కువ కాంతిలో ముందుహాలోని వస్తుజాలం అస్పష్టంగా అసంబద్ధ ఆకారాలతో కనపడుతోంది. కిటికీకి ఎదురుగా నల్లగా ఒక ఆకారం కనపడింది. ఏమిటా అని దగ్గరకు వెళ్ళేకొద్దీ స్త్రీరూపం ప్రస్ఫుటమైంది. రమ కిటికీకి ఎదురుగా కూర్చునివుంది. విడిపోయిన పొడుగాటి ఆమె కేశపాశం బుజాల్ని వీపుని ఒత్తుగా కప్పింది. అతను దగ్గరగా వెళ్ళి 'రమా' అని పిలిచాడు. ఆమె పక్కకు తిరిగి అతనివైపు చూసింది. దీపకాంతిలో ఆమె కళ్ళు జలమయం అయి వుండడం చూశాడు. ఆమె కపోలాలమీద అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి.

'ఇన్నాళ్ళకి రమా ఏడుస్తున్నారా?' అన్నాడు జగన్నాథం వ్యథతో, సానుభూతితో. ఆమె చీర చెరగుతో కన్నీరు తుడుచుకుని లేచి నుంచుంది. అతి ప్రయత్నంమీద ఆమె ఏడుపు ఆపుకుంటూన్నట్టు అతను గ్రహించాడు. ఆమె చెయ్యిపట్టుకుని 'లోపలికి రండి. ఈ చలిగాలిలో కూర్చుంటే ఉదయానికి ఏ న్యుమోనియానో కూడా రావచ్చును.' అంటూ గదిలోకి తీసుకువెళ్ళాడు. 'ఇలాగ మంచంమీద కూర్చోండి. ఈ క్షణంలో మిమ్మల్ని చూస్తే ప్రపంచంలోని బాధఅంతా మీలోనే ముద్దకట్టుకుందా అనిపిస్తోంది.' అంటూ ఆమె వద్దువద్దంటూన్నా ఆమెను మంచంమీద కూర్చోపెట్టి ఆమెకి కొంచెం దూరంగా కూర్చున్నాడు.

"ఇప్పుడెవరైనా వచ్చి మన యిద్దర్నీ చూస్తే నేను మిమ్మల్ని హింసిస్తోన్నట్టుగా వూహించుకుని నన్ను జైల్లో పడేయించాలని చూస్తారు. అవునా?" అన్నాడతను నవ్వుతూ.

ఆమె కన్నీళ్ళలోంచి నవ్వింది.

"అయితే ఇప్పుడు చెప్పండి. విజయుడెవరు?' అని అడిగాడతను. ఆమెని మాటల్లో పెట్టి, హృదయభారాన్ని వెళ్ళబోయించినట్లయితే కొంత ఉపశమనం కలుగుతుందని అతను ఉద్దేశించాడు.

'నా బాల్యస్నేహితుడు.' అందామె.

'ఊఁ!'

'నేను చదువుకునే రోజుల్లో అతని పరిచయం కలిగింది. ఎప్పుడు చూసినా ఎంతో ధైర్యంగా, ఉత్సాహంగా వుండేవాడు. తల్లీతండ్రీ లేని నన్ను చూసి జాలిపడేవాడు. ఇంట్లోనుంచి డబ్బు దొంగిలించి తీసుకొచ్చి నాకన్నీ కొనిపెట్టేవాడు.'

ఆమెకళ్లు స్మృతిపూర్వకమైన గర్వంతో మెరిశాయి.

'తర్వాత!' అన్నాడతను.

'కాని ఆ దొంగతనాలకి అతను విపరీతంగా కఠినమైన శిక్షలని అనుభవించేవాడు పాపం. అతనికి సవతితల్లి వుంది. ఆమె చాలా క్రూరురాలు. తండ్రి ఆమెకి దాసుడు. నాకోసమై అతను దెబ్బలు తినడమూ, తిండిలేక మాడడమూ సహించలేకపోయేదాన్ని. అతన్ని బతిమలాడుకునేదాన్ని యిటువంటి పనులు చెయ్యొద్దని. అతను వినేవాడు కాదు. 'నీకోసం ఏమైనా చేస్తాను. నీకొక్క నిముషం ఆనందం కలిగించడానికి వెయ్యేళ్ళ నరకమైనా అవలీలగా అనుభవించగలను.' అనేవాడు.

'స్కూలు వదలగానే ఒక నిర్ణీతస్థలంలో కలుసుకొనేవాళ్లం. ఇద్దరమూ అలా తోటలలోకి పొలాలలోకీ వెళ్ళేవాళ్ళం. ఆటలాడేవాళ్ళం. పాటలు పాడేవాళ్ళం. జామిపళ్లూ రేగిపళ్లూ తింటూ గంటలు నిముషాల్లాగా గడిపేవాళ్ళం. స్వచ్ఛమైన అనంతమైన నీలాకాశంకిందా వెచ్చని పచ్చని మెత్తని భూమ్మీదా ఎన్నో స్వప్నాలు కనేవాళ్లం. నన్నే పెళ్ళిచేసుకుంటాననేవాడు. నన్నే ప్రేమించాననేవాడు.

'చీకటిపడ్డాక అనాథశరణాలయానికి బిక్కుబిక్కుమంటూ వెళ్ళేదాన్ని. అక్కడ వార్డెన్ పెద్దపులిలాగ నాకోసం కనిపెట్టుకుండేది. భోజనంలేకుండా చీకటిగదిలో నన్ను తోయించి తాళం వేసేది. రాత్రంతా ఏడుస్తూ బాధతో భయంతో గడిపేదాన్ని. కాని తెల్లవారేదా, ఎప్పుడు సాయంత్రమవుతుంది, ఎప్పుడు విజయుణ్ణి కలుసుకుంటాను అని నిరీక్షిస్తూ ఉండేదాన్ని. అతనొకడే నా ఆశ, నేను బతకడానికిగల అర్థం.

'కాని మనం వూహించినట్టుగా, కోరుకున్నట్టుగా ఎక్కడేనా జరుగుతుందా చెప్పండి. రోడ్డంతా సవ్యంగా చదునుగా వున్నట్టే వుంటుంది. కాని మలుపుతిరిగేటప్పటికి బ్రహ్మాండమైన అగాధం నోరు తెరచుకుని అప్రమత్తుడైన పాంథుణ్ణి అమాంతం మింగివేస్తుంది. అక్కడ ఎర్రని అక్షరాలతో 'అపాయం' అని బోర్డుకూడా వుండదు. ఇంటా బయటాకూడా విజయుడికి పరిస్థితులు దుస్సహమయాయి. బి. ఏ. చదువుతూండగా అతనికి వివాహం చెయ్యడానికి సవతితల్లి దీక్షవహించింది. అన్నీ స్థిరపరిచింది. విజయుడెదురుతిరిగాడు. బెదిరించాడు. ఒకరాత్రి సంభవించిన పెద్ద దెబ్బలాటలో యినుపకమ్మీతో సవతితల్లి తలమీద బలంగా కొట్టాడు. ఆమె పరిస్థితి ప్రమాదకరంగా వుంది. రాత్రికిరాత్రి విజయుడు పరారి అయిపోయాడు. తండ్రి పోలీసులకు రిపోర్టు యిచ్చాడు. అతని ఆచూకీ దొరకలేదు. మూడు నెలల అనంతరం నాకో ఉత్తరం వచ్చింది. అందులో రెండేరెండు వాక్యాలున్నాయి. తాను సైన్యంలో చేరినట్లూ, బతికి బాగుంటే ఎప్పుడో ఒకప్పుడు కలుసుకుంటాననీ మాత్రం రాశాడు. అంతే. యుద్ధం ముగిసింది ఎన్నో ఏళ్లు గడచిపోయాయి. కాని యీనాటివరకూ అతని జాడలేదు.'

ఆమెగొంతు క్రమక్రమ క్షీణమూ, గాద్గదికమూ అయిపోయింది. ఆమె కాసేపాగి మళ్ళీ యిలా చెప్పింది. 'ఓసారి చెట్టుమీద నుంచి పడినప్పుడు విజయుడికి ఎడమకణతపక్కగా గాయం తగిలింది. క్రమేణా అది మచ్చగా మారింది.' ఆమె జగన్నాథంకేసి తీక్ష్ణంగా చూసింది. 'అదిగో అక్కడ మీకు ఏదో మచ్చవుంది. మీరు విజయుడు కాదా? చెప్పండి. నిజం చెప్పండి. నన్ను మోసగించకండి నన్ను బాధపెట్టకండి.' ఆమె ఉద్రేకంతో దీనంగా ప్రార్థేయపడుతూ అడిగింది.

జగన్నాథం ఆమెని, పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. శాంతంగా 'నేను నీ విజయుణ్ణికాను. రమా. అలా చిన్నపిల్లలాగ ఉద్రేకపడిపోవడం మంచిదికాదు.' అన్నాడు.

గదిగుమ్మం దగ్గర ఎవరో నడిచినట్టు చప్పుడయింది. ఇద్దరూ అటువైపు చూశారు ఎవరూ లేరు. అతను తిరిగి ఆమెని ప్రశ్నించాడు. 'అనాథాశ్రమంలో మిమ్మల్ని ఎవరు చేర్పించారు?'

'నాన్న.' అందామె.

'మీ తండ్రి నెరుగుదురా?'

'ఎరుగుదును.'

'ఆయన వుండగా—ఆయనే స్వయంగా మిమ్మల్ని శరణాలయంలో చేర్పించవలసిన అవసరం ఏముంది?'

'అదంతా ఒకగాథ.' ఆమె బరువుగా నిట్టూర్చింది.

'అంటే...?'

'నాన్న చాలా దుఃఖజీవి, సంస్కారవాదీ, విప్లవవాదికూడా.

తప్పక ఫలసురాలిని స్వాతంత్ర్యోద్యమ బంధువర్గమూ, సమాజం పెద్దలూ అతన్ని వెలివేశాగా నాన్న ఆరోజుల్లో ఒక రహస్య విప్లవ సంఘంలో సభ్యుడుగా ఉండేవాడు. ఎన్నోసార్లు జైలుకి వెళ్ళి తప్పించుకు వచ్చేశాడు. ఒకసారి పోలీసులకి ఈ సంఘానికి పెద్దకొట్లాట జరిగింది. అందులో నాన్న తుపాకీదెబ్బవల్ల గాయపడ్డాడు దానిఫలితంగా ఒక కాలు శస్త్రచికిత్స చేసి తీసివేశారు. కుంటివాడూ అనారోగ్యవంతుడూ అయిన తండ్రి అమ్మనూ నన్నూ పోషించలేకపోయేవాడు అమ్మ దిగులుతో వ్యాధితో మరణించింది. నాన్న చేసిన త్యాగాన్ని, దేశసేవ ఎవరూ గుర్తించుకోని కొంత సహాయమైనా చెయ్యలేదు. కర్ర ఆధారంగా నేనుకొని పొరుగూళ్లు వెళ్లి యాచనచేసి నన్ను పోషించేవాడు. క్రమేణా నాన్నకి జీవితం మీద విరక్తి కలిగింది. బతకడమే పెద్దబరువైపోయింది.

“ఒకరోజున అర్ధరాత్రి నిద్రపోతున్న నన్ను లేపి తనతో రమ్మన్నాడు నాకు అప్పుడు ఏడెనిమిదేళ్ళ వయస్సు తనతో కూడా చీకట్లో నడిపించుకుని వెళ్ళాడు. ఎత్తైన ప్రహరీగోడలు చుట్టూవున్న ఒక పెద్దయింటికి తీసుకవెళ్ళాడు. అదే అనాథ శరణాలయం. శరణాలయ నిర్వాహకురాల్ని మా నాన్న బాగా ఎరుగునట. ఆవిడకి నన్నప్పగించాడు ఆమె చేతికొక ఉత్తరం ఇచ్చి పెద్దదాన్నయాక నాకిమ్మన్నాడు ఒకచేత్తో కర్రసాయంగా ఒకచేత్తో నా చుబుకం పట్టుకుని కన్నీళ్ళతో “అమ్మడూ ఇకనుంచి యీవిడే నీకు అమ్మ. జాగ్రత్తగా ఉండమ్మ” అని శిరస్సుమీద ముద్దుపెట్టుకుని కర్రని టకటకమని చప్పుడుచేస్తూ వెనక్కి తిరిగిచూడకుండా వెళ్లిపోయాడు. నేను భయంతో “నాన్నా! నాన్నా!' అని గట్టిగా అరిచాను. ఆ ఆక్రోశం చీకట్లో మారుమ్రోగింది. ఉదయానికి నాన్న ఆత్మహత్య చేసుకున్నట్టు ఊరంతా చెప్పుకున్నారు' ఆమె బాధతో కంపించిపోతూంది. మంచంపట్టెని గట్టిగా నొక్కిపట్టుకుంది. ఇంకా ఇలా చెప్పుకుపోయింది.

'ఇప్పటికీ ఆ పిలుపు చీకటివేళల హృదయవిదారకంగా ప్రతిధ్వనిస్తున్నట్టే ఉంటుంది నాకు. ఆశ్రమ నిర్వాహకురాలు చాలా దయాహృదయంకల మహిళ. ఆవిడే వుంటే నా బ్రతుకిలాగ అయిపోయివుండేదికాదు కాని రెండుసంవత్సరాల అనంతరం ఆమె కూడా చనిపోయింది'

'ఆ ఉత్తరంలో ఏమని రాశాడు మీనాన్న?' అని అడిగాడు జగన్నాథం.

'“నేను జీవితసమరంలో చిత్తుగా ఓడిపోయినవాణ్ణి. అందుకే నిన్ను దిక్కులేనిదానిగా ఒంటరిదానిగా చేసి పోతున్నాను కాని ఒక్కటేమాత్రం మరచిపోకు. నీతండ్రి ఏంచేసినా ఒక్క ఆదర్శం కోసమూ, ఒక విశ్వాసంకోసమూ చేశాడు. అంతేకాని నీచమైన మోసమైన ఏపనీ చెయ్యలేదు ఏలోకంలో వున్నా, నీ సుఖాన్నీ, అభివృద్ధినీ కాంక్షిస్తూంటాను.” అని రాసి వుంది' అందామె.

దుఃఖపూరితమైన యీ గాథతో గాలి అంతా బరువెక్కినట్టనిపించింది అతనికి. ఇద్దరూ కొన్ని నిముషాలు మౌనంగా వున్నారు. అతనే మళ్ళీ ప్రశ్నించాడు. 'మరి యీ వూరు ఎలా వొచ్చావు రమా? ఈ అవ్వ ఎవరూ?'

ఆమె సంకోచంతో సాశ్రునయనాలనెత్తి చూసింది. 'చెప్పు రమా నాదగ్గర ఏం చెప్పడానికీ నీకు సంకోచం అనవసరం ఈ విషాదయాత్రలో నేనూ ఒక సహచరుడినే.' అన్నాడు జగన్నాథం.

'విజయరాముడు — అదే విజయుడి [illegible] — వెళ్ళిపోయాక నా బతుకంతా శూన్యమైపోయింది చాలాకాలం అతనికోసం వేచివున్నాను. కొందరు అతను యుద్ధంలో చనిపోయాడన్నారు. అతన్ని తలచుకుని రోజూ ఏడుస్తూ దిగులుగా వుండేదాన్ని. ఆశ్రమం అప్పుడు వ్యాపారుల చేతుల్లో వుండేది. నానా కష్టాలు పడేవాళ్ళం. బ్రతుకు దుర్భరమైపోయింది. అప్పుడు...' ఆగిందామె.

'అప్పుడు?'

'ఒక పెద్దమనిషి తీయనిమాటలు చెప్పి నమ్మించి నన్నీ వూరుకు తీసుకు వచ్చేశాడు. ఇక్కడి హోటల్లో దింపెట్టాడు ఒకరోజున ఉదయం లేచి చూసేటప్పటికి అతగాడు పెట్టెతో ఉడాయించి మాయమయ్యాడు కట్టుబట్టలతో ఉన్న నన్ను వీధిలోకి గెంటేశారు. అవమానంతో ఆకలితో చచ్చిపోదామనుకుంటూన్న నన్ను అవ్వ చూసింది. అప్పట్నుంచీ యిక్కడ అవ్వతో ఉంటున్నాను.'

'అవ్వ నీకేమీ కాదన్నమాట!'

'కాదు'

'అయితే నువ్వెక్కడ...' అని అతను ఏదో అనబోతూంటే ఆమె చేతులతో తన ముఖాన్ని కప్పుకుని 'ఇంక నన్నేమీ అడగకండి. నన్ను చంపకండి' అని వెర్రిగా కేకలు వేసింది.

జగన్నాథం తెల్లబోయాడు. ఆమె మంచంమీద బోర్లపడి వెక్కి వెక్కి యేడుస్తోంది ఆమెకి ఉపశమనం బదులు తీవ్రమైన దుఃఖాన్ని కలిగించానే అని బాధపడ్డాడు జగన్నాథం తెల్లని పక్కమీద ఆమె జుట్టు విప్పిన నెమలిపురిలా వుంది. వేటగాడి బాణం దెబ్బతిన్న కపోతంలాగా విలవిలలాడుతోంది ఆమె అతనికేం చెయ్యాలో తోచలేదు. ఇబ్బందిగా దిక్కులు చూశాడు అతని మనస్సు సానుభూతితో, జాలితో నిండిపోయింది అనుకోకుండా అతని కళ్లు రెండూ తడిఅయినై.

ఎన్నేళ్ళనుంచో దాచుకున్న యీ అపరిమిత దుఃఖాన్ని విజయుడిలాగ కనపడే తనముందు ఒక ఆత్మీయత ననుభవించి బహిర్గతం చేసిందనుకున్నాడు. సుకుమారంగా పువ్వులాగా ఉన్న యీమెకి యింత బరువుని ఇన్నాళ్ళు మోసేశక్తి ఎక్కడనుంచి వచ్చిందా అని ఆశ్చర్యపడ్డాడు. ఎన్ని సుఖాలూ సదుపాయాలూ ఉన్నప్పటికీ మనస్సులోని ఒంటరితనం ఎంత భయంకరంగా ఉంటుందో అతనికి తెలిసివచ్చింది. అది పెద్ద సహారాయెడారిలా వ్యాపించి ఉంటుంది. అక్కడ నీళ్లు దొరకవు, అడుగుజాడలు కనపడవు బ్రతుకు వాసన ఉండదు. అక్కడ నుండే కాలే యిసుకమాత్రం అనంతంగా పరచుకుని వుంటుంది. ఎవరూ ఆ యెడారిలో ఉండలేరు బ్రతకలేరు. తనలో, రమలో ఆఖరుకి అవ్వలో కూడా ఎడారి. ఆ యిసుకలో కాళ్లుమాడుతూ బ్రతుకునీడ్చుకుంటూ నాలిక పిడచకట్టుకుపోతూంటే ఒయాసిస్సులకోసం కొనవూపిరితోకూడా వెతుక్కుంటూ ఉంటారు.

ఈ ఆలోచనతో క్షణమాత్రం అతనిసర్వాంగాలూ కంపించాయి. అతను నిలదొక్కుకుని, ఏడుస్తున్న రమకేసి చూశాడు. ఆమె వీపుమీద చెయ్యివేసి 'రమా' అని మృదువుగా పిలిచాడు. ఆమె మాట్లాడలేదు

'రమా ఒక్కమాట చెప్పనా–' అన్నాడు మళ్లీ.

'ఏమిటో చెప్పండి.' అంది అలాగే బోర్లాపడుకుని.

'ఇక్కడకువచ్చి నిన్ను చూసినప్పటినుండీ నాలో ఒక అశాంతి రేగింది. ఇంతవరకూ ఏ సందేహాలూ లేకుండా కులాసాగా మొండిగా జీవితాన్ని గడిపేస్తున్నాను బుద్ధిపూర్వకంగా మనస్సునీ చర్మాన్నీ మొద్దుబారిపోయేటట్లు చేసుకుంటున్నాను నిన్ను చూశాక ఎన్నాళ్లనుంచో నీకోసమే వెతుకుతూన్నట్టనిపించింది. ఇప్పుడు నేను తెలుసుకున్నాను రమా. నాకు నువ్వుకావాలి.' అన్నాడు జగన్నాథం.

రమ ఏడుపు నాపింది. లేచి కళ్లుతుడుచుకుంటూ ఆశ్చర్యంగా అతనికేసి చూసింది.

'చీకటో వెళ్ళేపాంథుడికి దీపంకన్న మరో సాధనం ఎక్కువ ధైర్యాన్నీ విశ్వాసాన్నీ యివ్వగలదు రమా. మన యిరువు జీవితాల్నీ ఏకం చేసుకున్నట్లయితే, మనకొక ప్రశాంతీ, ధ్యేయమూ కలుగుతాయని ఆశగా ఉంది. నేను నిన్ను—ప్రేమిస్తున్నాను రమా.'

'నిజంగానా?' నమ్మలేని కళ్ళతో అడిగింది రమ.

'నిజం తెగిపోయిన దారాల్ని. తంత్రుల్నీ చేర్చి ముడేస్తే కొంతైనా జీవితాలు శ్రుతి తప్పి యిలాగే శిథిలమై నామరూపం లేకుండా నశించిపోతాయి నన్ను నమ్ము రమా. నిన్ను పెళ్ళిచేసుకుంటాను నీకిష్టమేనా?'

'మరి బర్మా, సింగపూర్ — ఎక్కడికీ వెళ్ళరా?'

'వెళ్ళను, నువ్వు నా భార్యవైతే'

ఆమె అతనికళ్ళలోని నిజాయితీనీ, నిశ్చయాన్నీ చూసింది. ఆనందం ఎక్కడనుంచో సంతరించుకునివచ్చి ఆమె ముఖాన్నీ, దేహాన్నీ మెత్తని వెలుగుతో నింపింది ఆమెకళ్లు పెద్దవై ప్రకాశించాయి. ఒక్కసారి పెలపెలారగా నవ్వింది వెర్రిఆవేశం ఆమెని ఆవరించింది. మైకం కమ్మినట్లయింది. అతన్ని తనవొడిలోనికి లాక్కుని, అతని శిరస్సుమీదా, బుగ్గలమీదా, రొమ్ముమీదా గబగబా ముద్దుపెట్టుకుంది. అతని కూపిరాడక 'అబ్బ వగులు వగులు రమా!' అన్నాడు. ఆమె కలకలనవ్వి మంచంమీదనుండి దిగి ఇప్పుడే వస్తానంటూ గదినుండి రివ్వున వెళ్లిపోయింది.

గది దాటగానే ముసలిది కంగారుగా అక్కడనుండి వెళ్లిపోవడం చూసింది. దగ్గరవెళ్లి కోపంతో 'అవ్వా. నువ్వు చాటుగా నిల్చుని మామాటలు వింటున్నావా?' అని అడిగింది.

'లేదు పిల్లా. లేదు లేదు' తడబడుతూ అంది ముసలిది.

'గుమ్మం దగ్గర ఏం చేస్తున్నావ్ ఇంత రాత్రివేళ.'

'నీతోడు పిల్లా. నేనొక్కమాట వినలేదు తాళం చెవుల కోసం వెతుక్కుంటూ వచ్చానలాగ.' అంది ముసలిది

'నీబుద్ధి మరగు ముసలిపీనుగా' అంటూ విసుగ్గా యింకో గదిలోకి వెళ్లిపోయింది రమ

జగన్నాథం ఒక్కడూ గదిలో మంచంమీద దిండ్లానుకుని కూర్చుని ఆమెకోసం నిరీక్షిస్తున్నాడు. అతని మనస్సెంతో తేలికైంది. వర్షం ఎక్కువయింది. రేకుమీద చినుకులుపడిన శబ్దం కూడా ఎక్కువయింది కొంతసేపటికి రమ గదిలోకి వచ్చింది. రమ కన్నముందుగా సుతారపు అత్తరువాసన గదిలోకి వ్యాపించింది. ఆమె ముఖానికి స్నో, పౌడరూ ఉపయోగించింది ఇందాకటి కన్నీటి చారలూ, బాధయొక్క నీడలూ లేవు తెల్లని పల్చని చీర కట్టుకుంది. జుట్టు దువ్వుకుని సిగగా చుట్టుకుంది. నవ్వుతూ, సిగ్గుతో హాయితో రాజహంసలా వచ్చే ఆమెని చూడగానే అతని హృదయం ఆనందంతో నిండింది.

అతను లేచి ఆమెను మంచంమీద పరుండబెట్టి పక్కనే కూర్చున్నాడు. ఆమె కళ్లల్లోకి చూస్తూ 'నువ్వు అమాయకురాలివి రమా. ఇంక నిన్నెప్పుడూ ఏడవనివ్వను. ఏడుపు నీ బ్రతుకులోకి రానివ్వను.' అన్నాడు.

ఆమె తన చేతివేళ్లు నతని చేతి వేళ్లలోంచి పోనిచ్చి 'మీరు నన్ను తప్పక పెళ్లిచేసుకుంటారు కదూ. ఇక్కడనుంచి వెళ్లిపోతాం కదూ.' అంది.

'తప్పకుండా. ఈ వర్షం తగ్గగానే బయలుదేరి వెళ్లి అన్ని ఏర్పాటూ చేసి ఒక వారంలో జిల్లో నిన్ను తీసుకు వెళ్లడానికి వస్తాను '

'మీరు రాకపోతే—' భయంగా అడిగింది రమ. ఆమె కళ్లల్లో భయం సుళ్లుతిరగడం చూశాడు జగన్నాథం.

'ఎందుకు రాను రమా. నీకిటువంటి అనుమానం ఎందుకు కలగాలి ?' అన్నాడు.

'అయితే వొట్టేయ్యాలి.' అంది ఆమె.

అతడు నవ్వుతూ ఒట్టు వేశాడు. ఆమె నిట్టూర్చి కన్నులు మూసుకుంది : మనస్సుయొక్క అగాధపు చీకటిలోయలో కాంతి మార్గం తెరచుకుంటూన్నట్లనిపించింది ఎర్రని ఆమె పెదవులు దేనికోసమో వెతుకుతూన్నట్లు కదిలాయి. ఆమె ముఖంలో తృప్తి వెయ్యి రేకుల పద్మంలా విరిసింది.

'నువ్వు చాలా అలసిపోయావు. కాస్సేపు నిద్రపో రమా.' అన్నాడు జగన్నాథం.

'మీరు...?' అడిగింది రమ.

'నేనిలాగే కూర్చుని ఆలోచిస్తూంటాను.'

'నాకు కాపలా కాస్తుంటారా!' అని నవ్వింది రమ కన్నులు మూసుకునే.

'అవును. ఎవరిసొమ్ముని వాళ్లు భద్రంగా చూచుకోవాలి కదా!' అన్నాడు జగన్నాథం.

పెంకెతనంలో వికసించడానికి ఒప్పుకోని ఎర్రని మొగ్గలాగ వున్నాయి ఆమె పెదవులు. జగన్నాథం వంగి పెదవుల్ని మెల్లగా మృదువుగా ముద్దు పెట్టుకున్నాడు. రమ అతని చేతికి తీసుకుని తన గుండెలమీద పెట్టుకుంది. అతనిచేతిమీద తన చేయి కనింది.

'ఈ చేయి నిలాగే ఉంచండి. ఇంక నాకు భయంలేదు. హాయిగా నిద్రపోతాను.' అంది రమ. అతనేవో కబుర్లు చెబుతూంటే వింటూ నిద్రలో లీనమయిపోయింది.

ఈ విచిత్ర సంఘటన గూర్చీ, తన హితాన్నిర్ణయాన్ని గూర్చి యింకా విస్మయంగా ఆలోచిస్తున్నాడు జగన్నాథం. అతని చెయ్యి ఆమె గుండెలమీదనే వుంది. ఆ చేతిమీద ఆమె చెయ్యి వుంది. అలాగ ఎంతసేపు కూర్చుని ఆలోచించాడో అతనికే తెలియదు. గది గుమ్మం దగ్గర ఎవరో తచ్చాడుతూన్నట్టుగా అని పించి నిదానించి చూశాడు. ముసలిది! సైగ చేస్తోంది. రమ్మని చేయివూపుతోంది. రమకి నిద్రాభంగం కాకుండా మెల్లగా తన చేయి విడిపించుకుని చప్పుడు కాకుండా గది దాటి వెళ్లాడు.

'ఎందుకవ్వా పిలిచావు?' అన్నాడు. ముసలిది అతన్ని మండువాలో మూలకు తీసుకు వెళ్లింది.

'అమ్మాయి బాగా వచ్చిందా బాబూ?' అంది.

'వచ్చింది' అన్నాడు జగన్నాథం నవ్వుతూ.

ముసలిదానికళ్లు కుత్సితపు వూహతో పన్నగా ముడుచుకున్నాయి. వెకిలిగా నవ్వి 'మారాజులు మీరు. గొప్ప ప్రభువులు.' అంది.

జగన్నాథం రమ లేస్తుందేమోనని 'త్వరగా చెప్పు అవ్వా!' అన్నాడు. ఆమె నమ్ముకున్న హస్తాన్ని ఆమె గుండెలమీంచి తీయడం కూడా ఏదో దోషంలాగా అనిపిస్తోంది అతనికి.

'నువ్వే కాదు బాబూ ఏ అయ్య మానినా వచ్చింపన్నవాడే కాని తేగా మాట పలికినవాడు లేడు. ఒక రాత్రికి రెండొందలు, మూడొందలు యిచ్చిన మారాజులే అందరూ. అందరిలాంటిది కాదు బాబూ నాపిల్ల. వజ్రం, వైడూర్యం. దాని వొట్టూ దాని రుచీ మీలాంటి ప్రభువుకి తెలుస్తుంది. అందుకే అయిన వాణ్ణి కానివాణ్ణి గుమ్మం ఎక్కనివ్వను. ఎంచుకోడంలో దానికున్న తెలివి గొప్పది బాబూ. మనసు కాకపోతే ఎంత గొప్పవాడైనా పొమ్మంటుంది.' అంది ముసలిది.

'ఇంతకి నువ్వు చెప్పేదేమిటి?' అన్నాడు జగన్నాథం విసుగ్గా.

'మరేం లేదు బాబూ నీకన్నాళ్లు మనసైతే అన్నాళ్లూ అనుభవించు. నువ్వు లోటుచేస్తావా బాబూ మారాజు బిడ్డవి. ఒక రాత్రికి రెండొందలు తక్కువ కాకుండా యిస్తావు. నాకు తెలుసును. నీ కివి నీ మాటే చాలు బాబూ, నీలోతు తెలుసుకోవడానికి. ఏదో లేనివాళ్లం. మీ లాంటివాళ్లు దయవలిస్తే నాలుగు రోజులు మీ పేరు చెప్పుకుతింటాం '

జగన్నాథానికి మాటా యీతీరూ అసహ్యం అనిపించింది. 'ఇదుగో అవ్వా. రమని నేను పెళ్లి చేసుకోబోతున్నాను.' అన్నాడు.

ముసలిది ఫక్కున నవ్వింది. ఆ నవ్వు కొన్ని వందల కప్పల్ని బుట్టలో చుట్టబెట్టి ఊపిరాడకుండా నొక్కుతూంటే వచ్చిన ధ్వనిలాగ వుంది

'మాకు పెళ్లేమిటి బాబూ!' అంది.

'చూడవ్వా, రమ చాలా కష్టాలు పడింది. రమ చింతతో కృశించిపోతోంది రమని నేను ప్రేమించాను. పెళ్లి చేసుకుంటానని వాగ్దాన మిచ్చాను.' అన్నాడు జగన్నాథం.

'వెర్రోడా!' అంటూ మళ్లీ విరగబడి నవ్వింది ముసలిది.

'ఏం?' అర్థంకాలేదామెనవ్వు జగన్నాథానికి.

'నువ్వుకూడా నమ్మేశావా బాబూ. అదంతా నటన బాబూ, నటన. ఎప్పుడూ ప్రతీవాళ్లదగ్గరా యిలాగే కల్పించి చెప్పుతుంది. వాళు జాలేసి యింకో వంద ఎక్కువిచ్చేవారు. నీకనుభవం తక్కువ. లేతమనిషివి. ఇట్టే నమ్మేశావ్.' అంది ముసలిది అతన్ని కనిపెడుతూ.

జగన్నాథానికి కోపం వచ్చింది; సంశయమూ కలిగింది.

'రమ మోసంచెయ్యదు.' అన్నాడు సందేహంగా.

'తాను దిక్కులేనిదానినని చెప్పిందిగదూ. నువ్వు తను చిన్నప్పుడు ప్రేమించిన బుల్లోడిలా ఉన్నావంది కదూ. తండ్రి ఉరిపోసుకు చచ్చిపోయాడంది కదూ. వెక్కి వెక్కి ఏడ్చింది కదూ.' గబగబా అడిగింది ముసలిది, జగన్నాథం స్తంభించిపోయాడు.

'అంతా నటన బాబూ నటన. ఇలాంటి తప్పుడువేషాలెయ్యొద్దని ఎన్నోసార్లు చెప్పాను. వినదు కదా బాబూ. నా కిలాంటి అబద్ధాలూ వేషాలూ నచ్చవు బాబూ. మనమామూలు మనకి చాలు త

అటువంటి మోసాలు చెయ్యరు. ఎప్పటికీ ప్రమాదం అని చెప్పాను. ఇదిగో ధర్మప్రభువు కాబట్టి నీతో చెప్పాను. ఎక్కడా అనకు బాబూ. మా కూడు పడిపోతుంది' అంది ముసలిది, ఉత్సాహంగా.

జగన్నాథానికి నోట్లో ఏదో అరుచి పుట్టినట్లయింది. వెగటుగా అసహ్యంగా అనిపించింది. కోపంతో అతని కళ్ళు జ్వలించాయి. 'అయితే ఈ రోజు రాత్రి మీరు పిలిచి ఉంచేమన్నందుకు డబ్బివ్వాలి. అంతేనా.' అన్నాడు.

'అంతే బాబూ. ఒకమ్మాయిని బతికేవాళ్ళం. మా కింకేం కావాలి బాబూ. ఇందాకా నా దగ్గరకొచ్చి 'డబ్బుమాట నువ్వడుగు నాకు సిగ్గేస్తుంది' అని మరీ మరీ చెప్పింది. 'అభాగ్యురాలా అయినా కొంత తీసుకో అవ్వా' అని పీక్కుతింది. 'మా రాజు అన్యాయం చెయ్యడు పిల్లా వుత్తి[illegible]ంగానూ నవ్వా' అని కూకలేశాను బాబూ' అంది ముసలిది వినయంగా.

'సరే అయితే' అన్నాడు జగన్నాథం. గబగబా గదిలోకి వెళ్ళాడు. బద్దలవబోతూన్న అగ్నిపర్వతంలాగ వుంది, అతని మనస్సు. మంచంమీద నిశ్చింతగా పడుకున్న రమ [illegible]మైన వస్త్రంలాగా కనపడింది. మెత్తగా పిసికి చంపెయ్యాలన్నంత కోపంతో మంచం దగ్గరికి వెళ్ళాడు. అప్రయత్నంగా అతని చేతుల లోని కండరాలు పురిపెట్టిన తాళ్ళులాగ బిగుసుకుపోయాయి. పళ్ళు బిగించాడు. ఇంతలో మళ్ళీ ఏమనుకున్నాడో తన పెట్టెను పట్టుతీసి మంచంమీదకు విసిరాడు. టార్చిలైటు చేత్తో పట్టుకుని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ముందువాలోకి వచ్చాడు. చీకటి. వర్షం కురుస్తూనేవుంది 'వెళ్ళిపోతున్నావా బాబూ.' అంది ముసలిది. సమాధానం చెప్పకుండా మెట్లు దిగి సందుదాటి వడి వడిగా చీకట్లోకి వెళ్ళిపోయాడు. ముసలిది విజయసూచకంగా వికృతంగా ధ్వని చేసింది.

రమకి మెలకువ వచ్చేటప్పటికి అయిదుగంటలు దాటింది. చీకటి పలచబడుతోంది. నల్లని చీకటి బూడిదరంగుగా మారుతోంది. చావులోంచి భయంలోంచి ఏదో కొత్త లోకంలోకి కాంతిలోకంలోకి వచ్చినట్లనిపించింది రమకి. ఆమె కళ్ళు తెరుస్తూనే చిరునవ్వు నవ్వింది. బయట వానకురుస్తూన్నా, ఆకాశం మేఘావృతమైవున్నా, చలిగాలి నాగుల్లాగ బుసకొడుతున్నా, ఆమెలో ఒకానొక వసంతప్రభాతసూర్యుడు వెచ్చని తెల్లని కిరణాల్ని ప్రసరించాడు.

బద్ధకంగా ఆవులించి పక్కకు చూసింది రమ. అక్కడ జగన్నాథం లేడు. లేచి [illegible] గది అంతా చూసింది.

జగన్నాథం ఎక్కడా కనపడలేదు. కంగారుగా మంచం దిగి ముందువాలోకి వచ్చింది. అవ్వ చీపురుతో తుడుస్తోంది. ఆతృతతో 'ఆయనేరీ అవ్వా!' అని అడిగింది

'వెళ్ళి పోయా—

రమకి గుండె ఆగినంతపని అయింది. 'ఉహుం వెళ్ళడు. నాతో చెప్పకుండా వెళ్ళడు' అని ఉద్రేకంతో అంది. ముసలిది మాట్లాడలేదు.

'ఎక్కడికి వెళ్ళాడు?' అంది రమ.

'ఏమో నాకేం తెలుసు. పెట్టె పట్టుకుపోయాడు.' అంది ముసలిది.

'ఎందుకు వెళ్ళనిచ్చావ్ అవ్వా? నేను లేచేవరకైనా ఉంచలేకపోయావా?' అంది ఏడుపు నాపుకుంటూ రమ.

'ఏవిటే ఆ కంగారు పిల్లా నేనంత తెలివితక్కువదాన్ననుకున్నావా? అదిగో చూసుకో నీ మంచంమీద పర్సు వదిలేసి మరీ వెళ్ళాడు'

'డబ్బా!'

'అవును.'

రమకి అనుమానం కలిగింది తీవ్రంగా 'మన విషయం చెప్పావా?' అంది

'ఢంకా బజాయించి చెప్పాను. నాకేం భయమా సిగ్గా. నాలుగురాళ్ళు రాలేచోట నోరుమూసుకుంచడం నా చేత కాదుపిల్లా.' అంది గర్వంగా ముసలిది.

పెదవులునొక్కిపట్టి 'ఏం చెప్పావు ఆయనతో?' అంది రమ.

'వెర్రిబాగులవాడు. నువ్వు ప్రేమించావనీ నిన్ను పెళ్ళి చేసుకుంటావనీ అన్నాడు. మరి నాకు తెలీకేం కాను పిల్లా. నాకుమాత్రం ఎవరున్నారు పిల్లా నువ్వుతప్ప వాణ్ణి తగులుకుని దర్జాగా పోదామని చూస్తున్నావా? నీ ఆటలు నేను సాగనిస్తానటే పిల్లా. ముసలిదాన్ని దిక్కులేక దాసీ నీకేం? ఇన్నాళ్ళు చేసిందీ మరచిపోయి మాయ చేస్తావా?' అంది ముసలి చేతులు వూపుతూ.

'ఏం చెప్పావ్?' అంది రమ.

'నీదంతా నటన అని చెప్పాను. వచ్చిన ప్రతివాడిదగ్గరా యిలాగే వేషం వేస్తుందన్నాను. అంబదం తాగినట్టయింది అబ్బాయి మొహం.' అంది ముసలిది కళ్ళు కిలికిస్తూ నవ్వుతూ.

రమకి కాళ్ళకింద భూమి బద్దలయిపోతూన్నట్లు అనిపించింది. ఆమెకి దేవుడిమీదా మనిషిమీదా విశ్వాసం ఒక్క పెట్టున తుడిచిపెట్టుకుపోయినట్లుంది. కళ్ళు తిరిగి పడిపోతూన్న ఆమె గోడ నానుకుని నిలబడింది.

ముసలిది అనునయంగా, 'మగవాళ్ళమాటలు నమ్మి చెడిపోకు పిల్లా. అప్పుడు నేను నిన్నాగకపోతే నీగతి కుక్కలకి, నక్కలకీ కూడా పనికిరాదు. ఈ వయస్సులో నాలుగురాళ్ళు కూడబెట్టకపోతే యింకెప్పుడే పిల్లా. పోయిచూసుకో నీ మంచంమీదకి పర్సు గిరవాటేసిపోయాడు. ఎంత సొమ్ముందో చూడు.' అంది.

'ముసలిపీనుగా. దొంగముండా. పిశాచంముండా.' అంటూ రమ వెర్రికోపంతో ముసలిదానిమీద పడి దబాదబా తలమీదా వొంటిమీదా మొత్తేసింది. ముసలిది తప్పించుకుని పారిపోబోయింది. 'నా కొడుకుని నువ్వే చంపావ్. నా బతుకుని నాశనం చేశావ్.' అని వెర్రిగా అరుస్తూ అక్కడున్న ముక్కాలిపీటని ముసలిదానిమీదకి విసిరింది 'అబ్బా' అని ముసలిది నిలువునా కిందకి కూలిపోయింది. ఆమె తలమీదనుండి నెత్తురు ప్రవాహంలా కారుతోంది. బలమైన దెబ్బతో ముసలిది స్పృహతప్పిపడిపోయింది. రమ తిన్నగా గదిలోకి వెళ్ళింది. మంచంమీద పర్సుని తీసి చూసింది. ఒక అరనిండా నోట్లు కుక్కి వున్నాయి. ఒక అరలో జగన్నాథం ఫోటో వుంది. ఆ పర్సు పట్టుకుని వెర్రిదానిలాగ అలాగే నిల్చునిపోయింది ఆమె చేతులు వణుకుతున్నాయి. కనులమ్మట అశ్రువులు ఏకధారగా ప్రవహిస్తున్నాయి మూర్తీభవించిన దైన్యంలాగ నిలబడిన ఆమెకు పరిసరజ్ఞానం నశించింది. ఒక్క సారిగా పరుగెత్తుకుని వీధిలోకి వచ్చింది. చేత్తో పర్సుని గట్టిగా పట్టుకుంది. సందులోదిగి వేగంగా నడిచి రోడ్డుమీదకి వచ్చింది. వర్షం సన్నగా పడుతోంది. ఆమె పరుగు సాగించింది. బురదనీళ్ళు వొళ్ళంతా చిందుతున్నాయి. ఆమె గోతుల్నీ గతుకుల్నీ చూడలేదు. గోతులలో కాలుపడి కిందపడుతోంది మళ్ళీ లేచి, పరుగెత్తుతోంది బట్టలన్నీ బురదతో దట్టంగా అసహ్యంగా తయారయాయి. ఆమెముఖాన కూడా బురద చిమ్మింది. జుట్టు ముడివీడిపోయింది వానకి వొళ్ళంతా తడిసిపోయింది. బట్టలచివరలనుంచి నీళ్ళు కారుతున్నాయి

తూర్పున వెలుతురు వచ్చేస్తోంది. తూర్పున మబ్బులు కొంచెం కొంచెం తెల్లబడుతున్నాయి. ఆమె పరుగువేగం హెచ్చించింది. ఆమె రొప్పుతోంది. ఆయాసపడుతోంది. కనుచూపు మేరలో స్టేషన్ కనపడుతోంది. స్టేషన్‌కి రైలు వచ్చేసింది. ఒళ్ళుబిగబట్టి శక్తినంతా ఉపయోగించి ఒక్కపరుగులో స్టేషన్ చేరింది. జనం గుంపులు గుంపులుగా దిగుతున్నారు. గేటుదగ్గర జనం క్రిక్కిరిసి ఉన్నారు. వాళ్ళని తోసుకుని లోపలికిపోయింది. చెయ్యి అడ్డంగా 'టిక్కెట్' అంటూన్న టికెట్ కలెక్టర్ని కూడా బురదచేతులతో తోసివేసింది. ప్లాట్‌ఫారంమీదకు వచ్చింది. విడిపోయిన జుట్టుతో వొళ్ళంతా మొహమంతా బురదతో [illegible]. వింతగా చూస్తున్నారు జనం. ఆమె ఒక్కొక్క రైలుపెట్టె ఆత్రంగా వెతుకుతోంది. 'బాబుగారూ' అని అరుస్తోంది. పెట్టెలలోని ప్రయాణీకులు అర్థంకాక 'ఏవిటి ఏవిటి' అంటున్నారు. ఆఖరుపెట్టెలో కిటికీకి కొంచెందూరంలో ఉన్న జగన్నాథన్ని చూసింది రమ. రైలు కూత వేసింది. గార్డు విజిలు వేశాడు.

'బాబుగారూ యిదిగో మీ పర్సు' అంటూ పెట్టెలోకి పర్సుని విసిరింది రమ జగన్నాథం రమని పోల్చుకోలేకపోయాడు మొదట. ఇంతలో రైలు కదిలింది. రైలుతోపాటు ఆమెకూడా పరుగెత్తుతూ 'నేను రమని బాబు రమని.. మళ్ళీమీరు.. మీరు...' ఆయాసంతో యింక మాట్లాడలేక పోయింది రమ. చీరమడతలో కాలు చిక్కుకుంది. ఒక్కసారిగా ముందుకు బోర్లాపడింది. జగన్నాథం తొందరగా వెళ్ళిపోయే రైలుకిటికీలోంచి ప్లాటుఫారంమీదకి చూశాడు. నేలను కరచుకుని, బురదతోనిండిన బట్టలతో విడిపోయిన శిరోజాలతో బోర్లపడివున్న దీనమైన స్త్రీ మూర్తివైపు ప్లాటుఫారంమీద మిగిలినజనం కంగారుగా రావటం చూశాడు. అతని మొహం బాధతో నల్లబడింది రైలు అప్పుడే చాలాదూరం వెళ్ళిపోయింది. జగన్నాథం కిందకివంగి పర్సును పైకితీసి చూశాడు. పర్సులో డబ్బంతా ఎలా పెట్టినది అలాగేవుంది. కాని ఫోటోమాత్రం లేదు.

డిగు > దిగ్గు, దిగు; డాగు > దాగు; డగఅ > దగ్గఅ, మొ॥ ఇప్ప టికీ కొండభాషలో డిగ్ (=దిగు), డిచ్ (=దించు); డాజ్ (=దాగు), డాప్ (=దాచు); డగ్గు (=దగ్గర), అనే ఉచ్చారణలు వినిపిస్తాయి. పై నిరూపణ బట్టి తేలిన సారాంశం చారిత్రకంగా కొండ భాష లోని వర్ణ నిర్మాణం నేటి తెలుగుకన్నా ప్రాఙ్నన్నయ శాసన భాషకు చాలా సన్నిహితంగా కనిపిస్తుంది. దీన్ని బట్టి నేటి కూయి కువి, కూబి భాషలు మాండలికాలుగా ఉన్న మూలభాషలో కూబి మాండలికానికీ ప్రాచీనాంధ్రానికీ ఎక్కువ ప్రాంతీయ సన్నిహి తత్వం ఉండి ఉండాలి.

## వ్యాకరణం :

### విశేష్యాలు :

ఈ భాషలోని నామ పదాలను మహత్తులనీ, అమహత్తులనీ విభజించవచ్చు. పురుష వాచక శబ్దాలు మహత్తులు. తదితర శబ్దాలు అమహత్తులు ఏకవచనంలోనూ, బహువచనంలోనూ, ఇదే పద్ధతి. తెలుగులోవలె గాక స్త్రీవాచక శబ్దాలు రెండు వచనాల్లోనూ అమ హత్తుల్లాగానే ప్రవర్తిస్తాయి. ఉదా: వాన్డు వాతిన్ = వాడు వచ్చాడు, వార్ వాతిర = వారు వచ్చారు (పురుషులు మాత్రం), అది వాతద్ = అది వచ్చింది (స్త్రీతిర్యగ్జడాలు); అవి వాతె = అవి వచ్చాయి (స్త్రీ తిర్యగ్జడాలు)

మహద్బహువచన ప్రత్యయాలు 'ర్, రు' వర్ణాలు. అమహ ద్బహువచన ప్రత్యయాలు 'క్/కు, జ్/జు' వర్ణాలు, ఉదా.

### మహత్తులు

| ఏక | | బహు |
|---|---|---|
| అనసి (= అన్న) | : | అనసిర్ (= అన్నలు) |
| కోడో (= పిల్ల) | : | కోడోర (= మొగపిల్లలు)<br>కోడ్లోక్ (= ఆడపిల్లలు) |
| అయెన్<br>ఎవెన్ (= ఎవడు) | : | అయెర<br>ఎయెర్ (= ఎవరు) |

### అమహత్తులు :

| | | |
|---|---|---|
| మరన్ (= చెట్టు) | : | మరక్ (= చెటు) |
| గఅమ్ (= గుర్రం) | : | గుఅమ్కు (= గుర్రాలు) |
| పెని (= పేను) | : | పెన్కు (= పేలు) |
| డుపి (= గుప్పి) | : | డుపిజ్ (= డుప్పులు) |
| ఘ్డేను (= ఎముక) | : | ఘ్డేకు (= ఎముకలు, చూ, ప్రా, తె ప్రేగులు) |

ఈ భాషలో నామవిభక్తులు నాలుగు : షష్ఠి లేక ద్వితీయాది విభక్త్యంగం, ద్వితీయ-చతుర్థి, తృతీయ-పంచమి, సప్తమి. ద్వితీ యాది విభక్త్యంగం ఏకవచనంలో '-తి/-ది', బహువచనంలో 'అ, ఇ' అనే ప్రత్యయాలు చేరటంవల్ల ఏర్పడుతుంది. ఈ రూపం సంబంధార్థ బోధకం (షష్ఠి) కూడా అవుతుంది. ద్వితీయ-చతుర్థి ప్రత్యయం -జ్, తృతీయ-పంచమి ప్రత్యయం -అణ్; సప్తమీ ప్రత్యయం -ఉ. అమహత్తుల్లో ప్రథమావిభక్తి రూపాలే ద్వితీయా విభక్త్యర్థంలో కూడా వైకల్పికంగా రావచ్చు. ఉదా.

### అమహత్తు : మరన్ = చెట్టు

| | ఏక | బహు |
|---|---|---|
| ప్రథమ | మరన్ (= చెట్టు) | మర-క్ (= చెటు) |
| షష్ఠి (ద్వితీయాద్యంగం) | మర-తి (= చెటు యొక్క) | మరక్-అ (= చెట్ల యొక్క) |
| ద్వితీయ-చతుర్థి | మరన్<br>మరన్-దిజ్ (= చెట్టును, చెట్టుకు) | మరక్-అ-జ్ (= చెట్లను, చెట్లకు) |
| తృతీయ-పంచమి | మర-త్-అణ్ (= చెటుచేత చెటునుంచి) | : |
| సప్తమి | మరత్-ఉ (= చెటులో, చెట్టుపై) | : |

### మహత్తు :- కోడో = పిల్లవాడు

| | ఏక. | బహు. |
|---|---|---|
| ప్రథమ | కోడో | కోడో-ర్ |
| షష్ఠి | కోడో-ది- | కోడో-ర్-ఇ- |
| ద్వితీయ-చతుర్థి | కోడో ది-జ్ | కోడోర-ఇ-జ్ |
| తృతీయ-పంచమి | కోడో-ద-అణ్ | : |
| సప్తమి | కోడో ద్-ఉ | : |

ప్రథమ పురుష సర్వనామాల్లో ద్వితీయాది విభక్త్యంగం '-ఇ' ప్రత్యయంవల్ల ఏర్పడుతుంది. ఉదా- వాన్డు వని-, వార : వరి- (తె వాడు వాని, వారు వారి) ప్రశ్నార్థకాలున్న చోట వాటికి గూడా ఇదే పద్ధతి. సేరణలో ఎక్కడా తగ్గలేదు

ప్రత్యయాల్లో ఏకవచనంలోని-ఇ -తి -ది, వర్ణకాలను, బహువచనంలోని-అ,-ఇ వర్ణకాలను, తెలుగులోని ఔపవిభక్తిక- తి,-ట, అ -ఇ, ప్రత్యయాలతో పోల్చవచ్చు (నూతి, ఇంటి, వారల, వారి) తమిళంలో ద్వితీయాద్యంగమైన మర-త్త్-, కన్నడం లోని మర-ద్ -రూపాలుకూడా వీటితో తులనీయాలు

### సర్వనామాలు

ప్రథమావిభక్తిలోను, ప్రథమేతర విభక్తుల్లోను వచ్చే సార్వ నామిక ప్రాతిపదికలు

| | ఏక. | : బహు |
|---|---|---|
| ఉత్తమ పురుష | నాన్ నా-(= నేను నా-) | మాప్ (= మేము) మాట్ మా (= మనము మన-) |
| మధ్యమపురుష | నీన్ నీ-(= నీవు నీ-) | మీర్ మీ-(= మీరు మీ-) |
| ప్రథమపురుష | వాన్డు వని-(= వాడు వాని) | వార్ వరి-(= వారు వారి) |
| | వేన్డు వెని-(= వీడు వీని) | వేర్ వెరి-(= వీరు వీరి-) |
| | అది దని-(= అది దాని-) | అవి వన్క-(= అవి వాని-) |
| | ఇది దెని-(= ఇది దీని-) | ఇవి వెన్క-(= ఇవి వీని-) |

తమిళ మలయాళ కన్నడాల్లో ద్వితీయాది విభక్త్యంగాలు ఉత్తమ పురుషలో ఎన్-/నన్-, ఎమ్-/నమ్-అనీ, మధ్యమ పురు షలో నిన్-, నిమ్-అనీ ఉంటాయి. వీటితో పోలిస్తే కొండభాషలో

| | |
|---|---|
| కొకిర్ (కొడగలి) | చూ. కోయు |
| కొడ్డియ (కోడలు, తమ్ముని భార్య) | కోడలు |
| కొఅొయ్ | కోఅి |
| కొడ్ వలి | కొడవలి |
| కొడ్డె | కోడె (పశువుల్లో) |
| గాలు (కూతుళ్ళ) | చూ. తమిళం. మగళ్ |
| గుడ్డ (కంటిగుడ్డు) | గ్రుడ్డు |
| గొయ్ద | గేదె |
| గొఅొన్ | కొండ (శాసన. కొన్ఱు; చూ. త. కున్ఱమ్) |
| గొఅ్య, గొటె | గొటియు, గొట్టె |
| గొడ్డ (శరీరం) | కోసు |
| డుము (ఎముక) | దుమ్ము |
| డొమ | దోమ |
| తన్ని | తండ్రి |
| తియెల్ | దిగులు |
| తిర | తీవ, తీగ (ప్రా. తివ) |
| తుయ్బ | తుమ్ము |
| తుమ్బెతె | తుమ్మెద |
| తూపి (ఎలుకదూరే బోను) | చూ. తూఉ, తూపు. |




| | |
|---|---|
| నమిల్ | నెమలి, నమలి |
| నాజ్‌సరస్ | నాగు (త్రాచు) పాము |
| నాఉ (ఊరు) | ? నాడు |
| నిటి (నిలువైన) | చూ. నిలుచు, నిలువు |
| నియు (నూనె) | నెయ్యి |
| నిరుణ్డ్ (పోయినయేడు) | నిరుడు |
| పిస్తె | పీడ |
| నెగ్ (మంచి) | నెగ్ (శాసనభాష) |
| నొటెస్ (పులి) | చూ. నోఉ. |
| నొబు (జ్వరం) | నోవు |
| పసిజ్ | పసుపు |
| పాలు (స్తనం) | చూ. పాలు |
| పాడ్ వీణ (పాడుబడ్డ) | పాడు -, ప్రా - |
| పిడ్డియు, ప్డియు (బహు. పిడ్కు) | ప్రువ్వు (పుర్వు, పుగడు) |
| పుత్తో | పుట్ట |
| పుగ్గు | పుటువు |
| పూయు (బహు పూజు) | పువ్వు, పూ. |
| పుటె (నిరుతాగే సాడిప్ప) | చూ. పుట్టె, బుట్ట |
| మరిన్ (కొడుకు) | చూ. మఱంగి |
| మూనెస్ (ముందటి యేడు) | చూ. మొన్న ( <* మొన్ + నాళ్ ) |
| ముట్కి | ముటికి |
| మెన్డొల్ | మీను |
| రెన | రెమ్మ |
| లేబ | లేగ |
| లొక్ఇల్ | లోగిలి |
| వట్వాత | వటె (పండిన) (ప్రా. వట్టె, వట్టియు) |
| వెటి | వెట్టి |
| సిపెర్ కుట | చీపురుకట్ట |
| సిసు | చిచ్చు |
| సీస్తెల్ మరన్ | ఈంత్రమాను |
| సీర | సిర |
| సెటి | జెట్టి |
| సెకి (చెవు) | సెగి |
| సేత్తి | చేట |
| సోసు (తాగినమత్తు) | చూ. సొగయు, చొక్కు |

క్రియలు:

| కొండ | తెలుగు |
|---|---|
| అట్ (కొట్టు) | అడచు |
| అల్ - | అల్లు |
| ఆ - | అగు |
| ఇన్ - | అను, చూ., త. ఎన్ - |
| ఉన్డ | ఇంచ (ము) |
| ఉట్క - | ఉన్వ్య, విసగా |
| ఊర్, ఊర్వ - | ఊరియు, తరియించు |

# చిన్నయసూరి

శ్రీ అద్దేపల్లి నాగగోపాల రావు

శ్రీ నీకౌశల కరుణా శ్రీవిలసిత ధీవిలాస! చిన్నయ సూరీ!
భావించి విన్నా నా మొన గావించెద వందనంబు గద్యవిహారీ!

నన్నయ భారతంబున గనంబడు నీలి పసిండిపల్కులన్
వన్నెతి కెక్కుమార్గమున సత్కృతులన్ సమకూర్చి యొజ్జవై
మన్నన లందికొన్న యసమానవిధూతన శబ్దశాసనా!
చిన్నయసూరి! సూరికుల శేఖర! వ్యాకరణ ప్రభాకరా!

నేటికి నూరువర్షములు నీవు గతించి మహానుభావ! నీ
మేటి తెనుంగు శబ్దముల మేల్మిడిజాడం బట్టి పాత్రముల్
తేట తెలుంగుమాటలను తీరిచిదిద్దిన వార లేరి? నీ
పాటవ మింత రాదు, సులభం బది కాదు ఘటించ వాడకున్.

తప్పులు పట్టవచ్చు, నెగతాళి యొనర్పగవచ్చు గాని నీ,
చెప్పినచొప్పునన్ రసము చిందుచు విందొనరించు శబ్దముల్
చెప్పగలారె వారు? అతినేర్పరి ధీవరు లిట్టివారి, నీ
గొప్పతనం బసూయమెయి గొందఱు సూడరు సూరిశేఖరా!

వ్యాకరణంబు పాఠకులపాలిటి భాగ్యము, నీతిచంద్రికా
లోకము సాహితీజగతిలో విరజిమ్మెడు కౌముదీప్రభల్
ప్రాకటపాండితీవిభవవర్ధకమై భవదీయ శబ్దర
త్నాకర మాంధ్రవాణికి నవాభరణం బగు జూపె చిన్నయా!

నీవు కళాతపస్వివయి నెమ్మి నొనర్చితి వాక్కుచేతిపై
వేవురు నేయనేరని పవిత్రతరంబగు సేవ సాహితీ
శ్రీవరణీయమూర్తి! రససేవధి! ధీనిధి! నీ ఋణంబు దా
శేవధి దీర్చనేర్చెద రహీనసుధీనుత పండితాగ్రణీ!

ప్రాకృత సంస్కృతాంధ్రముల పండితుడై, ద్రవిడాంగ్లభాషలన్
జేకొని కావ్యలక్షణవిశేషము లారసి తర్కశాస్త్రవి
ద్యాకృషి జేసి భూరిమహిమాశయుడై విమలార్థవేదివై
వ్యాకృతి కల్పనంబున శుభం బొనగూర్చితి తెల్గుబాసకున్.

ఈవు వ్రాసినట్టి కృతు లిప్పటికిన్ బడి ముద్రితంబులై
చేతములన్ గరంచినవి, శిష్టమవైన యముద్రితాంధ్ర వి

ఖ్యాత కృతి ప్రమోదశిని గైకొని శబ్దశిఖాలయంబు వి
ద్యోతిము సేయుగా వలయు నుత్తమరీతి మనోహరాకృతిన్.

కష్టము క్లిష్టమైన యది కావ్యకలానిధి! సంస్కృతాది భా
షాష్టక లక్ష్యలక్షణసమగ్రవిమర్శకచక్రవర్తి! నీ
సృష్టి యనన్యసాధ్యము విశిష్ట సుదుష్టము స్పష్టమింక సం
తుష్టులపై ఘటింతుము నతుల్ నుతులున్ గయికొమ్ము నెమ్మమై.

పద్యము వ్రాయవచ్చు సరిపాటి మెయిన్ ఒకపాటివారలున్
హృద్యమునైన గద్య మది యెంతటివారికి దుష్కరంబగున్
చోద్య మదేమియున్న గడుసొంపులు నింపెడు గద్యరీతికిన్
ఆద్యుడ వీ వుపాస్యుగవె యన్నిట మిన్నవు సన్నుతాశయా!

సెలయేటి నీటి జలజల కలకంఠకలస్వనంబు కలికి గీతంబుల్
కిలకిల్లు వచనరచనం బలరారున లాతివారి కాంధ్రమునందున్.

అక్కరమాలినట్టి కృతు లెందరు కూర్తురు, దాని కేమి లే
యక్కర మక్కరంబు నియమావలి కావలె ప్రోవబోక, నీ
వక్కరణింపజాలు ప్రతిభాగరిమం బది యెట్టివారికిన్
జిక్కదు కీర్తి దక్కదని చిత్తము కక్కదు పెక్కు లేటికిన్.

తెలుగు పసందుపిందులును, తేనియ తేటలు, పాలమీగడల్
కులుకుమిటారి వేళ్లాటలు, కోకిలపాటలు, చిల్కపల్కులున్
జిలుగు పసారపుం గ్రొమ్మెఱుగు చిన్నెలు, వన్నెలు, నిండువెన్నెలల్
మలయు జవాజితావియలు మల్లెలు కొల్లలు సూరి కైతలన్.

ఏమని తెల్గులోక మిటు లీర్ష్యకు లోనయి తెల్విగొల్పెడిన్
ఏ మెయి గౌరవింప దిటు లింతకు నీదగు సూత్రపాళియే
నియమముతోడ బాలురకు నేర్పెను పెద్దలు సూడ రిద్దియున్
'స్వామి! భవత్ప్రసాద' మని బాలురు గొల్తురు గాక నిన్నికన్.

నీ వంటివాడు భాషా జనయిత్రికి ప్రీతిసేయ జాలినవాడున్
గనుపింప డెందు జూచిన తెనుగుభువి సంస్కృతాంధ్ర ధీవరులందున్.

జలదశ్యామ మనోజ్ఞగాత్రరుచి భాస్వన్నేత్రయుగ్మంబు, మం
జులగంభీరగళస్వనామృతము, నాజూకైన నీ రూపు రే

కల దర్శింపని భాగ్యహీనులకు ముక్తాశ్రీఫలశ్రేణియై
చెలువొప్పారెడు నీదు వాక్కనెడు సుశ్రీగద్య సూర్యాగ్రణీ!

ప్రతిభావంతులు నిన్నువంటి సుకృతుల్ భాషావికాసార్థమై
శతవర్షంబుల నొక్కరుం డెచటనో జన్మించి సారస్వత
స్థితసంపన్నత మాతృదేశమునకుం జేకూర్చి, భూరిప్రభా
న్వితుడై సంస్తుతి పాత్రుడై చనెడు సందేహంబు లే దిందునన్.

తెలుగుం బాస యొసంగు సంతతమనుస్ దీపించి వ్యాపించి
దిక్కులనెల్లం జరియించి వ్యాకృతియు నీకుం బేరు పేరోలగం
బు విద్వజ్జనసత్కవిప్రతతిలో, భూపాలలోకంబులో
గలిగించుం జుమి నిక్కువంబిది మహాగంభీర వాక్సేవధీ!

శతవర్షీయ మహోత్సవంబు జరుపన్ సాహిత్యసమ్రాట్టులున్
మతిమంతుల్ గుణవంతు లాంధ్రవిషయామాత్యాళి, యొక్కుమ్మడిన్
జతసంబుంబొనరించి, చిన్నయకృతుల్ సద్రీతి ముద్రించి, వా
క్పతి సంప్రీతి భజింత్రుగాత కవితాకళ్యాణి దీపింపగన్.

శతవర్షీయ మహోత్సవ కుతూహల తరంగ మధురకోలాహల సం
తతసంగతి సంభృతమతి నతులిత సంప్రీతి సూరి నభినుతియింతున్.

జననము : ప్రభవ—1806. నిర్యాణము : దుందుభి—1862

కృతులు ముద్రితములు : 1. చింతామణి వృత్తి 1840. 2. పద్యాంధ్రవ్యాకరణము 1840. 3 సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణము 1844. 4 పచ్చయప్ప నృపయశోమండనము 1845. 5. ఆదిపర్వ వచనము 1847. 6. శబ్దలక్షణ సంగ్రహము 1858. 7. నీతిచంద్రిక 1853. 8. నీతి సంగ్రహము 1855 9. బాలవ్యాకరణము 1855. 10 విభక్తి బోధిని 1859.

అముద్రితములు. 1 ఇంగ్లీషు లా చట్టముల భాషాంతరీకరణము. 2. చాటు పద్యములు. 3. రాణిగారి మకుటాభిషేకమునకు రచించిన పద్యములు. 4 సంస్కృత బాలబోధ. 5. అక్షర గుచ్ఛము. 6 అకారాది నిఘంటువు. 7. విశ్వ నిఘంటువు. 8. ఆంధ్ర ధాతువులు. 9 ఆంధ్ర శబ్దశాసనము. 10. బాలవ్యాకరణశేషము. 11. ఆంధ్ర కౌముది. (వచనము) 12. ఆంధ్ర కాదంబరి. (వచనము) 13. యాదవాభ్యుదయము.

# ప్రాచీ ప్రతీచీ కవుల ఆదర్శంలో భేదం

శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మ

జీవితసముద్రం అనేకరకాల అనుభూతిప్రవంతుల మయం. దానిలోని నీరు తియ్యగానూ ఉంటుంది, చేదుగానూ ఉంటుంది. అందులో యేభాగం తియ్యనిది యేభాగం చేదుది అంటే—దానికి ప్రత్యేకత లేదు. ఒకచోటనుండే ఒక్కొక్కప్పుడు మధువీచికలు వస్తాయి. మరి ఒక్కొక్కప్పుడు అక్కడనుండే తిక్తతనూ ఉంటుంది మరొక్కొక్కప్పుడు ఒక్కొక్క అలయీ రెంటితోనూ ఉండి, స్పృశిస్తే తియ్యగానూ ప్రక్కనే చేదుగానూ ఉంటూ ఉండటమూ కద్దు. ఇట్లా జీవితసముద్రం యిది ఫలానా అని విడదీయటానికి వీలులేకుండా మధురతిక్తతల సమ్మిశ్రితమై సర్వదా ఉప్పొంగుతూ ఉంటుంది

ఈ సముద్రం అనుక్షణమూ మనుష్యహృదయంలో ప్రతిబింబిస్తూంది. దాన్నిబట్టి మన మనస్సు నర్తిస్తూంది. తియ్యని అల మనుష్యహృదయంమీద ప్రతిబింబించినప్పుడు, సముద్రమంతా అటువంటిదే ననుకుంటాడు మనుష్యుడు. కాని మరొక్కప్పుడు ఆ హృదయానికి చేదునీటిఅల తగిలిందా వాడు నివ్వెరపోతాడు. తన పూర్వానుభూతిని గూర్చి పదేపదే స్మరిస్తూ, మళ్ళా దానికోసమే నిరీక్షిస్తూ ఉంటాడు. ఎందుకీ నిరీక్షణం? అంటే— సముద్రం అనంతం. తియ్యనిఅల యెప్పుడు యేమూలనుండి వస్తుందో తెలియదు. అసలు వస్తుందో రాదో కూడా తెలియదు. పోనీ పోయి వెతుకుదామా అంటే యెక్కడని? యెంతని? అయినా ఒక్కొక్కడు దీని అనంతత్వాన్ని తెలియక వెతుకుదామని బయలుదేరుతాడు. కాని యెంతకూ యీ మధువు తగలకపోయిందా, వెనుక కలిగిన నివ్వెరపాటుతో పాటు నిర్వేదం కూడా కలిగి కూలబడి పడిపోతాడు. అంతేకాని యీ రుచిభేదం యెందుకల్లనో విచారించడు. విచారించలేడు. ఎందుకని? ఇతడు సాధారణుడు. సామాన్యుడు. కాని, సమన్వయనిపుణుడు యీ రెంటినీ పోల్చి చూచుకొని యేదో ఒకకొత్తను ఒకమహిమను ఒకదివ్యత్వమును తెలిసికొని, మనస్సులో నిర్ధారించుకుని, జీవితసముద్రాన్ని సుకరంగా తరిస్తాడు. అతడికీ మధురతిక్తతలలోని భేదం భేదంగా తెలిసినా, తన గ్రహణతో విచారంతో నిశ్చయంతో ఆచరణతో ఉభయంలోనూ ఏకత్వాన్ని చూస్తాడు. అట్టివానికి యీ సాగరం ఒకసరస్సు. అనంతం, శాంతం. ఇట్లా చూచే నిపుణత ఒక ఉపకరణం. కాగా అతడు ఉభయాతీత దృష్టితో తరించి ఆనందిస్తాడు. ఈ నిపుణత లేనివాడు తనగగ్గోలంచే కలిగిన భావపరంపరనే చూస్తూ ఉంటాడు. అతనికీ సముద్రం అంటే భయం. ఆ భయం తీరేదాకా అతడికి అవలిఒడ్డు లేదు. మధ్యసముద్రంలోనే మునగానాం తేలానాం.

భిన్నభిన్నములైన అనుభూతులను సమన్వయించి తనొకదోవ చూచి, యితరులకా త్రోవచూపి నడిపింపగలవాడే సుకవి. మన ప్రాచ్యకవులిట్టివారే. రామాయణము రచించిన వాల్మీకి రాముడి జీవితంద్వారా లోకానికి యిట్టిదోవనే చూపాడు. రాముని జీవితంలో అనేక చేదునీటి అలలు యెగిరి అతణ్ణి నిలువునిస్తారం ముంచి లేవనెత్తినయి. అనేక విషమపరిస్థితులు యెదుర్కొన్నాయి. అయినప్పటికీ రాముడు ధర్మపరుడే. సత్యవ్రతుడే. ఏకపత్నీవ్రతుడే. అతని నిశ్చయం నిశ్చయమే. దానికి తిరుగులేదు అయితే యిట్టి రాముడికి ప్రతికక్షిగా నిలిచిన రాక్షసకులమూ ప్రబలమైనదే. మొక్కవోని శౌర్యంతో, కించిత్తు కూడా తక్కువకాని రాజభక్తితో ప్రజ్వరిల్లిపోయింది. రావణుడు తన సర్వవిధ బలంతోనూ రాముణ్ణి లెక్కచేయలేదు. సోదరుడు చెప్పినా వినలేదు. కేవలం తన భుజబలం చూచుకుని సీతా సౌందర్యపిపాసువై అధర్మపరాకాష్ఠను అధిగమించాడు. పరదారాపహరణం పాపహేతువనే జ్ఞానం నశించిపోయింది. ఇట్లా వాల్మీకి ధర్మ—అధర్మాలకు పోటీ కల్పించాడు. రెండూ ఉన్నతస్థానాలలోనే ఉండిపోయినయి. ఇప్పుడు ధర్మానికి జయమా? అధర్మానికి జయమా? యేది అనే వేగభావంతో పాఠకుడి హృదయం నిలుకడలేని త్రాసువలె అటూయిటూ ఊగిసలాడుతూనే వుంటుంది. కాని చివరకు ధర్మానికే జయం. భగవద్భక్తి ప్రశాంతిలోని తరళ తరంగాలలో లీనమై శ్రీరాముని పక్షమందలి పుణ్యమయమైనరాజ్యము, అయోధ్యనుండి లంకాపురము వరకు సుప్రతిష్ఠితమైనది. దండకారణ్యమున రాక్షసభయం నశించింది.

భారతంలో కూడా 'యతో ధర్మస్తతో జయః" అని ముక్తకంఠంతో చెప్పి, అట్టి భగవదాశ్రితపక్షమైన పాండవపక్షానికే జయం కల్పించి వేదవ్యాసుడున్నూ ధర్మధ్వజాన్నే ప్రతిష్ఠించాడు. భారతంలో ధర్మపక్షమే, శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించినవారి పక్షమే ప్రబలెను. కౌరవపక్షరూపమైన మానవుల పాపచిత్రం సువిశదంగా విశదీకరింపబడింది. భగవదాశ్రితపక్షం అంతకన్న యెక్కువగా చిత్రించబడ్డది. ఈ పక్షంయొక్క ఉజ్జ్వల ప్రభముందు కౌరవపక్షమందలి పాపధ్వాంతం పటాపంచలైంది. "వెలుగు ముందర చీకటి నిలయగలదే?" కనుకనే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో పాపం భస్మమైంది.

కాగా—రామాయణం మహాభారతం వంటి పౌరాణిక గ్రంథాలు కేవలం ధర్మోపదేశంకొరకే ఉద్దేశింపబడినవైనప్పటికీ, వాటియందు రాజనీతి సాంఘికనీతి ధర్మనీతి లోకనీతి కనబడుతాయి. ఇవి కేవలం మహాకావ్యాలే కాదు. యుగయుగములవాటి సమాదరణీయమైన సామగ్రి వాటిలో ఉన్నది. కనుక వాటిని 'భారతవర్షేతిహాసములు' అనటం మంచిది. మాతాపితలయెడల సంతానమున నుండవలసిన భక్తి, అణకువ— సోదరుల యెడల చూపదగిన ఆత్మత్యాగము—, ప్రజలపట్ల రాజుకు గల కర్తవ్యము, విధి—, సోదరుల విరోధం వల్ల సంభవించే దుష్పరిణా

ము—, రాజ్యేషణ—, పరదారేష—, అసాధారణా ధ్యవసాయము—, ఉచిత మార్గానుసరణము మొదలైనవి యెన్నో సన్నిహితంగా వాటిలో చూపింపబడినయి. ఇట్టి యీ మహోత్తర గ్రంథరాజాల ప్రభావంవల్లనే యుగ యుగాలనాటి భారతదేశపు తపస్య శాంతి ధర్మం మొదలైనవి యిప్పటికీ మన దేశంలో నిలిచివున్నాయి. కవి మార్గదర్శి కనుక గ్రంథంలో అక్కడక్కడ ధర్మోపదేశాలు కనబడుతున్నా, అంత మాత్రంతో యీ పౌరాణికక్షేత్రాన్ని యావత్తూ ధర్మోపదేశ పరంగా మాత్రమే ఊహించరాదు. మానవజీవితంలోని మిట్టపల్లా లలో సుఖదుఃఖాలలో మధురిక్తతల్లో వ్యక్తికి కర్తవ్యతామూఢత్వం కలిగితే, కవి జ్ఞానకనుక ధర్మోపదేశం చేస్తాడు. అంతమాత్రంచేత వీటిని కేవలం ధర్మోపదేశానికి మాత్రమే యేర్పడ్డ పుస్తకాలుగా పుక్కిటి పురాణాలుగా ఊహించరాదు.

ఇక సాహిత్యక్షేత్రం చూతాం. కాళిదాసు భవభూతి శ్రీహర్షుడు మొదలైనవారు దానికి అధిపతులు. వారున్నూ తమ తమ గ్రంథాలలో ధర్మసూక్ష్మాలనే బోధించారు. కాళిదాసు తన నిరుపమ రచనాపాటవంతో కుమారసంభవంలో ధర్మమయమైన చిత్రాన్ని చిత్రించాడు. పార్వతి తపస్సూ హిమవంతుని శివాను రాగమూ అసాధ్య సాధనలే. ఇట్టి మహోత్కృష్టములను అలౌకికము లను సృష్టించి, కాళిదాసు అలౌకిక సృష్టికర్త అయినాడు. శాకుం తలమున ఋష్యాశ్రమంలోని పశుపక్ష్యాదులు సయితము శకుంతల యెడల మహానురాగం చూపించినయి. ఆమెను దుష్యంతునిదగ్గరకు కణ్వుడు పంపునప్పుడు శకుంతల పెంచిన లేడి కూడా వెంటపడ్డది. చెట్లుచేమ తమ తమ వర్ణాలతో దుఃఖభావాన్నే వెల్లడించినయి. మానవుడిలో వుండే త్రిగుణప్రవృత్తికి కాళిదాసు విసుగుచెంది, అథవా రజస్తమోగుణవృత్తిని సహించలేక, భగవంతుని సృష్టికి ప్రతిసృష్టిగా కేవలం సత్యమయమైన ఒకానొక పుణ్యాశ్రమాన్ని సృష్టించుకుని, తానందులో ప్రతిపాత్రఅయి, యథేష్టంగా విహ రిస్తూ యీ లౌకిక ప్రపంచాన్నే విస్మరించాడు. ఇటువంటి సత్య మయ సృష్టులు యే ఒక్క సందర్భంలో అకో కాక, రఘువంశంలో కుమారసంభవంలో శాకుంతలంలో తనివితీరా సృష్టించుకుని తన వాంఛ యిదనని తెలియచేస్తూ—, యీశ్వరుడు సృష్టించిన త్రిగుణ మయ సృష్టిలోని లోపం తెలియజేస్తూ, ఉండవలసిన సత్యమయ జగ త్తును నిర్మించి, 'ఆదర్శవాది' ఐనాడు. ఇల్లా ఇతడొక్కడో కాడు. అందరూ అంతే. అతడు ఆదర్శవాది. వాస్తవవాది. రస వాది. మార్గదర్శి. ఇంకా యేమున్నా ఉంటే అన్నీ. ఇక—భవభూతి తన ఉత్తరరామచరితంలో ధర్మానుతాపం చిత్రించిన విధం అద్వి తీయం. దానిలో ముఖ్యంగా మూడవ అంకంలో శ్రీరాముని భగ్న హృదయం ప్రతిబింబిస్తుంది. ఆ చిత్రమవలోకించేవారికి ప్రాచ్య సాహిత్య పఠనంవల్ల కలిగే ధర్మానురాగం యింతింత కాదు. ఇట్లా మానవ హృదయం కళంక దూషితమైనప్పటికీ ప్రాచ్య సాహిత్య పఠనంవల్ల యెంతటి ధర్మానురాగం కలుగుతుందో అది విడిగా వ్రాయాలంటే మామూలు కలాలకు సాధ్యం కాదు.

పాశ్చాత్యసాహిత్యం పఠించటంవల్ల వచ్చే ఫలం మాత్రం మన సాహిత్యఫలం కంటె కేవలం విజాతీయం, విభిన్నం. సాహిత్య భూషణాలు, సర్వాంగసౌందర్యజనకాలు, గౌరవదాయకాలు, ధర్మనైతిక సుందరాలు అయిన మహాదర్శాలు ప్రాచ్యసాహిత్యం లోవలె పాశ్చాత్య సాహిత్యంలో లభించవు. అందులో మానవసంఘ ముల వ్యక్తుల చిత్రణములు లేకపోలేదు. ఆ వున్నవి ప్రాచ్యసాహిత్య చిత్రములవలె ధర్మగౌరవ పూరితములు కావు. ధర్మం అక్కడక్కడ చిత్రించబడినది గాని వ్యక్తులయొక్క చేష్టల అహంకృతుల అధర్మ ప్రవృత్తుల, అవినీతి సంగతులయందు మాటుమణిగి, బయటకు రాజాలక పోతున్నది. అక్కడవున్న ధర్మం సముద్ర గర్జనములలోని గండు కోయిలకూతవలె వినబడదు. ఒకవేళ వినబడినా దానికి ప్రాధాన్యం లేదు. ఏమంటే, భయంకరగర్జారావాల విరళ ప్రచారానికివలె దీనికి ప్రచారబాహుళ్యం లేదు కనుక. ఇట్లా అక్కడక్కడ ధర్మలేశాల చిత్రణంవున్నా అది ప్రస్ఫుటంకాక ప్రచ్ఛన్నమై ధర్మజ్యోతిని బయట పెట్టజాలకున్నది

"ప్రాచ్యసాహిత్యంలో మెచ్చుకోదగ్గ ప్రకృతిచిత్రణంలేదు. మేము మంచి ప్రకృతి చిత్రకారులం" అనే అహంత అప్రాచ్యుల కున్నది. వాస్తవానికి ప్రకృతి చిత్రణం రెండు సాహిత్యాల్లోనూ ఉంది. కాని వాటిరెంటిలోనూ భేదమున్నది. పాశ్చాత్య సాహిత్యం లో ప్రకృతి నగ్నమూర్తి; ఆర్య సాహిత్యంలో సాలంకృత. ఆంగ్ల సాహిత్యంలో మానవ ప్రకృతిలోని పాశవ - అసుర ప్రవృత్తులకు గౌరవం; ఆర్యసాహిత్యంలో కేవలం దైవీ ప్రవృత్తులకే గౌరవం. అయితే మన సాహిత్యంలో మాత్రం అసుర - పాశవ చిత్రణం లేదా? అంటే - యిక్కడ పాశవప్రవృత్తి మనుష్య విజ్ఞానంలో మునిగి, జయింపబడదై బయటకు కనబడక అడుగున పడిపోయింది. అసురప్రవృత్తి దైవీప్రవృత్తి చిత్రణంముందు నిలువలేకపారిపోయి యెక్కడో తలదాచుకున్నది. మన సాహిత్యంలోవున్న అసుర - పాశవ ప్రవృత్తులు ధర్మ-దైవీ ప్రవృత్తులచేత పరాభూతాలు. కనుక వెన్నెలలో దివ్వెవలె నిస్తేజస్కాలు. ప్రాధాన్యం దైవీప్రవృత్తికే.

ఆంగ సాహిత్యంలో మానవ ప్రకృతిలోని పశు భావాలు, ఇంద్రియలోలత ప్రధాన వర్ణనీయాంశంగా ఉండటంవల్ల దైవ భావాలు దానిలో దాగివున్నాయి. బయటకు రాలేవు. కాగా ఉభయసాహిత్యాలకు రచనోద్దేశాలె వేరు వేరు. ఆంగ్లసాహిత్య విషయంలో షేక్స్పియరును చూతాం.

షేక్స్పియరు మహాకవి. ఇతని రచనలలోని ఒక్కొక్క వ్యక్తి నిజంగా తిరుగాడుతూన్న చైతన్యయుక్తమైన మనిషి; రచనలోని పాత్రగా తోచదు. ఇట్లా సర్వమూ సజీవంగా సృష్టించి లోకానికి మహోపకారం చేసిన మహానుభావుడు షేక్స్పియరు. ఈకవి విషా దాంత నాటక రచనలో అలౌకికమైన ప్రజ్ఞావంతుడు. అందుచేతనే అతని సృష్టికి ప్రత్యేకత వున్నది. ఐనా సంయోగాంతనాటకాలుకూడా కడుసమర్థ తతో వ్రాసిన మహామేధావి. ఏమైనా సంయోగ-వియోగాంత ఉభయ రూపమైన కృతులలో అతని మొగ్గు వియోగాంతాలకే. అవే అతనికి యింతకీర్తిప్రతిష్ఠలు తెచ్చి అతడు పోయినా చిరంజీవిని చేసినయి.

ఒకరి గొప్పతనం తెలుసుకోవాలంటె ఆ జాతిమతసిద్ధాంతాలు పరిశీలిస్తేనే గొప్పతనం బయటపడుతుంది. ఒక జాతిలోని వ్యక్తి దానిని మినహాయించి విడిగా వుండలేదు. క్రైస్తవమతం "మానవు

డిలో పాపాంశం యెక్కువగా ఉన్నది. మంచి చాలా తక్కువ. రజస్తమః ప్రవృత్తు లెక్కువ. కొబట్టి చాలామంది విశుద్ధవర్తనలు కాలేరు. కారు" అని సిద్ధాంతిస్తున్నది. అందుచేత ఆ సమాజంలోని కవిశేఖరుడు స్వమతిసిద్ధాంతానుసారం రజస్తమోగుణప్రధానంగానే రచన సాగిస్తాడు. అట్లాకాక విడిగా స్వసిద్ధాంతా భిన్నంగా ఉండే రచన యథారం కానేరదు. కొబటి ఒక్క షేక్స్పియరేగాక యితర పాశ్చాత్యకవిశేఖరులును తమ తమ రచనలలో రజస్తమోగుణాలకే ప్రాధాన్యం యిచ్చి వాటి వికాసాన్ని ప్రదర్శించారు. వాటినిబట్టి మొత్తంమీద ఐరోపీయ జనసంఘంలోనూ, దాని చరిత్రలోనూ విశిష్టదోషా లెట్లా వుంటాయో వాటికి అనుగుణంగానే షేక్స్పియరు రచనా సాగింది. కాగా వాటన్నిటికీ యీ రచన ప్రకృతి అన్నమాట. స్వమతిసిద్ధాంతం ప్రకారం మానవు డెంత పాపియో అతని సృష్టిలోని ప్రాతి కూడా అంత పాపే. అతని మత ప్రకారం రజస్తమోగుణసముజ్జ్వల ప్రభను ప్రజ్వలింపజేసి సర్వస్పష్టంగా వాటి ఘోరభయానక దృశ్యాలను చూపించాడు; నరక యాతనలను సృష్టించాడు; అవి నిర్భరములని నిరూపించాడు.

## తారతమ్యం:

ఇట్లా ఒకరు నరకాన్ని సృష్టించి దానిలోని యాతన లన్నింటినీ నిరూపిస్తే, యింకొకరు స్వర్గాన్ని సృష్టించి దాని సుఖసౌందర్యాలను వర్ణించి, దాన్ని పొందాలనే భావనలకు జనాన్ని త్రిప్పటానికి చూచారు. ఇద్దరూ తమ తమ నిశ్చయకౌశలంతో రచనలు సాగించారు. కాని ఒక్కమాట. ఆంగ్లరచనే చాలాకాలం క్రిందట సాగింది. దానికి కొన్నివేల సంవత్సరాలకు పూర్వమే ఆర్య సాహిత్యం ఉదయభాను డల్లే బయలుదేరి ప్రపంచాని కంతకూ భిక్ష పెట్టింది. అప్పటికే ఆర్యకవులు వాక్కు - దాని ప్రాధాన్యము, దాని పుట్టుక, దాని సార్థక్యమూ మొదలైన శాస్త్రవిషయాలు ఆమూలాగ్రం తమ ఘనతపస్సుతో శోధించి, సరస్వతీదేవి సమగ్ర మూర్తిని, ఆమె అధనుశోభను తనివితీరా చూచారు; ఒళ్ళంతా కన్నుచేసుకుని చూచారు. చూడటమే కాదు. ఆ మధువును తృప్తిగా ఆస్వాదించారు. జీర్ణం చేసుకున్నారు. కాని నేటికి కూడా పాశ్చాత్యవిద్వాంసులు వాగ్దేవి చీరకొంగు కూడా చూడలేకపోయినారు. మనవారు రేనాడో చూచి ఊరుకోలేదు. ఇప్పటికి యింకా ఆమెను దర్శిస్తూనే ఉన్నారు. ఆ దేవితో తమ ఉదంతం చెప్పుకున్నారు. చివరకు ఆ దేవి 'వీళ్ళే మనకు శరణ్యం' అని నమ్మింది ఒకప్పుడు తనను అమ్ముతారేమోనని భయపడ్డది. అల్లాగే సామాన్యకవులు ధనలోభంతో కుక్షింభరులై కొంతకాలను అనేక రిస్తే పాపం ఆ దేవి వచ్చి మన పోతన్నగారితో మొరపెట్టుకున్నది. ఆయన 'కాటుక కంటినీరు...నమ్మ భారతీ!' అని అభయం యిచ్చాడు. మరొక ప్రౌఢకవి యీ దేవిని పవిత్రవాణిని యింకో కళ్ళు తెరకుండా పిచ్చిపిచ్చిగా మాట్లాడకుండా చివరకు మనసా కూడా స్మరించకుండా చేయటానికా అన్నట్లు "వాణి నారాణి" అన్నాడు. అత డర్ధనారీశ్వరుడైనాడు. ప్రకృతిపురుషులు కలసి కున్నారు. అంతే. జగదుత్పత్తి ప్రారంభం

పాశ్చాత్య కవిలోకంలో యిటువంటిదేమీ కనబడదు. ఎంత కాలకు 'మానవుడు—అతని రజస్తమోమయ ప్రకృతి—దాని విలయ

తాండవం—దానివల్ల వచ్చే గుహ్యలీలలు' యివే కనబడేది. కాగా మన ఆర్యసాహిత్యంలోని సత్వసంపద క్షమ జిజ్ఞాస దయ దాక్షిణ్యం ధర్మప్రవృత్తి యివేవీ అనార్యసాహిత్యంలో కనబడవు

మొత్తంమీద షేక్స్పియరు సామగ్రి అతని సృష్టికి అనుకూలంగా ఉన్నది. అతని వియోగాంత నాటకాలు అతని రచనా ధ్వజాలు. వాటిలో అతను యాతనలు సృష్టించాడు. నరకాలను పోతపోశాడు. వాటి రెంటిలోని దుఃఖాగ్నులను కళ్ళకుకట్టేటట్టుగా చేశాడు. కాగా ఆసురసృష్టికి ఆ నాటకాలు ఉపకరించేటంతగా దైవసృష్టికి కావు. సామాన్యంగా లోకంలో మామూలు పామరజనంలో వుండే పశుప్రవృత్తుల ప్రబలరూపం యీ నాటకాల్లో కనబడుతుంది. వాటి అంత్యపరిణామం రక్తపాతం. ఒథెలో నాటకంలో యిల్లాగే జరిగింది రక్తపాతం అన్నాను కనుక ఉదాహరణకు ఒథెల్లోనుంచే యెత్తి చూపుతాను. ఏమీ యెరుగని అమాయకురాలు డెస్డెమోనాను వ్యభిచరించిందని అనుమానించి ఒథెల్లో చంపటానికి వస్తే,

"Des —O! banish me my Lord! but kill me not.

Othe —Down, Strumpet.

Des —Kill me tomorrow. Let me live to-night.

Othe:—Nay, if you strive.

Des.—But, half an hour.

Othe:—Being done, there is no pause.

Des —But while I say one prayer.

Othe.—It is too late"

అని నులిమి చంపుతాడు. ఇల్లా వాళ్ళిద్దరికీ సంభాషణ జరిగి తుదకు పశుబలం జయించింది. మొదట ఒథెల్లోలో పశుప్రవృత్తి ప్రబలంగా చెలరేగి చివరకు రక్తపాతం చేయించి తీరింది. అయితే యీ రక్తపాతానికి యింకా అనేక కారణా లుండవచ్చు. లోభమో ద్వేషమో స్త్రీ యెడల సందేహజనిత క్రోధమో యింకా ధనాశయో యిట్లాగే యింకేవన్నానో. అందులో యిక్కడ స్త్రీ యెడల సందేహం. ఇది బజారు మనుష్యుల్లో సాధారణంగా జరుగుతుండే ఒకానొక సామాన్యమైన లౌకికావస్థ. ఇట్టి అవస్థను చూచే కవి విషాదాంతనాటకాలూ-, ఒథెల్లో - మేక్ బెత్ - ఇయాగో-రోమియో మొదలైన అమానుష పాత్రలూ సృజించాడు. వీటిలో అనగా యీపాత్రలలో వున్న విశేషమేమంటే, వంచకత, హంతకత, ఆతతాయిత, విటవల్ల కలిగే యమనరకం, దుఃఖాగ్ని కాగా - యీరచనలలో సృష్టించింది మామూలు మానవులనే అయినా, వారికి అంతర్నిహిత ప్రాబల్యం మామూలు జనులకంటే వేరైకెక్కువై, మనష్యత్వ సీమ దాటి ఆసురలోకంలో ప్రవేశించినాయి. వారి ప్రకృతికి హద్దులేదు. లోభము మొదలైనవి సామాన్యజనుల్లో కొంచెం యెక్కువే అయినా, అక్కడ నాటికి కొంతవరకైనా హద్దుంటుంది. ఇక్కడది లేదు. పాశవభావం మొలకెత్తి పెరిగి, పెద్దదై, నానా చిందరవందర జరిగి, రాక్షసకృత్యమైన స్త్రీవధకు ఒకానొక మహాయోధుడు పాల్పడాడంటే యిక నా పాత్రనుగూర్చి విచారించటం సమయం పాడుచేసుకోవటమే.

ఇటువంటి స్త్రీవధే కాదు గాని, స్త్రీ మానభంగ ప్రయత్నమే భారతంలోనూ జరిగింది. రథులు, అతిరథులు, మహారథులు, యోధులు, మహాయోధులు మొదలైన భారతప్రభతో నిండిఉన్న నిండుసభలో తమ్ముడు అన్న ఆజ్ఞతో ద్రౌపదికి మానభంగం చేయటానికి పూనుకున్నాడు. సభలో ఒక్కరూ 'యిది తప్పు' అని అనరు. అనలేరు. అనలేరు. అయినా ద్రౌపది త్రికరణశుద్ధిగా శ్రీకృష్ణభగవానుని ప్రార్థించగా ఆయన వస్త్రదానం చేసి భారత వనితా మానసంరక్షకుడైనాడు. అధర్మం తలయెత్తింది. కాని దాన్ని ధర్మం జయించింది. ధర్మప్రతాపం ముందు అధర్మం దూదివలె మాడిపోయింది. ఆర్యులకు అనార్యులకు యింత తేడా ఉన్నది.

ఇక మేక్ బెత్ రాణిని ఒక జర్మను విమర్శకుడు (శెగెల్) 'రంకులాడి' అన్నాడు. దానిలో ఉన్న కృతఘ్నత సాహసము నిర్దయ యిత్యాదివి రాక్షసులకు చెలును గాని మానవులకు కావు. చూడండి. "అవసరమైతే నేను పాలిచ్చి పెంచిన పసిపాపశిరమైనా ముక్కలు ముక్కలుగా చెక్కగలను' అని ఒకచోట మేక్ బెత్ అన్నది.

అయితే, మనకూ భాగవతంలో పూతన ఉన్నది. వీరిద్దరిలో కృతఘ్నత నిర్దయ ధర్మద్రోహమూ సమానాలే. ఇయాగో సామాన్యకారణ ప్రేరితుడై తనకు అన్నదాత, ప్రభువు అయిన ఒథెల్లో చేత స్త్రీవధచేయించి, మానుష సీమనుండి భ్రష్టుడై రాక్షస సీమల్లో కాపురమున్నంతపని చేశాడు. ఇటువంటివే మిగిలిన పాత్రలూనూ.

అయితే, మన భారతంలోనూ గదమునరించి ఆసురప్రకృతి దుర్యోధనరూపంగా తాండవించింది. తన ఆవేశంతో మహాత్ములయిన ద్రోణకృపులను కూడా సూదంటురాయి యినుమునల్లే ఆకర్షించి, వారి నీతిని ప్రతాపాన్ని యుద్ధంలో నాశనం చేసింది. తల్లిగాని తండ్రిగాని భీష్ముడుగాని హితం బోధిస్తే దాన్ని పెడచెవిని పెట్టేది. తనకు తోచినంత చేసి పోతున్నది. దానితో దేవద్రోహం గురుద్రోహం జనద్రోహం జరిగింది ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలోనే మహాభీషణ సంగ్రామం సంకల్పించి, భూమండలాన్ని యావత్తూ గజగజలాడించింది. అయితే చివరకు వంశనాశనమైంది. మళ్లా ధర్మభానుడు ఉదయించేసరికి అధర్మాంధకారం యెక్కడెక్కడికో పారిపోయి, తలదాచుకునేందుకుకూడా చోటు లేక సర్వాత్మనా నశించింది. ఇటువంటి దీనికి ప్రతిగా ఆంగ్లసాహిత్యంలో "పారడైజ్ లాస్ట్" ఉన్నది. ఈ రెంటిలోని విషయాలను తౌల్యమూ ఉన్నది.

# అడ్డదారి

### శ్రీ "కండిల"

జనతా ఎక్స్‌ప్రెస్ పిఠాపురం స్టేషన్ వదిలిపెట్టేసరికి తెలతెల్లవారుజాము అయిదుగంటలయ్యింది. తెల్లగా వెలుగు రావడానికి ఇంకా ఒకగంట పడుతుంది. రైలునుండి అందరికంటె ఆలస్యంగా దిగినవారు అవతారంగారే. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ పిఠాపురం చేరువన కుమారపురంవైపు సాగుతున్నారు. కుమారపురానికి రోడ్డువెంబడి వెళ్ళాలంటే రెండుమైళ్ళు నడవాలి. అడ్డ త్రోవవుందికూడా; అవతారంగారికి ఆ దారి సుపరిచితమైనదే. రెండుతోపులు దాటి మళ్ళగట్లు పట్టుకొంటే అరగంటసేపటికి ఇల్లు చేరుకుంటారు. ఆ తోపులలోను ఒకటి తెల్లవారిజామితోట. రెండవదానిలో పసుపాళింలో ఏపుగా పెంచబడ్డ మావుళ్ళు, నారింజలు, పనసలు ఉంటాయి మావుళ్ళు పూతమీద వున్నాయి పనసలు పరువులాయి—ఎటొచ్చీ నారింజలే పుష్కలంగా ఫలించి ఆ శీతగాలికి చక్కని ఫలాల్ని అక్కడక్కడ రాల్చి భూదేవి ఉపరితలానికి శోభ కూర్చుతున్నాయి

అవతారంగారు తోటలో అడుగుపెట్టేసరికి ఇంకా చీకటివుంది. ఆ చీకటిలో క్రిందబడిన నారింజపండ్లు స్పష్టంగా కనబడుతున్నాయి. తోటను గిందరబందర చేస్తూ కొన్ని కోతులు అటూ ఇటూ చెట్టుమీదికి గమకిస్తూ కిచకిచలాడుతున్నాయి. ఎన్నడూ లేనిది అవతారంగారు అక్కడ కొంచెం దురాశకు అతిగా లొంగిపోయారు. ఒకటి రెండుపండ్లు తీసుకొని చేతిసంచిలో వేసుకొందామనిపించింది. చుట్టూ కలయజూచి వ్యక్తి లేదు గదా అని తనకుతానే గుణించుకొని రెండుపళ్ళు పైకితీశారు. చిక్కని రంగుతో చిత్తచిత్తలాడుతూ ఆ నారింజలు ఆయన్ని ముగ్ధపరుస్తూ లోలోపల ఆశను కొంకొంలోతుగా నేరగిల్పాయి. అనేకలాగు ననిపించి ఒక పండును ఒలవడం ప్రారంభించారు. గోటిని చొనిపి చొనపగానే మెత్తగా దాని తోలు విడిపోతోంది ఇంతలోనే కొంతమంది మనుష్యులు వచ్చేఅలికిడయ్యింది అప్పటివరకు ఆ ధ్యాసలో లేని అవతారంగారు తలఎత్తి అటు చూశారు. ఇద్దరు వ్యక్తులు ఆయనవైపే తీక్షణంగా ఆయన్ను ఒక దొంగను చూస్తున్నట్లు పరికిస్తూ రావడం పసిగట్టారు. తక్షణం ఆయన గుండె ఝల్లుమంది. ఏమీ ఎరగనివానివలె ఆ రెండు నారింజపండ్లు క్రిందికి జారవిడిచారు.

"ఆగలాగ! ఎవరు నువ్వు? తెల్లవారిందా దొంగతనానికి?" అంటూ అవతారంగార్ని ఎదుర్కొన్న ఇద్దరిలో ఒకాయన ఉరిమిపట్లు గర్జించాడు. ఆయన ప్రక్కనేవున్న వేరొకడు — బహుశా ఆయన తాబేదారు కావచ్చు—తోటింగా ఆయనకు మదుపు ఇచ్చాడు. అవతారంగారు అదొకవిధమైన తత్తరపాటులో చిత్తయుక్తి ప్రయోగించారు. కాని ఆ పాచిక పారుతుందా పారదా అని నిశితంగా ఆయన దొడ్డ నాపటిను ముందుకు వెళ్ళలేకపోయింది.

"అరెరెరెటండీ అలాగంటున్నారు? నేనేమీ దొంగతనం చేయలేదు — మా వూరికి ఈ తోపుమీదుగానైతే గెండుపుంజీల అడుగులు కలిసివస్తాయని ఈ దారిన వస్తున్నాను" అంటున్న అవతారంగారిని ఎగాదిగా చూశాడు యజమాని. ఇంతలోనే ఆయన ఉద్ధారుడు—తుణం క్రితమే—విరగబూచిన అంటుమామిడిగున్న క్రింద అవతారంగారిచే చల్లగా జారవిడవబడ్డ రెండు నారింజల్నీ ముందుకు పట్టుకొచ్చి "అబద్ధా లెందుకు బాబూ? తమరిప్పుడేకాదూ ఈటిన్ని చల్లగా ఒగేసవారు? చూడండి—ఒదానికి తొక్కకూడా దీసినారు—కొంత బొంచేద్దామని గాబోలు" అన్నాడు పళ్ళు ఇకిలిస్తూ.

"ఏమో, అది నాకు తెలియదు. నేనేమీ యెరగను" వ్యర్థంగానే దిరాయించారు అవతారంగారు.

"పురాగా దొరికికూడా బుకాయిస్తావేమయ్యా. పెద్దమనిషివి. ఎక్కడేనా జీతపెండు తోడిగిన మామిళ్ళు నారింజల్నీ రాల్చుతారా? అందులోనూ పళ్ళనుఒలిచిపడేస్తారేమిటి?" తనప్రజ్ఞను పిని పెట్టాడు ఆసామీ.

మాకు అవతారంగారు మళ్ళీ క్రిందపడికూడా పైచేయి నాదే అనే పద్ధతికలవారై ఇంకా మొరాయించి "అయితే తోట మీదిగదా అని మీమాట చెల్లుతున్నమాట. ఆవరసన కోతులు అంతా హంగామా చేస్తున్నాయి. తెల్లవారుజామున రెండుపళ్ళు కోసుకొచ్చి పడవెయ్యడం ఇక్కడ వాటికి ఎమైనా ఘనకార్యమా?" అన్నారు.

"ఔనౌను. మనుష్యులుకూడా కోతులే. కోతులు క్రమక్రమంగా మనుష్యులయ్యారంటూ మనుష్యులు క్రమక్రమంగా కోతులౌతున్నారు ఎందుకండీ అంత సతర్కం? మీ కుడిచేయి ఇటు చూపండి. మీ గుట్టు నదే బట్టబయలు చేస్తుంది." అంటూ ఆసామీ, అవతారంగారిచేతిని చివాలున లాక్కొని తన ముక్కుదగ్గర పెట్టుకొన్నాడు. గుమ్మని నారింజకాయ వాసన ఆయన ముక్కుపుటాలకి సోకింది. అవతారంగారి బొటనవేలిమీద చమురు చారికలు ఇంకా ఆరనేలేదు. ఆయన మొగం వెలవెలబోయింది. కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు నుదుటిపై. నోటిమాట పెకలడం లేదు. మౌనంగా తల వాల్చేశారు.

"లేచినవేళ మంచిదిగాదు బాబూ. పాసిక పారవేస్తే. పెద్ద పెద్ద మారాజులే సిన్నకి సితక్కి కక్కుర్తి పడతవుంటే మానాటోళ్ళ కొచ్చిందా? ఇయన్నీ యెరక్క మా యజమాని మనుష్యుల్ని దుమ్ము గులుపుతూంటాడు." హేళనగా మళ్ళీ ఇకిలిస్తూ వెక్కిరించాడు అవతారంగారి అవస్థను తాబేదారు.

"చాలు పదండి ఈపాటికి. జాగ్రత్తగా మనుషులకుని ఇల్లు చేరుకోండి." అని ఆ యజమాని, ఉదారుడు తోటలో ఉను మకాం

పైపు మళ్ళిపోయారు. అవతారం గారికి తను ఎగుట నంతా శూన్యముగా వున్నట్లు, కళ్ళు చీకట్లు గమ్మినట్లు ఏమీతోచక బరువుగా అడుగులు ముందుకుపడ్డాయి.

## 2

తెల్లగా తెల్లవారింది. సూర్యోదయానికి ఇంకా ఒక అర్ధగంటకు పైగా వ్యవధి వుంటుంది. అవతారంగారు ఇంకా ఆవారింజలో టను పూర్తిగా అధిగమించి బయటపడలేదు. అతోపు ఆయన్ను బయటకు పోనివ్వకపోయినా అదిగా ఎంత వేగిర పెడుతున్నా ఆకర్షణనుంచి తప్పించుకోలేక పోతున్నాడు. పదిబారల దూరంలో తోటకు కంచె కన్పడ కనబడుతోంది. అది దాటితే మళ్ళీ ఒట్టు తిరుగుతుంది. ఇంక అక్కడకు అంది పుచ్చుకున్నట్లు వుంటుంది కుమారపురం. అయితే ఈ కాసేపటిలోను అవతారంగారికి గొడవ మళ్ళీ ఎక్కువైపోట్లుంది. చెట్లక్రింద రాలిపడిన నారింజపండ్లు చితచితలాడుతూ కొట్టవస్తున్నాయి నిజంగా ఒక్క పండునయినా అంగుకోకుండా వుండటం మనిషిశరీరం గాదు. కాని అవతారంగారు మళ్ళీ ఆ పళ్ళను ముట్టుకోతలపిన మాట కాగు.

అయితే అవతారంగారు మనిషి. రక్తమాంసాలు గల మనిషి ఆశాపాశం చేత బాధింపబడ్డ మనిషి అవలు కోరిక తీరే అంత. అది తీరేవరకు నిద్రపోదు. మనసు నిద్ర పోనివ్వదు. ఆత్మలితంగా ఎట్టి శిక్షయినా తలపడడానికే మానవ ప్రవృత్తి పూనుకొంటుంది గాని ఇది మోహపాశమని గాని, భ్రాంతి అని గాని వదలిపెట్టదు గదా!

కొలనిలో తామరతూడుకై ఎగబడే ఏనుగు మొసలి ఉంటుందని తెలిసీ కూడా దాన్ని లక్ష్యపెట్టదు.

ఇక్కడ ఇంకొక వైపరీత్యం సంభవించింది. కోరికకు గుడ్డిదైన ప్రతికారంగూడా జతపడింది. అది కేవలం అనవసరం; కాగా మూర్ఖత్వం అవతారంగారనుకొంటున్నారు "ఈ నాలుగుబారల్లోను ఇంతలోకే ఎవడు వచ్చి చస్తాడు? కాకపోయినా మనిషంత మనిషిని పట్టుకొని, వెనకది, రెండుపండ్లు తీసుకొంటేమాత్రం - దానికింత యాగీనా? ఇప్పుడు ఎవడొస్తాడో చూస్తాగా? సంచినిండా ఎత్తుకొని కంచె దాటేస్తాను. వాళ్లు ఒక వేళ ఆ మూలనుంచి చూచినా ఇక్కడకు వచ్చేసరికి నేను ఊరి తలవాకిట్లో వుంటాను. అప్పుడు ఇంతమ పళ్ళని ఎలా గుర్తుపు చేస్తారు? పొరుగూరివాడు ఇక్కడకొచ్చి తోటకొన్నాడు గదా అనీ ఇంత పొగరా?"

మనస్సు ఒక నిశ్చయానికి వచ్చేసరికి పనిని చెయ్యడానికి శరీరం దానంతట అదే ఉరకలు వేస్తుంది. మరి కాసేపటికి అవతారం గారు వంగి చెట్లక్రింద రాలిన చెంబెడేసి నారింజపండ్లు అరచేతను కుపైగా సంచిలో వేసుకొన్నారు. అక్కడితో ఆగాలా? చేతుల లోనే వున్న ఇంకొక చెట్టుక్రింది పళ్ళు ఆయన్ను మరీ బలంగా లాక్కున్నాయి. అవతారంగారు ఇప్పుడు జాగ్రత్తపడినా లాభం లేదు కాని ఇది మన భ్రమ. లేకపోతే చోపకందూరం శరవేగంతో కోరికవల్ల ఈడ్వబడ్డ మనం అది త్రోసివేసి సుడిగుండంలోంచి బయటపడగలమా? మహామహులు సుడతలో పడిపోయారు. మనమూ అవతారంగారూ ఒక లెఖ్ఖా? అంతే. ఆయన రెండవ చెట్టుక్రింది

శారీరకపంతు వైభవంగా లేదో అది భూమికి లేచిరాని పం
దుగా ఆయన చెయ్యి దానికి అతుక్కుపోయినట్లు, జబ్బ లాక్కుని
కూడు సవరించుకొని వంగినమనిషి లేచి నిలబడి తమాయించుకోడా
నికి కూడా ఎంతమాత్రమూ ఆస్కారంలేని చిక్కులో ఇరుక్కు
పోయారు. బలిష్ఠమైన ఒక మూర్ఖ హస్తం, ఉక్కు చెయ్యి అవ
తారం గారి భుజాన్ని వొడిసి పట్టుకొని భూమిమీదకు అదిమి వేస్తు
న్నట్టుంది. తలయెత్తి చూశారు. గంటసేపైనా దాటనిక్రితం ఆయన
చూచిన తోటయజమానిగారి ఉద్దారుని వశంగా అవతారంగారు
బందీకృతులై వున్నారు. ఆ కింకరుని బలపరాక్రమాలు అవతారం
గారివాటికంటె ఎన్నో రెట్లు హెచ్చు. ఆయన వాడినుంచి
తప్పించుకు పోదామని ఆలోచించవసమంత మూర్ఖత్వం మరొకటి
వుండదు ఎంచేతనంటే ఆ ప్రయత్నం వృథా. ఒక వేళ ప్రయత్నిద్దా
మనుకొన్నా ఆ ప్రక్రియ తప్పులిన్ని మరింత దగ్గరగా బిగించి రాను
రాను అవస్థను విపరీతంగా ప్రమాదభరితం చేస్తుంది.

ఉద్దారుడు పెద్దపెట్టున అంగలేసుకుంటూ అవతారంగారిని
లాక్కుపోతున్నాడు. తోటమధ్యనున్న తాటియాకుపాక మధ్యలో ఎత్తయిన
మట్టి దిబ్బమీద సింహాసనారూఢుడైన వ్యాఘ్రాధిపునిలాగ తమా
యించి కూర్చున్న యజమాని ముందు హాజరుపెట్టాడు. అవతారం
గారు కొద్దిసేపటి క్రితమే కేవలం గౌరవ పురస్కృతిమైన హెచ్చరి
కతో తనను విడిచిపుచ్చిన యజమానినిచూచి వణుకుతూ తలవంచు
కొని నిల్చున్నారు. ఆయన ఇప్పుడు నేరస్థుడు; కాదు ఒక
ఘరానాదొంగ; పేరుమోసిన పెద్దమనిషి.

“ఏమండీ మీకు మాటలతో పెట్టిన గడ్డి చాలలేదన్నమాట!
లేకపోతే ఇక్కడున్న వాళ్ళంత గుడ్డివెధవలు, ఆగనరనివు చే
తికి దొరికితే పట్టుకుపోదామనా! మీ ధైర్యానికి మాకు ఆశ్చర్యం
కలుగుతోంది. తోటకాపుకొక్కన్నావున్న పాలగూరి ఆసాములు
గదా అని మీ ధీమా కాబోలు! న్యాయము కేది మీకు మాకు ఒకటే.
తప్పు అంతే. ఇప్పుడు నిన్నిక్కడ చెట్టుకు రెక్కలు విరచికట్టి
తొక్కలొలిచేస్తే ఎవడొస్తాడో కాపాడానికి! ఇప్పుడైనా నేరం
చేశానని ఒప్పుకుంటావా? లేక కాయలు దొంగిలించడం పుంచుకొని
కూడా బుకాయిస్తావా? ఏమో- ఈ పంచి వాడిగాదు. నేను కల
గంటున్నాను. అంటావా?” అని ఉరుముతూ ఉద్దారునికి సంజ
చేశాడు ఆ పంచిలో మున్నవన్నీ బలిపెట్టుమని. వాడు క్షణంలో
పంచి ఖాళీచేశాడు. అక్కడ ప్రోగుపడ్డ వాటిలో ఎనిమిదినారింజ
పండ్లు, రెండు చొక్కాలు. రెండుపంచెలు. ఒక ‘లాల్ - ఇమ్లీ’
కంపెనీవారి పచ్చశాలువా, ఒకపూలు స్వెటరు, రెండుమూడు కొత్త
తెల్ల పంచెలు ఉన్నాయి. అవతారంగారి నేరం నిప్పులా బయట
పడిపోయింది. లేకపోతే ఆ ఉద్రేకంలో యజమాని ఆజ్ఞకు బద్ధుడై
ఉద్దారుడు ఆయన వెన్నువ రేవు పెట్టి వుండేవాడు. “పిడికెడు తిగిన
వాడి చెయ్యాలి అప్పుడుగాని లోకం నవ్వగా ఊరుకోదు.” అని అవ
తారంగారి శాలువాను, స్వెటరును తీసుకొన్నాడు ఆయన
ఎదుటనే ఉద్దారుడు. యజమాని వాటిని పంచుకొన్నారు. కను
కింతగుర్తించలేనన్న ఉదారుని భుజమీదనుంచి ‘అగ్నిదేవలోహి’
శాలువా ‘లాల్—ఇమ్లీ’ కంపెనీవారిది ఆకుపచ్చరిది—తన యజ
మానిని చూచి జాలిపడి విలపిస్తున్నట్టుంది. లేక అది ఆత్మీయనంపద
తనకు ప్రాప్తించిన బానిసత్వానికే గర్హించిందేమో!

అవతారంగారు తోపు కంచె దాటేసరికి సూర్యోదయ
మయ్యింది. వంచితులయ్యారనుండా ఆ బాల భానుని ముఖారవిందం
చూడలేక సిగ్గుపడుతున్నట్టు, అప్పటివరకు తనకేమీ జరుగనట్లే స్థిర
చిత్తంతో గ్రామంలో ప్రవేశించి తనయిలుముఖం చూడడానికి
విశ్వప్రయత్నం చేస్తున్నట్లు అవతారంగారు కుమారపురం
ప్రవేశించారు.

## 3

ఈ దుర్ఘటన జరిగిన తర్వాత నాలుగుసంవత్సరాలు కాల
వాహినిలో కలిసిపోయాయి. కాలం తనతో బాటు ప్రపంచంలో
ఎన్నోమార్పులు తీసుకువచ్చింది. కొందరు గొప్పవారు కొద్దివా
రయ్యారు. మరికొందరు చిన్నవాళ్ళు లేమినుంచి కలిమికి ఆశ్చర్యం
కలిగించేటట్లుగా పెరిగారు. కుమారపురంలో అందరికంటె అవ
తారంగారి గురించే ఇప్పుడు మహాఘనంగా చెప్పుకుంటున్నారు.
“ఏళ్ళు మారినపుడు జ్యోతిలాగు వెలుగుతుంది. ‘కలిసవచ్చే కాలానికి
నడిచివచ్చేబిడ్డ పుడతాడు’—లేకపోతే దేశంమీద ఎంతమంది
వైద్యులు లేరు! వీరింటముందే జనం విరగబడాలా! ఈయనేమైనా
యం. బి. బి. యస్. డాక్టరా! లేకపోతే ఆయుర్వేద భిషగ్వరుడా!
ఏదో నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొనే వుంటాడు. అంత
మాత్రంచేత ఇల్లుకట్టుకున్న వైద్యులను మించిన గిరాకీ యేమిటి?”

“హోమియోపతిలో అద్భుతమైన ఔషధాలున్నాయంటారు.
ఆ పంథాలో మందుకు అరిదారా లెండనారేగు! వచ్చివచ్చి ఆ మహా
లక్ష్మి కొల్లిపికుపోయినట్టు వాళ్ళింట్లోనే గదికిలబడాలా!
ఎంత రద్దీ! ఏపొద్దుచూచినా యాభైమందికి తక్కువగాకుండా పడి
గాపులుపడివుంటున్నారు. ఆ ఇంటిముందు అరం చ్రితిమోగాని
ఎక్కడెక్కడి ఎంత పేరుమోసిన కుదరని రోగాలు ఆయన
చూచేసరికి తకమని తగ్గిపోతున్నాయట.”

“అవతారంగారి హస్తగుణం గొప్పది. ఆయన చేతితో మాత్ర
యిస్తే చాలు రోగం మట్టిముఖం పడుతుంది. ఏ వైద్యమైతే నేమి.
మానింది మందు”

ఇలాగ్గా ఊరూరా వాడవాడలా అవతారంగారి పేరు
మార్మోగుతోంది. ఆడా మగా విచక్షణలేకుండా ఆయనకు
ప్రచారంచేసి పెడుతున్నారు. వైద్యుని పేరు నలుమూలల వ్యాపింప
డానికి నమ్మకమైన రోగికంటె ఉత్తమమైన ప్రచారసాధనం వేరొ
కటి ఉంటుందా! జిల్లా పెద్దాసుపత్రిలో, కొమ్ములు తిరిగిన ఘన
వైద్యులచేతిలో, విశాఖపట్నం కింగ్ జార్జి హాస్పిటల్లో నయంగాని
మొండి రోగాలు; ఆయుర్వేద వైద్యుల అసాధారణ ప్రతిభకు
అందని బండతెవుళ్ళు అవతారంగార్ని చూచేసరికి పారిపోతు
న్నాయి. క్షయలు కుదిరాయి ముదిరిన ఉబ్బసాలు మాయమై
పోయాయి ఉబ్బుకామెర్లు ఒక్క మోతాదుతో ఊడిపోయేటట్లు
నయమవుతున్నాయి. సుఖవ్యాధులతో ఒళ్ళు కుళ్ళిపోయి
వచ్చిన రోగులు సంతోషంతో ఇళ్ళకు మళ్ళుతున్నారు. అచిర

...ంగారు పడకండి. మీరోగం పూర్తిగా నయమౌతుంది. ఏమీ ఫర్వాలేదు." అని అవతారంగారు ఆయనకు చేయూతనిచ్చి హాల్లోకి తీసుకువస్తూ చల్లగా మెల్లగా ఇలాగన్నారు. "రామస్వామి గారూ- చూడండి. భగవంతుడు ప్రతి వ్యక్తికీ ఇవ్వని ఒక గొప్ప గుణం మానవుడకు ప్రసాదించాడు. అదే క్షమ. దయ. మనం చేస్తున్న పని మంచిది కాదని ఒకమూలనుంచి మన అంతరాత్మ చెబుతూనే వుంటుంది. కాని మనం వినం. పవిత్రమైన ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకపోతే అపరాధం కేవలం మనదే. మూర్ఖుడైనా సరే, దిన్ని ఆచరణలో పెట్టడానికి అవకాశాలు కల్పించబడుతూంటాయి. అవి అరచేతికి చిక్కినప్పుడు ఆ అపూర్వావకాశం చూస్తూ జారవిడుచుకొన్నప్పుడు వారియందు జాలిపడ్డ మనకు ఇంకేమీ కలగదు. అంతే...."

"డాక్టరు గారూ- మీరు ఆ మాటలు అనుభవంమీద చెబుతున్నట్టుంది. అవి కేవలం నగ్నసత్యాలు. వాటిని వినక నేను తెలుసుకోవాలని కోరి తెచ్చుకొన్నాను." అన్నాడు రామస్వామి. ఇద్దరూ హాల్లోకి వచ్చేశారు. అప్పుడే కాంపౌండర్లుకూడా ఇళ్ళకు వెళ్ళిపోయారు. డాక్టరుగారే స్వయంగా మూడుపొట్లాలు అతని చేతిలో వుంచి 'వీటిని మూడురోజులు రాత్రి పడుకొనేటప్పుడు వేసుకోండి పదిహేను రోజులలో మీకు చక్కని దృష్టి ప్రసాదింపబడుతుంది. కాని ఒక్కటి మరచిపోవద్దు పది రోజుల పాటు మీ వ్యాధి లక్షణాలు బాగా ఉద్రేకిస్తాయి అయితే మనసులో ఏదో మూలనుంచి మీరు తేరుకొంటున్నట్లు మీకు బోధపడుతుంది. మనం తెలిసి చేసినా తెలియక చేసినా పాపానికి శిక్ష అనుభవించకుండా ఏదో అడ్డదారిన తప్పించుకు పోదామని భ్రమించడం పొరబాటు. దానివల్ల రోగం దాచబడుతుంది గని పూర్తిగా నయం కాదు—"

డాక్టరుగారి వద్ద శెలవు పుచ్చుకొని ఆరోగిని తీసుకువెడుతూ వెంటనున్నవారిద్దరూ రామస్వామి కండ్లు ఉబ్బును గురించి సూక్ష్మంగా అవతారంగారికి పరిచయంచేశారు. "ఇరుమాసాల క్రితం అతనువడచిన తప్పుదారికి, నీతిబాహ్యంగా సంచరించినందుకు అతడు ఈ విధంగా శిక్ష ననుభవిస్తున్నాడు. తాను చేసేది తప్పు పని అని అతనికి తెలుసు. ఏవో పోగరు కొద్దీ కన్ను గానక చెడుపని చేసి అందుకు ఆ కళ్లే బాధపడుతున్నాయి

## 4

అవతారంగారు తన చిన్న పిల్లని మంగుల పేటలో పొరుగూరిలో నున్న చలంగారి మకాం చేరుకొనేసరికి మధ్యాహ్నం మూడు గంటలయ్యింది. చలంగారు నూటపాతిక ఎకరాల పైచిలుకు ఏటి క్రింద పల్లం భూమిగల పెద్ద కాపు. తరచు వారింట్లో ఎవరికి కాస్తంత నెప్పిగా వున్నా అవతారంగార్కి కబురు వస్తుంది. చలంగారికి ఆయన మీద మంచి గౌరవము, భక్తి వున్నాయి. ఈయన కూడా ఆయన మాట తీసెయ్యడం జరగదు. ఇవాళ చలంగారు బాడవ దగ్గర చెరకు గానుగ మకాంలో వున్నారు. "పొద్దుట మీరు కబురంపగానే వచ్చేసే వాణ్ణి. అయితే ఈ రోజు రోగులు చాలా మంది రావడం, విశేషించి ఒక చిత్రమైన కంటి జబ్బుతో బాధపడుతున్న ఒక అసామిని పరీక్షిస్తూ కొంచెం తర్కంలోకి దిగడంకూ కారణంగా త్వరగా రావలిసింది గాదు. రెండు గంటలకు భోజనం చేసి ఈ వేళకి ఇక్కడకు చేరుకో గలిగాను" అంటూ తాపీగా ఒక రకమైన సంజాయిషీ వంటిది చలంగారికిచ్చుకున్నారు అవతారంగారు.

"అదా—దానికేమిలెండి మీకు కబురు పెట్టాను ఒక ప్రత్యేకం పనికలిగి. మా పెద్దపాలేరుకు సుమారు నెల రోజులనుంచి విచిత్రమైన వ్యాధి ఒకటి సంప్రాప్తించింది. మొదట్లో గొంతున ఏదో పుండు వున్నదనేవాడు. క్రమేపి స్వరపేటిక పూడుకుపోయింది. ఇప్పుడు వాడికి మాటరాదు. అదొకచిత్రమైనలక్షణం నొప్పిలేదు. వాపులేదు. పుండు లేదు. భోజనం సుష్టుగా చేస్తుంటాడు. మరొక విశేషం. ఎప్పుడూ పనిలో బాధపడే వానికివలె కాలువాగప్పుకొని వుంటాడు. వీడు మా పాలేర్లలో కెల్ల మంచి నిఖార్సైనవాడు. నిజాయితీపరుడు" చలంగారు ఇంకా చెప్పుకు పోతున్నారు.

డాక్టరుగారు అర్థవంతంగా మందహాసం చేశారు. దానికి కొద్ది వ్యాఖ్యానంకూడా చేసుకోవచ్చు. "బాగానే వుంది. ఇది ఒక చక్కని కేసు వైద్యుని మంచితనాన్నీ, రోగి తత్వాన్నీ ఈ సంఘటన పట్టిచూపుతుంది పదండి వాణ్ణి చూసొద్దాం" అవతారంగారూ, చలంగారు లేచారు. ఇద్దరు ఊరిగ్గా నడిచి వస్తున్నారు. ఎన్నడూ లేనిది ఆయన అనేకరకమైన ధోరణిలో ప్రసంగిస్తూండడం చలంగార్ని విపరీతమైన ఆలోచన కైపునెట్టింది. "మీ మాట కడ్డు వచ్చాను. ఏమీ అనుకోనంటే మనవిచేస్తాను. మీ దృష్టిలో ఆ పాలేరు మంచివాడు కావచ్చు. యజమానికి తగిన ఉద్ధారుడు మాత్రం కాదు. అట్టివాళ్ల విషయమై మీవంటి వారు జాగ్రత్తతో మసలడం అవసరం."

"వైద్యమే గాకుండా మీరు జోస్యంకూడా చెప్పగలరా! కాకపోతే మీరు అనేదేమిటి? వాణ్ణి చిన్నప్పటినుంచి నే నెరుగుదును." హేళనగా ముడితో అడ్డుకున్నారు చలంగారు.

"కొంచెం శాంతించండి యజమాని చేస్తున్న ప్రతిపనికీ తాళం వెయ్యడం సేవకవృత్తికి తగినపని అని మీరంటారని నే ననకోను. యజమాని తప్పు చేస్తున్నప్పుడు, సూచనమాత్రంగా నైనా సరే సేవకుడు గ్రహించినప్పుడు స్వామిని కొంచెం దారికి తీసుకు రావాలి. అంతేగాని ఆయనతో బాటు తనకూ ఒకటో రెండో దొరుకుతుంది గదా అని 'సై' అంటే అతని విధి నిర్వహణలో లోపం జరిగినట్టు కాదంటారా?"

"అబ్బెబ్బె—అలాంటివాడు కాడే."

"ఉదాహరణకు చెబుతాను మీ గానుగదగ్గర ఒకడు నాలుగు చెరకుగడలు దొంగిలించి మీకు దొరికిపోయాడనుకోండి. మీరు దొంగకు నాలుగు రూపాయలు జుల్మానా విధిస్తారు. ఆ నాలుగూ తాను వసూలుచేసి మీకు రెండు తిసుకొని వాణ్ణి మిగతావి తీసుకోనుంటే, పట్టుకుపోతే, వాడు చేసినది ఖచ్చితమైన పని ఎలా గౌతుంది?"

"ఓ... అదా..." చలంగారు సంభాషణ ముగించేశారు. ఇంతలో వారి పాలేరు ఉంచబడ్డ చావడి దగ్గరకు వచ్చారిద్దరూ. అవతారంగారు వాణ్ణి చూశారు. ఇప్పుడు వరకు తాను, చలంగారు,

చెప్పుకొన్న కథలోని సేవకుడు వాడే—నూటికి నూరుపాళ్ళు వాడే అని వారు కప్పుకొన్న అవతారంగారి శాలువా వాళ్ళకి నవ్వుతూ చెబుతున్నట్లు నగుల్తోంది. శాలువా కప్పుకొన్న పాలికాపు వణుకుతున్నాడు. పాపం చేసినవాడు భగవంతుని చూడలేక గజగజ వణికే దురవస్థను గురుకు తెస్తున్నాడు. తనకు, ఆ శాలువకు, వాడికీ తక్క అన్యులకు గురూహ్యంగా వున్న మూడు సంవత్సరాల క్రిందటి కథ అవతారంగారి కళ్ళల్లో మెరుస్తోంది. ఆయన చలంగారి వైపు తిరిగి భళ్లుక్కిగా "ఏమండీ—ఈ శాలువా 'లాల్—ఇమిలీ' కంపెనీవారిది. లేదంటే ముప్ఫై రూపాయలకు తక్కువ చెయదు. మీరు దీన్ని బహూకరించారని గాని, వాడు కొనుక్కున్నాడని గాని నే నెలాగన కోగలను?" అన్నారు.

'కొంచె మించుమించుగా కాకపోయినా అంతకు దగ్గరదే. అది ఓబాపతుగా వాడికి దొరకింది వెనక వాళ్ళు ఒకతోట పాడేరు. దానిలో ఒక ఘరానా దొంగ నారింజకాయలు ఎత్తుకుపోతూ దొరికిపోయాడు. ఇలాగ్గారు—ఈ వెనకకు తగినశాస్తి చెయ్యాలని వాడి జుబ్బా ఒకటి శాలువా ఒకటి ఊడలాక్కుని విడిచిపెట్టమని, మీకు పంచుకొన్నారు. ఆ రీత్యా వీడికి ఇది దఖలు పడింది" అవతారంగారు నిష్ప్రియమైన చిరునవ్వుతో దీన్ని స్వీకరించి "ఆc. అదే—నేను ఇందాకటినుంచీ చెబుతూంటు భగవంతుడు ఎవ్వరికీ ఇవ్వని ఒక గొప్పగుణం మానవుడికు ప్రసాదించాడు. అదే బుద్ధి. మనం చేస్తున్న పని మంచిది కాదని ఒక మూలనుంచి మన అంతరాత్మ చెబుతూనే వుంటుంది కాని మనం వినం దేవదత్తమైన ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకపోతే ఆ దోషం కేవలం మనదే మూర్ఖుడైనా పరే దీన్ని ఆచరణలో పెట్టడానికి అవకాశాలు కల్పించబడుతూంటాయి అవి అరచేతికి చిక్కినప్పుడు ఆ అపూర్వావకాశాన్ని జారవిడుచుకొన్నప్పుడు వారియందు మనకు జాలి దక్క ఇంకేమీ కలగదు. అంతే."

"ఇంతకీ ఈ జబ్బు పేరేమిటి అంటారు?" అవతారంగారి వ్యాఖ్యను విని కూడా అర్థం చేసుకోలేని చలంగారు ప్రశ్నించారు.

"ఏం చెప్పమంటారు—పురాకృత సుకృతం. కర్మ—వరి దానికేంలెండి. జరిగిందేదో జరిగిపోయింది ప్రస్తుతం ఆలోచిద్దాం. ఇప్పుడు రెండు మోతాదులు మందిస్తాను. ఒక వారంరోజులపాటు వ్యాధి ఉద్రేకిస్తుంది. తర్వాత క్రమంగా తగ్గిపోతుంది. చేజేతులా తప్పు చేసుకొని హాయిగా రోజూ వెళ్ళబుచ్చుకుందామంటే ఎలాగ కుదురుతుంది? వీడు సరిగా మాట్లాడడానికి ఒక నెలరోజులు పడుతుంది. వారానికి మూడు మోతాదుల చొప్పున మందు వాడండి." అని చలంగారితో చెప్పి అవతారంగారు శలవు తీసుకొంటూంటే పాలేరు అశ్రువుల్ని పిలుకరించే నయనద్వయంతో ఆయన్ని చూచి ఎంతో బాధ పడ్డాడు. వాడు తన వైద్యుని గుర్తుపట్టలేకపోయాడు. లేకుంటే ఈ సరికి ఎప్పుడో ఆ కన్నీళ్లు ఆయన పాదాల్ని అభిషేకించి వుండేవి. వాని యజమానే తెలుసుకోలేకపోయాడు—వీడసగా ఎంతకీ శుద్ధ మూఢుడు!

5

కుమారపురంలో అవతారంగారి హోమియో వైద్యాలయం ముందు ఎన్నడూ జరిగివుండని ఒక విచిత్రమైన గందరగోళం జరుగుతోంది. ఇద్దరు ముగ్గురు ఘరానా పెద్ద మనుష్యులనుండి వెలువడుతున్న నేరారోపణలు నూటిగా డాక్టరుగారిపైపే ప్రయోగింపబడుతూండడం చూస్తూన్న రోగులు, చుట్టుపక్కల మూగిన జనం ఎంతో విస్తుపోతున్నారు. ఒక పెద్దమనిషి అవతారంగారి వైపు కోపంగా తన బలమైన చేతిని జాడిస్తూ "పగబట్టినవాళ్ళను చాలా మందిని చూశాంగాని ఈ వృత్తిలో తాచుకు తాచే, నీకు నీవే సాటి. డొంకతిరుగుడు వాదాలు, చల్లచలని కల్లబొల్లి కబుర్లు చెబుతూ, కమ్మగా మాట్లాడుతూనే తియ్యని ఉపగింజలంతలేని మాత్రలలో కాలకూట విషం రంగరించి కసితీర్చుకోవడానికి పూనుకొంటావని కలనైనా అనుకోలేక మావాడి కళ్లు నీకు చూపించాం. కొరవితో తలగోక్కొన్నట్లు, కోతి పుండును బ్రహ్మరాక్షసి చేసుకొన్నాం. ఎక్కడి మూడేళ్ళు? ఏమి నారింజతోట గొడవ? వెనక జుబ్బాకోసమై విషం ప్రయోగించి నిలువునా నిండు ప్రాణం తీయడానికి సిద్ధపడావా?" ఇంకా ఏమేమో వదరుతున్నాడు. అవతారంగారు నిశ్చేష్టులై నిల్చున్నారు హిమాలయశృంగం మీద వడగండ్లవాన కురుస్తున్నట్లు అసహ్యమైన ఆ నిందలు ఆయనపై పడుతున్నాయి. ఈ విపరీతావస్థను చూచి సహించలేక అవతారంగారికి సుపరిచితుడైన ఒక మర్యాదస్థుడు ముందుకు దూసుకువచ్చి తూలనాడుతున్న పెద్దను ఆగమని సంజ్ఞచేసి "మీరు కొంచెం తమాయించండి. అవతారంగారికి జవాబు చెప్పడానికైనా అవకాశం ఇవ్వరేం? అసలు ఆయన ఎందుకు అంతగా మౌనం దాల్చారనైనా ఊహించారా?" అని ప్రశ్నించాడు అతగాడు అవతారంగార్ని వదలి ఈయనపై విరుచుకు పడుతూ "చేసినదంతా కిమ్మనకుండా కానిచ్చి ఇక కేమి సమాధానం చెబుతాడండీ సరిగ్గా దినరోజులౌతుంది ఈయనకు రోగిని చూపించి. మాత్ర వేసినప్పుడే అద్భుతమైన వింతధోరణి ప్రారంభించాడు ఈయన అసలు కథ మావాడు ఇంటికి వెళ్ళిన తర్వాత వివరంగా చెప్పినప్పుడు గాని మాకూ తెలియలేదు. పాతపగను కడుపులో దాచుకొని వాడి ఒంట్లో ఈయన నిప్పుపోస్తున్నాడని కనుకోలేకపోయాడు కాకపోయినా వాడు చేసిన తప్పుకు పనికి కళ్ళ జబ్బు కూడా అలాగే నాపురించింది నిజంగా వా [illegible] అనుకుంటే ఈయన చేతిలో పడేవాడు గాదు అబ్బో—వాడూ అఖండుడు. దివాంతకుడు. కాలం కర్మ కూడివచ్చింది. మందు కొంచెం ఉద్రేకం చేస్తుందంటే మేమూ ఫర్వాలేదు అనుకొన్నాం. కాని ఇంత కొంప మునుగుతుందని అనుకొన్నాంగాదు. ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం? ఎవర్ని తిడితే ఏం లాభం? ఆ పోయే ప్రాణం నిలబడుతుందా? ఇప్పుడు వాడికి వళ్లు ఉబ్బిపోయింది. కళ్ళలో పోట్లు ఎక్కువై పోయాయి. మనిషి కదల్లేకపోతున్నాడు. ఏక దురద. దానికితోడు ఈ ఉదయంనుంచి విరేచనాలు మొదలు, ఇంక వాడు పడే బాధ వర్ణించలేం. ఎక్కడికైనా తీసుకుపోదామా అంటే, మాకు కాళ్ళాడ్డం లేదు." అతగాడు ఇంకా పరిపరివిధాల ఇల్లాపు రామస్వామి గురవస్తను చెప్పుకుపోతున్నాడు. అవతారం కళ్ళు కాంతితో తళతళ మెరిశాయి. అది శుభ్రమైన, నిర్మలమైన, దివ్యమైన తేజస్సు అని ఒక్క సద్హృదయులకు మాత్రమే అవగతం కాగలదు. తక్కినవాళ్ళు ఆయన మందహాసాన్ని అపార్థమే చేసుకుంటారు.

ఈ దఫా అవతారంగారిని అడుగుకోవాలని వచ్చిన పెద్ద, పొరుగూరి ఆసామీ ఇద్దరూ ఏకమైనట్లు ఒకే గొంతులో

"ఇప్పుడేం చెయ్యమంటారు మరి! ఏదో దారి మీరే చెప్పండి" అన్నారు అవతారంగారు సంతోషంతోనే సమాధానం ఇస్తున్నారు. "హోమియో సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రాణాలు సహితం అర్పించడానికి వెనుకాడని తత్వవేత్తల అడుగుజాడల్లో నడుద్దామని ప్రయత్నిస్తున్నాను. మీ రేమనుకున్నా నా నిశ్చయం ఒకటే. మీరు చెప్పినట్లు రోగం తప్పకుండా నయమైపోతుందని ధైర్యంగా వక్కాణించడానికి శుభసూచనలు. బాగుపడడంకూడా అతిత్వరలోనే జరుగుతుంది. బహుశా మీరు ఇంటికి చేరుకోకే నా మాటలలోని యదార్థం అనుభవంద్వారా గుర్తించగలుగుతారు. ఇంతకుమించి నేనేమీ చెప్పను" మరి కొన్సేపటికి ఆసుపత్రిలో క్రమక్రమంగా నిశ్శబ్దం వ్యాపించడం ప్రారంభించింది. తనవంతు వచ్చిన పొరుగూరి పెద్దలు వేడిగా గొణుక్కుంటూ వెళ్ళిపోయారు. ఇతరులు తనను గురించి ఏమనుకొంటున్నారు? అనే విషయాన్నైనా పట్టించుకోకుండా స్థితప్రజ్ఞునిలాగ అవతారంగారు మామూలు పనిలోకి వెళ్ళిపోయారు.

ఆవేళ సాయంకాలం మరొక విపరీతమైన సంఘటన సంభవించింది. అదీ అంతవరకు అనూహ్యమైనదే. మరొకసారి అవతారంగారికి మహాత్వపూర్ణమైన మందహాసాన్ని పుట్టించింది. చలంగారి నుంచి ప్రత్యేక నౌకరుద్వారా అవతారంగారికి ఒక లేఖ పంపబడడమే ఆ వైపరీత్యం.

"శ్రీ అవతారంగారికి...వినయపూర్వక నమస్కారోపరి... నేను తమకిలాగ లేఖ వ్రాస్తున్నానని మీరేమనుకొన్నా నేను బాధపడను. కారణం మీరు చేసినపని. ఇందు కేవలం మీరు మీ ప్రతీకారేచ్ఛనే కనబర్చుకొన్నారు గాని తత్ఫలితంగా నా మానమర్యాదల భవిష్యత్తు ఎలాగుంటుందనైనా యోచించలేదు. నేను ఇప్పటివరకు మీలో అంతా మంచినే చూచాను. మా పాలేరు, మీరు [illegible] కావచ్చు. కాని నా కారణంగా మీరు వాణ్ణి చూడానికి రప్పించబడారన్నది మీ రెంతమాత్రం లక్ష్యపెట్టలేదు. మీపగ మీరు తీర్చుకొన్నారు. నాకు అతఃపూర్వమే మీకూ నానిక్కీ మధ్య మూడేళ్ళక్రిందట జరిగిన స్పర్థవిషయమై చూచాయగానైనా తెలిసివుంటే మీకు వాణ్ణి చూపించి ఉండేవాణ్ణి గాదు. చేయి జారిందనుకొని నేనూ వాడూ ఇప్పుడు విచారిస్తున్నాం. వాడు మరణశయ్యపై వున్నాడు. పోయిన గొంతుమాట దేవుని కెరుక. వాడి వొళ్ళంతా పుండ్లుపట్టి రసకారుతూ భరింపరాని దుర్వాసనతో వాడు బాధపడుతూ వాంతులు చేసుకొంటూంటే మేం చూడలేకపోతున్నాం. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మేం చేయతగినదేమైనా వుంటే ఈ జవాను ద్వారా వర్తమానం చేయండి. లేకపోతే మా దారి మేమే చూసుకుంటాం...

భవదీయుడు చలం"—

ఉత్తరం మడుస్తూ అవతారంగారు మరొకసారి నవ్వుకుంటూ ఆ పాలేరుతో "నాయనా! నీవు త్వరగా వెళ్ళు. అతనికే భయమూ లేదు. దేవుడు తన పాలేరును కరుణించాడని చలంగారితో చెప్పు." అన్నారు. అతడు ఆయనకు నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఇది జరిగి వారంరోజులు దాటుతుంది. ఆనాడు అవతారంగారు కొన్ని కేసులు చూడ్డానికి పొరుగూరువెళ్ళి ఇంటికి రావడం చాలా ఆలస్యమయ్యింది. ఇంట్లో కూడా ఆసమయంలో ఎవరూ లేనట్లు, ఉన్నా అలికిడి ఎంతమాత్రము కానట్లు నిశ్శబ్దం తాండవిస్తోంది. చరాచరా ఆయన లోనికి అడుగుపెట్టే కాళ్ళజోడు విడుస్తూ హాల్లో వున్న రెండు అందమైన పెద్ద పండ్ల తట్టలను చూస్తూ అత్యంతానంద పరవశులై సంతోషం పట్టలేక "లోపల ఎవరూ?... మాట్లాడరేం! ఈ పండ్లు ఎవరు తీసుకొచ్చారు?" అన్నారాయన వింతగా ప్రశ్నించారు. వంటింట్లోనుంచి డాక్టరుగారి శ్రీమతి కిలకిల నవ్వుతూ ముందుకొచ్చి "చూడండి! ఈ నారింజ పండ్లు ఎంత బాగున్నాయో! చూస్తుంటేనే నవులూరుతున్నాయి. ఇంక తింటే ఎలా వుంటుందో. చేతినిండుగా చెంబెడే కాయ దానికి తగ్గ బరువు-పిండితే ముంతెడు రసముంటుంది.' అని ఇంకా ఆ లేత యిల్లాలు నారింజపండ్ల సొబగు వర్ణిస్తూంటే పకపక నవ్వుతూ అవతారంగారు శ్రీమతికి ఊతనిచ్చారు "ఔను తల్లీపిల్లా కలిసి వచ్చినపుడు తగని ఆనందం కలుగుతుంది. అవి రాదలచినప్పుడు, రావలసినప్పుడు వస్తాయిగాని మనం ఎత్తుకొద్దామంటే వీలౌతుందా?"

"ఇది శ్రీవారి ఘనవైద్యానికి సమర్పిత సత్కారాలు. ఒకరికి కళ్ళు ఇచ్చారట! మరొకరికి కంఠం ప్రసాదించారట! చెరొక గంపెడు పళ్ళూ పంపించారు. పాపం! వారిమనుష్యులిప్పటివరకు తమకై నిరీక్షించి వెళ్ళిపోయారు. మరొక శుభదినాన ఆరోగ్యవంతులై తమను ప్రత్యక్షంగా దర్శించుకొని ఇతోధికంగా తమకు పారితోషికం సమర్పించుకొని తమపాదాలపై వాలి క్షమార్పణ చెప్పుకొంటామని మరీ మరీ తమతో మనవిచెయ్యమని విన్నవించుకొన్నారట."

"ఏమిటీ ధోరణి! వాళ్ళతరఫున నీవు నాకు భట్టుమూర్తిగా తయారౌతున్నావు."

"అవ్వే వాళ్ళు పడిపడి దణ్ణాలుపెట్టి చెప్పినదాన్ని ఆకాడికే నేను కుదించగలిగాను అంతే."

భార్యాభర్తలిరువురూ నవ్వుకొని లోపలికి వెళ్ళారు. ఆమె ఆయనకు భోజనం వడ్డించడానికి సిద్ధపడుతోంది—ఈలోగా అవతారంగారు ఆ గంపలను ఒక్కటొక్కటే ఎత్తలేక ఎత్తి తన పడకగదిలోకి తీసుకువెళ్ళి ఒకమూలను ఆ పళ్ళు గుమ్మరించారు. రెండుగంపలనుంచీ రెండువస్తువులు చక్కని శుభ్రమైన కాగితంలో పొట్లంగట్టబడి వుంచబడినవి అవతారంగారిని విపరీతమైన ఆశ్చర్యంలో ముంచితేల్చడానికి తాపత్రయపడి విఫలమైపోయినట్లు విడిపోయాయి. ఒకే ఒక సమయంలో, ఒకే ఒక స్థలంలో, ఒకే ఒక తావునుంచివచ్చి విడిపడిన—అవతారంగారి అతిప్రియమైన వస్తువులు ఆయన స్వేచ్ఛగా కాలవ—తిరిగి ఒకే సమయంలో వివిధ స్థలాలనుంచి తమ తమ నెలవులు చేరుకొన్నాయి. ఒకేకొండమీద కురిసిన వర్షధారలు రెండుపాయలుగా ఏర్పడి మహారణ్య మధ్యంలో విశాలమైన దూరాన్ని అధిగమించి, తుదకు ఒకే ఒక సుముహూర్తాన సముద్రంలో కలసిపోతుంటాయి. ఆ రెండింటి ఇస్త్రీముసలిల కమ్మదనం వాసనచూస్తూంటే ఆయనకడుపు నిండిపోయినట్లైంది. మా జోళ్ళు బానిసత్వం వెలిగించి తమయజమాని సుకృతం కారణంగా తిరిగి స్వేచ్ఛనుపొందిన ఆ రెండు స్వరూపాలు యథాతథంగా తమ మామూలు పెట్టెలో ఇరుక్కొని తృప్తిపొందాయి.

అవతారంగారు పీటమీద కూర్చున్నారు. అన్నం తినడం మొదలుపెట్టారు. అయితే ఆ భోజనప్రీతి ఆయన భార్యకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది. "అవు గావురుమంటూ కడుపు ఆకలితో కాలుపెట్టారు లోపల. మరి కంచెడు అన్నం వడ్డిస్తేనే, ఒకముద్దకూడా దిగదేం?" అన్న ఆమెకు అవతారంగారి ప్రత్యుత్తరం "నారింజపండ్లు చూస్తూంటే, అవి మన యింటికి వచ్చిన తీరు తలంచుకొంటూంటే ఎంత సంతోషం కలుగుతోందో! నిజంగా చెబుతున్నాను. నాకు ఇపుడు షడ్రసోపేతంగా కడుపునిండా భోజనం చేసినంత తృప్తిగా వుంది. ఇంక నాకేమీ అక్కర్లేదు" అని జవాబిచ్చి పీటమీదనుంచి లేచి చెయ్యి కడుక్కొన్నారు. "ఔను—మీకేనన్నమాటేమిటి! నాకూ అలాగే అనిపించింది. ఆ పళ్ళు నిజంగా అలాగే ఉన్నాయి." అని శ్రీమతి మళ్ళీ తన ఆనందాన్ని వ్యక్తం చేసింది.


త్వరలో విడుదల!
సుఖీభవ వారి
భక్త శబరి
దర్శకత్వం: సి.హెచ్. నారాయణమూర్తి
రచన సంగీతం పాటలు
పద్మరాజు...పెండ్యాల...దేవులపల్లి, పద్మరాజు, మల్లాది
కళ కెమేరా నృత్యం
వాలి & చలం...కె.వి.యస్.రెడ్డి...వెంపటి
నిర్మాత: బి.ఆర్. నాయుడు.....స్టూడియో: వాహిని & గోల్డెన్

# వీరరసచర్చ: రసగంగాధర మతము

శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి

దానధర్మ యుద్ధములన్న అవాంతర భేదములతో వీరరసమును భరతుడు నాట్యశాస్త్రమున ప్రస్తావించెను. దయా వీరమని నాల్గవదిగా నొకటి తరువాతి కాలమున కల్పింపబడినది. శ్రీ జగన్నాథ పండితరాయలు పై నాల్గింటితో పాటు సత్య పాండిత్య క్షమా బలవీరములని మరి నాల్గవాంతర భేదములను వీరరసము విషయమున నంగీకరించెను. వీరరసమును నాల్గు విధములుగా మాత్రమే పరిగణించుట అసమగ్రమనియు ఔచిత్యమును బట్టి ఇతర భేదములను గుర్తించుటయు యుక్తమనియు ఆయన చెప్పినప్పటికిని, తానుగా కల్పించిన ఆ నాల్గవాంతర భేదములను సిద్ధాంతము చేయుటకుగా చేసిన వాదమునుబట్టి చూడగా, అసలు వీరమును నాల్గు విధములుగా పరిగణించుటయే ఆయన కిష్టము గానట్లు తోచుచున్నది. సత్య వీరమును పేర్కొని అది ధర్మవీరమున లీనము కాదా యేమి అన్న పూర్వపక్షమును చూపి దానదయావీరములు మాత్రము ధర్మవీరమున నంతర్భవింపవా మరి? యని పూర్వపక్షమును పరాసము చేసి సత్య వీరమును సిద్ధాంతమును చేసెను. అనగా దానదయా వీరములు ధర్మవీరమం దంతర్భవించుటకు యోగ్యములైనప్పుడు వేరుగా గ్రహింపనవసరము లేదనియు, అట్లంతర్భవింపజేయక వాటిని పృథక్కరించి పై భేదములుగా గ్రహించుట కంగీకరించినప్పుడిట్లో సత్య వీరమును కూడ మరొక ప్రభేదముగా నిరూపించుటకును అంగీకరించుటకును వీలున్నదనియును జగన్నాథుల వాదము. దాన దయా వీరములను ధర్మమున నంతర్భవింపజేయుట నంగీకరించినప్పుడు సత్యవీరమును కూడ ధర్మవీరమున లీనము చేయుటకు జగన్నాథుల కభ్యంతరము లేదు. ఉండుటకు వీలు లేదు.

సత్యవీరము విషయమున నొక విధముగా సమాధానపడుటకు వీలున్నను క్షమా బలవీరముల విషయమున ఆయన నిష్కర్షగా మాటాడెను. పాండిత్య వీరమును యుద్ధవీరమున నంతర్భవింపజేయ వచ్చునన్న పూర్వపక్షము నాయన ఖండింపలేదు. క్షమా బల వీరములను ధర్మవీరమున నంతర్భవింపజేయుట యే విధముగాను కుదురదని మాత్రమే జగన్నాథులన్నారు. కాని ఏల కుదురదో నిరూపించలేదు. సహృదయ హృదయాలలో క్షమా బల వీరములు ప్రత్యేకముగా గోచరించుచున్నందున ధర్మవీరమున నంతర్భవింపజేయుట కుదురదని మాత్రమే ఆయన వాదము. ఇది సహేతుకము కాదు. క్షమా బల వీరముల కాయన యిచ్చిన యుదాహరణములను జాగ్రత్తగా పరిశీలించినచో అవి ధర్మవీరమున లీనములగుటను నిరాకరించునవిగా లేవు

"శత్రువు నా శిరస్సుపై బహులాగ్నిసమూహమును నిరంతరమూ మండింపచేయనీ, ఖడ్గధారను పడవేయనీ. నేను అణుమాత్రమైనా యేమీ పలుకను."

ఈ యర్థముగల శ్లోకమును క్షమా వీరమునకు పండితరాయల వారుదాహరించిరి. నేనణుమాత్రము కూడ పలుకనన్నవాడు క్షమావీరుడని గదా తాత్పర్యము? విభావానుభావవ్యభిచారులచేత సమ్పోషితమై ఉత్సాహము వ్యజ్యమానమైనప్పుడు గదా వీరరస ప్రాదుర్భావము? శత్రువు విభావము. బహుదహనజాలమును శిరస్సుపై మండింపజేయుట, అసిధారచేత వేయుటయు అనుభావములు. నేనణుమాత్రము కూడ పలుకనన్నది ధృతి. క్షమయు, ధృతి వ్యభిచారిభావము. మరి స్థాయి యేది? ధర్మము కావచ్చును. వ్యభిచారిభావము స్థాయి కాకూడదన్న నియమము లేదుకదా యన్నచో, లేదు కాని వీరమునకు స్థాయి ఉత్సాహముగాని ధృతి కాదు కదా! భరతుడు ధృతిని వీరమున కుపస్కారకముగ కేవల భావముగానే పేర్కొనెను. అదియునుగాక క్షమకున్ను ధృతికిని అభేదమును పండితరాయలవారు భావ (విషయ) ప్రకరణమున అంగీకరించినారు. తాము అంగీకరించుటకు హేతువు భరతముని వచనానుపాలనమనియు పేర్కొనిరి. ఆ గుణముల వీర రసమున కుపస్కారములగు భావములలో నొకటైన ధృతిని అనగా క్షమను ప్రధానముగా చేసి క్షమావీర ప్రభేదమును కల్పించినట్లైనది. అట్లేల కల్పింపవలయును? అవసరము లేదు. శ్రీ జగన్నాథులిచ్చిన ధర్మవీరోదాహరణమును పరిశీలించినచో దానికిని ఈ క్షమావీరమునకును భేదమున్నట్లు తోచుటలేదు. ధర్మవీరోదాహరణమిట్లున్నది.

'సపది విలయమేతు రాజ్యలక్ష్మీ,
ఉపరి పతంత్వథవా కృపాణధారాః,
అపహరతుతరాం శిరః కృతాంతో
మమ తు మతిర్న మనాగపైతి ధర్మాత్.'

ధర్మమని యధర్మమని మీనమేషములు లెక్కపెట్టుకొనుచు కూర్చుండక యేదైనను శత్రువును జయించుటయే ముఖ్యము - అని ధర్మరాజుతో నెవరో అనగా అప్పుడు ధర్మరాజు పైన యుదాహరించినట్లు మాటాడినాడు. రాజ్యలక్ష్మి విలయము పొందుగాక! కృపాణధారలు నామీదపడిన పడుగాక! కృతాంతుడు నా శిరస్సును హరించిన హరించుగాక! నామనస్సు ధర్మమునుండి అణుమాత్రము తొలగిపోదు ఇది ధర్మరాజన్న మాటలు ఈ శ్లోకమున ధర్మరాజు ధర్మోత్సాహము సత్త్వమున పొందుచున్నదనియు, శ్లోకోక్త దార్ఢ్యాంగీకారము లనుభావములనియు, ధృతి వ్యభిచారియనియు, "న జాతు కామాన్న భయాన్న లోభాత్ ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః" ఇత్యాది శాస్త్రవాక్యార్థజ్ఞాన ముద్దీపనమనియు రసగంగాధరమున వ్రాయబడియున్నది. క్షమావీరోదాహరణ శ్లోకమునకును దీనికిని గలభేదమేమి? అది యూహింపనగుచున్నది. ధర్మవిదుడైన ధర్మరాజు తన బుద్ధి ధర్మబద్ధమై తన్నిష్ఠమై యుండుటచేత దానికొరకేమి వచ్చినను సహింతునన్నాడు. క్షమావీరుడూరక శత్రువు తన కేమి చేసినను అణుమాత్రము కూడ పలుకననినాడు. ధర్మరాజు ధృతి ధర్మాభిముఖమైయున్నది. ఆ క్షమావీరుని ధృతి వట్టిధృతిగా నున్నది. ధర్మాభిముఖమైన ధృతి యుత్సాహగర్భమైనట్లు ఆ ధృతి యగుటలేదు. అది కేవలము నిష్క్రియత్వము జడలక్షణమది. ఆ క్షమావీరుడు ప్రదర్శించిన క్షమవలని ఫలమేమి? ఏమియును లేదు అన్నచో నా శ్లోకమున చెప్పబడక పోయినను ధర్మమై యుండవలయును. అప్పుడది ధర్మవీరమే యగును. మరొకముఖముగా పరిశీలించినచో నా క్షమావీరము వివక్షు మిట్లుండును "పరాక్రమదానాదిస్మృతిజన్మా ఔన్నత్యాఖ్యః ఉత్సాహః" అని ఆ

మున సంగీకరించుటకు ప్రమాణము లేదు. మొదల నవసరము లేదు. కానిచో తొలిచిన్న లేనిదై క్షమావీరమేమియు కానిది కావలయును.

ఒక బలవీరము ఇదియును క్షమావీరమువంటిదే. జగన్నాథు లీ శ్లోకమును బలవీరమున కుదాహరించినారు:

"పరివహతు ధరాం ఫణీశ వీరః
సుఖమయతాం కమఠోపి తాం విహాయ,
అహ మిహ పురుహూత! పక్షకోణే
నిఖిల మిదం జగదండకం వహామి."

ఫణివీరుడైన ఆదిశేషుడు భూమిని పరివహించుగాక! ఆదికూర్మము కూడ భూమిని వహించుట మాని సుఖించుగాక! ఓ ఇంద్రా! నేను నా పక్షకోణమున నిఖిలమైన యీ జగత్తును వహింతును — గరుత్మంతుడు దేవేంద్రునితో నన్నమాట లివి: ఏ సందర్భమునందనినో నవరస గంగాధరమున లేదు. అయినను ఇట్లూహింపవచ్చును: గరుత్మంతుడు అమృతమును తీసికొనివచ్చుచుండగా ఇంద్రు డెదుర్కొనినాడు. గరుత్మంతుని చేతిలో నింద్రుడు డెంగుకొని పరాజితుడై పోయినాడు. అపు డింద్రుడు గరుత్మంతునితో మైత్రి చేసికొన్నాడు. ఆ సందర్భమున దేవేంద్రుడు గరుత్మంతుని యడిగినాడు నీ బలమెంతయని. అందుకు బదులుగా గరుత్మంతుడు చెప్పిన సమాధాన మీ శ్లోకము. తన పక్షకోణమున నిఖిలమైన యీ జగత్తును వహింతునని గరుత్మంతు డేల యనెను? ఫణివిరుడు, కమఠము ఇరువురును ధరాభారవహనమునుండి వైదొలగినపుడు గదా గరుత్మంతుడు తాను తన పక్షకోణమున నీ నిఖిలజగత్తును వహింతు నన్నది! అసలు వారే ఈ జగత్తును వహించుచున్నారు! లోకసంగ్రహైకతత్పరమైన బుద్ధిలక్షణముతో వారా విధి నియమమును నెరవేర్చుచున్నారు. అట్టి బుద్ధియే గరుత్మంతున కున్నది. పరులైన యాదిశేషుని యొక్కయు ఆదికూర్మము యొక్కయు బలమును స్మరించి వారికున్నంతటి బలము తనకును నున్నదన్న భావమును గరుత్మంతుడు వ్యక్తీకరించినాడు. వారికంటె తనయున్నతినిరూపణమునందు బుద్ధి గలవాడగుటవలన పక్షకోణమున వహింపగలనని వాడు—గరుత్మంతునకు తాత్పర్యము తనబలమునందున్నదా? లేక దాని వినియోగమునందున్నదా? కేవలము బలమునందున్నచో ఒక్క క్షణములో నీ సర్వజగత్తును నాశనము చేయగలననియు చెప్పవచ్చును. పక్షకోణమున జగత్తును వహింతుననియే అనక్కరలేదు. అపుడు బలమునందున్న గరుత్మంతుని తాత్పర్యబుద్ధి స్పష్టపడును కాని గరుత్మంతునకు తనబలముయొక్క వినియోగమునందు బుద్ధి నిష్ఠమైయున్నది మొదలా ఫణివిరునియొక్కయు, ఆదికూర్మముయొక్కయు ప్రసక్తి తెచ్చుటయేల? వారి ప్రసక్తి లేకుండగూడ తా నీ జగత్తును పక్షకోణమున వహింపగలనని చెప్పవచ్చును గదా! మరి అట్లేల చెప్పలేదు? ఆ వారి ప్రసక్తి తెచ్చుటలోనే గరుత్మంతునకు తనబలము యొక్క వినియోగము నందున్న తాత్పర్యము స్పష్టపడుచున్నది నిజమునకు శేషకూర్మములు భారవహనమునుండి వైదొలగవు ప్రళయకాలావసరమున వైదొలగు నన్నచో ఆనాడు వహించుటకు గరుత్మంతునకు ఆగత్యముండదు. మరి గరుత్మంతుని మాటల యర్థమేమి? ఆ వాని మాటల తాత్పర్యమిది. నాకు చాల బలమున్నది ఆబలముయొక్క ప్రదర్శనమున కవకాశమే కనిపించుటలేదు. ఉండుటకీజగత్తును కేవలము పక్షకోణమున వహింప గలిగినంత బలమున్నది ఏమి లాభము? శేషకూర్మములు భూభార వహనమునుండి వైదొలగిన గదా నాకది సమకూడునది?—అది యెట్లును జరుగదు కనుక నా బలము ప్రకటించుటకు తగిన యవకాశమే నాకు లేదు—అని. అనగా గరుత్మంతునకు తనబల మెంతయో తనకు తెలియును.

ఆ తెలియుటతోడి యుత్సాహము లోకసంగ్రహైకశీలమైన బుద్ధియొక్క ధర్మలక్షణమునందు నిమితపడి యున్నది. ఊరక బలమును బలముగా గాక దానిని ధర్మకార్యమునందు వినియోగింపవలయునన్న యుత్సాహము గరుత్మంతుని యందు స్పష్టముగా నున్నది. కనుక గరుత్మంతు డన్నట్లుగా జగన్నాథు లుదాహరించిన యీ శ్లోకమునందు గరుత్మంతుని తనయొక్క బలవినియోగమునందలి యుత్సాహమే గోచరించుచున్నది. ఆ వినియోగము ధర్మబద్ధముగా నున్నది. అందువలన అది బలవీరముగా ధర్మవీరమే యగుచున్నది. బలవీరమని ప్రత్యేకముగా నంతవక్కరలేదు. అక్కరలేదుగాదు. ఉండుటకు వీలుకాదు. అదియును గాక ఈ బలమును గర్వమన్న భావములో చేర్చియే భరతునినుండి ఆలంకారికులు వ్యవహరించుచున్నారు జగన్నాథులుకూడ నట్లే వ్యవహరించినారు. గర్వమునకు బలమునకు జన్యజనక సంబంధమున్నది. గర్వము రౌద్రమును ప్రధానముగను, వీరమును కించిద్ప్రధానముగాను పోషించు గుణముకలదిగా భరతాదుల నిర్ణయము. ఈ భేదము ఆయా రసములకు నాలంబనవిభావములగు ప్రకృతులలోని భేదమునుబట్టి యున్నది. రౌద్రము వీరమువలె ఉత్తమప్రకృతికము కాదు. అందువలన గర్వమందు ప్రాధాన్యము వహించుచున్నది. గర్వము క్రోధమును పెంచులక్షణము కలది ఉత్తమప్రకృతుల యందలి గర్వము ఉత్సాహమును కలిగించునది ఉత్తమప్రకృతియైన వీరుని యుత్సాహమును పెంపొందింపజేయు గర్వమన్న భావము పుట్టించు సహాయకములలో బల మొక్కటిమాత్రమే. ఇటిదివిద్య. ఈ విద్య సాధారణముగా చేసుకొనికూడ జగన్నాథులు పాండిత్య వీరమును కల్పించినను అదియును నిలువదు. అట్లూరక అవాంతర భేదములను కల్పించుకొనుచు పోయిచో యౌవనవీరము - రూప

